# భానుమతి

గ్రంథకర్త,
యం. వి. పాపన్న గుప్త.

# భారతకథానిధి.

( చిత్రకథల పత్రిక. )

ఆంధ్రదేశమునందు చిత్రకథలనుమాత్రము ప్రకటించు
మాసపత్రిక యిదియొక్కటియే.

వలయువారు,

మేనేజరు,

**భారత కథానిధి.**
ప్రొద్దుటూరు.

సం॥రం చందా 2-0-0

---

# రెడ్డికులప్రభ.

దత్తమండలమున రెడ్డికులాభ్యుదయమునకై సొంపగు
చిత్రములతో, సులభశైలితో ప్రతీమాసాదిని
ప్రకటింపబడు సచిత్రమాసపత్రిక.

వలయువారు,

మేనేజరు

**రెడ్డికులప్రభ.**
రామసముద్రం, (చిత్తూరుజిల్లా.)

సం॥రం చందా 4-0-0

# విజ్ఞప్తి.

పాఠక మహాశయులారా!

ఒకటిన్నర సంవత్సరమునకు బూర్వమే నేనీనవలను రచించినంతనే నాయందలి యభిమానముచే నామిత్రులు కొందరుజూచి చదివి యానందించి నన్నిత్వరలో ముద్రింపించవలెనని యెన్నుప్రోత్సాహపఱుప సాహసించి ముద్రించితిని.

ఇందలి కథయంతయు స్వకపోలకల్పనమే. ఈనవలలోని ప్రదేశములును, గ్రామములును, మద్రాసుపట్టణమునకును తత్ప్రాంతమునకును సంబంధించినవి. ఆంధ్రభాషాయోషను సేవించు నుద్దేశముతో వ్రాసిన నా యీనవలారచనమున నేనెంతవఱకు కృతకృత్యుండనైతినో పాఠకులే నిర్ణయింతురుగాక.

ఇందు ముద్రణస్ఖాలిత్యము లనేకములుగాననయ్యెడు. వాటినెల్ల ద్వితీయ ముద్రణమునందు సవరించుకొందును. ఈనవలను రచించుటకు నాకు చాలాప్రోత్సాహమొసంగిన నామిత్రుడు వావిల్కొలను సుందరరావు గారికిని ముద్రింపించుటకు దోడ్పడిన మిత్రమండలికిని నాకృతజ్ఞతాపూర్వక వందనములు. ఈ నాప్రథమప్రయత్నమును సాహసించి ప్రకటించినందులకు బండితలోకము మన్నించునని తలంచెదను.

మదనపల్లె,<br>
6—4—1930

గ్రంథకర్త.

# అంకితము.

కీర్తిశేషులైన తండ్రిగారికి.

---

సీ॥ మరియాదపురమున మాన్యమౌ వైశ్యసంఘమునకు
దలవోలె గ్రాలెనెవఁడు
ఆంధ్రమందే గాక నాంగ్లమందునుగూడ
పండితాఖ్యుల మెప్పు బడసెనెవఁడు
చిన్నప్రాయమునందె చేరియుద్యోగాన
'తహశీలుదా'రాయె ధరణినెవఁడు
ఆశ్రితకోటి కనంతము గనుపాయ
మొనరించి కీర్తిని బొందెనెవఁడు

గీ॥ మొగిలిపులవంశపాథోధి పూర్ణచంద్రు
డస్మదీయజనక వర్యుఁడైనయట్టి
క్రిష్ణమశ్రేష్ఠికిదగ నీకృతినిప్రీతి
నంకితంబొనరింతు నేనధికభక్తి॥

శ్రీ

# భానుమతి

## మొదటి ప్రకరణము.

### ధర్మపురము.

ధర్మపురమను గ్రామము మదారాసు రాజధానియందు పేరెన్నికఁగన్న పురంబులలో నొకటి. ఈగ్రామము సముద్రమట్టమునకన్న నాల్గువేలడుగుల నెత్తుననుండుటవలనను, శీతోష్ణములంత యెక్కువగా లేకుండుటచేతను చాలమంది యాత్రికుల నాకర్షించుచున్నది. మఱియు నుద్యోగస్థులు దేశదేశములనుండి సెలవుదినములలో నిచ్చటికరుదెంతురు.

గ్రామమునందలి కట్టడములలో అతి పురాతనమైనదియు, ముఖ్యమైనదియునగు భవనమొండుకలదు. అయ్యది జమిందారు రామశర్మగారిది. వెలుపల మాత్రమంత బాగుగ లేకున్ననూ లోపలి భాగమున చాలపని చేయఁబడియున్నది. అంతయు నొక గొప్ప దేవాలయమువలె చిత్రింపఁబడినది.

ఆగ్రామమున కిరువంకల రెండుగొప్ప తటాకములు విరాజిల్లుచున్నవి. వానిలో నీరెల్లప్పటికినుండును. అచ్చటి ప్రజలు వర్షమునకై చింతింపఁబనిలేదు. వారికి గావలసినప్పుడు గ్రామము ముందరనే పాఱుచున్న కావేరినదిని తమ చెఱువులోనికిఁ బోనిత్తురు. తత్సహాయమువలన యచ్చటి జనులు తమ భూములను సాగుచేయ గల్గియుండిరి.

కొంచెము యించుమించుగ నాయూరఁగల ప్రజలెల్లరు ధనవంతులే యనిన యతిశయోక్తి కానేరదు. కాని చాలమంది

విద్యావిహీనులే. అయిననూ వారినెల్లరను పాశ్చాత్య నాగరికతా వనిత వరించియున్నది. ఎవ్వని మోముజూచినను తలపైన క్రాపింగు తప్ప శాస్త్రసమ్మతమైన జుట్టుకాన్పింపదు. వీరు విద్యాగంధ మించుకైన లేనివారె. వీరికెట్లా వేషములలవడెనని పాఠకులూహించుకొనవచ్చును. ఉద్యోగస్థులు తఱచుగా నీపురమునకు వచ్చుచుండుటచే వారి ననుసరించియుండిరి. మద్రాసీయులు యుబుసుపోసికొనుటకెట్లు సముద్రపు టొడ్డునకు జేరుదురో నీపురజనులుగూడ తమ తమ పొలముల వైపునకుఁ బోవుట వారికి యలవాటు.

ధర్మపురికిరువది మైళ్ళలోపలగల భూములన్నియు సాగు చేయఁబడుచున్నవి. కాగడావేసి వెదకిననూ నొక్క బీడుభూమియుఁ గానరాదు. ఎవ్వరైన నూతనముగా యిలుకట్టుకొన నెంచిన తమ పొలమును పూడ్చివేసే గట్టుకొనవలయు. కావుననే యచ్చటి భూములన్నియు సారవంతములై వెలలు కల్గియున్నవి. వాటిలో మూడుపాళ్లు జమీందారు రామశర్మగారికి సంబంధించినవే. సాలున కిరువదివేల రూప్యములు వాటిపై గుత్తలుమాత్రము వచ్చుచుండెను. అవి యాతడు స్వయముగా నార్జించినవి గావు. పిత్రార్జితము. వారి తండ్రి యదివరకుండిన జమీందారునకు సమీపజ్ఞాతి యగుటచే జమీందారు ననంతరమాతనికి వారసులు లేనందున యాతనికి జెందినవి. అతని తరువాత రామశర్మకు సంక్రయించినవి. అక్కాలమున రామశర్మ నెఱుఁగని వారే లేరు.

ధర్మపురమునఁ జూడవలసిన వింతలయందు రెండవది యోగీశ్వరాలయము. ఈదేవాలయము పట్టణమునకు సమీపమున నేయున్నది. గ్రామమున కుత్తరభాగముననుండు చెరువున కిరువది గజముల దూరముననుండుట వలన యీగ్రామమును దర్శించువారు తటాకస్నానమునకును, సాయంకాల విహారమునకును, అచ్చట చెరువు

కట్టపై గూర్చుండి విలాసార్థముగ మాటలాడుకొనుటకును యనుకూలముగ నుండును. దేవాలయ మంటపమెక్కి సాయంకాలమున పరిసర ప్రాంతముల నవలోకించితిమేని ఆనందదాయకముగనుండును. ఉత్తర దక్షిణ దిక్కుల ప్రబలతరంగ పంక్తులచే ఘూర్ణిల్లుచుండు తటాకములును, తత్సమీపముననే శృంగారవంతముగ నలరారుచుండు యీశ్వర దేవాలయమును, దానికీవల పచ్చనియాకృతి గలిగి నలరారుచుండు లేబ్రాయఁపు వరిపొలములును, చుట్టును నారికేళ వృక్షములతో నిండిన వనములును చూచుట కెంతయో నానందముగనుండును.

జమీందారు గారిప్పుడీయూర లేరు. మద్రాసునందు నివసించుచున్నారు. ఆయన కచ్చటనే యుద్యోగము. హైకోర్టునందు సబ్ జడ్జిపదవి. శెలవులువచ్చినంతనే స్వగ్రామమున కరుదెంచి తన భూముల వ్యవహారముల నడుపుకొనుచుండును. ఆతని భార్య లీలావతి మహాపతివ్రిత. అసత్యమనునది యెఱుఁగదు. మోసమనునదామెకుఁ దెలియదు, అసూయత నింటి కడపనైన నెక్కనీయదు. ఆమెకిప్పుడు ముప్పదవయేడు. ఇఁక సంతానము గలుగుననుయాశ యాదంపతులకు లేదు, "అంగడిలో నన్నియునున్నవి; అల్లుని నోటిలో శనియున్నపన్నట్లు" తమ కెంతయాస్తియుండిననేమి? ఎంత పెద్ద యుద్యోగమునందున్ననేమి? బిడ్డలు లేని గృహము శూన్యగృహమేగద. ఈచింతవారి ననవరతము దుఃఖాబ్ధిని ముంచివేయుచుండెడిది. కాని వారేమి చేయఁగలరు? చేయవలసినవన్నియు జేసిరి. తుదకు విసిగి యూరకుండిరి.

వేసవికాల మరుదెంచెను. ఆయేడు వానలు బహుకొద్దిగా కురిసినవి. అందుచే నెండలు బహుతీక్షణంబులుగానుండెను. జనులు ప్రాతఃకాల మెనిమిది గంటలకుఁబైగా వీథిలోనికి వచ్చుటయే బహు

కష్టము. వార్తాపత్రికలలో నెండదెబ్బచే (Sun Strokes) జనులచ్చటచ్చటకూలఁబడి మృతినొందుచున్నారని ప్రకటించుచుండిరి.

మదారాసు హైకోర్టునకు నాలుగుదినములలో వేసంగికి మూయుదురని వదంతి బయలుదేరెను. అందులకే కాబోలు ధర్మపురమున జమీందారుగారి గృహమును రిపేరిచేయుచుండిరి. ఆయ నెప్పుడు వచ్చునోయని జనులు నిరీక్షించియుండిరి. వేసంగికి తానచ్చటి కరుదెంతునని వారికుత్తరము వ్రాసియుండెను.

ధర్మపురమిప్పుడు మిక్కిలి శోభాయమానముగనున్నది. ఎందుకన? పొరుగూర్లనుండి యనేకులు యాచకవృత్తిచే జీవించువారచ్చటికి వచ్చియుండిరి. మరియు బొమ్మరివాండ్రేమి, హరికథలు జెప్పువారేమి, శతావధానష్టావధానము లొనర్చువారేమి, యక్షిణీ గారడీవిద్యలొనర్చువారేమి, వారువీరననేల? యాచకవృత్తిచే బ్రతుకు ప్రపంచమే యచ్చట నిమిడియుండెనన్న యతిశయోక్తి కానేరదు. ఎల్లరును యెప్పుడు కోర్టుమొదలగు యాఫీసులు మూయుదురాయని వేచియుండిరి. వాటిని మూసిననేగాని తమ పనిసాగదు. ఎందుకన? శెలవులు వచ్చినంతనే ఉద్యోగస్థులందరచ్చటి కరుదెంతురు. వారి యెదుట తమ విద్యానైపుణ్యమునుఁజూపి బహుమానములు గొననెంచియుండిరి. నక్షత్రసహిత చంద్రునికై చకోరములెట్లు నిరీక్షించియుండునో యట్లుద్యోగులందఱిలో మేటియైన జమీందారుని రాకకై యెదురుచూచుచుండిరి. ఉద్యోగులెప్పుడు వచ్చుచూ పోవుచుండుటను జూచిన నాయూరు రెండవ యుదకమండలమున బరగియుండె.

ఉద్యోగుల కప్పుడప్పుడు బిరుదము లొసఁగుట ప్రభుత్వధర్మమైయున్నది. ప్రభుత్వమువారికేయుద్యోగి మేలుచేకూర్చునో

యాతని గుణగణములను ప్రభుత్వమువారు పరిశీలించుచుందురు. ఇట్లు పరిశీలించి యోగ్యులైనవారికి చక్రవర్తిగారి జన్మదినముననో లేక యుద్ధ విరామదినముననో వారివారి యోగ్యతానుసారము బిరుదము లొసంగెదరు. మన జమీందారుగారికి "దివాన్ బహదూరు" యను గౌరవ బిరుదము నొసంగినను వార్త గెజిటునందు ప్రచురించి యుండిరి. అందులకే కాకోలు ధర్మపురమున గూడియున్న యధికారులు, అధికారేతరులు, పురప్రముఖులువారి గౌరవార్థమై యొక విందుజరుపనిశ్చయించియుండిరి. కావలసిన యేర్పాటులన్నియు జరుపంబడెను. కావుననే జమీందారుని వీధియంతయు శుభ్రపరచుచుండిరి. ఆవీధియందుండు గృహములన్నియు నాతని సంబంధించినవే. అందు నివశించు వారందరు తమ యిండ్లముంగల సిరుచల్లి ముగ్గులుంబెట్టుచుండిరి. విందునకేతెంచు ప్రజలందఱికి నాహ్వాన పత్రికలంపబడియుండెను. మరియు సభవారందరు గూడుటకు నాయూరున వెలసియుండు శారదా నాటకశాలను గూడనలంకరించిరి.

కౌన్సిళ్ళయందేమి, ఉపన్యాసవేదికలందేమి, వారివారి స్వసంఘములందేమి, స్త్రీలకు పురుషుల రీతి సమాన హక్కుల నొసంగవలసినదని విరివిగా తీర్మానించు నీకాలమున నాసభకు స్త్రీలకుంగూడ నాహ్వాన పత్రికలంపబడిన వని వేరుగ జెప్పుట యనవసరము. గావుననే స్త్రీలందఱు చక్కగా నలంకరించు కొనుచుండిరి.

# భానుమతి.

## రెండవ ప్రకరణము.

### వైకుంఠశర్మ.

సాయంకాలమయిదు గంటల సమయము. ఎండకాలము గాన యింకనూ సూర్యుఁడు ప్రకాశించుచుండెను. ఆ కాలమున మోటారు బండ్లింకనూ చాలా వె[illegible]లిగియే యుండెను. ఐరోపియనులు దప్ప నేటీవులింకనూ మోటార్లు [illegible]నకుండిరి. మోటారుకన్న రెండవ యంతస్తు గుఱ్ఱపు స్వారిచేయుట.

అట్టి సంధ్యాసమయమున నొకఁడు [illegible]ఁడై ధర్మపురి వైపరుదెంచుచుండెను. ఆతఁడు వేసుకొన్న దుస్తులను బట్టి నొకగొప్ప యుద్యోగియని చెప్పక చెప్పుచుండెను. కాలికి బూడ్సులు, మోకాలివరకు కాలిసంచులు, అంతకుపైగా షరుచపరాయి, షర్టుపైన వేస్టుకోటు, దానిపై నొకమంచి ట్వీడుకోటు, గొంతునకు కాలరు, అందులోనిమిడ్చియుండు నెక్టయి, ముఖమునకలంకారమగు కంటియద్దముల జోడు; తదుపరి హ్యాటును ధరించి చేత బెత్తమును ధరించి గుఱ్ఱమునదలించుచుఁ బోవుచుండు నలువదియేడ్ల పురుషుని వీక్షించిన యిరువదియేండ్లకన్నమించి యుండవని యభిప్రాయపడుదురు.

ఏవ్యక్తికై యింతవరకు ధర్మపురి నివాసులందరు నిరీక్షించి యున్నారో, ఏపురుషుని గౌరవార్థమై జరుపఁబోయ్యేడు విందు సమయమున తమ్ములఁగూడ నాహ్వానించినందులకు సంతోష చిత్తులై పోవనుంకించుచుండిరో, ఏయధికారి తమ వ్యవహారములను వీక్షించుటకై రాబోవుచున్నాడని వేచియుండిరో, ఆవ్యక్తియే యశ్వారూఢుఁడైన జమీందారుగారగు రామశర్మగారు.

ధర్మపురి పొలిమేరువద్ద కరుదెంచు నప్పటికే యచ్చటది వరకు వేచియున్న జనసమూహమునందు కలకల మారంభమయ్యెను. మేళగాండ్రు తమవాయిద్యముల వాయించదొడఁగిరి. అంతలో రామశర్మగారేతెంచిరి. వెంటనే యచ్చటకూడియున్న ప్రముఖుల లో నొకరు యాతని పుష్పమాలా లంకృతునిగఁజేసిరి. పిమ్మట జనులందరు యాతని చుట్టు గుంపుగాగూడి దారి నడువసాగిరి. ముఖ్య పురవీధులగుండ పూరేగించి, శారదా నాటకశాలకుంబోవు మార్గమునకై బ్రాహ్మణ వీథినిఁబడ పోవసాగిరి. వీథికడపటింటి వద్ద కరుదెంచునప్పటికి గుఱ్ఱమొకింత యాగెను. జమీందారుగారి దృష్టి యాయింటిముందరి వయ్యారముగ నిలచియున్న పదునాఱేండ్ల జవ్వనిపై వారెను. తదుపరి నాటకశాలా మార్గమునఁ బడిపోవ జొచ్చిరి.

ఆమార్గమధ్యమున యాయింటి ముంగల వయ్యారముగ నిలచుకొని యుండిన స్త్రీ యెవ్వరని పాఠకుల మనంబు తెలుసుకొన తత్తరపడవచ్చును. ఆమె సుప్రసిద్ధ డాక్టరు వైకుంఠశాస్త్రిగారి తనూజయని కొందరును, అవివాహిత మేనగోడలని కొందరును యనుకొనుచుందురు గాని యందేది నిజమో దెలియదు. చూపరులకు మాత్రము సాక్షాత్ లక్ష్మీదేవియో లేక రతీదేవియో యని మనంబున శంకగొల్ప చేయును. కానివారి కుండవలసిన గుణము

లలో నొక సహస్రాంశమైననూ లేదు. పైకిమాత్రమతి వినయము. తేనెపూసిన కత్తి. గోముఖ వ్యాఘ్రము.

ఎల్లున్ననేమి? ఆసౌందర్యమునుఁ జూచి నెవ్వఁడు ముగ్ధుండుకాఁడు; మొగమునందలి రంగుపూత, ఆతోకజడ, ఆకనుబొమలు మీఁది కాటుక, ఆనవడల మధ్య తమలము గలిగి నిక్కుచు వయ్యారముగ సంచరించుచుండిన పరాశరునివంటి వానికే తెగులుఁబుట్టిన మనబోటి యల్పమానవుల గతిఁజెప్పనలయునా? రామశర్మ యామాయలలో చిక్కెననుటకు సందియము లేదు.

ఆమె యెవ్వరైననేమి? ఆయింటియందు కాపురముండుటచే యాయింటి వారికి బంధువై యుండఁదగునని చెప్పనొప్పు.

వైకుంఠ శర్మగారి నెఱుఁగని వారాగ్రామమున లేరు. ఆగ్రామవాసు లేయననేల? చుట్టుపట్టుఁగల జనులందఱు యాతని నెఱిఁగి యుండిరి. అతఁడు సుప్రసిద్ధ డాక్టరు. అతనికి యాయుర్వేద వైద్యమునకన్న యింగ్లీషు వైద్యమునందాతని కత్యంత పరిచయము. వ్యభిచారవృత్తిచే జీవించువారల కత్యంత పరిచయుఁడు. రహస్య గర్భవతుల కధిక ప్రాముఖ్యుఁడు. అందుగల మర్మార్గులకు జారచోరుల కత్యంత ప్రియమిత్రుఁడు. ఎవ్వరేని నిద్దఱు కలహించి నొకని నొకరు జంపఁదలచుకొన్న యీడాక్టరు స్నేహముఁ జేసినఁ జాలును. అతఁడే పర్యవసానము గావించును. దుష్టకార్యములందగ్రగణ్యుఁడు. అతఁడు నెలకొల్పియున్న వైద్యాశ్రమము దప్ప వేరొకటి నాయూర లేనందువలన యాతఁడే ఘనవైద్యుఁడు. అతని మాట వేదవాక్యము. ఇంతటి కార్యవంతుఁడెట్లా గ్రామమునందుండ గల్గెనని పాఠకు లూహించుకొనవచ్చును. ప్రపంచమునందు ధనవంతులే యన్నిఁటికిని కారణము. మంచికిగాని, చెడ్డకుగాని వారే

కారణభూతులు. అందు వెలశియుండు వారందఱు ధనవంతులగుటచే దుర్మార్గపుం బనులాచరించుటకు వెనుదీయరు. తమకు మంచివాడు గానున్నందున పోరులకేట్లున్న నేమి? తమ పనులకు సహాయభూతుండుగదా యని మిన్నకుండిరి. ఆదుర్మార్గులకు వెఱచియో లేక మరే కారణముననో నేమియు ననకుండిరి. ఒకరిద్దఱు వైద్యులు నుచ్చటికి రాజూచిరిగాని తమ యాటలక్కడ సాగవని వెడలిపోయిరి. దుర్మార్గుల ముందఱ నుంచి ప్రజలకు కాలము గునా? పైకము నార్జించు విషయములో యేపనిఁజేయుమనిననూ చేయును. ఒక వేళ నాతనికి కొంత ధనమిచ్చి ఫలాని వారిని ముంచవలసినదనిన, నేవిధము చేతనైనను నాతనితో పరిచయము మొనరించుకొని తుదముట్టించును. గాన నేనాయూరంగల ప్రజలు నాతనిజూచిన భయపడుదురు. అదేమి మాయయోగాని నాతని హస్తగుణము మంచిది. అతండే రోగినైన బాగుచేయ దలంచెనేని యాతండు జీవించగల్గినట్లే, నాతనికిం గావలసినది ధనము. కేరు ప్రతిష్ఠలతో నిమిత్తము లేదు. ఆతం డొక యనాథ శరణాలయమును నొకటి స్థాపించియుండెను. అందులో తనవద్ద కరుదెంచు రహస్య గర్భవతులగు స్త్రీల గర్భమునుండి వక వేళ జీవించ గల్గిన శిశువు జనయించిరేని వారిలో మంచి యందము గలవారిని మాత్రము పెంచుచుండును. పెంచి పెద్దలఁజేసిన తరువాత వారి నమ్మివేయును. ఆతనికి భార్య లేదనిఁ జెప్పెదరు. బహుశా చనిపోయియుండవచ్చునని గ్రహింపఁదగును. కాని యాతనికి పండ్రెండేండ్ల యీడుగల నొక్కకొమారుండును, యెనిమిది వత్సరముల కొమార్తె యొక్కతియునుండిరి.

పిల్లవాడంతందగాడు కాడు. చామనచాయ; కురూపి, తండ్రి కెంతమాత్రముఁదీసి పొయ్యెడివాడుగాడు. నిరక్షరకుక్షి, పిల్లవాని నెదవ యేడే తండ్రి పాఠశాల కంపెను. గాని యాతని

దురదృష్టమేమోగాని యింతవఱకు మొదటి తరగతి పుస్తకముఁ
జదువనేఱడు. ఎట్లున్ననేమి? ధనవంతుని బిడ్డండగుటచే గౌరవము
నకు కొఱంత లేదు. ఇఁకనాతనిఁ జదువనేయుట యుపయోగము లేదని
తండ్రి తనవద్దనేయుంచుకొని తన సేవకునివలె జూచుచుండెడివాఁడు.
విద్యాగంధ మెఱుంగని వాని విషయమెంత చెప్పినను తనివి తీఱదు.
ఇఁక నాతని స్నేహితవర్గముఁగూడ యట్టి వారేయని వేరుగ చెప్ప
నక్కఱలేదు.

ఇఁక కొమార్తెయన్ననో పాపము చిన్నది. ఆమెకు
మూఁడవ యేట తలిదండ్రులు వివాహముగావించిరి. పెండ్లియయిన
నెల దినములకే భర్తమరణించెను. అందుచే నేమి తెలియని పిల్ల
వైధవ్యమనుభవించుచున్నది. ముక్కు పచ్చలారనియీచిన్నికి
పెండ్లి యననేమో యెఱుఁగని బిడ్డకు వివాహము గావించి వైధవ్య
మనుభవింపజేసిన యాతలిదండ్రులను దూరవలయునా? లేక యీ
కాలపు సంఘ సంస్కర్తలను దూరవలయునో తెలియదు. మాటలు
కూడ యింకనూ రాని పిల్లలకు వివాహమనునది జేసివారిని దుఃఖాబ్ధిని
ముంచెడి చెడుగుల నేమిచేసినను పాపములేదు. పురుషులకన్న
స్త్రీకెక్కుడు కామమని యెఱుంగరా? అట్టియెడ వారికి యవ్వన
మంకురించిన తర్వాత నెట్లుండ గలరు? గాన నట్టివారికి పునర్వివాహ
ముగావించిననేమి? శాస్త్రి సమ్మతముగాదని కొందఱు వాదించె
దరు. ఆవిషయమంత పాటింప నక్కఱలేదు. సంఘమౌన్నత్యము
నకు రావలెననిన యిట్టి వివాహములు గావించిననేగాని సంఘమభి
వృద్ధికి రానేఱదు. దురాచారములడుగంటవు. భగద్వ్యాధివలన
నొకనికి వృద్ధాప్యమునందు భార్యావియోగము తటస్థించెనేని, తన
శరీర స్థితిగతులు నారయక, కుటుంబముయొక్క భావి పరిస్థితులను
పరీకింపక మఱునాడే నోరెఱుంగని ముగ్ధను పరిణయమాడుచున్నాడు.

వేరొకఁడు బాల్యమునందే వైధవ్యము నొంది అత్తింటి ముఖమైనను నెఱుఁగని యుక్తవయస్సుండిన కొమరిత తనతండ్రిచేతలకు దూరుచు తన్నట్లొనర్చిన భగవంతునిఁ దిట్టుచుండ, తాను వారికి సద్వర్తనలను బోధించుచు, సత్కథా కాలక్షేపముల నాచరించుచున్నాడు. తనకు పత్నీవియోగము ప్రాప్తించి నప్పుడు పుత్రికలకు నేర్పిన పుణ్యకథలను మఱచిపెట్టి పరిణయమాడుచున్నాడు. పురుషులకేల యిట్టి వివాహములు? తామే మొగజన్మ మందితిమనియా? లేక నిరంకుశుల మనియా? స్త్రీలు తమకు యణఁగియున్నారనియా? దంతములూడిననూ, వెంట్రుకలు నెఱసినను, ముఖము రక్తహీనమై ముడుతలు బడి చూచుటకు గుంటనక్క వలెయుండినను, కాటికి ప్రయాణమగుచున్ననూ తాము తిరిగిపెండ్లి యాడవచ్చు. ఏమియెఱుఁగని ముద్దు బాలికలు చిన్ననాటనే వైధవ్యమనుభవింపచేసి తిరిగి వివాహము గావించుటకు మనసొప్పదా? ఇదేటి న్యాయమో తెలియదు. సంఘమునందీ కారణమున దినదినము బాలవిధవల సంఖ్య యభివృద్ధి నొందుచున్నది. ముత్తైదువుల సంఖ్యకన్న వితంతువుల సంఖ్యయధికమగుచున్నది. వితంతువులు యభివృద్ధియగుకొలఁది సంఘ గౌరవము నానాటికి క్షీణించి పోవుచున్నది. దీనిని నివారింపఁజేయుటకు సాధనములు లేవా? ఓ దేశభక్తులారా? మీరేల నడుములు గట్టుకొని వితంతూద్వాహములు గావింపగూడదు. ఓ దేశనాయకులారా! ఎన్ని సంసారములు భ్రూణహత్యలొనర్చి యపకీర్తి పాలై కూలిపోవుచున్నవో యోచించితిరా? యీమారిని మారణము జేయరేమి? వీరేశలింగ పంతులు, రామమోహనరాయలు, కేశవచంద్రసేను, యీశ్వరచంద్రునివంటి మహామహులవలె నేలపని చేయరాదు. ఓజగదీశ్వరా! భరతమాత గొడ్డుబోయినది. బిడ్డలఁగనుటలేదు. కనినను పెంచుటకు భయముజెందుచున్నది. పుట్టిన క్షణముననే చంపివేయుచున్నది. నీవొకసారి వారివంక కన్నెత్తిచూడుము. నీకృపారసమును వెదజల్లుము. వితంతువుల దుఃఖమెడబాపుము. జనులను వితంతూద్వాహముల పట్ల యభిమానమునుంచునట్లు జేయుము.

# భానుమతి.

## మూడవ ప్రకరణము.

### మోహావేశము.

అది వైశాఖ మాసము. రాత్రిసమయము. వెన్నెల దినములు. చంద్రుడుచక్కగా ప్రకాశించుచుండె. అతని కిరణములు ధర్మపురిలోనిజమీందారుని గృహమున కేటవాలుగా పడుచుండెను. ఆవెలుఁగులో నాయింటిలోని నొక్కగదిని యాధావళ్య కిరణజాలము సున్నము కొట్టినట్లుండెను. అంతయు వెన్నెల మయము.

రాత్రి పొద్దుఁబోయిన తరువాతి రామశర్మ యింటి కరుదెంచెను. విందుయగు నప్పటికి యెనిమిది ఘంటలాయెను. అతఁడు మాటలాడుచు యింటి కేతెంచునప్పటికి తొమ్మిదిన్నర ఘంటలయ్యె. వచ్చినంతనే తన దుస్తులనుఁ దీసిగూటమునకుఁ దగిలించి రాత్రి దుస్తుల (Night Dress) ను ధరించి యెచటికి పోవుటకుఁ దోచక చక్కగా తనపెరటి త్రోవన దూరి యుద్యానవనమునఁ బ్రవేశించెను. అందమర్చియుండు యొక పడక కుర్చీపైపడెను. నాడేలకో తానూరేగి నప్పుడు యాయువతినిఁ జూచినప్పటినుండి యాతనిమనంబొక విధముగానుండెను. పరాధీనమైయుండె. ఆ యువతిని గూర్చి చింతింపదొడఁగె.

"నన్ను భ్రమింపఁజేసిన యీబంగారు బొమ్మ యెవ్వరోకద. డాక్టరుగూడ నాకుచిరపరిచితుఁడే. అయిన నాయువతి యాతనికేమి కావలయునో? ఆమధురాకృతికి నామనంబు సంతసమందెను కాని దాని చందమెఱుకపడదయ్యెకదా! ఈవరకెందరో సుందరాంగులఁ జూచితిని కాని యింతటి సౌందర్యవతినిఁ గాననైతి. నిన్నటి దిన మామెను జూచినది మొదలు నాకేల యిట్టి భ్రాంతిగలుగుచున్నది. ఆముద్దు మోమును తనివిఁదీర దగ్గరనుండి చూచు భాగ్యమెప్పటి కబ్బునోకదా! ఒకవేళ డాక్టరును ధనముచే నొప్పించవచ్చుననుకొనెదను. నాభార్య సవతిపోరునకు నిచ్చగించునా?" అని పరిపరివిధముల చింతింపసాగెను. అట్లు చింతించుచుండ యీతనికి పొద్దే తెలసినది గాదు. ఇంతలో తాలూకాఫీసునందు రెండుఘంటలు గొట్టిరి. వెంటనే యాతఁడు తనగడియారమునుఁ జూచి "ఏమీ! అప్పుడే రెండు ఘంటలైనదే నేనెంత కాలమునుండి యిటులనున్నాడ. ఎంతప్రొద్దు పోయినది. ఎంతటి మూర్ఖుడనైతి. నేసంకల్పించిన పని జయించునోయన్నట్లు గంటకూడ మ్రోగినది. తప్పక ఫలసిద్ధిగాగలదు." అని యేమియో వితర్కించుకొనుచు! తనభార్య గదిలోనికేగెను.

ఆమె తననాథుఁడదేలకోయదివఱకు రాడాయెనని యతనికై చాలాసేపు వేచియుండి యిప్పుడే నిద్రించియుండె. ఇంకనూ యొక తూగుఁదూగెనో లేదో యంత యడుగులుచప్పుడు విననయ్యెను. వెంటనే యులికిపడి లేచి "ఎవరువారు?" అన యాతురతతో నడిగెను.

రామ— "ఎవ్వరు గాదులే! నేనేగదా" అనెను.

లీలా — " నాథా! యెచటికేగితిరి? ప్రొద్దుకూడ తెలియదయ్యెనా? "

రామ— "తోటలోనుంటిని, కుర్చీపై కూర్చొని యుండ యట్లనేనిద్రించితిని. నిదురబట్టినదో లేదో నొకకలగంటి. వెంటనే

నిద్రాభంగమయ్యె. అంత లేచి చూతుగదా రెండు ఘంటలు మీరి నదిచక్కగా నీగది కేతెంచితి."

లీలా — "ఏల మీముఖమంతగా వాడియున్నది? స్వప్న ప్రభావమేగాబోలు. అంత చెడ్డకలయూ యది?"

రామ — "ప్రేయసీ! నీవుచక్కగా గ్రహించితివి. ఆస్వప్న మంత చెడ్డదిగాదు గాని యాకహాశ్య మెఱింగించిన నీవలుగవుగద".

లీలా — "నేనెందుల కలుగవలయు".

రామ — "అట్లయిన వినుము. బిడ్డలు లేరని నీకునునాకును చాలకాలమునుండి కలదుగద. కాన నేను వేరొక వివాహముం గావించుకొన నెంచియున్నాడ. అట్లు చేయుటవలన నీక సౌఖ్యముగల్గించిన వాడనగుదును. మరియు నీయిష్టమేమిరుద నున్నదో. దశరథు నంతటివాడు భార్యపోరునకు ప్రాణములువిడె. గాన నదిశ్రేయస్కరముగాదని మనంబున నొకశంక బొడముచున్నది. నీవు సమ్మతించిననే నాప్రయత్నముచేసెద. మరియు దేవుడే నన్నట్లు ప్రేరేపించుచుండెనో యన్నట్లు నాకుకలయందుం గాన్పించిన కాంత మంచి రూపవతి. ఆమెను నిన్నటిదినము డాక్టరు యింటజూచితి. ఆమె యాతని కేమి కావలయునో తెలియదు. కాని యాతని రప్పించి మాటలాడవచ్చును. దేనికిని నీయనుగ్రహమున్నగదా?"

లీలా — "నాథా! మీరేల నాపైన భారము వైచెదరు? పురుషులెంతటి పనికైనను వెనుదీయరు. అట్లొనరించిన ప్రథమభార్య గతిఱుక్కల గతియేగద. అయినను మీరటువంటి వారుకారని నాకుం దెలుసును. ముఖ్యము సంతానములేనిచింత మనలను బాధించుచున్నయది. "అపుత్రస్య గతిర్నాస్తి" అను లోకోక్తి ననుసరించి పుత్రులు లేనివారికి గతులు లేవని మనశాస్త్రములు బోధించుచున్న యవి. గాన మీరు రెండవ వివాహము జేసుకొనుట నాకుంగూడ

సమ్మతమే. కాని యామె మాయలకు లోబడి సన్నెచట విడనాడె దరో యని నామనంబు కలతనొందుచున్నది. మీహృదయము సం పూర్ణముగా యెఱిగిన దాన నగుటచేయట్లు భావింప ననమంజసము. మఱి మీరు పిల్లనుజూచియే యుంటిరిగదా? సౌందర్యవతియేనా?''

రామ— ‘‘చక్కగనేయున్నది''.

లీలా — ‘‘నాథా! యిప్పటికే చాల ప్రొద్దుబోయినది. ప్రస్తుత మాశిషయము చాలించి నిద్రింతిము. పెందలకడనే డాక్టరునకు నే కబురంపెదను. మీరు శయనింపుఁడు.'' అని యిద్దఱు మెసఁగిరి.

ప్రాతఃకాలమేడు ఘంటలాయె. జమీందారుని గృహ మంతయు మేల్కాంచినదో యనునట్లు శేవకులు తమతమ పనుల నిమగ్నులైయుండుటచే యెుకింత సందడికాసాగె. ఇంతలో రామ శర్మగారి గదివద్దకు వంటలవాఁడుపోయి ‘‘స్వామీ! కాఫీతయారైనది. కొనివత్తునా?'' యని యడిగెను. అతఁడందుల కంగీకరింప వంట వాఁడు కాఫీనిఁగొనివచ్చెను. అంత భార్యభర్తకు యందించెను. అతఁడద్దానినిఁగ్రగైకొని ‘‘ప్రేయసీ! నీవెందులకు కాఫీని పుచ్చుకొనవు? చాలదినములనుండి నిన్నడుగవలయుననియుంటిని. అది నీకు రుచిం చదా?''

లీలా — ‘‘నాథా! సారాయము ద్రాగిన నెంతో కాఫీ ద్రాగిన నంతే''

రామ— ‘‘అదెట్లు?''

లీలా — ‘‘సారాయము మొదలగు మత్తు పదార్థములు మనలనెట్లు దాసుల గావించుకొనుచున్నదో యట్లేకాఫీ, తేనీరు మొద లగు పానీయములుగూడు లక్షల కోట్ల జనులను దాసుల జేసుకొను చున్నది. ఈరెండింటికి బేధమేమన — కాఫీకంటె సారాఁ ,

యధికముగా, శీఘ్రకాలములోనే హానికలిగించుచున్నది. దాని ఫలితము బలవత్తరమైనప్పుడే గోచరించును. కాఫీ, శరీరాయవ కార్య నిర్వహణమును సారాయమువలె నతిశీఘ్రముగా గాక, క్రమముగా మెల్లఁగా జెఱచును. కాఫీయొక యపుష్టమేగాని యాహార పదార్థముకాదు. ఈవిషయము మనకు గ్రాహ్యమైనప్పుడు కాఫీ నే మాత్రమైననూ మనశరీరములోనికిఁ బ్రవేశింపఁజేయుట మనశరీరము మనమే దుర్వినియోగముచేయుట యేయని గ్రహింపవలయును. కాఫీ యనునది యతి తీక్ష్ణపదార్థము. ఆరంభమున నది నరములకు హృదయమును త్తేజమును గలిగించును. కాని నిరంతరోప యోగమువలన నుత్తేజ గుణముఁగోల్పోయి క్రమముగా జీర్ణశక్తి నశింపఁజేయును. ఇంతటి హానికరమైన పదార్థమైయుండియు మన మెంత రుచికరముగ నుండిన నంతెమెచ్చుకొని గుటగుట త్రాగుచు న్నాము. చూచితిరా! మనము దెలసియో రోగముల నాహ్వానిం కొనుచున్నాము. ఏమంటే! కాఫీని ద్రాగుట గౌరవపదమట. అదియెటో దెలియకున్నది. నీచులు కల్లంగడికి జనినట్లు మనము కాఫీయంగళ్ళకు జనుచున్నాము. వారికిని మనకును బేధమేమి? మనము త్రాగుచున్నాము. వారనూ త్రాగుచున్నారు. ఇద్దఱును త్రాగుబోతులేగదా! మనము నీచులకు కల్లుత్రాగవద్దని బోధించుటకు ముందు గ మనము కాఫీనిద్రాగుట మానివారికి బోధింపవలయు. ముందే బోధించుట యవివేకము. మనము తెలసియే చేయుట మఱింత యవివేకము.

ఇక కాఫీహోటళ్ళ సంగతి విచారింతము. లక్ష్మీ విలాస కాఫీహోటలట, సరస్వతీ కాఫీక్లబ్ అట, మలబార్ రెస్టారెంటట. చూచితిరా! గ్రంథముల పేళ్ళన్నియు కాఫీహోటళ్ళ బోర్డులెక్కినవి. పడకనుండి లేచినదే తడవుగ బాలురు మొదలు

వృద్ధులవఱకు ఒకే యనుష్ఠానము. లోకమాత కాఫీదేవతారాధన గావింపవలయు. ఆయిష్ట దేవతాప్రార్థన ముగిసిననేగాని యితర దేవతారాధన బనికిరాదు. ఆకాఫీ నిచ్చు పాత్రిలవంక జూడుడు. వాటినన్నిటిని నొకపాత్రియందుంచియుండు నీటిలో సారెసారెకు ముంచి కడిగినట్లు నటించి తిరిగి మరియొకరికి కాఫీనందిచ్చుచున్నాడు. చూచియే యెంగిళ్లు దినుచున్నాముగదా, దీనిలో జాతిమత బేధములు లేవుగాని యింటికగు దెంచినంతనే యన్నియు గోచరించును. ఎంత యన్యాయము? ఈకాఫీవలన నెంతధనము వ్రియమగుచున్నదో దెలసికొంటిరా? సాలునకు 47½ లక్షల రూప్యములు వ్యర్థమగుచున్నవే. ఈధనమే మరియొక సదుద్యమునకు వినయోగించిన నెంతయో మేలుండునుగదా, మతాచారములు మంటఁగలసినవి. ఐకమత్యము మంటగలిసినది. సంఘాభిమానము చచ్చిపోయినది. సకల భాగ్యభోగ్యములకుఁ బుట్టినిల్లగు హిందూదేశము, పరాశరాది మహామునులను గన్న హిందూదేశము, కాళీదాసాది మహాకవులనుఁగన్న హిందూదేశము, కర్ణ, భీష్మ, భీమార్జునులాది మహాబల సంపన్నులఁ గన్న హిందూదేశము, అహింసా తారకమంత్రిము నుపదేశించిన సాధు దయామూర్తియైన గౌతమ బుద్ధునిగన్న హిందూదేశము, వివేకానందాది మత సంస్కర్తలగన్న హిందూదేశమున వెలసియుండియు, ఆర్యసంతతి వారమైయుండియు యీమదాచారములు బోగొట్టుకొనకున్న మనము హిందూమాత బిడ్డలకానేరము. మహాత్ముఁడెంత బోధించిన నేమి? అదిమన చెవుల దూరునా? యెన్నటికిని బాగుపడ దలఁచబోము. జంటితేనె బ్రీతి జుర్రెడువేళ నుచ్ఛిష్టమనిన రోత చెందుదురా!” యనెను.

రామ— “ప్రియా! నేదో కారణముఁజెప్పుమటన్న నింత యుపన్యాసముగావించితివి. అది దురభ్యాసమనునది నాకుఁగూడ

దెలుసును. కానియద్దానిని విడచిపెట్టుటకు నాకేలకో బుద్ధిపోడము టలేదు. మఱియు నేను విందులకు తఱచుగబోవువాడను. అచట ముఖ్యముగా కాఫీనుంచుదురు. త్రాగకున్న వారి నవమానపఱచి నట్లగును''.

లీలా — ''సారాయము నచ్చట నుంచనందులకు దేవునికి వేయి నమస్కారములు. మిమ్ముల నిప్పుడే విడువమంటినా? క్రమముగా విడువుడు. కాఫీనిమాని వట్టి యావుపాలనేల త్రాగగూడదు. రుచికరములుగావా?''

రాము — ''అట్లే గావించెద. నేటినుండి శపథముగైకొంటి. ఇందులో నీవుగురువనందగు. ఆవిషయమటుండనిమ్ము. నిన్నటిరాత్రి నీతోవచించి విషయమై యేమాలోచించితివి. సంపూర్ణాంగీకారమేనా?''

లీలా — ''మున్నాటికి యంగీకారమే. అపుడే యాతనికిఁ గబురంపితి అతఁడీపాటికి వచ్చుచుండును.'' అని వచియించెను.

అంతట నాతడు సరియని తలయూంచెను. పిదపనాతఁడు సేవకునొకనిబిలచి ''సుబ్బన్నా! డాక్టరు వచ్చినంతనే యాతనిమేడ మీఁదికి గొనితెమ్ము''ని వెడలిపోయెను.

# భానుమతి.

## నాల్గవ ప్రకరణము.

### వివాహ నిశ్చయము.

రామశర్మ—"డాక్టరుగారూ! రండి! ఇటుగూర్చొనుఁడ"నెను.

వైకుంఠశర్మ—"వందనములు. బహుకాలమునకు దర్శనము. క్షేమమేగదా" యనియడిగెను.

రామ—"మేముందఱము క్షేమమే. మీరును కుశలమేగదా" యనియడిగెను.

వైకుం—"చాలచిక్కినట్టున్నదే జబ్బేమియు లేదుగద".

రామ—"ఏమున్నది! పనులతొందరవేళకుభోజనములేదు".

వైకుం—"ఉద్యోగుల కెల్లఱకు నిదే యవస్థ".

రామ—"డాక్టరుగారూ! విందుసమయమున మిమ్ముల నచ్చట జూడలేదు. వచ్చియుంటిరా?"

వైకుం—"ఎక్కడ! మీరుగొప్పవారు. మావంటి బీదవారు మీకన్నులకగపడెదరా? ఇంతకూ నేనూరలేను. రాత్రియేవచ్చినది. రాత్రియంతయు నిదురలేమిచే యట్లేపఁడుకొనియుంటిని. పొద్దే తెలిసినదికాదు. మీసేవకుడే తెంచి మీరుపిలచుచున్నారని విన్నవింప, అదేపరగున లేచి గుటికెడు కాఫీనిత్రాగి వచ్చునప్పటికించుక యాలశ్యమాయె".

రామ—— ఆశ్చర్యముతో "ఏమీ! మీకుఁగూడ కాఫీయుల వాటుగలదా? ఇదివఱకు నాకును నాభార్యకును దానిగురించి తీవ్ర వాదన జరిగెను. అది దురభ్యాసముగదా?"

వైకుం—— "ఎక్కడికి దురభ్యాసము. ప్రతియొక్కటియు దురయలవాటే చెప్పుటబహు సులభము. పట్టువడిన యలవాటును పోగొట్టుకొనుట బహుకష్టము. నాకిదివఱకే ప్రమాదము దాని వలన లేదు. వచ్చినను నేవైద్యుండనుగదా ఇఁక యోచింపఁబని లేదు. మొత్తమునకు యిదిదురభ్యాసమే".

రామ—— "అవును. తప్పకయది దురభ్యాసమనకతీఱదు. పోనిండు ప్రసంగవశమున మీవిషయమే యడుగుట మఱచితి. మీ భార్య అంత శీఘ్రకాలములో మృతిజెందుటకు కారణమేమి?"

వైకుం—— "ఏమనిచెప్పుదు. ఆమెకెప్పుడెప్పుడు హృదయ కోశమున నొప్పి యెత్తుచుండెడిది. ఎప్పటికప్పుడు మందుపది యొసఁగుచుండెడివాడను. అదేమిచిత్రమో! యీమారు సంభవించిన బాధ యింతయంతయని చెప్పనలవికాదు. ఆమె జన్మమధ్యమునందెప్పు డు యట్లు సంభవించలేదు. చేతనైనంతవఱకు జూచితి; కుదురునట్లు నటించుచుండె. ఒకనాడది బలమై జీవించదని యాశవిడనాడితి. ఆమఱునాడే యామెమృతినొందెను."

రామ—— "మఱల మీరు వివాహ ప్రయత్నము చేయలేదా?"

వైకుం—— (యోచించి) "ఎందుకండీ! ఇఁకనూ వివాహము వయస్సు చెల్లినది. ఇద్దరు బిడ్డలు వివాహము జేసుకొన్న మీ బోటివారు నవ్వరా?"

రామ—— చేసుకొన్న నేమి తప్పితము. చూచుటకంత వృద్ధుఁడవుగా కానఁబడవు. నేనేమఱియొక వివాహముగావించుకొనన నెంచియుండ మీరెందుకు జేసికొనగూడదు. పోనిండు. నాకు

పిల్లనిచ్చువారెవ్వరైన నుంటిన జూపించుడు"

వైకుం—— "ఏమీ! పరిహాసమున కనియెదరా? ఇదివఱకు యొక్క భార్యయున్నదిగదా. ఇంకేల రెండవ వివాహము"

రామ—— "నేను జేసుకొనునది సంతానమునకొఱకు".

వైకుం—— "సరియే మీ మొదటి భార్య జీవించియుండ పిల్లనిచ్చువారుందురా? మీరుధనవంతులుగావచ్చును, జమీందార్లు కావచ్చును. జడ్జిపదవినందుండవచ్చును. అంతమాత్రమున తమ పిల్లలనిచ్చి సవతిపోరుపడుటకు నిచ్చగించు యావివేకులుందురా?"

రామ—— "నా భార్యను నేనొప్పించగలవాడ"ననెను.

వైకుం—— మాటవరుస కిప్పుడంగీకరించవచ్చును. తదుపరి కలహము రాకపోదు".

రామ—— "నిజముగా నామె యొకమారంగీకరించినేని మరి తిరుగునదిగాదు. గాన మీరు వేరువిధముగ యోచించుట యనవసరము".

వైకుం—— ఉన్న స్త్రీ యంతయు సవతికి జనించు బిడ్డనికె సంక్రమించునని దెలసిదెలసి యంగీకరించునా?"

రామ—— "అందులగురించి మీరు సందేహింపబనిలేదు. పిత్రార్జితమునంతటిని నా రెండవ భార్యకు జెందునట్లుగా నొనర్చెద. ప్రథమభార్యకు నాయనంతరము మరణపర్యంతము ననుభవించగలదు. అదియామెకు చాలును లే".

వైకుం—— "ఎంత మొత్తమునకుc గట్టుచుంటిరి".

రామ—— "రెండు లక్షలకు".

వైకుం—— "అయినసరే. పిల్లనన్వేషించుటయే మిగిలియున్నది. నాకుచూడ మీ హోదాకు తగినట్టు మనవారిలో కన్యకలు దొరుకుట యరుదు".

రామ— "నీదింటివారైనను యాక్షేపణ లేదు. పిల్ల మంచి గుణవంతురాలుగా నుండిన చాలును. చెప్పమఱచితి. మీగ్రామమున నిన్నటి దినమొక యువతిని జూచియుంటి. ఆమె యెవరు?"

వైకుం— "(ఆశ్చర్యముతో యోచించి) ఆమె నామేనకోడలు. ఆమె తండ్రి కామె యొకతియే కొమరిత. చిన్ననాడే తలిదండ్రులను గోల్పోయె. ఇదివరకు దాయాదులింట పెరుగుచు వచ్చినది. కానికొన్ని నాళ్ళనుండి వారికిని యీమెకును సరిపోవనందున నేనుపిలుచుకొనివచ్చి పోషించుచున్నాడ. ఇప్పుడు సుమారారు మాసములనుండి యిచటనేయున్నది. మంచిరూపవతి. గుణవంతురాలు".

రామ— "నాకిచ్చి వివాహముగావించుట కెట్టి యాక్షేపణ లేదుగదా",

వైకుం— "మీ వంటివారు మాయింట వివాహమాడుదురా. నన్నుఁ బరీక్షించుట కటులనుచున్నారు గాని మీరేమి? మాయింట వివాహమున కిచ్చగించుటయు జూడ నాశ్చర్యము జనించుచున్నది".

రామ— "నిజముగా జెప్పుచుంటి. మీకంగీకారమే గదా".

వైకుం— "సమ్మతమేగాని వివాహ కట్నమే మొసఁగెదరు?"

రామ— "అదియెట్లు? మీరుగదా యిచ్చువారు".

వైకుం— "ముదుసలులకు పిల్లల నెవ్వరిత్తురు. వివాహమాడదలఁచితి రేని కట్నమియ్యక తప్పదు. నాకుగాకున్న యింక యెవరికిగాని యియ్యక తప్పదు".

రామ— "ఏమియాయవలయునో తెలియఁజెప్పుడు."

వైకుం— "(మంచియవకాశ మొదవినదనుకొని) నిజముగా నామేనకోడలినే వివాహమాడ దలఁచితిరా?"

రామ— "నిశ్చయముగ యడుగుడు మీకెంత యాయ వలయునో"

వైకుం— "మీరే జెప్పుడు".

రామ— "ఇది యంగడి బేరమా. బేరము చేయుటకు బిడ్డ సుఖము జెందు మార్గమూరయువలయునంతియే".

వైకుం— "సిరిరా మోకాలొడ్డు వారుందురా".

రామ— "ఎందులకు మాటలు. యడుగుడు".

వైకుం— "చూడుడు. మనవ్యవహారము మాటలతో పరిణమించునదిగాదు చిరకాలముండదగు కార్యము. కాన మిమ్ముల నిప్పుడు కొన్ని ప్రశ్నలడుగదలచితిని. ప్రత్యుత్తరమిండు. మీకు సమీపజ్ఞాతులెవ్వరును లేరుగద. మీయనంతరము మీ యాస్తియంతయు మీ భార్యకే సంక్రమించునుగదా"

రామ— "నాకు జ్ఞాతులే లేరు."

వైకుం— "మీరు పొరబడుచున్నారు. నేనిన్ని యడుగుట మీకొరకేగాని మరియే కారణమునకుగాదు. మీరింతెంత మాత్రము సందేహింప నక్కరలేదు."

రామ— "మీయెడ నాకెంతమాత్రము సంశయము లేదు. మన స్నేహము చాలకాలము నాటిను ండివచ్చినది. అందులకే మీ సంపర్కము నే కోరునది."

వైకుం— "అన్నిటికిని మీపత్నియగు భార్య యంగీకారము గావలదా? మీరొకమారు మీభార్యనిటు రమ్మనుడ"ని చెప్పెను.

రామశర్మ లోనికిబోయి లీలావతిని గొనివచ్చెను. అంత నామెయుటకే తెంచి "ఆర్యా! నాయెడ మీరు సంశయింపబని లేదు. మీకు సమ్మతమైనది నాకుగూడ సమ్మతమే"యనెను.

వైకుం— "వివాహమేరీతిగ, నిచ్చట జేయవలయునో జెప్పుము."

రామ— "ఇచ్చటనే జేయ నెంచితిగాని జనుల కసహ్యముగా నుండునని యొక్కింత వెనుదీయుచున్నాడ. వివాహమైన తదుపరి యెవ్వరేమనుకొన్న నేమి? గాన మీకనువగు, యిష్టమగు ప్రదేశము నందు గావించెదము లే. నాకు జూడ శింగ పెరుమాళ్ దేవాలయమున జేసిన బాగుండునని దలంచెద. అది మీకు సమ్మతమేనా?"

వైకుం— "(యోచించి సంతోషమున) మాకుగూడ సమ్మతమే. నాయీ వివాహపు కట్టుబొట్లు గమనింపుము. నాకయి వేల రూప్యముల నివ్వవలయును. మీయనంతరము మీకుఁగల యాస్తి నంతయు మాయిల్లకుదయించు బిడ్డలకే సంక్రమించునటుల వీలు వ్రాసి యియ్యవలయును. వివాహపు వ్యయములన్నిటిని మీరే భరింప వలయును. ఈవివాహమునకు మీబంధువర్గమును బిలువరాదు. ఇది మీకిష్టమేనా?" యనియడిగెను.

రామ, లీలా— "మాకును సమ్మతమే" యనిరి.

తదనంతరము రామశర్మ డాక్టరునకు రూ 5000 వేలకు చెక్కు నొకటిచ్చెను. నాడే కావలసిన కట్టుబొట్లన్నియును జేసుకొనిరి.

మరునాడు వేకువనే లేచిరి. రామశర్మగారు కాలకృత్యములు దీర్చుకొని వచ్చినవెంటనే సేవకుల నందరి నొకమారు పిలువనంపి "మనము రేపటిదినమే మద్రాసునకుఁ బోవలసినపనియున్నది. గాన మీరు సామానులన్నింటిని జాగ్రత్త జేయుడు" యనెను. వారు "చిత్తం" మని మరలిరి.

నాడు సేవకులకు పనిమిక్కుటముగానుండుటచే యింటిలోనికి నెవ్వరు బోయినను యాటంకపరుపలేదు. లేకుండిన చీమనైనదూర

నిత్తురా? దేవుడు వరమిచ్చినను పూజారి వరమివ్వడను లోకోక్తిసను సరించి ఒకవేళ యధికారి తమ స్నేహితుడైనను సేవకులు లోనికి బోనివ్వరుగదా! ముందుగ వారిపరిచయము జేసుకొనియే లోనికరుగ వలయు. వారికి కానుకలు సమర్పించినగాని లోనికేగుట కుత్తర్వు దయచేయురు. ఈదురహంకారము ప్రతియాఫీసరు క్రిందనుండు సేవకుల కందఱికిని నున్నదనిన యసత్యము కానేఱదు.

నేడు రామశర్మగారింటికి ప్రతియొక్కరు బోయివచ్చుచుండిరి. ఎట్టి యాటంకములు లేనందున యుద్యోగులేకాక బీదవారు సహితము తమ జమీందారుడానాడు యానాడా గ్రామము వీడనున్నాడని యాతనికి వందనములాచరించి జనుచుండిరి. అందులకే నాడు రామశర్మ గారికి తీరికయేలేదు. వచ్చిన వారందరికి సలహాలను జెప్పి పంపుచుండెను. కాని యంతమంది యుద్యోగులు బోయివచ్చిరే. ఒక్కరైననూ యాతఁడెందులకింత త్వరగా జనుచున్నాడని యడిగినవారు కారు.

పనులన్నియు పూర్తియైన బిమ్మట రామశర్మగారు తను బంధు సేవక బృంధముతోటి రాత్రి ప్రయాణము సాగించెను. పగలు బోయినడాక్టరు కుటుంబము నెందులకు వెంటబెట్టుకొనిపోవుచున్నాడని ప్రజలు సంశయించెదరని రాత్రి ప్రయాణము జేసెను.

# భానుమతి.

## అయిదవ ప్రకరణము.

శింగపెరుమాళ్ దేవాలయము మద్రాసున కిరువది మైళ్లదూరమునందున్నది. ఇదియొక రైల్వేస్టేషన్. స్వగ్రామమున వివాహము జేసిన వ్యయమధికమగునని భయముచే జనులు తిరుచానూరు, తిరుపతికిబోయి వైవాహికములెట్లు గావించుకొందురో యారీతి మద్రాసు ప్రాంతీయులెల్లరీదేవాలయమునకరిగి తమ వివాహములగావించుకొందురు.

ఈ దేవాలయముచుట్టును నొకచిన్నపల్లె గలదు. అందు దేవాలయమున కెదురుగనున్నది బ్రాహ్మణవీధి. బ్రాహ్మణులు తప్ప యందెవ్వరు లేరు. వివాహసమయములందు పురోహితులందఱు వారే. ఆచిన్నపల్లెయలోని వారందఱు యయికమత్యముగలిగి యుండిరి. మనకుపురోహితుఁడు గావలయునని యెవ్వరికేని నిశ్చయపఱచుకొన్నవాడు తక్కిన వారందరికి యది తెలియంజెప్పి తనకు రాబోవు లాభమును యందరికి సమముగా నిచ్చివేయును.

ఆబ్రాహ్మణవీధికి పదియడుగుల దూరమున నొకవిశాలమైన సత్రమొకటున్నది. ఆసత్రము నే మహానుభావుఁడు గట్టించెనో గాని యింటికన్న నెక్కుడు యనుకూలములఁగలిగియున్నది. దాని ప్రక్కన దేవాలయమునకు సంబంధించిన నొక చిన్ని కోనేరొక్కటి గలదు. అది నిర్మల జలపూరితము. ఆకోనేరాచిన్ని పల్లెకు దాహముఁదీర్చుచున్నది. మనకు గావలసిన వస్తుసామగ్రియంతయు

నాబ్రాహ్మణ సమాజమే మనకు దెచ్చిపెట్టును. వారు వివాహమునకు గావలసిన వస్తువులన్నియు నెప్పటికప్పుడు సిద్ధముగా నుంచుకొందురు.

ఆ గ్రామమునందున్నది యీదేవాలయ మొక్కటియే. శింగపెరుమాళ్ కోయిల్ యనగా నరసింహస్వామి దేవాలయము యని పేరు. అయ్యది సమున్నతప్రాకార పరివేష్టితమై చిత్ర విచిత్ర విలసితమై, చంద్రకాంత శిలానిర్మితమై యున్నది. దేవాలయ వెనుకటిభాగమున చిన్న పుష్పోద్యాన మొకటి గలదు. అందు నానావిధములగు కుసుమములంత రాంతరముల వగుసలుదీరి వికసించి పరిమళించుచుండును. మాధవీమల్లికా చంపక పారిజాతాది దైవ పూజార్హములగు చెట్లందమరియున్నవి.

ఒకనాటి సాయంసమయమున రెండు యెద్దులబండ్లు బలిష్టములగు యెద్దులచే గట్టబడి శింగపెరుమాళ్ కోయిల్ వైపు బోవుచుండెను. అందొక బండియందు సామానులు మాత్రముండెను. రెండవదానిలో యిద్దఱు స్త్రీలును, ముగ్గురు పురుషులుండిరి. స్త్రీలలో నొక్కరితెకు ముప్పది కన్న పైబడియుండవచ్చును. యెఱ్ఱని దేహచ్ఛాయ, సుందరమగు వదనము, వినీలలోచనములుగలిగి చూచుటకు దేవలోకమునుండి దిగివచ్చిన స్త్రీయనునట్లున్నది. రెండవయామె మొదటియామెకన్న మిక్కిలి చిన్నది. పదునారేండ్ల కన్న మించియుండదు. చామనచాయ, ముఖము సుందరమైనది. కన్నులంతకంటె చక్కనివి. ఆమె యించుక కోపస్వభావ యనునటులామె ముఖమునందా స్వభావము తాండవమాడుచుండెను. పురుషులలో నొక్కడు యేదో యుద్యోగమునందున్నట్లు యాతని దుస్తులే తెలియజేయుచుండెను. శరీరపటుత్వము దప్పినది. కొంచెము హెచ్చుతక్కువగ యేబదివత్సరములుండును. రెండవ

యాతఁడుగూడ నారీతిగనేయుండెను. గాని మొదటియాతనికంటె కడుచిన్నవాడు. మూడవవాడు సామాన్యపురుషుఁడు. తలకు గట్టినపాగా, తొడుగుకొనినకోటు, దానిపై నుత్తరీయముజూచిన యాతఁడెవ్వఁడో చక్కఁగా వ్యవహారజ్ఞానముదెలసిన దిట్టయని చెప్పక చెప్పుచుండెను. వారులోనగూర్చుండి యేదోమాట్లాడుకొనుచుండిరి. వారు తమరాక యచ్చటివారికి తెలియజేసియుండిరో యన వారి నెదుర్కొనుటకై బ్రాహ్మణులిద్దఱు వారికెదురైరి. ఇంతలో మొదటిబండివారిని సమీపించెను. అంత నాబ్రాహ్మణులు "అయ్యా! ఈ బండిలోనివారెవ్వరు? ఎచటినుండి యెచటికేగుచుండిరి? ఎందునిమిత్తమై జనుచుండిరని" ప్రశ్నలవర్షము గురిపించిరి. బండివాడంత తెలివిలేనివాడగుటచే యొకింతసేపూరకయుండి "అయ్యా! వీరుధర్మపురినివాసులు, అందులో వృద్ధుడేజమీందారుఁడు" నియిఁకనూ చెప్పబోవుచుండ వినుపించుకొనకయే, తామెవ్వరికొరకై వచ్చియుండిరో యావ్యక్తియటనున్నాడని పరుగు పరుగునఁబోయి రెండవబండియొద్దకు జని వందనములొనర్చిరి.

పాఠకులారా! అందుండువారు రామశర్మాదులనియు వివాహమునకేగుచున్నారనియు నెఱిఁగియే యుందురని తలంచెద. వారా శనివారము తనియను చరులను నొకయింటిలో దింపిరి. ఆ యిల్లంతపెద్దదికాదు. ఒక చిన్న సంసారమునకుఁదగియున్నది.

పాపము! ముసలివాడగుటచే సిగ్గుజెంది, మహావైభవముతో జేసుకొనవలసిన పెండ్లి యిట్లు యీపాడూరున రహస్యముగా నేరికినిఁదెలియనీయక, తుదకు బంధువుల సహితమాహ్వానించక మోహాతిరేకమున జేసుకొనవలసివచ్చెగద! ఆహా! మోహమెంత చెడ్డది. అతఁడు వివాహముగావించుకొనుట సంతానము కారణమైననూ మోహమే యింతజేసెనని జెప్పకతప్పదు. నేడే దేవతా

సమారాధన. అందులకై తగిన పరికరములన్నియు సముకూర్చఁబడి నవి. సన్నాయి మేళమును వాయించుచుండిరి. వధూవరులు పీట లపై యాశీనులైనబిమ్మట నిశ్చితార్థమును గావించి లగ్నపత్రికను వ్రాసి వినిపించిరి. నాటికార్య మంతటితో ముగిసెను.

మరునాఁడారు ఘంటలకే యందఱు మేల్కాంచిరి. ఇంతకు ముందు రామశర్మాదులను తోడితెచ్చిన పురోహితులిద్దఱు యూరకే స్నానమాచరించి తమతమ భార్యలంగూడి వివాహమంటపమునకేఁగెంచిరి.

ముహూర్త వేళ యగుచెంచుటచే యందఱు మంటపము ముట్టుసుమూగిరి. నాయూరునంగల బ్రాహ్మణ దంపతులందరువచ్చి కూర్చుండిరి. జమీందారుని వివాహమునకు దాయుని పాపముతోఁత్రుులు గూడ యచ్చటికి సమీపముననే యాశీనులైయుండిరి.

అంతయు వైభవముగానున్నది. పందిరనిండు జనులు మూగియుండిరి. పౌరోహితుఁడు మంత్రములను జపుచుండిరి. వెనుక పాటగాఁడరీతి పురోహితులలో గొందరు పురోహితునికి యగౌరవము రాసియుఁ యొకవేళ యాతఁడేదైన జెప్పుట మఱచినేని యది వారందుకొనివల్లె వేయుచుండిరి. ఇఁకపుస్తెముడివేయుసమయము. డాక్టరు వైకుంఠశర్మ రామశర్మనుజూచి "రామశర్మగారూ! ఇప్పుడే మనకార్యములన్నియు ముగియవలయును. నాకు మీరివ్వదలఁచిన కట్నము నాఁడేనాకు ముట్టినది. మనము యేర్పాటుగావించుకొన్న రీతి దస్తావేజు వ్రాయవలయు. మనరామావధానులు దిట్టముగా వ్రాయగలరు. మీరుకిరించ సంతతి మొనర్చుడు. మీ ప్రథమ భార్య సాక్షికిరింద సంతకమొనర్చినజాలు" ననెను.

రామ—"మిత్రమా! ఆతొందరగూడ యిపుడేగావలయునా?

జరుగగల కార్యములుజరుగనిమ్ము. పిదపమన యిష్టమొచ్చినరీతి యొనర్చుకొందము''. అని జవాబొసంగెను.

డాక్టరు— ''అట్లు జేయుటకు వీలులేదు. ఇప్పుడేగావయును. రిజిష్టరుయనంతర మొనర్చుకొనవచ్చు''నెను.

రామశర్మ వానిశంకితమునకు లోలోన విచారించుచుండెను. ఇంతలో పురోహితుండు ''అయ్యా! మనమాలశ్యము జేసిన ముహూర్త సమయము దాటిపోగలదని'' హెచ్చరించెను.

డాక్టరు— ''నీముహూర్తము పాడుగాను! అన్నియు సక్రమముగ జరుగవలయును. నీవూరక పడియుండమని'' హెచ్చరించి (రామశర్మవైపుజూచి) ''అయ్యా! దీనికేమిజెప్పెదరు?'' అనియడిగెను.

రామశర్మ చేయునది లేక ''మీరాయిచ్చవచ్చిన రీతిగావింపుడ''నెను.

ఇంతలో రామావధాని దస్తావేజు వ్రాసి వినపించెను. రామశర్మ సంతకమొనర్చెను. లీలావతి సాక్షిక్రింద సంతకమొనరించె. పిదప పురోహితులిద్దఱు సాక్షిక్రింద సంతకములు జేసిరి. అంత పురోహితుండు తనప్రజ్ఞ యచ్చటొకింత గనుపరుపదలంచి ''ఎచటికి బోవునండీ. రామశర్మగారేమి? మాటదప్పుట యేమి? వివాహానంతరము యీకార్యముజరిగియుండిన బాగుండెడిది. కానిండు. మీకంతలో నేయాత్రము. అవును మీరేమిజేయుదురు లే. ఎవరిపని వారు గట్టిజేసుకొన వలసినదేగదా'' అని మేళగాండ్రవైపుజూచి ''వాయింపుడ''ని హెచ్చరించెను.

అంత పెద్ద ధ్వనియాయెను. పురోహితుండు పెండ్లికొడుకును లేవదీసి మాంగల్యము నాతనిచేతి కొసంగి వధువుమెడలో గట్టుమనెను.

అతఁడట్లుగావించెను. పిదప తలంబ్రాలు పోసికొనిరి. దానితో నాటికార్యము సమాప్తినొందెను.

ఇదిమూడవదినము. నేమునాకబలి. అలుకపాన్పు. అయిననేమి ప్రయోజనము. జమీందారలగియుండెడివారేగాని వారేమి చేయఁగలరు? పాపము! ముసలిపెండ్లి, రెండవ వివాహము. ఓలియిచ్చి జేసుకొనెడి వివాహము. అందముజూసి చేసుకొనెడి ప్రేమయిక వివాహము. గాననేకలహములు లేక యన్నియు సక్రమముగ జరిగిపోయెను.

వివాహపు నాల్గవదినమున కార్యములన్నియు ముగిసియుండె. నాయూరింగలవారందరికి నాడువిందు జరిపించిరి. అనంతరము రామశర్మ తనయున చగులఁగూడి ఇష్టాగోష్టి ప్రసంగించుకొనుచుండెను. ప్రసంగవశమున రామశర్మ "డాక్టరుగారూ! నేనుచాల ముసలివాడనైతి. ఆఫీసు పనులింక జేయ నశక్యుండనైతి. నాతోడి వారలు పరిహసించుచుందురు. నాకు ధనమునకేలోటును లేదు. కావలసినంతున్నది. ముచ్చటగా కాలముగడుప నిశ్చయించితి" నని చెప్పెను.

డాక్ట— నిజముగా నిక్కాలమున మీవంటివారు గ్రామము లోనుండి వ్యవహారముల జక్కబెట్టుకొనుచు సుఖముగా కాలము గడుపవలెను గాని యింతటి వృద్ధాప్యమునందు మీరు పని చేయదగదు" అనివచించెను.

రామ— "నిజము బుత్తెంచితిరి. ఇఁకను నాకు పిన్నను కాలము చాలగాలమున్నది. ఎవ్వరంత వఱకు కష్టపడెదరు. ఇదిగో! యిప్పుడే నాపనికి రాజీనామా నివ్వనిశ్చయించితినని" పరపర నొక కాగితముపై వ్రాసి యాతనికి జూపి "చక్కగానున్నదా యని యడిగెను.

డాక్ట— అంతకన్న నేమి వ్రాయవలయును. చక్కగ నున్నద నిఁ తలపంకించెను.

రాము— “మరియొక విషయము వినుఁడు. నాకు చాల కాలము నుండి తీర్థయాత్ర పోవలయునని యాశ. దిక్కుమాలిన యుద్యోగము నన్నుఁ బోనిచ్చినదిగాదు. తీరిక కాలములో వెళ్ళుదమన్న జమీందారీ వ్యవహారములు నన్ను బోనిచ్చినవి గావు. నేనుద్యోగము వీడ నన్ను వదలినది. గాన నా కళత్రముతోడ రేపే మద్రాసునకుఁ బోయి యచ్చటినుండి క్రమముగా రామేశ్వర యాత్రగావింపదలఁచితి. మీరుకూడ ప్రయాణము సాగింపుఁడ”నెను. అతఁడు “సరి” యని యంగీకరించెను.

మరునాడు పురోహితునకీయవలసినది వారికి ముట్టజెప్పి బహుమానాదులొసఁగిన పిదప నాయనను వెలసిన తక్కుఁగల వారికిగూడ నొకింత యొసఁగి వారి మన్ననకుఁ బాత్రులైరి.

# భానుమతి.

## ఆరవ ప్రకరణము.

### తీర్థయాత్ర.

కాంచీపురము చరిత్రాత్మకమైన పట్టణము. పూర్వము దానిని చోళరాజులు పాలించుచుండిరి. అందు విష్ణుదేవాలయమున్న పట్టణ ప్రదేశమునకు విష్ణుగంచియనియు శివుని దేవాలయమున్న పట్టణ ప్రదేశమునకు శివకంచియనియు పేర్లు. ఈపట్టణము ముఖ్యముగా పట్టు చీరలకు పుట్టినిల్లు. వేనకు వేలుకు సాలీలు పని చేయుచుందురు. ప్రతిసంవత్సరము నిచ్చట నొకగొప్ప రథోత్సవము జరుగును. అందు గరుడోత్సవము చూడతగినది. దూరదేశముల నుండి యాత్రికులనేకులు యానాడచ్చోటగూడుదురు. అప్పుడొక వింతజరుగును. ఆదేవాలయమునకు చేరువనున్న కోనేటియందు పండ్రెండు ఘంటలు వేళనుత్తర దిశనుండి నొక్కగరుడపక్షియు దక్షిణ దిశనుండి నొక్కపక్షియు వచ్చి యాకోనేటియందు స్నానమొనర్చి యాదేవదేవునిదర్శించి వెడలిపోవును. అపుడచటగూడియుండు లక్షల కొలంది యాత్రికులు వాటినిదర్శించి తమజన్మములు పావనమైనవని స్మరించుకొనుచు యానీట స్నానమాడెదరు.

ఆవత్సరమచటికి వచ్చెడు యాత్రికులకై యతివిశాలముగ

చలువపందిళ్ళు వేయబడినవనియు భోజనసౌకర్యములు బహుచక్కగా జేయఁబడినవనియు పత్రికలందు ప్రకటించియుండిరి. అందుచే నెచ్చటజూచినను యిసుకవేసిన రాలనంతటి ప్రజాసమూహ మచ్చటి కరుదెంచియుండె. అటువచ్చినవారిలో మనజమీందారు రామశర్మ గూడనొక్కడు. తనయిరువుర భార్యలవెంట గొనివచ్చియుండె. ముఖ్యస్థలములను, తీర్థములను వారికిజూపి గరుడోత్సవమునుజూపెను. గుడియందానాడు జనమధికమగుటచే చూచుటకు వీలులేక యింటికి మఱలిరి.

మరునాడు వేకువనే లేచి స్నానమునొనర్చి శివకంచికి బండి కుదుర్చుకొని యచ్చటికిజనిరి. అచ్చటస్వామిని దర్శించి సేవించిన పిమ్మట యాతఁడు చిన్నిభార్యకోర్కె చొప్పునయచట వెలసియుండు హోటలులో నొకింత కుడిచి తదుపరి బట్టలవీధికి జనియాదు దమకు గావలసిన గుడ్డలుకొనిరి.

మూడవనాడు విష్ణుదేవాలయమునకుం బోయిరి. అచ్చటి యర్చకులందరు మనజమీందారు నదివరకే యెఱిఁగినవారగుటచే నధికముగ గౌరవించిరి. అచ్చటస్వామిని సేవించిన పిమ్మట నాయూర నిఁక విశేషములేవియు లేకుండుట జేసి యాగ్రామమును త్వరలో వీడనుద్దేశించిరి.

వేసఁగియగుటచే ప్రయాణము సాగుటకష్టతరమని మెట్టుపాలెం మెయిలులో ఉదకమండలమునకు బోయిరి. వేసవినంతటి నచ్చటనే గడుపజూచ్చిరి. తమకుటుంబ సౌకర్యమునకు తగినట్లు నొక్క బంగళాను నీలగిరి కొండపై యద్దెకు గైకొనిరి. సామానుల గొనితెచ్చుట కొక్క మోటారునుగూడ యద్దెకుగొనిరి.

నీలగిరి పర్వతరాజము వివిధఫలవృక్షభరితమై, యంద

చందంబులుగల వింతవింతలగు వర్ణములతో నిండి సుసౌరభ్యమును గలిగిన పుష్పజాతులతోడ విరాజిల్లుచున్నది. ఎచ్చటజూచిననూ కాఫీ, తేయాకు, జాజి మొదలగు చెట్లువనములుగా బెరగియున్నవి. దైవ కృపచే యచ్చోట వత్సరము పొడవుననూవర్షముకురియు చుండుటయే సంభవించియుండిన యీసాంద్రారణ్య ప్రాంత్యము జూపరులకు భయము గొల్పియుండియుండదు. ఎప్పుడు జూచిననూ వానయే. ఎండ యనునదియెరుగరు. అందులకే వేసఁగిని గడుపుటకై యెల్లరు నచ్చోటికరుదెంతురు. సమస్తము యచ్చోట దొరుకుటకు ప్రభుత్వమువారు జనుల సౌకర్యార్థమై యొకచిన్న రైలుమార్గమును కొండనుండి క్రిందికివేసియున్నారు. ఆ రైలుమార్గమే లేకున్న చాలకష్టతరమైయుండియుండును.

ఉద్యోగులంతమందియొక్కచోట గూడిన వింతలకు కఱవగునా? వారికి గావలసినన్ని వినోదశాలలుగూడ యందమరియున్నవి. తఱచుగావిందులుగూడ తటస్థించుచుండుటచే యప్పుడప్పుడు యందరు గూడుటగూడ తటస్థించుచుండును.

రామశర్మ తనగృహమును దాటి బయటికేతేరడు. కావలసినన్నిటిని యింటనే యొనర్చుకొనెను. తన చిన్నభార్యతో సరసములాడుకొనుచు బొత్తిగా కాలమును మఱచెను. ఇట్లు మాటలలోనే రెండుమాసములు నిరాయాసముగా గడపివేసెను. నాయేడతి వైభవముగ శ్రీరంగమున వుత్సవాదుల జరుపనెంచి యున్నారని విని యచ్చటికిబోయిరి.

ఇప్పుడు శ్రీరంగక్షేత్రమున ముక్కోటి యేకాదశి యగుటచే రైల్వేకంపెనీవారెన్ని స్పెషలుబండ్లు నడుపుచున్ననూ చాలకుండెను.

శ్రీరంగపట్టణము తిరుచునాపల్లెకు రెండుమైళ్ళ సామీప్య మునన్నది. ఈరెండు పట్టణముల మధ్య ఎయ్యాది ధర్మప్రభువనం దగు మైసూరు మహారాజావారి రాజ్యమున నుదయించి యనేక క్షేత్రముల పవిత్రవంతముగం జేయుచు సకల జనులకు పయోగ కారిణియై యనేక యాత్రికులకు పూజ్యనీయంబై నలరారుచున్నదో యా "కావేరినది" యొక్క మైలంతవెడల్పున పారుచుండును. దాని పై కట్టంబడిన వంతెననుండి క్రిందికి తేరిపారజూచిన మనమునకు నొక వంకభీతియు మరియొకవంక యాహ్లాదమును గొల్పుచుండును. శ్రీరంగ మువద్ద కావేరినది చీలిరెండు పాయలై పోవుచుండును. అందుచేతనే నచ్చట నది చాల లోతులేమిచే స్నానసంధ్యాది కృత్యములకు చాల ననుకూలములను గలిగియున్నది.

శ్రీరంగధాముని దర్శించువారు తొట్టతొలత కావేరినది యందు స్నానమాడి తదుపరి పరమేశుని శేవార్థమై యాలయములో నికి జనెదరు. మూల విగ్రహముగల గర్భగుడి యేడుప్రాకారము లావలనున్నది. ఆగర్భగుడి శిఖరము బంగారుతో చేయబడియున్న ది.పూర్వము విభీషణుండు లంకనుండి బంగారు బుట్టయందు కుసుమ ముల గొనివచ్చి రంగనాయకుల నర్చించుచుండెడి వాడట ఒక్కనాడ తని యందాపరంధాముడు ప్రసన్నతవహించి యందుంచియుండిన బంగారు బుట్టను తనయాలయ శిఖరముపై బోర్చించుకొనెనట. అందులకే యాదేవదేవుని దర్శించ నేగువారు తొట్టతొలుత యా హేమ శిఖరమును గాంచి నమస్కరించి గుడిలోని కేగెదరు.

నేడే ముక్కోటి దేవాలయమందెచ్చట జూచినను యాలికి ముగ్గులిడి యుండిరి. సున్నపు పట్టెలచేతను యెర్రమట్టి పట్టెలచేత ను దేవాలయ ప్రాకారపు గోడలన్నియు చిత్రవిచిత్రములుగ యలంకరింపంబడియున్నవి. జనులు గుంపులు గుంపులుగా వచ్చి

స్వామిని దర్శింపనేగుచుండిరి. జనులందఱు నేటిరాత్రి యుపవసించి ద్వాదశినాఁడు భుజించెదరు.

సూర్యోదయంబను పూర్వదిక్భాగమున గానబడుటలేదు. మంచు తెరలికనూ వీడియుండలేదు. అప్పుడే జనులందరు కాలకృత్యములు నిర్వర్తించుకొని స్నానసంధ్యాదుల గావించుకొని దేవాలయము జేరుచుండిరి.

ఏటేట వత్సరము కొక్కమాఱుమాత్రమే తెఱచియుంచు నట్టి ద్వారమొండుకలదు. అదియే ముక్కోటిద్వారము. ఆనాఁడు తప్ప యితర సమయములయందు దానిని తెఱచుటలేదు. అందుండియే స్వామిని మేళతాళములతో గొనిపోయి దక్షిణ దిగ్భాగమున యనేక శిల్పములయలంకరింప బడ్డ వెయ్యికాళ్ళమంటపమున వేంచేపు జేయుదురు. స్వామి యీద్వారములో దూరినవెంటనే జనులందరొక్కుమ్మడి వెనువెంటనే దూరెదరు. అట్లు జేయుటవలన పుణ్యము లభించునని వారియాశ.

మనరామశర్మగారు వాటినన్నిటిని వీక్షించి యానాఁడే ప్రయాణమై తిరుచునాపల్లెకు సకుటుంబముగా నేగెను.

తిరుచునాపల్లె యొక గొప్ప వర్తక స్థలమగుటయేగాక, దక్షిణాత్యులకు విద్యానిలయమై, దక్షిణహిందూ రైల్వే (South India Railway) వారి కేంద్రస్థానమగుటచే యనేక బీదకార్మికుల కెల్ల జీవనాధారమై, కావేరినదీతటప్రదేశమగుటంజేసి సారవంతంబై, శైవవైష్ణవమగు దేవాలయముల గల్గియుండుటచేత పవిత్రస్థలంబై నొప్పారుచుండును.

ఆదివ్య క్షేత్రమును దర్శించిన పిదప రామశర్మగారు రామ

నాథపురము జేరిరి. అదియొక జమీందార్‌పట్టణము. జిల్లాకేంద్ర
స్థానము. జమీందారు మనరామశర్మకు పరిచితుఁడగుటచే వారి
యింటనే బసచేసిరి. రాకరాక వచ్చిన మిత్రునికి విందులచేసియు
తన వ్యవహారములను గురించి వివరించియు మొదలగాగల సంగతుల
నెల్ల నాతనికిఁ జెప్పుచు కొన్నిదినములు తనయింటనే యుంచుకొని
యధికముగ గౌరవించి తనగ్రామమునకు సమీపమునసుండు దివ్య
క్షేత్రమగు దర్భశయనమునకుదగు మనుష్యుల దోడు నిచ్చి సగౌర
మునని పెను.

ధర్భశయనమును పవిత్రస్థలమున తొల్లి శ్రీరామచంద్రుఁడు
సేతుబంధనము గావింప సమకట్టినప్పుడు సముద్రుఁడు తోవయివ్వనం
దున వానిపైయాలిగి బాణము సంధింప సముద్రుఁడు భయపడి పత్నీ
సమేతుఁడై బయటికేతెంచి యంజలిబద్ధుఁడై శ్రీరాముని చరణముల
వ్రాలెనట. తదుపరి యాతఁడు మార్గమియ్య వానరమూకలు
సేతుబంధన మొనర్చుచుండ రామచంద్రమూర్తి దర్భశయ్యపై పరుండి
చూచుచుండెనట. అందులకే నాప్రదేశమంత పవిత్రతను గల్గి
యుండెను.

దానిని దర్శించి యందలి తీర్థంబులమునింగి తదుపరి యచ
టికి పదిమైళ్ళదూరమునసుండు నవపాషాణ క్షేత్రమునకు జనిరి.

అదియొక చిన్నిపల్లియ. అందుసూద్రులిండ్లు మిక్కుట
ము. అచటి ప్రదేశమంత సారవంతముగామిచే యచటి ప్రజలు
మత్స్యవిక్రయాదుల తమపొట్టబోసికొనుచుండిరి. తొల్లి దశరథనంద
నుఁడు రావణ సంహారమును గావించిన తదుపరి తనకు సంభవించిన
బ్రహ్మహత్యా పాపనివారణార్థమచ్చట నవగ్రహముల ప్రతిష్ట యొన
ర్చిన పిదప రామేశ్వరమునందు రామలింగ ప్రతిష్టగావించెనట.

నేటికిని యీపరమాత్ముని స్వయహస్థములచే ప్రతిష్టింపఁబడిన నవ
గ్రహములను గాంచగల్గుదుము. అవి సముద్రమునందున్నవి.
యాత్రికులు గట్టునగల యొకదివ్య తీర్థమునందు స్నానమాచరించి
పుష్పాదులగైకొని సముద్రమధ్యమందు ప్రతిష్టింపఁబడిన నవగ్రహ
ముల నర్చించెదరు. అచ్చటి సముద్రమంత లోతుగలేమిచే జనుల
చటికి బోవగల్గుచున్నారు. మన జమీందారుఁడుగూడ యచట
పూజలుగావించి తదుపరి రామేశ్వర మేగెను.

అచ్చటికి బోయి రామలింగని దర్శించి గంధమాధన పర్వత
మెక్కి, రామలక్ష్మణ తీర్థముల మునిఁగి, బిందుమాధవుని దర్శించి,
బిడ్డల ఫలమునకై నాగప్రతిష్ట యొనర్చి, మఱలివచ్చునప్పుడు దేవా
లయమునంగల తీర్థముల నెల్లమునిగి, కాశికిబోయెదనని ప్రమాణము
గావించి, జటాయు తీర్థమును శేవించి, సేతుదర్శనముజేసి, ధనస్సు
పూజజేసి, యందు ముప్పది రెండుమార్లు స్నానమాడి తదుపరి వెను
కకు మఱలి మార్గమధ్యమునందు మధురకేగి మీనాక్షిని దర్శించి,
చారిత్ర ప్రసిద్ధియగు తిరుమలనాయకుని నగరుజూచి, తంజావూరున
కేగి యందలి వైచిత్రములనెల్లజూచి, ఒకప్పుడు చాల పరాక్రమ
వంతులగు రాజులకు నిలయమగు నాకోట యిపుడు పాడుపడియుండు
టజూచి కొంతవడి దుఃఖించి, యచట నెలసియుండు కోవెలనుజూచి
యాదేవదేవుని కెదురుగ యాసీనమైయుండు గొప్పనంది విగ్రహమును
దర్శించి, చిదంబరమునకేగి నటరాజస్వామిని దర్శించి, భక్తుఁడైన
నందుని స్మరించి కావేరినదియందు మునింగి, కుంభకోణమునకుబోయి,
కుంభేశ్వరుని శేవించి మామాంగమునందు తానమాడి, సారంగపాణిని
శేవించి సంతానమునకై మ్రొక్కులిడి తదనంతరంబ కలకత్తా మార్గ
నంబడి వారణాసి జేరుకొనిరి.

విశ్వేశ్వరుని దర్శించి, యచట పితురులకన్న శ్రాద్ధములనిడి గయకేగి పిండ ప్రదానమాచరించి, జగన్నాథమునకేగి పురుషోత్తమస్వామిని దర్శించి యర్చకులొసగిన ప్రసాదమును స్వీకరించి చక్కగా తిరిగి రామేశ్వరమునకుఁజని గంగాభిషేకముఁజేసి పూర్తి సంతృప్తినొంది సాగించుకొనియెన.

# భానుమతి.

## ఏడవ ప్రకరణము.

---

### అసూయత.

రామశర్మగారి భవనమునఁగల గదులలో వంటయింటి పడసాలయందెవ్వరుగాని స్త్రీ నివాసమొనర్చుట లేదు. అనగా యందధివసించుట యనిగాదు. ఎవ్వరుగాని యెక్కువకాల మచ్చట యుండరు. ఆగదియంత యందమైనది కానిదగుటచేతను సామానులచే నెల్లప్పుడు క్రిక్కిరిసియుండుటచే సాధారణముగా నెవ్వరచ్చటనుండరు.

నేడేలకో కళావతి తనచిన్ని తనయుని నొడినుంచుకొని నతిగారాబపు మాటలచే బుజ్జగించుచుండ, శిశువు సంతోషాతిరేకమున కేకలు వేయుచుండ తానా సంతోషమును మఱుగుపఱచి లేని చింత మనంబునకు దెచ్చుకొని దీనవదనయై కూర్చొనియుండెను. అంత రామశర్మలోనికేతెంచి "ప్రేయసీ! ఏలయిట్లు కలకాలము చింతచే మ్రగ్గుచుందువు? తీర్థయాత్రనుండి యేతెంచినది మొదలు నీముఖమున రక్తపుబొట్టునది గాన్పింపదు." అని ప్రేమపూర్వకము నడిగి "బిడ్డడేమి చేయుచున్నాడు?" యనియడిగెను.

కళా — "కులాసాగానున్నవాడు." అని యసంతృప్తి ప్రత్యుత్తర మొసఁగెను.

రామ— "ఏల? నీకు నాయందంత నిష్ఠూరత. చక్కగా సంభాషింపగూడదా? నీగోడవలు నీకే తెలియునుగాని యితరుల కెంత మాత్రము దెలియవు. తెలియజెప్పినగదా తగు సదుపాయము జేయవగు"నని వినయముగా బల్కెను.

కళా— ఇప్పటికి మీకన్నుల కగపడితిని గాబోలు. ఇప్పటికి మీకుపని కి వచ్చితి నేమో. మీప్రథమభార్య యొద్దకే బొండని' నిష్ఠూరముగా బల్కెను.

రామ— "ఎన్నడు లేని మాటలదేల యీరీతి మాటలాడె దవు? యీవిపరీత మెన్నిదినములనుండి. దానిపై నీకేలనంత యసూయత. వివాహకాలమునుండి నిన్ను తనస్వంత బిడ్డవలె జూచుచుం డుటలేదా?" అని యడిగెను.

కళా— "చూడకేమి? చక్కగా జూచుచున్నది. మనంబున నొక్కటి వెలుపలయొకటి. ఎంతైననేమి? మీప్రియురాలామెయే గదా?"

రామ— "అదేమి? నీవుకావా? నీయందు నాకెక్కుడు మక్కువ. దయయుంచి నీకృశింపునకు గారణము దెల్పుము. నేను యాత్రకుబోయివచ్చియున్నందున పలుచోట్ల నీరు దేహమునకు సోకి యనారోగ్యము కలుగ జేసియుండు ననియు, కొన్నిదినములు బోయిన యథారీతిగ యారోగ్యము గలుగకమానదని యనుకొంటి. ఇదివరకే వచించియుండినతగు చికిత్స యొనర్పక బోదునా?" అని వచించెను.

కళా— "నారోగము దేహమునకు సంభవించియుండిన కుదుర్పగలరుగాని మనోరోగమును కుదుర్పగలరా?"

రామ— "(ఆశ్చర్యముతో) ఏమీ! మనోరోగమా! అది యేదో జెప్పుము".

కళా— "నేజెప్పిన చొప్పున యొనర్చెదనని వాగ్దత్తమొనర్చి

ననేగాని మీకెత్తిగింపను." అని కచ్చితముగా బల్కెను.

రామ— "ప్రియా! నాయెడనీకెందుల కంత సంశయము. వచింపుము. తప్పక ప్రతీకార మొనర్చెద" ననెను.

కళా— "ఇదిగో! వినుఁడు. మీప్రథమభార్య లీలావతి గర్భముఁదాల్చియున్నది. నేను గర్భము ధరించినప్పుడే యామెయు గర్భవతిగానుండెను. నేనది పాటింపలేదు. నేఁడు మాతు గదా యేఁడు మాసములు మీరినవి. అందుల కేమి విచారములేదుగాని——"

రామ— "ఏల మఱుగుపఱచుట. సవిస్తరముగా దెలుపుము. సంశయింపకు" మని యభయ మొసఁగెను.

కళా— "(మనసు దిట్టపఱచుకొని) ఆమెకు జనించు శిశువు పురుష సంతతిగా పరిణమించిన నప్పుడే దాని మట్టు బెట్టవలయును. ఒకవేళ అట్లు కాక స్త్రీసంతతిగా పరిణమించిన పోషింపవచ్చును. తెలసినదా? మీరిట్టి వాగ్దాన మొసఁగవలయు" నని నిర్బంధించెను.

రామ— (ఆశ్చర్యముతో) "మట్టుబెట్టుటయా! కసిగందను చంపుటయా? ఏల యింతటి క్రూరకృత్య మొనర్పవలె" నని యడిగెను.

కళా— "పురుష సంతతిగా పరిణమించిన మీరు నాకొసఁగిన యా స్థిరయంతయు యామెకును యామెకొమారునికే సంక్రమించును గాదా"

రామ— "అదియా నీసంశయము. అంతమాత్రమునకింత బెంగగొనవలయునా? పిచ్చిదానా లెమ్ము. భయపడవలదు. అది యెంతమాత్రము నిన్ను బాధింపదు." అని సమాధాన పఱచెను.

కళా— "మీమాటల నెంతమాత్రము విశ్వసించు దానను గాను. నేజెప్పిన రీతినే గావింపవలయు. లేకున్న నిప్పుడే మిము వీడు దానను." అని ఖండితముగా జెప్పివైచెను.

రాము— “నేడెంతటి పాపపుదినము. ఎట్టి వార్తలకులో నైతి. ఏమిసేయువాఁడ”నని యోచించి “ప్రేయసీ! నామాటలందు సత్యము లేదు. నీకంతగా సంశయమేయున్న యెడల నాయనంతరము నేను “మరణఫండు” (Life Insurance) నందు గట్టినది మాత్రము వారికి సంక్రమింపకుండునట్లొక వీలునామ వ్రాసియిచ్చిన చాలదా?”అని దీనముగా ప్రార్థించెను.

కళా— “నూటికి నూరుజెప్పుము. నేను వినుదాననుగాను. మీరు నిక్కముగా నన్ను ప్రేమించినట్లయిన నామాట జవదాటుదురా? నాముద్దు చెల్లింపని నాథుఁడేల?”

రాము— దేవీ! ఇవియేటి ముద్దులు. రమణులలగి మంచి దువ్వలువలో లేక సువర్ణాభరణములో కోరుట తగును గాని యిట్టి కఠిన చర్యలకు గడంగుదురా?”

కళా— “నేను మీకు నిక్కముగా పత్నినై యుండిన నా మాట చెల్లింపకుందురా? ఇదిగో! వినుఁడు. మీయిర్వురను, వయోవృద్ధులను, గుణహీనులను, వివాహమాడుట వలని ప్రేమించి గాదని యెఱుంగుడు. ధనమును జూచియే వరించితి. వచించిన చొప్పున గావింపకున్న నిల్లు లేచి పోవుదాననని” గంభీరముగా బల్కెను.

ఆమెయొక్క గంభీరోక్తులకు రామశర్మ హడలెను. దేహము కంపింపసాగెను. చిరుచెమటలుబోసెను. లోనుండి వచ్చుచూ గృహమునంతటిని యెఱచిపెట్టి “నీవిట్లు నుడివెదనని కలనైనఁదలఁపనైతి. ఇపుడేమనుకొన్న నేమి? దానిపై నీకింత యసూయాతకలుగనేల? కానిమ్ము. డాక్టరు నొకమారువచ్చి పొమ్మని చెప్పిపంపితి. అతడీ పాటికివచ్చుచుండును. వచ్చినవెంటనే యాతఁడెట్లు వచించిన నటుల గావింప సంసిద్ధుఁడను.” అనుచుండ శేవకుఁడరుదెంచి “దేవా! డాక్టరు వైకుంఠశర్మగారు లోనికిరా యనుజ్ఞ వేడుచున్నార”నెను.

రామ— "రమ్మని చెప్పు" మనెను. అట్లనుచుండగనే డా
క్టరు లోని కరుదెంచి "రామశర్మగారూ! వందనములు. విశేషము
లేమియు లేవుగదా, పనియున్నది సత్వరముగ రమ్మన్నారని సేవకుడు
వచించె. నాకార్యాలయమును చక్కబెట్టుకొని యేతెంచునప్పటికి
యాలశ్యమాయె. క్షమింపవలెనని" యాచ్చోటనాసీనుడై. "ఏల
మీరు దీనవదనులై యుండుట?" అని యడిగెను.

రామ— "మీ మేనగోడలనే యడుగుడు" ని యూరకుండెను.

కళా— (డాక్టరు చెవిలో నేదో యూదెను)

డాక్టరు— "రామశర్మగారూ! మీ నిశ్చయమేమి?"

రామ— "కన్నబిడ్డను చేతులారా చంపుకొనను సంతతి పాత
కిని గాజాలను. నా యెదుట యున్నది చంపబడ జాలద" నెను.

కళా— "(కోపముతో) మీకిష్టము లేకున్న యాపని నేనే
కావించెదను లే. అందులకైన యంగీకారమేనా?"

రామ— "(తనలో) పాపి! ఇంతటికి పాల్పడితివా. హా!
ఇదే యేమునివచించెదు విడనాడుటకుగూడ సందేహింపవుగదా.
(ప్రకాశముగా) ఎప్పటికీ గాని కసిగందును జంపింపను. అట్లు యనుజ్ఞ
యియ్యన" ని జెప్పివైచె.

కళా— "అట్లొనర్పకున్న యిప్పుడే యిలువీడి వెడలవడె చెద
నిక్కము.

వెళ్ళిన యపకీర్తి పాలయ్యెదవు. చక్కగా యోచింపుడు.
జనులిదివరకే రెండవ వివాహము, రహస్య వివాహము, బంధువర్గము
లేని వివాహము గావించుకొన్నాడని బహుభంగుల దూరుచుండిరి.
నే నెడలిన యిక జెప్పవలయునా? చేయకూడనిపని చేసినయట్లనేయగు
నుగదా. రహస్య వివాహముగావించుకొన్నాడు. చేసుకొన్నది
యింటరాకనే దానితో యాత్రకేగె. అచ్చటినుండివచ్చి పట్టుమని

పదిమాసములు కాపురము జేసెనో లేదో యప్పుడే యొకబిడ్డ. అది యును కొన్నాళ్ళు జరిగెనో లేదో యిపుడే లేచిపోయినదని మిమ్ముల ననకమానరు. గొప్పపదవినందుండినవారు. కొంచెమించుమించుగ ఉద్యోగలోకము నంతటికి నాయకమణి యంతటివారు వారందరు మిమ్ము పొడుచుక తినకమానరు. ఇందరకే తమ్ము వివాహమునకు కనీసమాహ్వానమైన జేయకపోయెగదా యనిక్రోధము లోలోన వహించియుండిరి. సంతానాపేక్షచే నన్ను వివాహమాడితిరి. మీకోర్కె చొప్పున చక్కని బిడ్డఁడుదయించెను. వాఁడొక్కఁడు చాలఁడా? కాన మీరు యంగీకరింపక తప్పదు'' అని నిర్భీతిగా వచించెను.

రాము—(తనలో) దైవవిధి తప్పింప నెవరితరము. నేనొకటి తలఁచిన దైవమొకటి తలంచె. డాక్టరున్నాఁడు. అతని యడిగి జూచెద (ప్రకాశముగా) డాక్టరుగారూ! యిందు మీయభిప్రాయ మేమి?''

డాక్ట—(యోచించి) నాకొక యూహపొడముచున్నది. ఒకవేళ పురుష శిశువేయుదయించెనేని నాయొద్దనుంచుకొని పోషించెదనులే. ఆమె ప్రసవవేదన యందుండు నప్పుడు నేవచ్చి యామె కొంతకాలము తెలివి హీనయగునట్లొనర్చి జనించిన పురుష శిశువు నెత్తికొని యేగెదను. మీరు స్త్రీశిశువుదయించెననియు జనించిన నిమిషముననే మరణించెనని యామెకు జెప్పుఁడ''నెను.

రాము— ''అదినాకుగూడ సమ్మతియే''యనెను.

కళా— (నిర్భయముగా) ''అదియెంత మాత్రము పొసగదు. చంపియే తీరవలయు''నని పట్టుబట్టెను.

డాక్ట— ''నీకెందుల కింతపట్టుదల. నీయోగక్షేమముల నారయవలసిన వాఁడను నేనుండ నీవేమాత్రము సంశయింపఁబనిలేదు.

శిశుపోషణ జేయువాడను నేనుగదా. ఒకవేళ బిడ్డపెద్దదైనను తొం
దరేమియులేదు. రామశర్మగారు యిపుడు చనిపోయినాడని ప్రక
టించి తిరిగి బ్రతికియుండెనన్న నవ్వరుందురా? మరియు వుదయించిన
శిశువును తనగృహమునందు పోషింపక పెరవారలింట పెఱుగుచుండుల
కని యడుగకుందురా? ఇంతకు జమీందారుని బిడ్డడితడేయని యెవ
రికి దెలుసును. అదియు యిఱువది సంవత్సరముల మాటనిప్పుడెట్లు
చెప్పగలము. దినగండము వేయేండ్లాయుస్సని పెద్దలునచింతురు.
నేడుండినవారు రేపుండుదురో యదృష్టమే. మనము రేపుండగలమని
చెప్పగలమా? గాన నీవెట్టిశంకను మనమున నుంచుకొనకుమని" సమా
ధానపఱచెను.

కళా — "సరే" యని తలయూచి "మీరుండ నేనెందులకు
ప్రయాసపడవలె"నని యూరకుండెను.

డాక్ట — "రామశర్మగారూ! మీకు నేను సామీప్య బంధు
వును. అత్యంత హితుడను. కుటుంబ వైద్యుడను. సర్వదా
మీక్షేమము నారయువాడను. తమవంటివారి ఘనతను జూచియే
నా మేనకోడలనిచ్చి వివాహమొనర్చితి. మనస్నేహము చిరకాల
ముండునది నేనుమీకుగాని మీరునాకుగాని మోసముతలంచెదమను
కలలోనివార్త. పిల్లొకటి వ్రాసియిచ్చిన జాలును. మీవంటివారు
తప్పక సూర్యచంద్రాదులు గతులుతప్పుట యనుటయే. ఇప్పటియు
వుదయించు బాల్యావస్థ శిశువు చిరాయువుగలిగి జీవించి మఱియును
పురుష సంతతిగా పరిణమించినగదా. ఒకవేళ దైవవశమున
ప్రతికూలముగనే యగుననుకొందము. అప్పుడు నేనిదివఱకు వచిం
చిన చొప్పున యాతడు నాపోషణలోనే యుండగలడు. మీ
రాతనికై మాసమునకు రెండు వందలిచ్చుచుండవలయు బ్రతికిపెద్ద
వాడయ్యెపక్షమున యాతని చక్కగ చదువనేసి తగు యుద్యోగమున
బ్రవేశ పెట్టువాడను" అని చెప్పెను.

రామ— (తనలో) "ఇదియును కొంతమేలే. జీవించి యెచ్చటనైన వృద్ధినొందుచుండిన యదియే పదివేలు" అనుకొని (ప్రకాశముగా) శర్మగారూ! మీచిత్తమెచ్చిన రీతిగావింపుడు. అంతయు మీదే" యని మిన్నకుండెను.

డాక్టరు—"వ్యాధిగ్రస్తులనేకులు శరణాలయమువద్దగాచుకొని యుందురు గాన వెళ్లకతప్పదు" యని శెలవు పుచ్చుకొని యేదియో జ్ఞప్తికిరా మరలి వెనుకకువచ్చి "రామశర్మగారూ! దయయుంచిమా గృహమువైపోక మారు రావలయును. నావయొక పెద్ద కేసొకటున్నది. దాని తప్సీళ్లన్నియు మీకుచక్కగా దెలియును దాని నేరీతిగావింపవలయునో మీరు చెప్పవలయును రండు! పోవుద"మనెను.

రామ—"అంతగా వేడుకొనవలయునా? మీరుమాకాప్తులు మీకు మేమాప్తులము. ఒకరికొకరు సాహాయ్యముగావింపు కొనుట విధి. అదియెంతపని రండు" యాతనితో కలసివెళ్ళెను.

పిదప రామశర్మ యింటికరుదెంచి యిట్లని చింతించె "బొందిలో ప్రాణమున్నంతవరకు వృద్ధాప్యము సంప్రాప్తమైన పరిణయమునాడ దలచెదేని వారికి పలుమారు నాయనుభవము దెల్పి నివారింపజేసెద. ఒక్క క్షణములో నెంతమార్పు. ఎంతటివాడ నెంతటివాడనైతి. అగ్నియని దెలిసి తెలిసి చేయిపెట్టిన యూరకుండునా? ఇదినాఖర్మము కాబోలు. గతించినదానికి వగచిన బ్రయోజనములేదు. రోటి యందు తలదూర్చి రోకటిపోటునకు వెఱచిన యట్ల"ని తనకు తాను వితర్కించుకొనుచుండెను.

# భానుమతి.

## ఎనిమిదవ ప్రకరణము.

### ప్రసవము.

వెనుకటింటి పడసాలలో బిడ్డ నెత్తుకొనియుండిన యామెయే రామశర్మగారి ద్వితీయభార్య కళావతి. వివాహమైన యేడుమాసములకే సంతానము కలిగెను. పురంధ్రీలు యేడునెలలకే సంతతి యాయని కలవరపడిరి. ఆబిడ్డయున్ననో నల్లనికాకిమబ్బు వంటిరంగు. లావు పెదవులు. నిక్క చెవులు. మిట్టపండ్లుగలిగి భూలోకమున యమదూత యీరీతి జన్మించినాయని దోచుచుండును. అయిననేమి! కాకిపిల్ల కాకికి ముద్దుగదా.

అది జ్యేష్ఠమాసము వానలు కురిసినవి గాలి విశేషముగా వీచుచుండెను. పిల్లలు బయలేగుచుండ తలిదండ్రులు యీగాలిలో దిరిగిన మంచిదిగాదని వారించుచుండిరి. అందులకే కాబోలు జమీందారుగారి ప్రథమభార్య లీలావతీదేవి వెలుపలికివచ్చుట లేదు. ఆమెకిప్పుడు తొమ్మిదవ మాసముమీరినది. ఇక ప్రసవించుట దినములమీదనున్నది. ఆమెకు పురుష సంతతియే కావలెనని చాల యిష్టము. సవతివలె తానుగూడ తనకొమారుని నెత్తికొని ముద్దాడవలెనని మురియుచుండెను. అందులకే సవతిబిడ్డను పలుమారు ముద్దిడుచుండును. స్వయముగా కురులు దువ్వును. జడలువేయును.

మంచియంగీలు కుట్టించి తొడగును. బిడ్డయొక్క నిమునమైన నూతన పెద్దమ్మ కడబాయును. ఏట్లువిడుచును? ఎత్తినవారి చంకబిడ్డ. ఎవరు విచారించి పోషించిన వారె బిడ్డ తలిదండ్రులు. తల్లిపిలచి ననుపోదు. బలవంతముగా దీసికొని పోయిన పోరుపెట్టును.

ప్రసవ దినములు. ఎన్నగా జూచిన యాయాతురతతో నుండిరి. తీరికయే లేదు. లీలావతియొక్క పరిశుద్ధమైన గదిలో నుంచబడినది. అగది విశాలమై గాలిచక్కగ వీచుచుండుటకై యనేక గవాక్షములను గలిగి చాల సౌకర్యముగనున్నది. భారతీయులు గర్భవతులు గావాడుట యందును, పసిబిడ్డలను పెంచుటయందును పాశ్చాత్త్యుల ననుకరింపక తప్పదు. మనకు దెలిసిన పద్ధతులు బొత్తిగా యిప్పటికాలపు ప్రజలకు బనికిరావు. పాశ్చాత్త్యుల నను కరించుట తప్పనిమ యింకను వారిబోధనలు సరిగానేర్చని మనవైద్యులు సవ్యపరుత్రా చెప్పెడి [illegible] యువియంతమాత్రము సరియైనవిగావు. మన విద్యావిహీనమగు ప్రపంచములో సమస్తజంతువులు కంటె వెనుక బడియుండుట నిజమే. లేకున్న శిశుమరణము లెక్కువగా మనదేశ మునకే కలుగుటేల? మనయజాగ్రతయే కారణము. బాలింత రాండ్రకు తగు యవుషధమివ్వంపక, కావలసిన యాహారమివ్వక లేని పత్యములను బెట్టి చంపివేయుచున్నాము. కావుననే మనదేశమున స్త్రీలుగర్భము ధరించి ప్రసవించిన తిరిగి పునర్జన్మమెత్తినట్లే. కొన్ని యూళ్ళయందు బాలింతరాండ్రకు యింగువ, సల్లసుంపు, యుల్లి పాయలు మొదలగు మత్తు పదార్థములొసంగి వారినేక రోగముల పాలుచేయుచున్నారు. నిక్కముగా యీపద్ధతులు యిప్పటి కాలము నకు బనికిరావు. వీటిని విడచి కొంతవరకు పాశ్చాత్త్యుల ననుకరించుట మంచిది.

నేడు లీలావతి యామాడుదినములకన్న వేదనాభరమున తహతహ

పడుచున్నది. ఆమెను చక్కఁగా విచారించు వారే లేరు. బంధు
వు లైన రప్పింప లేదు. పురుషు లెంత విచారించిన నేమి? వారివారికి
వారివారే సాహాయ్య మొనర్పవలయు. కాని యది కళావతియందు
విముఖతఁ జెందియున్నది. తన్నది వఱకు కనిపెంచిన బిడ్డవోలె పోషిం
చిన సవతిని నొక్కమారైన విచారించిన పాపమునఁబోలేదు.
క్రూరచిత్తుల మనస్సులెట్టివో? తుదకు కటికవానికైన నొకప్పుడు
గాకున్న మరియొకప్పుడు జాలికలుగునేమోగాని కళావతి కొకవారఁ
లుక బొడిన నిఁక జన్మపర్యంతర మార్తిననే గడుపవలసినదే.

గ్రీష్మఋతుపు దినములు. మధ్యాహ్నము పండ్రెండు ఘం
టల సమయము. సూర్యభగవానుఁడు నడినెత్తిపైనుండెను. చెట్ల
పై లిబిడిచే గాలిమొక్కింత వీచుచుండెను. జనులు వేడిమికి తాళలేక
న్నమా చల్లని కిటికీలచెంత కొంతవఱకు శ్రమమునుండి విముక
బడుచుండిరి. [illegible] సమయమున లీలావతి పురుటి శిశువును
బ్రసవించెను. ఆమెకు నదికే మత్తుమందివ్వఁబడి యుండుటచే యామె
బిడ్డ ముఖమును చక్కఁగా జూచెనో లేదో వెంటనే తెలివిహీనయయ్యె.

శిశువు చూచుటకు బహుసుందరుఁడు. ఆకాశమండలమున
చరించు చంద్రుఁడే యీరీతి భూమి నవతరించెనేమో యనునట్లుం
డెను. కొంచెము గూడ హెచ్చుతగ్గులు లేక జనకుని ప్రతి
బింబ మాబాలుని ముఖమున యచ్చుగ్రుద్దినట్లుండెను. కళావతి
డాక్టరు నాబిడ్డను త్వరితముగ నెత్తికొని పొమ్మని తొందరపెట్ట
సాగెను. రామశర్మ యింకనూ కొంతసేపాగుడనెను కాని కళావతి
యింకనాలస్యము జేసిన లీలావతి తెలివినొంద గలదనియు పిదప
ప్రమాదము రాగలదని జెప్పెను. రామశర్మ నోటమాటరాక
నిశ్చేష్టుఁడాయెను. ఎత్తుకొని పొమ్మని యెట్లుచెప్పగలడు? ఇంటి
యందు కురూపియగు నల్లకొరవిదయ్యపు బిడ్డనుజూచి, యచ్చోట

తన ప్రతిబింబ మా ముద్దుల మూటగట్టు యానందమూర్తి ఫాలసీమను ప్రతిఫలించుచుండు నట్టి బిడ్డను చేతులారగొని ముద్దుబెట్టి మురిపెమున పెంచుటకు మారుగ నొక్క వేటున చంపుటకు కటికవాని కిచ్చినట్లు, తెచ్చిపోషించిన చిలుకను పిల్లి కర్పించినట్లు దీసికొని పొమ్మని చెప్పపోరాదునా? హా! కళావతీ! నీవెంతటి దాసవే!

ఇంతలో లీలావతి యిటునిటు పొర్లసాగెను. డాక్టరు రామశర్మను జూచి "రామశర్మగారూ! ప్రమాదము రాగలదు" అని హెచ్చరించెను. అంతకళావతి "తీసుకపొండని" నిర్విచారముగ జెప్పివైచెను వెంటనే యాతఁడు బ్బాలునిగొని తిన్నగ వెడలిపోయెను.

లీలావతి కొన్ని నిముసములకు మఱియొక గూడ శిశువును గనెను. కళావతి కొకింత సంతసమబ్బెను. తనయొత్తు నిరాటంకముగ జరిగెనని లోలోన దేవుని స్తుతించెను.

లీలావతికి దెలివివచ్చునప్పటికి బిడ్డక్రిందబడి యేడ్చుచుండెను. ఆరోదన ధ్వనివినినంతనే యామెయొకింత కన్నులు నులుపుకొని యచ్చటనున్న బిడ్డనెత్తికొని ముద్దాడెను. లేక లేక పుట్టినందులకు సంతసమందెను. అందున పురుష శిశువుదయించెనని మఱింతయుబ్బెను. వెంటనే దిగ్గున లేచి "ఏమిది? విచిత్రము. ఇదికలయా? ఇంతకుముందు కన్నులార పురుష శిశువును జూచినట్లు జ్ఞాపకము ఇంతలో నదియేమాయె మోసమా? మోసగించువారెవ్వరు? లేమ లేదు. ముమ్మాటికి నిందు మోసమే జరిగియుండవలయు. ఆమ రాత్మకురాలిట్లొనర్చి యుండదుగదా! ఒకవేళ నన్ను మోసగించిన నానాథుని కంట మన్నుగొట్టుట కాతఁడిందేయుండెను గదా. అయిననే జూచినది యసత్యమందమన్న పురుష శిశురోదన ధ్వని చెవులార వింటిని. కనులారకంటి వేదనాభరమున మూర్ఛరాక్రిందబడి

పోయితి. కావున నిందేదో మోసముండకతీరదు. కాని నానాథు నొక్కమారడిగి జూచెదగాక' యని మనంబున తర్కించుకొని "నాథా! నాథా!" యని పిలచెను. ద్వారముచెంతనున్న రామ శర్మ లోనికేతెంచె.

లీలా — "నాథా! యీబిడ్డ యెవరిది?"

రామ — "ఏమిది? జన్మిపట్టినదా! మనబిడ్డ కాకున్న నిక యెవ్వరిదైన యిక్కడికెందులకు వచ్చును.

లీలా — "నాకు జనించినది పురుషశిశువుగాని స్త్రీశిశువు గాదు. దీనిజూడ యాడబిడ్డగనున్నది".

రామ — "అదెట్లు సంభవించును. ఇంతలో నింత మార్పా! ఎన్నడు మార్పుగలుగు. నీవిచ్చుటచే గాదుకొని యుం[illegible] నాకు [illegible] నిన్ను చూచు [illegible] యానందమునాకున్నదో"

లీలా — "నాబిడ్డ కాకున్న దెట్లున్ననేమి! [illegible] మోసము జరిగియుండకూడదా"

రామ — "లేదు లేదు. ఇవి నీభ్రమలు. ఎవ్వ[illegible] నిట్టి పన్నుగడ పన్నరా"

లీల — "నేనిచ్చినది యక్షరముగదురా! చెప్పలేరా నిలుకడ, నిలుకడ గాంచినదే యసత్యమా"

రామ — "నిశ్చయముగ పొరబడియుంటివి".

లీలా — "నేనంత బుద్ధిహీనురాలనా"

రామ — "ఎవ్వరు చెప్పగలరు!"

లీలా — "యీవిపరీతమునకే మందును?"

రామ — (ఏమి చెప్పుటకు దోచక) "ఇదిగో! వచ్చెద" నని యింటిలోనికి పోయి లీలావతియొక్క ఫోటోను దీసుకొనివచ్చి "ప్రేయసీ! యిటుచూడుము ఇది యెవ్వరి పటము?"

లీలా — "నాయదియే"

రామ— "నీనిని గైకొనుము. ఇందులోనుండు రూపము నకు యీ బిడ్డ రూపమును పోల్చిచూడుము"

లీలా — (గైకొని ఆశ్చర్యముతో) "ఈపటములోని నాప్రతిబింబమునకును బిడ్డకును నొక్కటే రూపమైయున్నది"

రామ—(సంతోషముతో) "నీవు పోలబడినది వాస్తవమేగదా".

లీలా — "నేకిన్నుడ కలదా?"

రామ— "నిక్కముగా కలదే".

లీలా — "సరి యిక మీరు పొండు" నెను. అంతట రామశర్మ వెడలి పోయెను.

లీలావతి గొంతెత్తిగా తనగదిలో కూర్చొని "అయ్యో! దైవమా! నాయందు యేలనీకింత నిర్దయ. మొగశిశువుదయించునని గంపెడాశతో నుంటిని. నాసవతి కన్నుల కింపుగ తనముద్దుల తనయుని పోషించి పెద్దవానిగ జేసి, విద్యావంతునిగ జేసి, నేడైన నుద్యోగము బత్తిచేసి పెట్టి నాతని సంపాదించుమాడ చూచి సంతోషపడుచుండ, నేను నాబిడ్డను యికను చదువుపూర్తి కాకముందే వివాహము గావించి వారింటికి తరిమి వేయవలసినదేనా? లేక మోసమైన జరిగియుండిన వచింపరాదా" యని పరిపరివిధముల నోటికవచ్చినట్లు యనుకొనసాగెను. ఇంతలో డాక్టరు యేతెంచెను. లీలావతి నాతని చేరబిలచి "డాక్టరుగారూ! నేప్రసవించినప్పుడు మీరిచ్చటనే యుంటిరా'

డాక్ట— "ఉంటిని".

లీలా— "జనించినది పురుషసంతతియా లేక స్త్రీసంతతియా"

డాక్ట— "పురుష (కాదు కాదు) స్త్రీ శిశువు".

లీలా— "నిజము వచింపుడు".

డాక్ట— “ఇందసత్యము లేదు”.

లీలా— ‘‘నే పురుష శిశువనుకొంటి’’.

డాక్ట— ‘‘పొరబాటు’’.

లీలా— ‘‘కన్నులార గాంచితినే’’

డాక్ట— ‘‘అదెట్లు? మేమందరమిచ్చటనే యుంటిమిగదా. నొక్కవేళ యెవ్వరైన మార్చివేసి యుందురను కొనుము. ఇదే సమయమున సమాన వయస్కురాలకు, యందపు బిడ్డ నెవ్వరిదైన కొనివచ్చునెట్లు. ఆపనికి పాల్పడు పాపులెవరు?’’

లీలా— ‘‘నాయదది పొరబాటేనా?’’

డాక్ట— ‘‘ముమ్మాటికిని. ఇదిగో! యీమాత్రిలను పుచ్చుకొనుము. ఘంట కొక్కటి చొప్పున మింగుడు’’. అని చెప్పి వెడలెను.

డాక్టరు వెడలిన తదుపరి లీలావతి ‘‘డాక్టరుగూడ నటులే ప్రశ్నకుత్తర మొసంగెగదా! అతఁడు గూడ వారి జట్టులోనివాడే. నీవు నా యెడకెంట నాలుక కెంపుల కౌనుచుండుట ఇంక దైవము తప్ప నిక్కము వచించువారలు గారాని’’ తనలో తాననుకొనెను. తాను కోర్చి రెండుమూఁడు మాయులు గదవెుడ్డ కనుదెంచి బిడ్డను చూచి చాల యానందించెను. పురుష శిశువును చేతులార పెంచుటకు నోమునోచి కొనసైతిగదా యని పలుమారాసంగతి జ్ఞప్తికివచ్చి నప్పుడెల్ల దుఃఖించుచుండెను. శేవకులు లేదు పెద్దయజమానురాలాడ బిడ్డను కనినందుల కమితానందము నొందిరి. పురజనులు ముసలిదంపతుల కిప్పుడు సంతానము గల్గినందుల కాశ్చర్యపడిరి.

# భానుమతి.

## తొమ్మిదవ ప్రకరణము.

### ఆత్మహత్య.

అవి కృష్ణపక్షపు కడపటి దినములు. పగటినంతయు భద్రముగ గాపాడి రాత్రి కాళరాత్రికి నప్పచెప్పియుండెను. అందులకే కాబోలు యామె తననల్లని చేలమున లోకమును గప్పివేసి భద్రముగ గాపాడుచున్నదో యనునట్లు జీకటులు నలుగడల వ్యాపించియుండెను. ధర్మపురమున యచ్చటచ్చట మునిసిపలు దీపములు వెలుగుచున్నను, నవి గాఢచీకటి మహాసముద్రమున మునిగిపోవుచున్నవో యను నట్లు మినుకుమినుకు మనుచుండెను.

అట్టి నిశీథవేళ రామశర్మగారి భవనమునుండి నొకవ్యక్తి బయటి కరుదెంచి యందు పరుండియున్న దాసిని లేపెను. అది మేల్కాంచి "ఎవరది" యని యడిగెను. అంత నావ్యక్తి "ఎవరూ లేదు లేవే! నేను" యనియనెను.

దాసి—"అమ్మా! ఇంతటి నిశీథమున బయట కరుదెంచు నంతటి కారణమేమి. ఈచలిగాలి మయిసోకిన జ్వరము రాగలదు. లోనికి బొండ" నెను.

వ్యక్తి—"అవసరపు పనియున్నది లేచిరమ్మని" బలవంతపెట్టెను.

దాసి—"ఇట్టివేళ నాతో నేమిపని"

వ్యక్తి—"అంతయు నిచ్చటనే జెప్పవలయునా? లోనికిరమ్మా నాగనివద్ద" కని దారినడువసాగెను. దాసి యామె వెనువెంటనే

లోనికరిగెను. తనయజమానురాలు తన్నుందుల కంతటినిశీథపు సమయమున పిలువవలయుననియు, నొక్కకూతవేసిన నెందరో చేతులు గట్టుకొని సిద్ధముగుదురే వారినందరిని విడిచి నావద్దకే యెందులకు రావలయును; వారందరు మగవారనియా, ఎవ్వరితోనైన చెప్పి యంపిన రాకుందునా. స్వయముగా రానేల? నడుచుటకుగూడ శక్తి లేనిది, నిస్సత్తువచే నీరసముగానుండు దేహస్థితి నారయక గదివెడలి రానేల నేనత్యంత ప్రియురాలననియా? అయిననేమి. బహుశః చెప్పవలసిన సంగతులు రహస్యములనియా! పగటిపూట వచింప రాదా. సమయము చిక్కదనియా వుండవచ్చును. అని తనకు వూహాపోడమి నట్లెల్ల తలచుకొనుచు యామెవెంట జనెను.

పీనట్టులోన బ్రవేశించుచుండ రామశర్మ పగలు జరిగిన చర్యల నొకమారు మనసునకుఁ దెచ్చుకొని తలపోయుచుండినందున యాతనికి జక్కగా నిదురబట్టినదిగాదు దుస్స్వప్నములు దాకలువరించుచుండెను స్వప్నములోకూడ బిడ్డనుగూర్చియే చింతించెను. తలుపుదీసినట్టు శబ్ధమునవినెను. రామశర్మ యులికిపడి లేచి "ఎవరది! తలుపుదీసి నద"ని గద్దించి యడిగెను. లీలావతి "ఎవ్వరునుగారు నేను బిడ్డకు పాలుకుడుచుంటి"ననెను. రామశర్మ నిద్రాభంగముచే నచ్చోటు బాసి వుద్యాన వనమునందలి మేడమెత్తకి బోయిపరుండెను.

లీలావతి దాసిని దగ్గరబిలచి బుజ్జగించుచు "లక్ష్మీ! బిడ్డ బాగున్నదేమే? మాచిన్నమ్మ బిడ్డకంటె బాగలేదుగదా" అని యడిగెను.

దాసి—"లేకేమమ్మా! లక్ష్మీసంపన్నులు నిజముగా రతీదేవి లాగుననున్నదమ్మా" అని చెప్పెను.

లీలా—నాబిడ్డయేయయియుండిన యట్లేయుండియుండును.

దాసి—(ఆశ్చర్యముతో) ఇంకెవరిబిడ్డ. ఇతరులబిడ్డ నిచ్చుటి కెవ్వరు దెచ్చి పెట్టెదరు.

లీలా—మీచిన్ని యజమానురాలు.

దాసి—ఆమె యెందులకట్లు జేయును.

లీలా—నన్ను మోసపుచ్చుటకు.

దాసి—మోసపుచ్చిన యామెకేమి లాభము.

లీలా—లాభమో! నష్టమో! నన్ను మోసపుచ్చిన సంతృప్తి గదా.

దాసి—ఛీ! ఛీ! ఏటిమాటలమ్మా! ఆమెపై నింతటి నిందలు మోపజనదు.

లీలా—ఇంకెవరు జేసిరి.

దాసి—ఎవరును యెట్టిపనియు జేసియుండ లేదు.

లీలా—ఈబిడ్డ యెవ్వారిదో నిజము జెప్పుము. నీకు బహుమానమొసంగెద.

దాసి—"మీకుపిచ్చిపట్టినదా యేమి? లేకున్న నిట్టిమాటలా. ఎవ్వరైన వినిన నగుబాట్లగును. ఇంక చాలింపుడు మీమాటలు" అనును.

లీలా—నవ్విన నాకేమి? నాకుజూడ నిందేదో మోసము జరిగియుండునని దోచుచున్నది. డాక్టరునుకూడ యడిగితి వారెవ్వరును సరియగు జవాబివ్వరైరి.

దాసి—ఉన్నదున్నట్లు సత్యమెఱింగించిన సరియగు జవాబివ్వ లేదని యనుచుంటిరే.

లీలా—నిజము వచించియుండిన నిన్నంతగా యడుగనేల.

దాసి—అమ్మా! మీయెడ నాకెందులకు సంశయము

లీలా—చెప్పవద్దని చెప్పియుండిరి గాబోలు.

దాసి—ఎవరు చెప్పువారు. ఎవరికంతపని.

లీలా—పనియుండబట్టియే

దాసి—నిక్కముగా నాకేమియు దెలియదు.

లీలా—(మెడనుండి చంద్రహారమును దీసి) "నిజము బుత్తెంచుము. ఈహారమును బహుమానమొసంగెద"ననెను.

దాసి—లేని విషయములనెట్లు చెప్పగలను.

లీలా— ఉండు విషయములే. నీకు దెలసినవే.

దాసి—నిష్కారణముగ నన్నేల నిర్బంధించెదమట? మీకు పాడిగాదు.

లీలా—(తలుపులను మూసి వైచివచ్చి) "తలుపులుగూడ మూసివైచితి. వినువారెవ్వరును లేరు. ఇప్పుడు చెప్పు"మనెను.

దాసి—ఇదివఱకు చెప్పినదే జెప్పుచునదరా.

లీలా—(కోపముతో) ఏమి జెప్పితివి. నిజమొప్పుకొంచెదవా లేదా?

దాసి—(భయముతో వడకుచు) నేనే కార్యము నెఱుంగనమ్మా.

లీలా—నీకు దెలియకున్న నింకెవరికి దెలియును. నీవేగదా యాంతరంగిక కార్యదర్శినివి.

దాసి—(ఏడ్చుచు) "చాలు లెండు. నన్నూరక యేల బాధించెదరు. పోదును. నే వెడలెద?"నని బెదరించెను.

లీలా—"దాసీ! ఇంక వాదముతో బనిలేదు. నిన్నిపుడేమి చేయుదునో జూడు మని" నదివఱకే గుప్తముగా దాచియుంచియున్న కత్తిని బైటికిదీసి "ఇదిగో! నీవు నిజమొప్పుకొనకున్న నిన్నీ ఖడ్గమునకు బలియిచ్చెద"నని చేయిపైకెత్తెను. దాసి మిక్కిలి భయపడసాగెను.

దేహము పులకరించె. మేన చిరుచెమ్మటలు గ్రమ్మె. చెవుల వెచ్చని గాడ్పులు బయలుదేరె. దిక్కుదోచక పోయె. తహతహ పడ జొచ్చె. యజమానురాలి సాహసమున కక్కజమందె. యేకాంత ప్రదేశమున నిశీధవేళ నెవరికిని దెలియకుండ యజమానురాలు చేయు దుష్కార్యమునకు లోలోన చింతించి లేని ధైర్యమును దెచ్చుకొని మెల్లగా నిట్లు మందలించె. "అమ్మా! మీకీదుష్ప్రవర్తనదగదు".

లీలా—"నిజము వచింపుమన్న నీతులు గరిపెదవా" యని కోపోద్దీపితయై దాసిని తలవెంట్రుకలు బట్టియీడ్చి "యిఁక జెప్పకున్న నీగతి యింతే బాగుగ నాలోచించుకొమ్మ" నెను.

దాసి—(భయాకంపితయై) "అమ్మా! నన్ను క్షమింపుము. నిక్కము వచించెద" ననెను. అంత లీలావతి ఖడ్గమునటు బారవైచి దాసి నత్యంత సమీపమున గూర్చుండ బెట్టుకొని "చెప్పు" మనియెను.

దాసి—"మీరానాడు ప్రసవ వేదనచే బాధనొందుచుంటిరి. అప్పుడు మీకొక పురుషశిశువుదయించె. అదేలకో మీరు పుట్టిన క్షణమునకే మూర్ఛిల్లితిరి. శిశువును డాక్టరెక్కడికో యెత్తికొని పోయె. మరిరెండు నిముసములకు మీకీయాడ బుడుత బుట్టెను. ఇంతవఱకు మీకు చెప్పనందులకు నన్ను క్షమింపవలె" నని యామె పాదములపై బడెను.

లీలా—అప్పుడే యేల జెప్పవైతివి.

దాసి—మీకు జెప్పవద్దని రామశర్మగారు కట్టడి జేసియున్నారు. ప్రమాదవశమున మీకు జెప్పుటయే తటస్థించిన నన్ను యిలు వెడల గొట్టెదనని చెప్పె. మిమ్ములను విడచిన నాకిఁక యెవరు దిక్కు మిమ్ముల నమ్మినదానను. అని యున్నదంతయు జెప్పివేచెను.

లీలా—అయిన నాకు యమడలు (Twins) దయించిరా?

దాసి— అవును

లీలా—"ఇదిగో! దీని పారితోషికముగా గొనుము. ఒక వేళ మావారు నిన్ను వెడలిపొమ్మన్ననూ, నీజీవిత పర్యంతము దీనితో జీవించగలవు". అని చంద్రహారమును దీసియిచ్చెను.

దాసి—(హారమును గైకొని) "తల్లీ! నేవచించితినని యేరికి గాని దెల్పకుడు". అని బ్రతిమాలెను.

లీలా—"నాకు గావలసినది కోరకినది నెవ్వరితో నైన వచించుటకు నాకదియే పనియా. నీవు నీదారినిపొమ్ము. నాకు నిద్ర వచ్చుచున్నద"నెను. దాసి వెడలి పోయెను.

అంత లీలావతి యిట్లని చింతింప దొడఁగె. "ఆహా! దైవమా! నాకేల గతి లిఖించితివి. దుర్మార్గులకు కాలమన్నట్లుజేసితివే. నానాథుడు నన్ను వంచించునని కలనైన దలఁపనైతి. కడుపున బుట్టిన బిడ్డకన్న నెక్కుడుగ పోషించుచుంటి. ఎంత చేసిన నేమి? పాలుపోసి పెంచిన పాము విషము గ్రక్కుట మానునా? అక్కటా నా ప్రాణేశునికి నేనెంత పగదాననైతి. హా! పరమేశ్వరా! నాకిక దిక్కెవరు. ఇఁక పుడమిపై యుండినను నుండినను నొక్కటే ఓసీ! దుర్మార్గురాలా! కులపాంశనీ! నీవెక్కడనుండి దాపురించితివే. ఎక్కడనుండి దాపురించితివి యన నేల? నా దౌర్భాగ్యముచేతనే దాపురించితివి. కొఱవిని దెచ్చుకొనుటయే యని దెలసియు దెచ్చి తల గాల్చుకొంటి. నాడే వివాహమున కంతరాయము గల్పించియున్న యింతవరకు గాకుండెడిదిగదా. యుంచిన పిదప యేమనుకొన్న నేమి ప్రయోజనము. కోరికోరి దయ్యము నింటికి దెచ్చుకొంటిమి. సంతానము ప్రధానమని భర్త ప్రతినిత్యము వచించునపుడెల్ల నేనేల యూకొట్టి యూరకుంటి. అదియే నన్నింత జేసినది. వివాహము గావించుకొనె పోదానికేల జననికన్న నెక్కుడుగ జూచు నాపై యింత

యీాగ్న్య జనింపనేల. జనించె పోయిట్టి పనిగావింపనేల. హా! దానిని దూరనేల. ఇదియంత యాకట్టడి విధాతపనిగాని వేరొక రిదిగాదు. పాపపు దయ్యమా! సంతానమే స్వప్నవార్త యను కొనుచుండిన వార్లకు యింతటి వయస్సున కలుగ జేయనేల. కలుగ జేసెపో పోషింప ననుమఁండగువాఁడు కలిగించుట తప్పుగాదా. ఇం తకు నాఖర్మ మిటులుండ నొరుల ననవలసిన పనిలేదు. హా! నాకే లకో యంతకంతకు జీవితము పై రోతజనించుచుండె. ఇంకెక్కడి బ్రతుకు నాసర్వస్వము. నాముద్దుల తనయుఁడు, నా భాగ్యరాశి, వారత్నములకుప్ప, సువర్ణపుముద్ద లేని యీానిర్భాగ్యపు జీవనమేల. హా! పాపీ! ఎంతటి పనిగావించితివే. నేనేమి యపకారమొనర్చితి. నీ యనుల కడ్డము దగిలితినా. హా! దుర్భర పరాభవానలముచే పూర్ణముగ దహింపబడితి. ఇఁక మిగిలిన మొద్దునై జీవింపుట యసహ్యము". అని వెక్కి వెక్కి యేడ్చి "నాథా! నిన్ను యింక పుడమిపై మనని మ్మనా? జాగ్రత్తగా నుండుము. బంగారము వంటి వానికి చదలు పురుగు దగుల్కొననే యయ్యో! నీవిక నెటుల బ్రతుకగలవు." అని యేదో తనచునంబునకు దోచినటుల పరపర నొక లేఖ లిఖించియుంచు పక్కవైచి నిస్పృహ జనించుటచే దేహముపై యాశవీడి యున్మాదావస్థ నొందుచు "హా! ఎక్కడికి పోవుదాన. అదిగో! నాజీవితము సంపూర్తియైనది. వచ్చిరి. వచ్చిరి. జము బంట్లు దాపునకువచ్చిరి. యమభటులారా! నేను పాతకిసిగాను. అదిగో! యింట పరుండియున్నది. దానిని బట్టుకొనుడు. పొందు. పొందు. నాదరికి రాకుడు. పార్వతీశ్వరా! నీకివే నాకడపటి వంద నములు"ని చేతులు మోడ్చి యందున్న నల్లని విషద్రావకమును నూనెతో కలిపి ద్రాగివైచెను. విషము శరీరమున బ్రవేశించెనో లేదో వెంటనే లోనపనిచేయ సాగెను. కన్నులు తిరుగజొచ్చె. అవయవములు యల్లాడుట నిలచిపోయె నోటమాటలే చక్కగరాక

పోయె. శరీరము చల్లబడసాగె. అందులో బాలింతరాలు. కోమల దేహమున కావిషమెంత గావలయు. గొంతురాచుకొను చుండెను. మాటలు తడబడసాగె. అంత లీలావతి ప్రాణనాథుని పరవుపై దృష్టించి, "నాథా! యందుకొనుము నానమస్కారములు. దీవించితి ననుము. (సంతసమున) దీవించితివా! ధన్యురాలనైతి. చిరికి తననా! యూవల బొమ్మ. ధైర్యమా! యిటురమ్మ. కళావతీ! నీవు వచ్చితివా! నీగతి పైనమే జూచుగాక సేవక బృందములారా! మీరు నాకు గావించిన సేవలకు కృతజ్ఞురాలను. మీఋణము నేదన్మజాల పైననూ"—— యను చరికి మాట వెడలదయ్యెను.

అప్పుడే తెల తెలవారుచుండెను. విహంగ సంతానము బాలభానుని రాకకై మంగళారావములట్లు తమ నైజకంఠ ధ్వనులచే కిలకిలారవములు కలుగ జేయుచుండెను. భానుశర్మ కాలకృత్యములం దీర్చుకొని భార్యగదివద్ద కేతెంచి చూడ, వెలిగించబడ్డ దీపమట్లే మినుకు మినుకు మనుచుండెను. గృహమే కళావిహీనమయినట్లు దోచె అంతయు నిశ్శబ్దము చంటిబిడ్డ చీకటీగల బాధకోకింత యిటునటు పొర్లసాగెను. వెంటనే యాతని దేహము పులకరించె మేనంతయు యమరు బుట్టె. లోనికడుగిడుటకే సందేహించె. ఎట్టకేలకు మొండి ధైర్యమవలంబించి లోనికేగె. అందొక కాగితపు మడతను కనుగొనెను. అందేదో చిందర వందరగా లిఖించబడియుండెను. ఆతడద్దానిని గైకొని యిట్లని చదువసాగె.

"మదీయ ప్రాణ ప్రియునకు,

నాథా! మీకిదే నాకడపటి వందనములు. మిమ్ము వివాహమాడినది మొదలు నేటివఱకు యెక్కుమార్లైన మీమాట

జవదాటి యెఱుఁగను. ముక్కువోని పతిభక్తిచే గ్రాలుచుంటి. ధర్మపత్ని నామము సార్థకపఱచుకొంటి. సర్వకార్యములందును మంత్రివలె సాయపడితి. తెలియని సమయమున నాసలహాలనొసఁగి వ్యవహారముల చక్కబరచుకొంటిమి. కాని యెంతవఱకు ఋణమో యంతవఱకు నిరాటంకముగ జరుగుచువచ్చెను. నేటికా ఋణానుబంధము వీడినది. నేను మీకుదూరురాలగుచుంటి. మీ ద్వితీయ భార్యతో మీరు చిరకాలముండుడు. అదియే నాకు కావలసినది. మీసంతోషమే నాసంతోషము మీరు సౌఖ్యముగ నున్న నేనును సుఖపడెదను. అట్టిందు దానవగు నన్ను మీరెంత చులకన చేయదగదు. అది మీతప్పితముగాదు. మోహము చాలచెడ్డది. అదియే మిమ్మింత జేసినది. ఇంకనూ పూర్తిగా చెరుపగలదు. దాని వలలో జిక్కితిరి. వలలో చిక్కి తప్పించుకొనజాలని మత్స్యముభంగి యల్లాడుచుంటిరి. అదియెవ్వరికిని పొసగదు. నిరుక్వము.

ఆహా! ఎంతలో నెంతమార్పు. రెండేండ్ల కాలములో మా కుటుంబమునకెట్టి మార్పుసంభవించె. ఇంకెన్ని మార్పులు గానవయునో తెలియదు. అయిన నిట్టి పనికి పాల్పడు తండ్రులెందైన గలరా! ఔరా! మగవారెంతటికైన తెగుదురుగదా. తమసుఖమే సుఖముగాని పరుల సుఖము తమకెందులకు? నారుల తమచేతి కీలుబొమ్మలలాగు జేయసాగిరి గదా. ఆహా! కాలమెంతకు బాల్పడినది. నాథా! మీ అద్వితీయ మహిమ, అసమానబుద్ధి కుశలత, నిష్కళంక ప్రేమాతిశయము, నిరుపమాన సుగుణ పుంజము, విశుద్ధ పరిపాలనా చాతుర్యము, వినిర్మల విశాల భావములు యన్నియు వమ్మయ్యెనా? అంతయు బూటకమేనా? హా! నాహృదయ వేదన యేరితో జెప్పికొందును. అయ్యో! నాబంగారు మొలక, నాస్వాం

దర్పకాశి, నాప్రేమాంకురము, నావంశలత నెందుబొరవై చితివి. నానిని చంపుట కనుజ్ఞ నీవేయొసఁగితివా? లేక నిన్ను బట్టి పీడించు యాపిశాచి ప్రేరేపణమున జేసితివా? హా! ఎంతటి మాయలమారివే. కపటనాటక పాత్రమును ధరించి, కల్లప్రేమను నటించి తుట్టతుదకు నాగొంతునే గోసితివే. అయ్యో! నిచేతులెట్లాడె. ఆర్యా! మీ రాఘోరము కన్నులార జూచుచుంటిరా చలిచీమ సహితము కాలి క్రిందపడి మడిసినప్పుడెంతో విచారించువారు నేఁడు యాత్మీయ సంతానమును బట్టి జంపుచుండ కన్నులార జూచుచుంటిరి. కసి గందువు మిమ్ములనేమి జేసె. ఎంతలో పగదాననైతి. పసిపాపని చంపమనసెట్లొప్పె.

మీరు కళావతినిఁ బెండ్లాడినది మొదలు మీకంటికి నేనొక పిశాచమువలె గానఁబడుచుంటి. నాసంభాషణములు మీకు కర్ణ కఠోరములు. నాచర్యలు మీకసహ్యము. నన్ను దుర్గంధముగ దలఁచితిరి. కళావతి కారణమున దుర్గంధము దొలఁగిపోవునుగదా! అట్టి నన్ను దొలగించుకొని వెంటనే మీకింపగు కళావతీ సౌరభ్యము నాఘ్రాణింపుడు. మీవైఖరి యంతయు మారిపోవుట నేగనిపెట్టి యుంటి. నోటిమాటతే యనుకయ్యె కలలోగూడ నేఁబలికిరాక పోతి. మతిలేని యామమత లేవంకఁ జేరె? ఆప్రేమ లెందరిగె? ఆవిశ్వా సము లెందుబోయె? ఇంతదురవస్థ కలుగునని నేనెన్నఁడు దలపనైతి. బక్కతాళ్ళితో గొంటిని గట్టవశమే? చాలకాలము సుఖమనుభవిం చినదానను. పట్టుమని పందేండ్లకాలము కాపురముగూడ జేసి యుంటి. వయసుమీరినదానను. నాకు శెలవొసంగుడు. మీకుఁ బ్రియముచేయుట నావిధ్యుక్తధర్మము గాన మీకన్నులకింపైన మాయలాడికి చోటుగల్పించితి. అల్లదిగో! యిందుపడియుండు యీకసిగందునుఁ దిలకింపుడు. సవతి కప్పగింపకుడు. మదాత్రసున

నున్న నాసోదరుని కడకుఁ బంపుడు. మీకాభారము గూడఁదప్పిం
చితి. అంతియే కావలసినది. అయిన మరియొక విన్నప మొకటి
గలదు. మీసౌఖ్యము గోరియే చెప్పుచుంటి. ఇఁక నీపురమునఁ
గాపురముండకుడు. నగుబాట్లకు లోనుఁగాకుడు. అవమానముల
పాలఁబడకుడు. మీవృద్ధతపదవి నొకమారు దలపోయుడు. మనకు
"బస్నా" యనుగల జమీందారీని చక్కఁ బరుచుకొనుడు. అం
దేని వశించుటకుఁ బ్రయత్నించుడు. మీస్నేహిత శ్రేష్ఠుఁడొక్కఁడు
మీరుపోకున్న జమీనులన్నియు యన్యాక్రాంతమగుననియు గృహ
ముపాడగుచున్నదనియు వ్రాయుచుండెనని నాతో యప్పుడప్పుడు
చెప్పుచుండెడివారు. అచటికేఁగుండు. చెప్పవలసిన వన్నిటినిఁ జెప్పి
వైచితి. ఇఁక సెలవుపుచ్చుకొనుచుంటి. కోర్కెలు ఫలించునట్లు,
మీసంకల్పము లీడేరునట్లు చేయవలసిన చెయిదముల కాటంకము
తీరినట్లు మీప్రియురాలి ముద్దు చెల్లినట్లు, సంతోష పూర్వకముగ
యాశీస్సులు నిడుచుంటి. మరియొకమారు మీయెడ నెన్నడైన
యెదురాడియుండిన క్షమింపుడని వేడుచుంటి. మిమ్ముల ననవరతము
యానారాయణుండు కాపాడు గాక.

ఇట్లు,
మీపాదసేవకురాలు,
"లీలావతి"

జాబునుఁ జదువుట ముగిసిన వెంటనే రామశర్మ "హా! లీలా
వతీ!" యని మొదలంట నఱికిన కదళీ తరువువలె క్రిందఁబడిపోయెను.
ఆకేకలు వినియుందందు పారాడుచుండిన సేవకులు పరుగెత్తికొని
వచ్చి యాతని బట్టుకొని కారణమడిగిరి. కాని యాతఁడు పలుక
డయ్యె. కంటినుండి కన్నీరు వఱదలై పారఁజొచ్చె. వారొకింత
నీరమునుగొని వచ్చి ముఖముపై జల్లిరి. తెలివొకింతరా రామశర్మ

“హా! లీలావతి!” యని మఱియొకమారు మూర్ఛిల్లె. అంత సేవకులు లీలావతి కేదో కీడుమూడియుండునని దలంచి యాతనచ్చట విడచి గదిలోనికిఁబోయి లీలావతిని జూచిరి. ఇంకనూ యాయపూర్వ లావణ్యమామె వదన మండలమున విలసిల్లుచుండె. యామవతి దాటిన వెన్నెలలోని శీతమయూఖుని చంద్రానకాంతిదగ్గి, కళాహీనయై నోటినురుగులు గ్రక్కుపడియుండుట గనుగొని యంతర్భాగమునకుఁ బోకాళ్ళాడక దడదడ వణంకుచు నొక్కపెట్టున “అమ్మా! లీలావతి! మమ్మెల్ల దుఃఖాబ్ధిని ముంచివైచితివే” యని రోదన మారంభించిరి. అదివిని తక్కుంగల వారందరు బరువెత్తివచ్చిరి.

ఇంతలో రామశర్మ లేచి భావపరిస్థితి గనుల నొకింత విచారించి మూలేసి సంతసముతో మడిచి జేబున నిడుకొని లోనికిఁబోయి రొమ్ము మోదుకొనుచు “నిన్నటి దినమంతయు నెంతో చక్కగ మాటాడితివే. అయ్యో! నన్ను కోపమున దోసిపోతివే. రాత్రి రంతయు నిదుర పోతునని మాటాడుమంటివే. అది నన్ని పాపమని గ్రహింపనైతినే” యని మూడువారివలె వాపోవుచు నాలుక యెండి పోవ “హా! నెంతటి యాపదవేసితి. దీనికంతటికిని కారణభూతుఁడను నేనేగదా! పాపాత్మా! రామశర్మా! నివెంత పాపివి” యని లోలోనఁ దిట్టుకొనుచు “విధాతా! నీవు నిక్కముగా యని నేకివి. ఇంతటి పుణ్యచరితకు, సాధుశీలకు, పరమ పతివ్రతకు యల్పాయు విచ్చితివి గదా. నిన్నేమనవలయు? అయ్యో! లీలావతీ! నీవుపారాడని యీ గది, పాలకుడునని మాబిడ్డ నిరాధారాములయ్యెనే. నిర్భాగ్యుఁడను నావంటివానికి దక్కుదువా” యని వెక్కివెక్కి యేడ్చుచు మూర్ఛిల్లె సేవకులెల్లరు “హా! తల్లీ! లీలావతీదేవి! నీవులేని యీభవనములెంత సన్నగిల్లినవి. ఎంత కళాహీనములయ్యె. అయ్యో! యింకమమ్ము గాపాడు వారెవ్వరు. నీవస్తమించిన యీగృహ మస్తమించెనే.

నీవుపోవుటచేత యీసౌధరాజము నేలగూలినది. నిన్నుసేవించు భాగ్యము నిన్నటి వఱకేనా! ఇంకనూ యెన్నియో నాళ్ళుందువని మురిసితిమే. చిన్నితనమున వివాహమైనంత వఱకుండక పురిటింటి లోనే గతించితివే. మాతా! పిడుగువంటి నీమరణవార్త ధర్మపుర మునెల్ల దుఃఖాబ్ధిని ముంచితివే'' అని దుఃఖింపసాగిరి.

రామశర్మ మోస్పియేడ్చి కొంతవఱకు దుఃఖమును దిగమ్రింగి నోటనుం జేరంబడి మొగంబున నుత్తరీయాంచలము వైచి భార్యను గూర్చి చింతింపసాగె. "పరమేశ్వరా! నేనెట్టి దుర్దినము. తన కొంగున కలిమియున్నను వారలను జూచి గర్వపడని యనసూయరాలు. పతివాంఛితానుష్ఠానమేగాని నిముషమైన నూరకుండని యోగ్యురాలు. పుట్టినింటి వారెన్ని మారులు రమ్మని చెప్పి యంపినను పతిని విడచి నొక్క నిమిసమేనియు నుండనని చెప్పుపూజ్యురాలు. పతిసేవ దప్ప యన్యము నొల్లనని చెల్లు విమలచరిత. నాకదక్కునా. ఎంతటి మందభాగ్యుడను.'' అని వాపోవుచు దిక్కుతెలియక యుందేపడి

అంత కళావతి లేసివ్యసనమును ముఖమునకుఁ దగిలించుకొని మాసిన చీరగట్టి, ఆభరణా విహీనయై యెంతయో దుఃఖించినదిబోలె కంటినుండి కన్నీరు గార వెంట్రుకలు కారుమబ్బులట్లు భుజముల కిరు కెలంకుల వ్రేలాడ, పైటచెరగును మాటిమాటికి ముఖమున కద్ది కొనుచు పఱగు పఱుగునవచ్చి "అక్కా! లీలావతీ!'' యని నేల కూలంబడెను. రామశర్మ యదిజూచి కళావతిని దబ్బుకొని మఱింత దుఃఖింపసాగెను. సేవకులరుదెంచి "బాబూ! దుఃఖించిన నేమి ప్రయోజనము. ధైర్యమూనుడు. పశిపాపను దిలకింపుడు. ఏడ్చుచున్నది. ఎత్తికొనుడు'' అనిచెప్పసాగిరి. రామశర్మ అయ్యో! లీలావతీ! యీకసిగందునెట్లు బెంచుదునే యని మూర్ఛిల్లెను.

కళావతి పతినిచేరదీసి "నాథా! మనమిట్లు దుఃఖించుచుండిన యెన్నటికిని తరుగదు. పసిబిడ్డ యాకలి చిచ్చుచే చావగలదు. దాని గతి ముందారయవలయు, పోయినవాదికై చింతించిన బ్రయోజనము లేదు" అని యూరడించుచు మెలమెల్లగ నాతనొకగదిలోనికిఁ దీసికొనిపోయి యచ్చుండజేసి పరుగెత్తివచ్చి యాపీనుగ నెత్తికొని పోవుటకు గావలసిన పనులకుపొంకి. త్వరపడుడని సేవకులపై కోపపడసాగెను. వారామె రాయిడికి లోలోన క్రోధమూని చేయునది లేక తఱలిరి.

లీలావతి మరణవార్త గ్రామమంతటను వ్యాపించెను. ఆ పుణ్యాత్మురాలకు విరోధులే లేరు. అందుచే వగవనివారే లేరు. కొందరు యీవార్త నిజముగనో లేకయో యని రామశర్మ యింటికిని వచ్చి నిజమరసి తమ్ముండ్రగల వారికెల్ల యీదార్థము వచించుచుండిరి. ప్రతియింటివారును యీమె సుగుణగణమును బ్రశంసించుచు క్రొత్త జమీందారిణి (కళావతి) యెదుట యీమె యుండుటకన్న పోయినదే మేలనిరి. ముసలిముప్పున సవతితో పోరుపడి చచ్చుటకన్న ముందేపోయినది యీమెయే చాలపుణ్యవంతురాలని పొగడిరి. జన్మిచేఁ జచ్చెనని వారను ప్రకటించిరి.

లీలావతి మరణించిన నాటఁనోలె రామశర్మ కళావతిపై యసహ్యత వహించెను. ఆమెచేయు పనులొక్కటియు యాతనికిఁ బనికిరావు. ఎదురుపడిన తప్పుకొని పోవుచుండును. అట్లెంత కాలము జరుగగలదు? కళావతి తన నాథునివైఖరిగాంచి యింతయైనను విచారించక మఱింత దిట్టత వహించి తిరుగజొచ్చె. రామశర్మ మందలింప దలఁచెగాని యెదురుపడి మాటాడిన తనకెనలేని యవమానము రాగలదని యిన్నకుండెను.

కళావతి తనకున్న యాటంకము దీరిపోవ నిరాయాసముగ తనయధికారమును నిరపరాధులగు సేవకులపైనను, సచ్ఛ్రేష్ఠుడగు రామశర్మపైనను చెలాయించుచు కాలము వెళ్ళబుచ్చుచుండెను. చేజిక్కిన ధనమునంతటిని విచ్చలవిడిగా వెచ్చింపసాగెను. రైతులను తనవద్ద కరువొంచి తను వ్యవహారములు ముచ్చటింపవలసినదని కట్టడిఁజేసెను. వేయేల! అల్పుని కధికార మొచ్చినట్లు, నీచుని యధికారిని జేసినట్లు, కుక్కను కనకపు సింహాసనాసీనం జేసినట్లు తనబుద్ధిని వినియోగించుచుండెను.

జగదీశ్వరా! నీలీలలు పరమాద్భుతములు గదా! యెల్లిని నల్లని, నల్లిని యెల్లని, [illegible] గను, మేరువును తృణముగను, తృణమును మేరువుగను, నిర్ధనుని ధనవంతునిగను, ధనవంతుని కుచేలునిగను, కుచేలుని ధనవంతునిగ జేయుచుందువుగదా! నీసామర్థ్యమును గనినొని యేకవలయు నీకునీవే సాటి.

# భానుమతి.

## పదియవ ప్రకరణము.

### రహస్య వ్యాపారము.

బాలభానుఁ డుగ్రభానుఁడై యుండెను. అతని చండకిరణజాలముల ధాటికిఁ జెట్లపైనుండెడి మంచు తెమ్మెరలన్ని యొక్కొక్కటిగ విడిపోవుచుండె. భానుఁడు తన్నెవరును చెరయుంచినట్లు బయటికి రానీయక గృహమందే దాగియుండెనని యూహించినట్లు కాళరాత్రికిఁ గట్టువడి వేఁగఁగ తనముగా వచ్చెనే బయలుదేరి తన ప్రతాపము నంతయు వెడలఁగ్రక్కినట్లు తీక్ష్ణంబులగు కిరణములచే ప్రకృతిని నొప్పించుచుండ యాతని ధాటి తాగలేక యుదివరకు భానునికట్టియుంచిన ప్రత్యాళ్ళన్నియు విడిపోయినట్లు వెనుకకుఁ దగ్గసాగెను. కళావతి తన పనుల కత్యంత కంటక ప్రాయంబగు లీలావతి నెట్లో వదలించుకొనెను. ఇఁక తనపని కాటంకముండు వారెవరని నిశ్చితయై మెలఁగఁజొచ్చె.

అట్లొకనాఁడు కళావతి తనయుద్యానవనము నంగల మేడ వెనుకటి వసారాలో నేదో యాలోచించుచు పలుమారు లేచిలేచి కిటికీలోఁ దొంగిచూచుచు నుండెను. ఎవరికోసమో వేచి యుండెను. అందులకే "ఇంకనూ రాలేదే" యని గొణుగుకొనుచు, యాలస్యమైనందున కొంకవంక క్రోధమువహించి యచ్చటకూర్చుండ నోర్వక

యిటునటు తిరుగుచు నయిదు నిమిసముల కొకమారు కిటికీవంక జూచుచు రానందున మరింత విసిగికొనుచు చేయవలసిన కార్య క్రమము నొకపరి తలంచుచు నెంతసేపటికిని రానందున విసిగి యెక్కుచో నాశీనయయ్యెను. ఇంతలో యడుగుల చప్పుడు విన నయ్యెను. వెంటనే యామె తలుపుకించి కిటికీలోనుండి జూచి, రావలసినవారే వచ్చుచుండ సంతసమంది యందే కూర్చుండెను. ఆమె సంతోషము వర్ణనాతీతము. తలంచిన కార్యములన్నియు సఫల మగుచుండ నెవ్వరికి సంతసముగాయుండదు! కళావతి పట్టిన పెల్ల బం గారమగుచుండెను.

ఇద్దరు పురుషులు సమవయస్కులు. ధృఢశరీరులు. నల్లని మేనులుగలవారు. కిరాతులని వారిరూపమే చెప్పుచుండెను. ముఖ్య ములందు నీచభావము జూపట్టుచుండెను. ఎంతటి హైన్యమునకైనను వెనుదీయని వారని వారి మోములే దెలియజేయుచుండెను. పిల్లలెవరేని వారిని జూచిన యన్నము తిననేరరు. పగలేయటుండిన రాత్రికింకెంత యందముగ గన్పట్టెదరో! అట్టి క్రూరులచ్చటికేల రావలయు. వారికందేమిపని. ఏదేని పనియున్నదేమో! ఎవరికెఱుక. వారిపనుల మానుషము లేగద. నాకెవ్వరికి గ్రహచారము చాలదో గదా!

అట్లు వారులోనికేతెంచి కళావతికి వందనములిడిరి. కూర్చొండని చెప్పి యిట్లనియె "మీరేనా రామలక్ష్మణ కిరాతులు?"

కిరా—అవునుతల్లీ! మేమే అని బదులిడిరి.

కళా—మీరు నాకొక సహాయము జేయవలయును.

కిరా—అవశ్యమొనర్చెదము.

కళా—బహుకఠినమైనది

కిరా—మేమిదివరకు జేసినవాటి కంటెనా.

కళా—మీయింట మీకే యిట్టులొనర్పవచ్చునా యని యడుగకూడదు.

కిరా—అంతకార్యమైనపని మీగృహమునందే!

కళా—అవును.

కిరా—అదియెట్టిది?

కళా—"నేటినుండి మూడురోజులలోపల డాక్టరు వైకుంఠశర్మగారి యనాధశరణాలయమున పోషింపఁబడుచుండు చిట్టిబిడ్డను రహస్యముగా నెత్తికొనిపోయి మట్టుబెట్టవలయును. తిరుపతి నావద్ద కరుదెంచిన నేనొక స్త్రీని పంపుచుంటిని. దానినిగూడ యాక్షిగా నొనర్పవలయును. సాధించితిరా!" అనిచూపించెను.

కిరా—అయ్యో! ఇంతేనా! ఇది మాకొక లెక్కలోనిదిగాదు.

కళా—"మంచిది మీరుచేయుపని నొకవేళ యితరులకంటెఁ బడిన ప్రమాదము రాగలదు. మరియు మఱచి నేచెప్పితినని యెవరికిగాని తెలియనీయకూడదు. తెలిసితిరా! మీప్రాణములు మీకుదక్కవు!"

కిరా—"చిత్తమని" యూరకుండిరి.

కళా—"మీరికార్యమును జయప్రదముగా నొనర్చుకొని రావలయును. అందులకు పారితోషికము రూ 200—0—0 రెండువందలు".

కిరా—(సంతోషముతో) ఒక్క త్రుటిలో జేసెదము.

కళా—"చెప్పమఱచితి. ఒకవేళ డాక్టరింట బిడ్డ మీకంటి కగపడదేని యాయింటిని పూర్తిగా దహించివేయుడు. భయపడవలదు". అని నిశ్చితిగ జెప్పివైచెను.

కిరా——"సరి. మాకిక శెలవ"ని మరియొకనూరు వందనము లొనర్చి వెడలిరి. కళావతి యింటిలోని కరిగెను.

నాడమావాస్య. గగనము మేఘావృతమై యుండెను. రాత్రి రెండు ఘంటలు సమయము. చీకటియను మహావృక్షము భూమినవతరించి లోకమునంతటిని యాక్రమించి గగన పందిరిపై చిక్కనై యల్లిబిల్లిగ నల్లుకొని పిందెలు, కాయలు గలిగినదో యన నట్లుండెను. జనులు తోవ గనబడదిననూ తమకెదురుగ నెవరువచ్చునది యెఱుంగజాలకుండిరి. ధాత్రిపురి మాటుమణిగి యుండెను. అచ్చటచ్చట వీధులను చేతులాంతర్లకై నియమింపబడ్డ రక్షకభటులు కాండ విసిరి నిదురించుచుండిరి. జనసంచారము పూర్తిగా నాగిపోయెను.

అట్టి సమయమున వృద్ధమన్నట్లుండి "యిల్లు కాలుచున్నది; ఇల్లుకాలుచున్నద"ను కేకలు మిన్నుముట్టుచుండెను. నిదురపోవుచుండిన రక్షకభటులు కన్నులనులుముకొనుచు యులికిపడి బయలు వెళ్ళ సాగిరి. ఎప్పుడు జూచినను జనులుచేతి లాంతర్లు (Hand Lights) కేల బూని పరుగిడుచుండిరి. "అయ్యో! పాపము! వైకుంఠశర్మగారి గృహమును కెవ్వరో దుర్మార్గులు నిప్పంటించిరి" యని యొకరితో నొకరు చెప్పినదే జెప్పుచు "పాపము! పాపము" అనుకొనుచుండిరి. రక్షకభటులు తమతమ బిగుళ్ళ (Whisiles) నూది తోడి రక్షకభటులను జేర్చుకొనిరి. అంతలో తెల్లవారినదా యనునట్లు జనులందరా గందరగోళమునకు మేల్కాంచిరి. అందరు వైకుంఠశర్మ యింటివరకు పోయి చూచువారేగాని చేతనైన సాయము చేయజాలకుండిరి. మంటలధాటికి రక్షకభటులు లాగలేక ప్రక్కయిండ్ల గోడలనెక్కి నీరు చల్లుచుండిరి. ఇదేసమయమని చోరాగ్రేసరులు యెమరు పాటున నుండు జనులయిండ్లు కొల్లగొనుచుండిరి. జనులూరక సందడి జేసెడి వారేగాని యొక్కరైన ముందువకురాక చిచ్చునార్పం బ్రయత్నింపవ

రైరి. అంత నాయూరున వెలసియుండు బాలభట (Scout Master) నాయకుఁడొక డరుదెంచి తనవద్దనున్న బిగులుతో నుపాయమును తెలియజేయునట్లూదెను. వెంటనే యదివినిన వారందరు తక్కుంగల జట్టును లేపి పెద్దపెద్ద లాంతీలను కేలఁబూని యాస్థలముజేరిరి. అంత దళనాయకుఁడు వారివారిని తగు పనుల నియమించెను. వెంటనే యొక్కరొక్కరు పరువెత్తి కడవల నిండ నీరుదెచ్చి గుమ్మరింప సాగిరి. ఇట్లొక ఘంటకాలములో నగ్ని యార్పఁబడెను. ఎంత యార్పిననేమి? అంతయు భస్మీభూతమైయుండెను. కాని పెనుచిచ్చు యితర గృహములకు వ్యాపింపకుండునట్లు చేయగలిరి.

విద్యాలయములుగల పెద్దపెద్ద పట్టణములందు బాలభటోద్యమము (Scout Movement) చాల ప్రచారమునందున్నది. చాలవరకందు పాఠశాలను వారందరు విద్యార్థులే. ఒక్కొక్క జట్టున కొక్కొక్క ప్రపనాయకుఁడుండును. వారందరిపై దళనాయకుఁడే యధికారి. ఆతని యాజ్ఞకు లోఁబడి బాలభటులందఱు నడుచుకొనవలయును. వారికి నీతను, ప్రథమ చికిత్స మొదలగు విద్యల గఱపెదరు. వారెల్లప్పటికి తమ జీవితమును తమ్ముఁబోషించు దయామయుఁడగు సర్వేశ్వరుని విషయమై, ప్రజాజనరక్షకుఁడగు రాజునిమిత్తమై మాతయగు దేశవిషయమై వినియోగించి జన్మముసార్థక పఱచుకొందుమని ప్రమాణముల గొని పనిచేసెదరు. వారుకొన్ని సాంకేతిక విద్యల నభ్యసించి తద్వారా దూరమునున్న తమ స్నేహితులతో మాటలాడెదరు. ఇంకనూ బావుటాలతోను, బిగుళ్ళతోను, లాంతర్లతోను మాటలాడ నేర్చుకొందురు. ఇదియంతయు పరోపకారము నిమిత్తమేగాని తమ స్వప్రయోజన నిమిత్తముకాదు. ఎచ్చటనైన జనులాపదయందు గాని సహాయాపేక్షాపరులై యుండినగాని వారికి వెంటనే తగు సాయమొసఁగి ధన్యతగాంచెదరు. ఆహా! వారెంత

పరోపకారధురీణులు నిక్కముగా బాలభటోద్యమము దేశమున కెంత మేలొనగూర్చుచున్నది. దీనినింకనూ ప్రభుత్వమువారు సాయమొనర్చి ప్రోత్సాహపఱచిన జనుల కత్యంత యుపయోగ కరంబగునని వేఱుగ జెప్పఁబని లేదు.

పరోపకారమన్న అట్టిది. పొరుగిండ్లు కాలుచుండ తమయిండ్లు యగ్నిపాలగునని భయపడి రాబోయెడి దానికి యిప్పుడే నీటిని తమ యిండ్లపై జల్లుకొనుటగాదు. అందఱును జేరి మండుచుండు గృహమును నార్పిన తమయింటికే యాపద యెక్కడిది? హా! జనులెంత స్వార్థపరులైరి. ఐకమత్యమే లేకపోయెనుగదా! ఎంతబోధించిన నేమి? వారి చెవులకెదియెక్కునా? విననంతకాలము బహుతీపిగా నున్నదని తలలూచువారే గాని యింటి కరుదెంచిన వెంటనే యా మాటలన్నిటితో యెగిరిపోవుచున్నవి. సర్వేశ్వరుఁడొసంగిన బుద్ధిని చక్కఁగ నుపయోగపెట్టుకొను సామర్థ్యము లేని స్వభావముగదా. ఆహా! మానవులెంతటి హైన్యము నొందుచుండిరి. తుదకు చీమల కంటెను, కాకులకంటెను నీచులై మెలఁగుచుండిరే. ఒక్కకాకి మృతినొందిన కోటి కాకులచ్చట జేరుచున్నవి. ఒక్కచీమ కేదయిన తినుపదార్థము దొరకిన లక్షచీమలను బిలుచుచున్నది. ఏదీ మనలో యట్టి సంఘాభిమానము, ఐకమత్యము?

మరునాఁడు రామశర్మ డాక్టరిల్లు పూర్తిగా దహింపఁబడెనని చాల విచారమొంది పరామర్శ చేయుటకై యాతని పిలువనంపెను అతఁడరుదెంచి ‘‘రామశర్మగారూ! మీకిదివరకు దెలియదా!’’ అని యడిగెను. రామశర్మ ‘‘నాకిప్పుడే దెలిసినది. సేవకులు జెప్పిరని’’ నెను.

డాక్టరు — రాత్రియంతయు ధర్మపురమే మాగృహముచుట్టును మూగియుండెను. మీకెవరూ జెప్పకపోయిరా?

రామ—“ఏమోనండి. లీలావతి మృతినొందిన నాటినుండి మనంబు స్థిమితంబుగ లేదు. నిన్నటి రోజుననే యొక్కింత గురుక పెట్టి నిద్రించితి. అది యేమి చిత్రమోగాని యింతవఱకు మేలుకువ వచ్చినదిగాదు. చిచ్చిడిన వారి జాడ కనుగొంటిరా?

డాక్ట—ఎవరినని పట్టుకొనుట?

రామ—మీకెవరూ శత్రువులు లేరుగదా.

డాక్ట—లేరండి. ఎవరో గిట్టనివారి పనిగాక యింటిలోని మంటలు గావు.

రామ—మీకెవరిమీదను యనుమానము లేదుగదా.

డాక్ట—ఎవరిపైననూ యనుమానము లేదండి.

రామ—నష్టమెంత మాత్రము?

డాక్ట—చాల సంభవించినదండి. అందుల కెంతమాత్రము చింతిలనుగాని యందు తొట్టిలో నుండిన పసిపాప యగ్నిం బడి మడిసె. అందులకు గూర్చి చాలచింతిలుచుంటి.

రామ—(ఆశ్చర్యములో) “ఏమీ! మనకుర్రవాడా! అయ్యో! బాబూ నాముద్దుల తనయుడే” అని యక్కజపడుచు లేచి సమీపమునకు బోయియడిగెను.

డాక్ట—“వానికేమిలెండి. మనయదృష్టమునుకొనవలయు వాని నందుంచియుండ లేదు”.

రామ—“డాక్టరుగారూ! మీఋణము నేను తీర్పజాలనండి. ఆకసిగంమునకు మీరే తలిదండ్రులు. మీమేలు మరువములెండి” అనుచుండ తోటమాలి రాముడును మరియొక సేవకుడును యొక్కని త్రాళ్ళచే కాలుసేతులు బంధించిగొని వచ్చి “బాబూ! వీనిపైకిరి జూడుడ”ని చెప్పిరి. రామశర్మ (యాశ్చర్యముతో) “ఎవడురా వీడు?”

తోట—వీడెవడో దుర్మార్గుడు మనపెద్దమ్మగారి పిల్లనెత్తి కొని పారిపోతుంటే పట్టుకొంటిమి.

రామ—(ఆశ్చర్యముతో) ‘‘వాని నిచటికి గొనిరెండ’’ని చెప్పి సమీపమునకుబోయి ‘‘ఎందుకురా గొనిపోవుచుంటివి?’’ అని యడిగెను.

దొంగ—బాబూ! ఇది నా తప్పితముగాదు. నామాట లాలకింపుడు. కళావతమ్మగారు యీచిట్టి పాపను నాచేతికొసంగి చంపి పారవేయుమనిరి. అందుకై బహుమానముకూడ యొసంగిరి. నేగొని పోవుచున్నండ వీరునన్ను పట్టి బంధించిరి.

రామ—(క్రోధముతో) ‘‘హా! మాయలాడీ! ఎట్టిపనికిపాల్ప డితివే. అయ్యో! యింక దీనిని గట్టుకొని బ్రతుకుటెట్లు’’అని లోలోన గుందుచు పైకిమాత్రము క్రోధమనుభవించి యొలుగసి వానివలె ‘‘ఎందుల కిట్టిపని జేయుచుంటిరని యడుగక పోతివా?’’

దొంగ—నాకెందులకది. నీపనిని నీవు నిర్వహింపుమని శెల విచ్చిరి.

రామ—‘‘హా! పాపి చిరాయువు అను లోకోక్తి యదార్థ మయ్యెగదా. అయ్యో! యిప్పుడేమనుకొన్న నేమి? ఎంతటి క్రౌర్య మునకు బాల్పడనుంటివే’’. అని రామునివంక జూచి ‘‘రామా! దీనిని పైటబెట్టిన మనకు యిదివరకున్న యపకీర్తి చాలక మరింత గూర్చిన వారమగుదుము. తక్షణ మాతని విడిచివేయుము’’ అని యాజ్ఞాపించి (దొంగ వంకజూచి) ‘‘నీవీ పదిరూపాయలు గైకొమ్ము. ఈవిషయ మెచ్చటగాని బైటబెట్టకుమని’’ వాని కొక పదిరూపాయల నోటొకటి యిచ్చెను. వాడు సంతసమున ‘‘చిత్త’’ మని తేనెయం దుబడి బ్రదికి బైట కరుదెంచినరీతి వానికెక్కడలేని సంతసము పెను గొన బంధిఖానానుండి గృహోన్ముఖుడై వెడలునట్లు వెడలిపో

యెను. తదుపరి రామశర్మ డాక్టరు వంక జూచి "చూచితిరా! మీ మేనకోడ లెంతటిదో" అనెను.

డాక్ట — "స్త్రీలకు మనమొగ్గి యుండవలసినదే. మన మెంత చెప్పినను వారు వినరు. నే నెన్నిమార్గులు బోధించిన నేమి? పైత్య రోగికి పక్వాన్నములు రుచించనట్టు దానికి వినాశకాలము సామీప్యమున నున్నది. లేకున్న యిట్టి బుద్ధులు పొడముట చోద్యముగదా"

రామ — "ఇతరుల ననవలసిన పని లేదు. నా ఖర్మము నన్నిట్లు గాల్చుచున్నయది. నాకేలకో జీవితమే దుర్భరమనిపించినది. నాకీయూరున కాపురమే విసుగు జనించినది. నా ప్రథమ భార్య యంత్యక్రియ లొనర్చిన తదుపరి యిక నిశ్చయించితి బర్మాదేశమున కేగదలంచుకొంటిని. నా నివాసమచ్చటనే యేర్పరుపదలంచితి. ఇచ్చట నున్న యింకనూ లేని యపకీర్తికి బాల్పడి యెల్లప్పుడు దుర్వ్యాకులా పీడితుండనై యుండుటకు నిచ్చగించను. మీరుగూడ నిచ్చటనుండకుడు. నాకు మదరాసున యనేక గృహములున్నవి. అందులో నేదైన నొకదాని యచ్చటనే మీ వృత్తిని కొనసాగించుకొనుడు. బిడ్డ విషయమై యెక్కువ శ్రద్ధ బూనుడు. కావలసిన సౌకర్యములన్నిటిని తప్పక గలుగజేయుడు. డబ్బునకు లోపము లేక కావలసినంత పంపుచుందెద. అప్పుడప్పుడు త్తరములు వ్రాయుచుండుడు". అని దీర్ఘముగా నాలోచించి తన ప్రథమ భార్య యిచ్ఛనెరవేర్ప కుతూహలుండై తన యుద్దేశమును డాక్టరునకుఁ దెలియజేసెను.

డాక్ట — "మీ మాటలు నిక్కములు. నాకుగూడ వైద్యవృత్తి బొత్తిగా నిలచిపోయినది. మీరు వచించినరీతి మదరాసున కేగ దలంచితి. నాకు వృత్తి చక్కగా జరుగనన్ని నాళ్ళు బాడుగ దండుగ యిచ్చుకొనలేనుగదా. గాన దయయుంచి మీ గృహము నుచితముగా నియ్యవలయును". అని యతివినయముగా నడిగెను.

రాము—"సరిసరి. మీరంతగా వేడనలయునా. మీ కన్న మాకాప్తు లెవ్వరు? అవశ్యము గైకొండు"నెను. అంతట వైకుంఠశర్మ పనియున్నదని శెలవుపుచ్చుకొని వెడలి పోయెను.

నేడు పదియవ దినము కర్మలన్నియు ముగిసినవి. లీలావతీదేవి పేరిట భూదాన గోదానములు భూసురుల కొసంగబడినవి. బంధువర్గముచే రామశర్మగారి భవనము నిండియుండెను. బ్రాహ్మణ సంతర్పణములు మొదలగునవి యగునప్పటికి చాల పొద్దాయె. రామశర్మ యప్పుడే భుజించి బంధువులతోడను, యిష్టులతోడను సరససల్లాపము లాడుచు, చనిపోయిన లీలావతిని గూర్చి వాకొకింతె ప్రశంసించుచుండ, లోనుండి యేతెంచు కన్నీరును చేలాంచనము వలన దుడిచికొనుచు యట్టిది యిట్టిది యని తానుగూడ వారికి సాయపడుచు సంభాషించు చున్నుచుండెను. అప్పుడు ప్రసంగవశమున రామశర్మ తనమువెనుక సుబ్బశర్మ వంకకుదిరిగి (గద్గదస్వరముతో) "బావా! మనసంబంధము నేటితో దీరిపదని యెంచకుము. పూర్వము రీతి యికముందుగూడ మన నెయ్యము నిలచుగాక. ఒకవేళ మా సంబంధము మీరు తెగింపుకొన జూచినను మనల నిద్దఱను నొక్కటిగా కట్టగల తాడు; ఆపశికూనయున్నది. తల్లిలేనిబిడ్డ. దాని భావి భాగ్యోదయములు మీమీద యాధారపడియున్నవి. వేఱుగ భాషించక నాకసిగందను దీసికొని మీరే పోషింప సమర్థులు. అది మదీయ ప్రాణ ప్రియాభీష్టము గాన మీరన్యథా భావించరని నమ్ముచున్నాడ"నని కన్నులనుండి భాష్పములు రాలుచుండ దుఃఖాతిరేకమున తన యభీష్టమును చెప్పవైచెను. సుబ్బశర్మ చింతిల్లకుండని యూరడించి శిశువును గొంపోయెదనని జెప్పెను.

ఆవిషయము జరిగిన మరుదినముననే రామశర్మ బంధువర్గముతోగూడ తనప్రయాణమును సాగించెను. పురజనులా దంపతుల

గొంత దూరమువరకు సాగనంపి వచ్చిరి.

ధర్మపురము నాఁడు చంద్రుఁడు లేని వెన్నెల రాత్రియట్లు, రాజు లేని యూరట్లు, వజ్రములు లేని యాభరణములట్లు కాంతి దొరికి కళాహీనమైయుండెను. ఆహా! ఆయొక్క రామశర్మ యను విగ్రహము లేనిది యెన్నిటికి కాంతిహీనమయ్యె.

జనులా దంపతుల సద్వర్తనపు రోజులను గూర్చియు, లీలావతి సుగుణ పుంజమును గూర్చియు, ఆతనికిఁ దగిలిన మనోవ్యథను గూర్చియు ప్రసంగించి, యాతని ప్రయాణము ప్రథమ భార్యా వియోగమే కారణమని యనుకొనిరి. ఆతని యాశ్రయించి జీవించు సమస్త ప్రాణులేగాక, యాతని వెదకిన వారందఱు లీలావతికై దుఃఖించుటయే గాక రామశర్మ వియోగ భారమునకు బిట్టువగచిరి. వారు వెళ్ళి కొద్దిదినములే యైనను యెన్నోవత్సరములట్లు భావింప నారంభించిరి. జనులు వారిని తలువని నిమిషమే లేదు.

పాఠకులారా! అంతటి విశ్వాసాభిమానమును జూరగొన్న రామశర్మ వియోగభారమునకు కారణ మరసితిరా? ఆతని యందంతగా నుండిన దే వస్తువంతటి స్థితికాతని దెచ్చెను? ధనవంతుండనియా? కాదుకాదు. ఆతని యందుండిన సుస్వభావము. విమల గుణపుంజమే యాతనంతటి వానినిగ జేసెను. ధనవంతుని పేదవానిని నొక్కరీతిగనే భావించెను. సేవకుని, యాత్మీయ బంధువు నొక్క విధముగనే యాదరించెను. గాననే జనులకతనియెడ గాఢమగు యభిమానముండుట. ప్రజావిశ్వాసము చూరగొన్న వాఁడేగదా మానవుఁడు.

# రెండవ భాగము.

## భానుమతి.

### పదునొకండవ ప్రకరణము.

గోవిందప్ప నాయనిపేఠ

గోవిందప్పనాయనిపేఠ చైనాబజారునకు యుత్తరభాగముననున్నది. కుటుంబికుల నివాసస్థలములచేత జనసంచారము చాల తక్కువ. కాని యందందు కాఫీక్లబ్బులుండుటవలన కొంతవఱకు జనసంచారమును కనబడుచున్నది. ముఖ్యముగా నిది వైశ్యులకు నెలవగుటచే నాపేఠనిగల గృహములన్ని వారికి సంబంధించినవే. మఱియు వారు తమ సౌకర్యార్థమై వేశికలకై యొకపెద్ద సౌధమునందు నిర్మించి యున్నారు. అది యతిసుందరమై చిత్రవిచిత్రంబులగు రంగులచే యలంకరింపబడి చూపఱులకు మిరుమిట్లు గొల్పుచుండెను. అందుకే కాముకులు దాని సౌందర్యమవలోకించి సార్థకనామమిడిన బాగుండునని దానికి "సౌందర్య మహల్" యని నామమిడియుండిరి. ఇందెల్లప్పుడు వేశికల కాలవాలమగు నాటకబృందము లధికముగా వచ్చి నివసించుచుందురు. మఱియు నేవేని మత సాంఘిక, రాజకీయ సభలను సమావేశ పఱుపవలెనన్న యిచ్చోటు దప్పమఱి వారికి

వేఱు స్థలమే లేదు. అందులకే యది మద్రాసునగల సౌధరాజము లలో నొక్కటియై యలరారుచుండెను.

ఆసౌధరాజమున కెదురు శ్రేణిలో నొక దివ్యభవన మొండు గలదు. ఆయింటియందుండు వారెవ్వరోగాని యాయింటికి దగిలిం చఁబడిన పలకను జదివిన యదియొక నేటివు డాక్టరు గారిదని చెప్పక చెప్పుచుండెను. ఇంటివారయిదుగురికన్న నెక్కువ లేరు. అందుచే నాభవనము వారికి చాలఁ బెద్దదనియే చెప్పవచ్చును. ఇంటియజమాను డెంతో వయసు మీరినవాఁడు. ఇఁక మిగిలిన వారెవ్వరో తెలియదు. మిగిలిన వారిలో పెద్దవాఁడు మాత్రము యజమానుని బోలియుండు టచే నాతని కొమారుఁడై యుండవచ్చునని యూహింపవచ్చును. మిగిలిన ముగ్గురిలో నిద్దఱు యౌవనవంతులు. వారిలో పెద్దామె యంత యందవతిగాదు. మఱియు నామెముఖమునందైన ముత్తైదువ చిహ్నములు గానరామిచే నామె వితంతువని మాత్రము భావింపఁదగును. మఱి యిద్దఱున్ననో సీతారాములవలె రూపసులై వారివలె గుణములందుఁగూడ దీసిపోక సుందరాకారులై యుండిరి గాని వారన్న చెల్లెండ్రని వారి సంభాషణములవలనఁ దెలియవచ్చెడిని. పదునాఱు వత్సరములపైఁబడియుండిరి. నవయౌవనా తటాక స్నానమొనర్చి వచ్చిన వారివలెఁ జూపట్టును.

అలనాఁడు రామ లక్ష్మణ భరతశత్రుఘ్నులు నలువురొక్క దశరథ మహారాజునందనులై యుండియు నదియేమి చిత్రమోగాని రామలక్ష్మణులకును, భరతశత్రుఘ్నులకును నత్యంత మైత్రి. వారెటుల నొకరిని విడిచి నొకరుండజాలరో పైఁజెప్పఁబడిన కుటుంబమునందు నలుగురును వారిసంభాషణాధారములను బట్టి యన్నదమ్ము లక్కచెల్లెండ్రని స్పష్టమగుచుండెను; వారిలో చామనచాయ గల పెద్దవాఁడును నాతని సోదరియగు యావితంతువును నత్యంత

మిత్రులు. తక్కిన యిద్దఱికిని యెడతెగని స్నేహము. ఒకరిని
విడచి యొకరుండజాలరు. తినిన నొక్కే కంచమున. పరుండిన
నొక్కే మంచమున. జదివిన నొక్కేమారు జదువవలయు. చెల్లె
లగుపడకుండిన యన్నయుండ లేదు. అన్న యగుపడకుండిన చెల్లెలు
విచారముతో వెదుక నారంభించును. వారు భానునివలె తేజో
మూర్తులగుటచే తలిదండ్రులు భానుమతీ భానుమూర్తులని వారికి
నామములిడియుండిరి. నిక్కముగా యవి వారికి సార్థక నామ
ధేయములే.

ఏమహాతల్లి కడుపున నుదయించినోగాని యీభానుమతీ భాను
మూర్తులందు దుర్గుణములు మచ్చునకైనను లేవు. భాను
దేశీత నిష్కళంకుడా వారుగూడ నట్టివారే. ఎట్టి యమాయకులు.
లౌకికవ్యవహార జ్ఞానసంపత్తి యించుకైన లేదు. విచారమును
సూచించు విషయములు జ్ఞప్తికివచ్చు నెడల యివితమ్ములనేమి చేయు
నని యెంచక భీతిల యింకెటుల రాయని తహతహపడెదరు. ఎట్టి
బేలలు. కోమలులు. కష్టపడి యెఱుగరు. వారికితరుల
దూషించుట యటన్నబనికి రాదు. సోమరులుగారు. ఎప్పుడు
జూచినను నేదోయొకపుస్తకమును గైకొని జదువువారేగాని వృథా
కాలము వెళ్ళబుచ్చరు. భానుమూర్తి, B. A., జదువు చుండెను.
భానుమతి పదియవ తరగతి కాయేడే బోయియుండెను. తండ్రి
వారిని మాతృమతి గారాబమున బెంచుచుండెను.

పాఠక మహాశయా! యింతవఱకు జదివిన కుటుంబ చారిత్రి
మెవరిదనుకొంటిరి? సుప్రసిద్ధ డాక్టరు వైకుంఠశర్మ చారిత్రమే
సుమా.

నాడు రామశర్మ ధర్మపురము విడిచ రోజుననే తానుగూడ

స్వగ్రామము వీడి మద్రాసు జేరుగొనెను. రామశర్మ బర్మాకేగెను. అది జరిగి యిప్పటికి పదునైదు వత్సరముల మీరియుండెను. వారి కుటుంబమిపుడు పూర్తిగా మారియుండెను. అతని పెద్ద కొమారుఁడు దామోదరుఁడు నేటికిని నిర్భాగ్య దామోదరుఁడే. నిరక్షర కుక్షి. ఇరువది యెనిమిదికి మించిన వయస్సు. ఇద్దఱి బిడ్డల తండ్రి వలె జూపట్టుచుండెను. చిల్లి గవ్వయైన సంపాదింప యసమర్థుండయ్యును పైకిమాత్రము గొప్పవారివలె నీటుగా దుస్తుల ధరించి వీధుల వెంబడి తిరుగుచుండును. అతఁడు జూడని సందా చెన్నపట్టణమున గాన్పింపదు. తుంటరి సంఘసమాజముల సభ్యుఁడు. వేశ్యాలోలుఁడు.

కొమార్తె కిప్పుడిరువది యైదేండ్ల వయస్సు. యౌవ్వన ప్రాయురాలు. తండ్రి తిరిగి పునర్వివాహము గావించియుండినచో పలువురు బిడ్డలు గలిగియుండెడిది. ఆమె నవనాగరికతా ప్రపంచ సభ్యురాలుకా గోరుచుండెను గాని తండ్రియెదుట తనయాటలు సాగి వచ్చినవిగావు. వితంతువయ్యును ముత్తైదువులకువలె బొట్టొక్కటి లేదుగాని మిగిలిన వన్నియునున్నవి. దానికిదోడు పట్టణ వాసినియై యుండుటచే యిఁక వేరుగ జెప్పనక్కఱలేదు. తండ్రియే లేకున్న యీపాటికి పలాయన మంత్రము పఠించియుండెడిదే గాని యాతని కోపపు చూపులకును, అతి కఠినములగు వాగ్ధాటికిని వెఱచి తనచేతలొకింత కట్టిపెట్టియుండెను. అయిననేమి? స్త్రీల మనముల ద్రిప్ప సమర్థులెవ్వరు? మహామునులకే యలవి కానప్పుడు యిట్టివారికి ద్రిప్ప శక్యమా?

సాయంకాలము కాగూడదు. జడయల్లికొని, సబ్బునొకింత ముఖమునకు రుద్దికొని ముంగురుల దిద్ది, శుభ్రమైన మల్లు రవికె దొడిగి మాఱు చీరగట్టి పలుచని పైటవైచుకొని వీధిగుమ్మమున

నిలువఁబడి వచ్చిపొయ్యెడి వారివంక గన్నెత్తి చూచుచు నిలుచుండిన యది సానియో, సంసారియో, యిల్లాలో, యుంపుడుగత్తెయో దెలియదు. ఆహా! పాశ్చాత్య వ్యామోహార్ణవమునంబడి కొట్టుకొని పోవుచుండిరిగదా. అవును. వారి ననఁబనిలేదు. మగవాని తెలివితేటలు మన్ననయైనప్పుడు యాఁడుదాని యోగ్యత కభ్యంతరమేముండును? గురువుగారు కల్లుద్రావుచుండ శిష్యుఁడు పాలు ద్రావనేర్చునా? అత్తకు కోడలొక కొరత. కోడలుకత్తగారొక కొండముచ్చు. ఆసీత సావిత్రులు; ఆయరుంధతీ దమయంతులేరీ? భర్త యింటికి వచ్చుసరికి భార్యలు రక్కసులవలె గాన్పింతురు. ఇఁక మగవారు వారియెదుట మాటలాడఁగలరా?

వైద్యశేఖరుఁడు ధర్మపురము కన్న నిచటనే బడి యాధిక్యత వహించెను. ఆవీధిని గల వారందరాతని యొద్దకే యౌషధములకై పరువెత్తివచ్చుచుందురు. స్త్రీల పాలిట కల్ప తరువువంటివాఁడు. ఎట్టిరోగము గాని వైద్యాలయమునకు బోనక్కఱలేక యే రోగులింటికి తానే జనుచు యౌషధ సేవ జేయువాఁడు. ఆస్పత్రులలోవలె ధనమాతనికివ్వనక్కఱలేదు. ఎంత యిచ్చిన సంతటితో తృప్తిజెందును. పదిమందిని తనవలెనె బడికిఁ బోబడియుండునట్లు జేయవలయుననియే యాతని యుద్దేశ్యము. వచ్చిన కొన్నినాళ్ళకే యాతనిపేరు దిగంతము మారుమ్రోగెను. అది విని దూరమువనుండువారు గూడ వచ్చి తఱచుగ నాతని తమతమ గృహములకు దోడ్కొని పోవుచుండిరి. రోగులధికమగు కొలఁది యాతనికి ధనముపై యాశ మెండయ్యెను. ధనములభించిన కొలది నైచ్యమునకు పాల్పడుచుండెను.

అతఁడెందులకు ధనము సంపాదించుచుండెనో దెలియదు. బిడ్డలకందమా? కొమారుని సేవకుని కన్న యతినీచునిగా జూచును. కొమార్తెయన్ననో వితంతువు. ఇఁక మిగిలిన యిద్దఱి కందమా

వారికి మాస మాసమునకును రెండువందల రూప్యములు మణి యార్డరు (Money order) ద్వారా వచ్చుచుండెను. ఎట్లు వ్యయ మొనర్చిననూ తరుగదు. ఇఁక హెచ్చుగా నైచ్యమునకు బాల్పడి సంపాదింప నేల? తానుతినక యితరులకు గాక భూమీశులవశము జేయుటకా! ధనమన్న యంతతీపిగదా! అది తిన్న జెఱచునని యెఱుఁగదు కాబోలు. కష్టములోనగూడి నప్పుడుగదా తెలియును.

మానవులు ధనమార్జించు నిమిత్తమై చేయరాని పనులును, ఆచరింపరాని దురాచారములను వంశాచారములుగ నెంచుకొని వ్యవహారముల నడుపుకొనుచుండిరిగదా. తప్పుడు పత్రముల సృష్టించియు, కూటసాక్ష్యముల జెప్పియు చేయరానిపనుల జేసి సంపాదించిన ధనమును తుదకు చోరుల పాలో యగ్నిపాలో కావించు చున్నారు. వారి నోటమన్నుగొట్టి తానార్జింప నేల? తనసొమ్ము పరుల పాలొనర్ప నేల? తల్లిగర్భమున నెలువడినప్పుడు ధనమును గొనివచ్చెనా? వెళ్లునాడు గొనిపోవునా? ఏదియును లేదుగదా. ధన మార్జింపకున్న పొట్టగడవదని యా? పుట్టించిన సర్వేశ్వరుఁడు మనుజునికే దేని నొక వృత్తి గల్పించియుండును. దానియందు లోపమురానీ యక కొనసాగించుకొనుచుండిన యెడల యెన్నటికిని కూటికి లేకుండ చేయజాలఁడు. సద్ధర్మపదమున ధనార్జనజేయుచు భగవంతు నారా ధించుచుండిన మోక్షాధికారుండగును. తామరాకుపై నీటివలె మట్టి లోని కుమ్మర పురుగువలె భూమినవతరించి సంసార సాగరమునీద వలెను.

అట్లు వైకుంఠశర్మ మదరాసున తనవృత్తిని సాగించుకొనుచు దురాశాపీడితుఁడై దుర్మార్గావలంబుఁడై మంచి మర్యాదస్థునివలె మొట్టమొదట గనుపఱచి తనపూర్వపు వృత్తిని వదలక చరించుచుం డెను. ఆతని మాటలు తీరుగాంచిన సద్వర్తనుఁడని యనుకొనవల సినదే. పయోముఖ విషకుంభము.

ఆహా! ఇక్కాలమున దుర్మార్గులయ్యును తమ యభినయాదులచేత తమగుట్టు మరుగుపఱచి వారు సత్యవంతులవలె యెన్నబడు చుండిరి గదా! దైవమా! వారికెంత కాలమట్లుంతువు? అదియును గొన్నినాళ్ళేగదా! తదుపరి తమగుట్టు బయలువడ యవమానమునకు లోనై పరితపింపవలయును గదా!

యమాయకులగు పల్లె నివాసులు తమ సహజ వృత్తుల వీడక తమ ధర్మమును నెఱపుచుండ వారిని గడపనైన యెక్కనీయము గదా. వారితో సమాలోచించుటగాని, సంభాషించినగాని నీచ కృత్యమనియు, గౌరవహీనమనియు నెంచుచుంటిమిగదా. కొండింగ్లీషు ముక్కలు నేర్చినంత మాత్రమున గౌరవాధిక్యతలు హెచ్చుచున్నవా? అదే బుద్ధికలిగిన యాంధ్ర పాఠకుడు నీచుడనతగునా? మొన్నటిదే విద్యగాని యేండ్ల తఱబడి వచ్చుచున్నదిగాదా? ఇంగ్లీషు నేర్చిన కుఱ్ఱవాడే విద్వాంసుడు. సదమలాచార వంతుడును, సత్కావ్య పాఠకుడగు యాతని తండ్రి యాతనికి నీచుడువలె గన్పట్టుచుండె. వీరిద్దఱిలో నీచులెవ్వరో మీరే నిర్ణయించుకొనుడు. మనమందరము పాశ్చాత్య వ్యామోహమున బడి దిక్కుతెలియక చరించుచున్నాము.

దేశీయులారా! పూర్వులవలె చరింప నేర్చుకొనుడు. మంచి ప్రవర్తనముల నేర్చుకొనుడు. మతగ్రంథములను, సాంఘిక పుస్తకములను పఠింపుడు. మాయా వేషముల వీడుడు. ఇట్లు చేయకున్న గతి పయిదినములలో హిందూదేశము తిండికిలేక కట్టుగుడ్డ లేక మృగప్రాయులై సంచరింప వలసిన గతిగలుగకమానదు. కాన మనమిప్పుడే కన్నులు దెఱచి దేశమును గుర్తించి మనబిడ్డ పాపలను తల్లిదండ్రులను జూచియైన తెలివి దెచ్చుకొనుట మంచిది. మన వ్యవసాయమును చేతి వృత్తులను దెచ్చుకొందము. గ్రామపు నిర్మాణమునకు గడంగుదము. విశ్వకల్యాణమున పాల్గొందము.

# భానుమతి.

## పంచత్రింశవ ప్రకరణము.

### మైలాపూరు.

మైలాపూరు చెన్నపట్టణమునకు దక్షిణ దిగ్భాగమున వెలయుచున్నది. ప్రభుత్వోద్యోగులకును, న్యాయవాదులకును, నివాసస్థానము. మనకథాకాలము నాటికింకనూ మైలాపూరునకు ట్రాము (Tram) బండి వేసి యుండలేదు.

న్యాయవాద ప్రముఖులకు నెలవగుటచే వారికి గావలసిన లా రిపోర్టులు పత్రికలు, లా పుస్తకములు మొదలగునవి యచట విశేషము. సూర్యనారాయణ శ్రేణిలో మూడిండ్లు నొకదాని కొకటానుకొని సమున్నత నాలంకార శోభితములై యలరారుచున్నవి. వాటిని జూచిన వ్రాతకొన్నవారో యవి యన్నియు నొకరికే సంబంధించియుండవలయును. కేవల యన్నియు నొకతీరున సంఘటనకు కారణ మేమి? బహుశః ముగ్గురన్నదమ్ములు వేరైనప్పుడు విభజించుకొన్నట్లు దోచెడిని. ఒకే యావరణమున మూడిండ్లును దీరియున్నవి. మూడును మూడంతస్థుల మహామేడలే.

అందు మూడింటి మధ్యనుండు గృహము సుబ్బశర్మగారిది ఈసుబ్బశర్మగారే జమీందారు రామశర్మ బావమఱది. ఈయన

కొక్కతియే చెల్లెలుండెను. ఆమెయే మన లీలావతి. సుబ్బశర్మకు బిడ్డలు లేరు. వారొకింత కలిగియుండిరి. వడ్డి వ్యాపారమునందు నష్టము సంభవించుటచే కొంతవఱకు డీలుపడిరి. కాని పోయినది పోను యింకనూ రెండు లక్షలకు పైగానుండెను. పైకము నంతటిని బ్యాంకులందునిచి యందుపైన వచ్చు వడ్డిని మాసమాసమునకు గైకొనుచు సుఖముగా కాలము వెళ్ళబుచ్చుచుండెడివారు. ఎన్ని యుండిననేమి? ఎంతటి భాగ్యముండిననేమి? ముద్దుల మూటలు కట్టు నొక్క బుడుతయుండిన గదా యది గృహము. లేకున్న యది శూన్య గృహమేగదా. పాపము! వారేమి చేయగలరు? అనేక తీర్థయాత్రలు గావించిరి. చెప్పిన వ్రతము లాచరించిరి. చేయవలసిన యుద్యాపనల జేసిరి. ఎన్ని చేసిననేమి? అన్నియు నిష్ఫలములయ్యెను తుదకా యాశనే వదలుకొనిరి. ఇతరుల బిడ్డల నెత్తుకొనుచు వారికి గావలసినవి గొనిపెట్టుచు సంతోషించుచుండిరి. అతని సతీతిలకమెట్టింత పూజ్యురాలు. సదాచార సంపన్నురాలు. ముఖమునలంకారముగ పెద్దకుంకుమ బొట్టుపెట్టి, దేహమున తెల్లని వస్త్రముల దాల్చి పతిసేవా పరాయణురాలై యింటనే మౌనముగ నుండుచు సర్వాగ్ర పవిత్రవర్తనరాలై బాగుండెను.

ఆ దంపతులు నోచిన నోముల పంటయో యనునట్లు వారు జేసిన తీర్థయాత్రల ఫలమనునట్లు వారికి రామశర్మ తనూజ ప్రియద భాగ్యవశమున లభించుటచే లీలావతి నంతరాంతరము తమ యింటి దెచ్చుకొని యేకొఱంతయును లేక యల్లారు ముద్దుగా పెంచి పెద్ద దానిగ జేసిరి. విద్యాబుద్ధులు గఱపిరి.

ఆమె కిప్పుడు పదునాఱవయేడు. నిండు జవ్వనప్రాయము. బంగారపు చాయ. తేనె వర్ణముగల వెంట్రుకలు పెద్ద సిగవలు, బ్రహ్మజెముడు పండునందు నూగువలె శరీరమున చిన్న నూగు

కలు, మెడకు ముత్యాలహారములు, కాళ్ళకు కడియములు, నడుమునకు మువ్వల వడ్డాణము, కన్నులకు కాటుక, నొసట యెఱ్ఱకుంకుమను ధరించి జగన్మోహినివలె నుండెను. ప్రమద ప్రమదయే సుమా! సుగుణములదొంతి. కరుణారస పరిపూరిత హృదయ. పరిపూర్ణ ప్రేమజలనిధి.

రూపమునందే గాక జదువునందును యందరికన్న మిన్నయై మెలఁగుచుండెను. ఇపుడామె హైస్కూలు (High School) నందు జదువుచుండెను. ఇంతటి వయస్సు నందియుండినను, వివేకవతిగా నుండినను యదియేలకో సుబ్బశర్మ దంపతులామెకు నిజజనక నామమును జెప్పక మఱుఁగుపఱచిరి. బహుశా తమపై నుండెడి ప్రేమాభిమానములు పోవునని కాబోలు.

పాపము ప్రమద చిన్ననాటనుండి తన యత్తమామల పోషణమున నుండుటచే నిజజనకుండొకఁడుండెనని యెఱుఁగ జాలకుండెను. ఆమె వారినే యప్ప యమ్మా! యని సంబోధించుచుండెను. అదిగని యా వృద్ధదంపతులు సంతత సంతోష సాగరమునందీదులాడుచుండిరి.

రెండవ గృహమునందు నివసించు నాతఁడొక గొప్పన్యాయవాది ప్రముఖుఁడు. బార్ కౌన్సిల్ (Bar Council) అధ్యక్షుఁడు. అది యేమి చిత్రమోగాని యాతఁడు పట్టినదెల్ల బంగారమగు చుండెను. పట్టిన కేసెల్ల జయించుటయే. ఎందరికో మరణ శిక్షల దప్పించెను. దినమొకటికి వందరూప్యములకు పైగావచ్చుచుండెను. ఎందరో చిన్నప్లీడరులీతని వద్ద పనినేర్చుకొనుచుండిరి. నాడీతని కన్న నెక్కుడు సంపాదనము గలిగినవారే లేరు. జడ్జీలందరికి యీతని పై చాలా యభిమానము. ఇతఁడు సభ్యుఁడుగా లేని సంఘముగాని సభగాని యుండదు. ఇతనికిని సుబ్బశర్మకును చాల మైత్రి.

సాయంత్రమగు సరికి యిద్దఱు నొకకోచి (Coach) బండి నెక్కి షికారికి వెడలెదరు. నాటకమునకుగాని, బయస్కోపునకుగాని రాజకీయసభకుగాని పోయిన యిద్దఱు పోవుదురు. ఒకరిని విడచి యింకొక్కరుపోరు. సుబ్బశర్మపై యితనికి భక్తిమెండు. తొట్ట దొలుత తాను హైకోర్టు (High Court) నందు ప్రాక్టీసు మొదలెట్టి నప్పుడు చాల సహాయమొనర్చినది సుబ్బశర్మయే. అందులకే యాతని జూపిన భక్తి.

అతని కొక్క కొమారుడుండెను. ఇంటర్ మిడియట్ (Inter Midiate) జదువుచుండెను. ఇరువది వత్సరముల వయస్సు ఇదివరకే బి. ఎ., తరగతియందు ప్రవేశించి యుండెడివాడేగాని ధన వంతుని బిడ్డడగుటచే యాటపాటల మరిగి పాఠముల యందు శ్రద్ధ వహించినందువలన రెండుమార్లు దప్పిపోయెను.

వీరశర్మ యంతపొడుగరికాడు. తేనెవర్ణము, తలపైన బెంగాలు క్రాపింగు, పొట్టిచేతులు గలిగి చూపరులకు జవాలు చుంచ గాడుగా గాన్పించును. ఈతని ముఖమునకొక విధమైన యాకర్షణశక్తి యొకటున్నది. స్త్రీలెవరేని జూచుట తటస్థించినేని మోహపాశ ముల నగాల్కొన వలసినదే. ఎందరో తమ కన్యకల నొసంగెద మని చెప్పియుంపిరి గాని యాతడు నిరాకరించెను. తలిదండ్రులు గూడ మంచి సంబంధముల నూహ్న నెంచిరి గాని యాతడొల్లడయ్యెను. ఇంటర్ పరీక్ష నెగ్గినగాని వివాహమాడనని శపథమూనెను. తలి దండ్రులు వాని మూర్ఖతకు విసిగి వాడెవ్వరిని జేసుకుందునన్న యా వనితనే నూహ్న నెంచిరి. కట్నమొసంగియైనను యాసంబంధమును దగిలించుకొనుట కనేకులు దలంచిరిగాని యాతడు నిరాకరించెను. ఎప్పటికైనను సరే కట్నములిచ్చి వివాహము జేసుకొనననని జెప్పెను. మరియు యాకన్యా వరశుల్క పిశాచములవ్వాల బారదోలుటకు దస

జీవితమును ధారబోయ నెంచెను.

వీరశర్మా! నీవంటి సుపుత్రు లెపుడు మన భారతావని నిండ గలరోగదా! కన్యావర శుల్క పిశాచముల బారదోలు మంత్రగాండ్రు నీవంటివారే గావలయును. లేకున్న వాటియెదుట మరియెవ్వరి యాటలుగాని సాగిరావు. వాటి మోసములకు మునిసి మునుగు చున్నారు. అంటుమామిడిపండు వలె యూరిగి చచ్చుచున్నారు అని దేహమునకు నారోగ్యము గలుగజేయునని మోదించెను.

రతనాల హైందవకూ! నీబిడ్డ లేకేతిగ నుండిరి. కట్నము కొరకై స్త్రీ వాహికము లొనర్చుకొనుచుండిరి. పాపము! బీదలగతి యేమిగావలయును? ఒకనికి నలుగురు కొమార్తెలున్న వాడికి భూమిని కీచువ నక్కఱలేదు తనకున్న యాస్తిని కట్నముల క్రింద నిచ్చి తుదకు చిప్పచేతఁగైకొని భిక్షాటనమునకు బయలుదేరవలసినదే. ఏమో యొకింత గలిగినవాడు కట్నమొసంగగలడు గాని బీదలెట్లు జేయవలయు? దరిద్రమునకు దోడు వారికే సంతానము నధికముగా యిచ్చియుండె. వారికి వివాహములు గావలెనన్న యింక కుంటి కో గుడ్డికో గట్టిపెట్టవలయును గాని యింకెవ్వరు బెండ్లాడెదరు? ఇంక వాని యానంద మారీతిని నుండవలసినదేనా? లేక యీమ హామ్మారిని బోగొట్ట యంత్రములు లేవా? హా! కట్నముల బాధ పడలేక యెన్ని కుటుంబములు పాడగుచున్నవి. ఇంటి వరుమాన ములు తక్కువ. ఖర్చు లెక్కువ. మొగపిల్లల గన్న తలిదండ్రులు తమ బిడ్డలవలన ఫలములభింప గలదని యువ్విళ్ళూరుచున్నారు. ఆడుపిల్లలగన్న వారిస్థితిని దలపోసినగదా దెలియును. వారములు జేసి జదివిన వంటవాని కొమారునకు గూడ కట్నాలకై దడవులాడు చుండె. చందాలు గైకొని బి. ఏ., ప్యాసైన నీళ్ళుమోయువాని బిడ్డనికి గూడ కట్నాల గోర్కెయే. దానికి దగినట్లు ధనవంతులు

వాడెట్టివాడైనను సరియే. గుణముపూజ్యమైనను సరియే. బి.ఎ., యను రెండక్షరములు దగిలించుకొని యుండినజాలు. పదివేలు. యమ్. ఎ., జదివిన అయిదువేలు. ఈరీతిగ పిల్లలుగల వారింట బేరమాడుటకై వచ్చు యల్లుండ్ర వైఖరి గాంచగాదగును. ఆహా! దేశమెంతటికైనను వెనుదీయకున్నది. ప్రపంచమున గల దేశము లన్నిటికన్న మేటియని కీర్తింపబడు నీయార్యావర్తపు జనలిట్లి నిర్భాగ్యపు జీవన మొనర్చుటకై చెప్పిన కారణములచేతనే వెలలిచ్చి మన పిల్లలకు మగల గొని పెట్టుచున్నాము. ఓ దేశ బాంధవులారా! శుల్క పిశాచమును మన దేశమునుండి దరిమివేయుడు. భారత యువక శ్రేష్ఠులారా! కట్నముల కైకొని వివాహముల గావించు కొనమని చెప్పుడు. దేశ పుష్టిని కాప సమకట్టుడు. వీరశక్తి వలె శపథమూనుడు.

పాఠక మహాశయులారా? కథాక్రమమున నగుపెంతుము గాక. కట్టకడపటి యిల్లొక బ్రాహ్మణ వితంతువుది. ఆమెయొక జమీందారుని భార్య. యజమానుడు చనిపోవుటకు ముందు యామె కొక యాడశిశువునయించి యుండెను ఆశిశువిప్పుడు పెరిగి పెద్దదై యిరువదేండ్ల ప్రాయంపు జవ్వనియై బాగుసు గుల్కెడు నారియై స్వరమున శుకవాణియై చాకచక్యమున గంభీరమూర్తియై సముచితాలంకార శోభితయై యలరారుచుండెను. అందచందములకు దగిన విద్యను గలిగిన బాగుండునని యాపెతల్లి చదువవేసెను. స్కూల్ ఫైనల్ క్లాసునందు జదువుచుండెను. ప్రమదయును నీమెయు యక్కచెల్లెండ్రవలె మెలగుచుండిరి. ప్రక్కప్రక్కననే నివసించు వారగుటచే వారికి గల మైత్రి యెడతెగనిది. ఆమె బి.ఎ. వఱకు జదువ నెంచి యుండెను. అంతస్త్రీస్వరాట్టైన పిదప చిత్తమొచ్చినవాని జేపట్టి యజమానునిగ జేయ నెంచి యుండెను.

సుందరి సర్వాంగ సుందరి. మోహనాకార, క్రూరస్వభావ. చేయదలంచిన కార్యమెట్టిదైనను జేసియే తీరవలయును. లేనిచో నామెకు నిద్రపట్టదు. తనకార్యము కొనసాగువఱకు నెవరిని గాని లక్ష్యపెట్టదు. తుదకు దల్లినైన పాటింపదు. గర్వమున విఱ్ఱవీగుచుండెను. వివాహము జేసుకొనిననూకూడ తన నాథుడు తనయదుపు నాజ్ఞలకు లోనై యుండవలసిన వాడేగాని యాతని యనుచరురాలై యుండుట కెన్నటికిని నొప్పదు. స్త్రీలు ప్లీడర్ వృత్తి జేపట్ట వచ్చునని తీర్మానించి యుండుటచే నామెగూడ ప్లీడరుకా నెంచియుండెను. కాని దైవమెట్లు సమకూర్చునో తెలియదు.

వీరికిగల యాస్తినంతటిని సుందరి తండ్రి జీవించియుండినప్పుడు సుబ్బశర్మ యొక్కయు, వీరశర్మ తండ్రియొక్కయు యాధీనము నందునిచి పిల్లపెద్దదైన పిదప తగువరునకిచ్చి వివాహము గావించు నట్లు సంరక్షణకర్తలగా జేసియుండెను. కాని వారిమాటలు సుందరికి లక్ష్యమా?

# భానుమతి.

## ఏకోనవింశ ప్రకరణము

### స్నేహిమాత్రేయము.

రామశర్మకు కళావతియందు గలిగిన పుత్రుఁడు నారాయణుఁడు చెన్నపట్టణము నందుండెను. అదివఱకు తండ్రితోఁగూడ బర్మాలోనే కాపురముండె. ఇప్పటికతఁడు పెరిగి పెద్దవాఁడై యుండెను. ఆతని చేష్టలు దండ్రికి సరిపడేవిగావు. చదివించినయెడల కొంత జ్ఞానోదయ మగునని రామశర్మ దలంచెను గాని యాతని యాశలన్నియు వమ్మాయెను. నారాయణునికి జదువనిన గిట్టదు. ఆటపాటలనిన పరమ సంతోషము. స్నేహితులనఁ బొమ్మన్న మాటలాడఁబోవును. అందుచే రామశర్మ యచటనుంచుకొనదగదనియు, మఱియు దుర్మార్గమునుండి వదలింపించిననే గాని బుద్ధిమంతుఁడు గానేరఁడని మదరాసున కంపించెను.

నారాయణుఁడు తనకడ్డుపడువారెవ్వరు యుండరని సంతోషముతో రంగూన్ విడచి చెన్నపట్టణము వచ్చెను. చదువునందా శక్తి లేనివాఁడగుటచే బొత్తిగా పాఠశాలను వదలి పానశాలానుభవములననుభవించుకొన జొచ్చెను. చెన్నపట్టణమునగల యిండ్లపై వచ్చుబాడుగ నంతటిని దానే యుపయోగింప మొదలిడెను. దీనికి

నోషఁగ తండ్రి మాసమాసమునకు నూరురూప్యముల చొప్పున పంపుచుండెను. తమకడయారు (Adayar)ననున్న భవనమునుదాను తన యుపయోగార్థమై యుంచుకొనెను.

అతఁడు బ్రాహ్మణుఁడయ్యు సహవాసదోషమున మధుమాంసములను నవరతము యుపయోగించు చుండెను. రెండు చిన్ననాడు నేర్చిన యింగ్లీషుముక్కలు నోటయుచ్ఛరించుట యలవరచుకొని గొప్పపండితునివలె యందరితోడ నాంగ్లముననే మాటలాడఁదొడఁగెను. మద్యపానమునందాశక్తి మొదగు కొలఁది యాతని త్రాగుడు కంతమే లేకుండెను. ఘంట ఘంటకు త్రాగ మొదలిడెను. కావలసినప్పుడు వెంటనే యేదో యొక యింగ్లీషు హోటలునకు బోయి కావలసిన మధుమాంసముల దినుచుండెడివాఁడు. ఆతఁడప్పుడు త్రాగి త్రోవదెలియక దారిలో పడిపోవువాఁడు. ఆతనెఱిఁగినవారు చాలమంది యుండుటచే దయదలఁచి తమయింటికిఁగొనిపోయి తెలివి వచ్చినపిదప నింటికంపెడివారు. ఆతఁడొకనాడు సినిమా (Cinema)కు బోయి త్రాగియుండినందున మత్తుచే యచటనేబడి నిదురబోయెను. బయస్కోపు ముగిసినంతనే ప్రేక్షకులందరు వెడలిపోయిరి. సినిమాయధికారు లరుదెంచి తలుపుల బంధించి వైచిరి. ఇఁక వారు తలుపులను దీయుట మఱునాఁడాఱింటికే. అంతవరకు పాపము నారాయణుఁడచ్చటనే బడియుండెను. ఆకలిబాధకోర్వలేక మూర్ఛిల్లెను. మఱునాఁడు తలుపులు దీయునప్పటి కాతఁడు కొనయూపిరితో నుండెను. వారాతని గనిపెట్టి వానియింటవిడచి వచ్చిరి.

త్రాగుబోతుల గతులిట్టివేగద. మరియొకనాఁడు తెప్పద్రాని యింటికిపోవుటకే శక్తిహీనుఁడై యొకచెట్టుక్రింద బడిపోయెను. నోటినుండి నురుగులు వెడలెను. కడుపునకు దిన్నయాహారము వెడలగ్రక్క సాగెను. ఆపడినచోట యొకపెద్దబండ యొకటుండెను.

దానిపై బడుటచే యూతని తలకాబండ దగిలి పెద్దగాయమయ్యెను. దానిమాన్పుకొనుటకొక నెలదినములు బట్టెను. చూచితిరా! త్రాగుబోతులగతులు.

జమీందారుని తనయుఁడయ్యు నారాయణుఁడు గౌరవాగౌరవములను పాటింప కదుష్టశీలుఁడై దుర్మార్గానుచరుఁడై మెలఁగఁ జొచ్చెను. తండ్రివలె నారాయణశర్మయను నామమునుంచుకొనుట బాగుగలేదని నారాయణరావని ప్రకటించుకొనెను. తండ్రి కావిషయము దెలియజేసినపుడు డాతఁడు చాలనుండి పడియెనుగాని భార్యకు భయపడి యూరకుండవలసి వచ్చెను.

ఇఁక నీతనిస్నేహితు వర్గమున్నదో నీనికంటె వేయిమడుంగు లెక్కువ జదివినవారే గానితక్కువగ లేరు. నీలకంఠుఁడనువాఁడొకఁడును, వైకుంఠశర్మ తనయుఁడు దామోదరుఁ డొకఁడును వానికత్యంత హితులు.

నీలకంఠుని కిప్పుడు ముప్పదివత్సరములుపై బడియుండెను. వేశ్యాలంపటుఁడై వీఁడినాశ్రయించి యుండిన యాస్తినంత గొల్లబెట్టి వేఱు గత్యంతరములేక తుదకు వారినే జేరి బ్రతుకుచుండెను. తనజీవితాధారమునారాయణుని నిహస్తమునందుండుట చే యూతఁడు జెప్పిన చొప్పునగావించుచూ నొక్కనిముసమైన నాతని విడక చరించుచుండెను.

ముగ్గురు త్రిమూర్తులవలె నొకరిని విడచి యొకరుండక, ఒకరికొకరు దీసిపోక సమానముగ వ్యవహారములందు భాగస్వాములై చరించుచుండిరి. ఎచటికిబోయినను ముగ్గురును బోవలయును. క్రొత్తగా నాటకములుగాని సర్కస్ (Circus) యాటలుగాని మఱియితర వినోదమేదయినగాని రాఁగూడదు. వచ్చినదే తడవుగ బోవువారె

వరన్న మన త్రిమూర్తులేయుందురు. వారికొనక మేముందుము. పోయిరి
పోయుచట గూర్చుని యందరివలెనున్న తమకీర్తికి భంగకరమని యల్లరి
చేయుట కారంభింతురు. ఒకనాడు వారియాటలు ప్రబలుటచే
పోలీసువారు వారిని దరినిపట్టి కానాడు గొంపోయిరి. ఇంక నట్టి
పనికి పాల్పడమని క్షమాపణ యిచ్చివిడిపించుకొనిరి. దామోదరు
డప్పుడప్పుడు తనస్నేహితుల వెంటనిడుకొనిపోయి తనతండ్రికి దెలియ
కుండ తనయింట వారికి విందునిచ్చుచుండెడివాడు. ఏమిజేసినను
భానుమతీ భానుమూర్తులకు దెలియ కుండనే జేయుచుండెడివాడు.
వారెల్లప్పుడు మిద్దెపైభాగమున నుండుటచే క్రిందిభాగమున నేమి జరుగు
నది యెఱుఁగ జాలకుండిరి. సహవాసదోషముచేత దామోదరుని
చెల్లెలుగూడ వారిననుసరించెను. కొంచెముగూడ సిగ్గుజెందక వా
రితో సమముగా వచ్చికూర్చొని సరసములాడు చుండెడిది. ఇంటి
ముందరి భాగమునుండి లోనికే తెంచిన భానుమూర్తియొక వేళ శం
కించునని దొడ్డిత్రోవనుండి వచ్చుచుండిరి. తమకు గావలసిన రుచి
కరంబులగు భక్ష్యంబులను జేయించుకొని యానందముగ కుర్చీలపై
నాసీనులైనపిదప వారియెదుట నుండు మేజాలపై ఫలహారములతట్ట
లు దామోదరుని చెల్లెలు బెట్టుచుండెడిది. వారొక్కటొక్కటే
గిచుచు సరసములాడు కొనుచు యామెతో గూడ నొకింత సరసము
లాడసమకట్టి భక్ష్యములు బాగున్నవని మెచ్చుకొనుచు మాటలాడుట
కనువగునట్లు జేసుకొనిరి. ఆదుష్టచతుష్టయము నానాటికి వృద్ధి
నొందజొచ్చెను.

అట్లనుదినము వారు తమవిందులు కొనసాగించుకొనుచుండిరి.
నారాయణుఁడు జమీందారుని బిడ్డడగుటచే గావలసినవి దెచ్చి
యిచ్చుచు నిచ్చవచ్చినరీతి జేయసాగెను. దామోదరుని చెల్లెలు
నానాటికి వీరిపరిచయము హెచ్చుకొలఁది స్నేహము గాఢముగా

నాటుకొన యొకదినము నారాయణుఁడు రాకున్న పిలచిరమ్మని చెప్పి పంపులగూడ సంభవించెను. దామోదరుఁడు యిది యెఱిఁగియు కానుఁగని వానివలె నటించెను. అట్లుండకున్న తన తాగుడు ఖర్చువమ్మగునని యూతని భయము.

ఆనాటిరాత్రి చాలమబ్బుగా నుండెను. ఆకాశము నక్షత్రరహితమై యుండెను. జనసంచారమప్పుడే తగ్గినది. చలిగాలి మిక్కుటముగా నుండుటచే జనులు వెలుపలికి రాజాలకుండిరి. పది ఘంటలకు మీఁరినసమయము. వైకుంఠశర్మ యింటగడియారపు టిక్కుమను శబ్దముదప్ప వేరొకశబ్దము లేదు. మేడమీఁదమాత్రము రాబోవుపరీక్షలకై భానుమతీ భానుమూర్తులు జదువుచుండిరి. వారు దప్పనాయింటిలో మేల్కొనిన వారెవ్వరును లేరు. ఎలుకలువారాడుటచే యప్పుడప్పుడు ఒకవిధమగు యలజడికలుగుచుండెను. ఇంతలో వున్నమున్నట్టుండి తలుపుదీసి సధ్వని వినవచ్చెను. భానుమూర్తి యులికిపడి లేచి పిదపై దృష్టించి ఎవరువారని యడిగెను. వైకుంఠశర్మ "భానూ! నేనే కదా!" యనిపోసాగెను. అంతభానుమూర్తి నాయనా! ఇంతరాత్రిలో నెచటికి బోవుచుంటివని యడిగెను. వైకుంఠశర్మ వెనుకకుదిరిగి "కార్యార్థమై వెళ్ళునప్పుడు నెక్కడికని యడుగవచ్చునా? నాకెప్పటికి పనులుండును" అని యుచటనొక్కింత కాలమాగి తిరిగిప్రయాణము సాగించెను. భానుమూర్తి తనతండ్రికి యపశకునముగావించెనని చాలచింతిల్లెను. దానిని దెలుపుటకై చెల్లెలకడకేగి "భానూ! నేనొక యపరాధము గావించితినిగదా!" యనెను.

భానుమతి—"అదియెట్టిది? ఎవరియెడ?" యనియడిగెను.

భానుమతి—మనతండ్రియెడ?

భానుమతి— అట్లయిన క్షమించుము

భానుమూర్తి—క్షమించెనుగాని నామనంబంగీకరింపదు.

భానుమతి—అదేల?

భానుమూర్తి—ప్రయాణమై పోవుచుండ యెక్కడికంటివి? అది యపశకునముగాదా?

భానుమతి—"అంతమాత్రమునకువిచారమేల? పిల్లిశాపముల కుట్లూడునా? మనవారూరక లేనిశంకలు పెట్టుకొని తమకార్యములు పాడుజేసికొందురు. నేనొకనాడు కార్యార్థమై నాస్నేహితురాలింటికి జనుచుంటిని త్రోవలో యొక పిల్లికూన యడ్డమువచ్చె. అదియు శకునమేమోయని తలంచితినిగాని నాకార్యము ఫలించి నందున శకునములందు విశ్వాసమే పోయినది. నాటగోలె యెవ రేని శకునములగూర్చి మాటాడిన నాయనుభవమును వారికి దెలిపి వారిసంశయముల బోగొట్టుచుంటిని".

భానుమూర్తి—"అట్లుచేయుట సరిగాదు. మన పెద్దలు మూర్ఖులు గారు శకునశాస్త్రములు వ్యర్థములుగావు. అసత్యముల నేల కష్టపడి వ్రాయవలయును. పొద్దుపోవక వ్రాసిరా? మనము పూజ్యభావముంచి చేయుప్రతివిషయము తప్పక ఫలించును. నీవు నీస్నేహితురాలింటికి బోయినకార్యమంత యవశ్యమైనది గాక పోయియుండవచ్చును. లేక వేళావిశేషమై యుండవచ్చును. గనుక మనమెప్పుడుగాని విషయము యొక్క మంచిచెడ్డలారయవలయునే గాని మంచిచెడ్డలు మనమే నిర్ధారణ జేయరాదు".

భానుమతి—అన్నా! వీనియందు నాకెంతమాత్రము నమ్మకము లేదు. లేని నమ్మకమును నీవుబుట్టింపజాలవు. పెద్దలాచరించుచుండినది విడచిపెట్టరాదంటివి. మనపూర్వులు కల్లుద్రావు

చుండిరను కొనుము. మన పెద్దలు జేయుచుండిరని మనముగూడ దాఁపుట యవివేకముగదా?

భానుమూర్తి—అట్లుకాదు ఆవిషయము వేరు. ఈవిషయము వేరు. పెద్దలనగా మనతాత ముత్తాతలుగారు వారికంటెను మానవలోకముకంటె సత్యము లైన ఋష్యులొనర్చినవి యపద్ధములగునా? గాన మనము దేనినిగాని నిరసించరాదు. ఒకవేళ విశ్వాసము లేకున్న యితరులను విశ్వసించకుండా చేయుట పాపకార్యము. నీ మనసున కది నచ్చకున్న యూరకొనుము. నా యనుభవమే శ్రేష్టమని ప్రపంచమున చాటరాదు''

భానుమతి—''మన యనుభవములు వెల్లడించుట చాటినట్లా''

భానుమూర్తి—''అట్లొనర్చుట మహాపురుషు లనదగు వారికే జెల్లునుగాని మన వంటివారికి దగదు. వారికిగల తెలివిలో మనకు సహస్రాంశమైన లేదు''. అని చెప్పెను.

భానుమతి—''గొప్పవారందరు మనవంటి మానవులు గారా? వారొకించుక భాషాప్రయోగము దెలిసికొనియు, కొంత జనుల కంటె మన్ను గొట్టుటకై త్యాగము జేసిన వానివలె నటించుచు నంబము గొట్టిన వారందరు పెద్దవారగుదురా? తమ వాదమే, నిజమని స్థాపించుట గొప్పతనమా?'' యనియడిగెను.

భానుమూర్తి—భానూ! మనకావాద మెందులకు? పరీక్షలగు చున్నయవి. చదివిననేగాని నెగ్గగలమని యాశ లేదు. పైవిషయములెట్లున్నను జెప్పెదను. చూడు! మన తండ్రి కిప్పుడుగూడ పని యే. నిజముగా డాక్టరుపని చాలచెడ్డది సుమా! నామిత్రులెందరో నన్ను ఆపనియందు ప్రవేశింప మనిరి. నాకిష్టమే లేదు.

భానుమతి—పని యెపుడుండిన నపుడు జేయవలయును. డాక్టర్లు వేళలు పాటింపదగునా? అపాయము లేవేళలంటే యూ వేళల

తటస్థించవచ్చును. అప్పుడు పోకున్న యింక యెప్పుడు పోవలయును. మఱియు ధనమున గొనుట కిట్టి సమయములే పనికివచ్చునవి. నిజముగా వైద్యవృత్తి మానవశేవ నిమిత్యముపచరించునది. గాన నిదియవశ్య యాచరణీయాంశము. నా పరీక్షలో నెగ్గిన పిదప మెడికల్ కాలేజి జేర నూహించుచుంటి'' ననెను.

భానుమూర్తి—"ఎవరి మనస్సునకు దోచినది వారుజేయుట శ్రేయస్కరము'' అని గడియారమువంక జూచి "భానూ! మన ప్రసంగము లింకగట్టిపెట్టుదము, రెండు ఘంటలైనది. ఇక నిద్రింతము''. అని యిద్దరు తమ పర్యంకములపై బడి నిదురించిరి.

నాల్గు ఘంటలు గొట్టెను. అట్టి సమయమున నెవ్వరో తలుపుల దట్టిరి. "ఎవరండీ'' యని భానుమూర్తి యడిగెను. ఎవరో వెలుపలినుండియే వైకుంఠశర్మకై యేతెంచి యుంటిమనియు చాలపనియున్నదనియు జెప్పిరి. అంత భానుమూర్తి మీవలెనే యెవ్వరికోసమో యప్పుడెక్కడికో యేగియుండెననియు యచ్చటనుండి యింకనూ రాలేదనియు జెప్పి వారినంపివైచెను. అంత తనకు చెడు స్వప్నములే తేరనిదుర రామిచే నిదురబోక మేల్కొని యిటునటు బచారు చేయ మొదలిడెను. ఇంతలో గొల్లున తెల్లవారెను.

జనులదేలకో గుంపుగుంపులుగా గూడి డాక్టరు వైకుంఠశర్మ యింటిపద్ద కేతెంచి యాతని దిట్టుచుండిరి. అమ్మలక్కలు మాయన కాపని దగవని యొకరితో నింకొకరనుచుంటిరి. అనేకలు భానుమూర్తి చెవినిబడెను. వారెందులకు తనతండ్రిని దూషించుచున్నారని కలవరపడసాగెను. అడుగ నెంచెనుగాని యనూయాపరులైన పురజనుల నడుగ సాహసించుట ప్రమాదకరంబని యూరకుండెను.

ఒక చిన్నపిల్లవాఁడొక కాగితముల కట్టనొకటి జేతనిడుకొని "వింతయైనవార్త. వింతయైనవార్త. మూఁడు పైసలు " అని యెలుగెత్తి యఱచుచు చేతనున్న కాగితముల నమ్ముకొనుచు మిక్కిలి యుత్సాహముతోఁ బోవుచుండెను. భానుమూర్తి మూఁడు పైసలొసంగి కాగితము నొకదానిని గొనెను. అందీవిధముగా నాంగ్లమున ప్రకటించియుండిరి.

## TRIPLICANE INFANTICIDE.

Pitch dark. An old man aged Fourty and above with an infant packed with rags was about to burry the same on the shore of Buckingham canal at about two 'o' clock in the night; when the police on night duty cought him red-hand. The culprit is under arest. Enquiry going on. Further it is known that he is a lea ding native Doctor of Govindappa naick's street going by name Vykunta Sarma".

"గాఢాంధకారము. నలువది వత్సరములపై బడిన వాఁడు గుడ్డ పేలికలతోఁ జుట్టబడిన నొక చిన్న బిడ్డను బకింగుహాము కాలువ గట్టున పూడ్పుటకు యత్నించుచుండ, రాత్రి గస్తీయందుండిన పోలీసు వారాతని రెండుగంటలప్పుడు బట్టుకొనిరి. నిందితుఁడు అరెష్టుచేయబడినవాఁడు. విచారణ జరుగుచున్నది. నిందితుఁడొక సుప్రసిద్ధ నేటివుడాక్టరనియు గోవిందప్పనాయక వీధి నివాసియనియు వైకుంఠశర్మ యని నామధేయంబనియు దెలసినవి". అని యా కాగితమందు ప్రచురింపబడియుండెను. చదువుట ముగిసినంతనే భానుమూర్తి యొకకేక వైచి మూర్ఛిల్లె. భానుమతియు కేకలు వినియులికిపడి లేచి యాతని చేతనున్న కాగితము నొకమారు పీక్షించి యంచు మూర్ఛిలిన యన్నను పైకిలేవనెత్తెను. అతఁడు దెలివిరాఁ "భానూ! శకునఫలమెంత జేసెనే. నేనెక్కడికని యడిగినపుడు కోపించినవాఁడు దిరిగిబోనేల? తెలవారిన బిడప పోరాదా? పోయిన

వాఁడు తానట్టి కార్యమేల జేయవలయును. పావలా డబ్బులొసంగి యున్న నెవ్వరాపని జేయరు. తండ్రీ! మాకిక దిక్కెవరు? ఇఁకనే మొగము బెట్టుకొని కాలేజీకేగువాఁడ. దైవమా! ధనాశ నాతండ్రికేల గల్పించితివి. కావలసినంత యుండ నెవరికి బెట్టవలయునని సంపాదించుచుండెనో దెలియదు. తుదకు కొల్లబెట్టినను తఱుగదు. ధనముకై యింతటిపనికైన పాల్పడుటయేనా? నిన్ను విడిపుచ్చుటకు బ్రయత్నించు వారెవ్వరు? తుదకు జామీనైన నొసఁగువారు గూడ లేరే. నిన్నందఱు దూషించువారేగాని భూషించు వారొక్కరును లేరే. బ్రతికినంతకాలము చెడ్డవాఁడవనిపించుకొనవలసివచ్చెగదా ఎట్టి వెఱ్ఱి యొనర్చియుంటివో. ఆ పాప ఫలము నిన్నిట్లు జేసినది. నేఁటిది దుర్దినము. ఎంత ఘోరసంకటము సంభవించెను". అని వెక్కి వెక్కి యేడ్చుచూ చెల్లెలువంకఁజూచి "భానూ" యని క్రిందబడిపోయెను. భానుమతి యన్నను చేరదీసి అన్నా! ఎంత మందమతివి. కష్టములొదవినవని వ్యసనము జెందుట వలన బ్రయోజనమేమి? ధైర్యం పురుష లక్షణముగదా. అధైర్యపడకుము. అప్పుడే నేమాయె. విచారణ కావలదా? మనతండ్రియే యపరాధి యని స్థిరపడినగదా. సాక్షులుండవలయును. మరియు నది చనిపోయిన బిడ్డయై యుండఁగూడదా. కానిమ్మని యాతనొకింత యోదార్చి క్రింద దామోదరుడేడ్చుచుండెనని వాని దోడ్కొని మేడదిగి యందేడ్చు చున్న సోదరుని, సోదరిని చేరి యొకరిఁ బట్టుకొని ధైర్యము వహింప జేసిరి.

# భానుమతి.

## పదునాల్గవ ప్రకరణము.

### కేసు పూర్వచారిత్ర.

సామిపిళ్ళవీధిలో నంబరు 18 వ గృహమందొక వైశ్యుడొకం డుండెను. అచటికే తెంచి సుమారు పది వత్సరములయియుండెను, ఆయిల్లాతని స్వంతముకాదు. బాడుగయిల్లు. గృహము చాల పెద్దది. అందు రెండుమూడు కుటుంబములు కాపురముజేయుటకు చాలినంత వైశాల్యము గలిగియుండెను. తనకనుకూలురగు వారును దొల్లప్పటుండువారును, యగు వారెవరునూ బాడుగకురానందున తానే యాయింటికంతటికిని బాడుగ నిచ్చుకొనుచుండెను. అప్పు డప్పుడు తాత్కాలికముగా బాడుగకు వచ్చుచుండిరి గాని పట్టుమని పదిమాసములైననూ యుండుటలేదు. ఆవరణము పెద్దదగుటచేత యేదొక మూలను మాత్రము తమ కుటుంబోపయోగమునకు యనువగునట్లు జేసికొని తక్కినభాగమును వదలియుండిరి. భవనము చాల గొప్పదగుటచేతనూ, జనసంచారము చాల తక్కువగుటచే తనూ, నివాసులిద్దరికంటె యెక్కువలేకుండుటచేత యాప్రదేశమును గొత్తవారెవ్వరైన జూచిరేని భీతిల్లక మానరు.

వారికున్న దుకాణము చైనాబజారు నందుండుటచే పాప మాతని యిల్లాలు మగడులేని తరి యొంటరిగానుండ భీతిల్లుచుం

డెడిది. అవకాశ మొదవినపుడెల్ల పొరుగిండ్లకు జనుచు యందు కాల క్షేపము జేయుచుండెడిది. సాయంకాల మగుసరికి భుజించి తలుపులు బంధించి వైచిన మరునాటి వరకు మాటలే యుండవు. ఎల్లకాలము భీతిచేయణగి యుండలేక నాథునితో నాయింటిని వదలిపెట్టుమని నిర్బధింప సాగెను. వర్తకుండట్టి గృహమును వదలిన సౌఖ్యములకు నెలవగు వేరొక యిల్లుదొరక నేరదని యెప్పటికి కప్పుడు జవాబొసంగుచు సరియగు వారెవ్వరైన వచ్చిన తుదకు తక్కువ బాడుగకైన నిచ్చుటకు సంసిద్ధుడనై యుంటినని చెప్పుచుండెడివాడు.

పచ్చయప్ప కళాశాలయందు స్కూలుఫైనల్ నెగ్గి తుదకున్నత విద్య బడయుటకు డబ్బులేనందున ట్రయినింగు కళాశాల జేరి యందుత్తీర్ణయై యొక పాఠశాలయందుపాధ్యాయినియై తన జీవితమును గడుపుచు నొక వింతంతు జప్పని తననిజ తల్లితో గూడ మదరాసున నివసించుచుండెను. తగు గృహవసతి లేనందున యిల్లొకదాని నద్దెకు దీసికొన వలయునని ప్రయత్నించు చుండెను. అకస్మాత్తుగా యామెతల్లికి వర్తకు నిల్లాలితో పరిచయము గల్గెను. నాటగోలె వారిమైత్రి యధికమై యెడతెగనిదై తుదకు వర్తకునింట బస గుదుర్చుకొనెను. వర్తకుండు గూడ వారిద్దఱాడ వాండ్రగుటచే యేలాటి సంశయములేక వారి ననుమతించెను. కాని యాతని మనమున నొకశంక మాత్రముదయించి భీతిల్ల జేయుచుండెను.

అది యేదన నావితంతువు గర్భము దాల్చియుండె. ఆయపవాద మెచటనైన తనపైబడునే మోయని భీతిల్లుచుండెను.

నవమాసములు మీరెను. ప్రసవదినము లెదురు జూచుచు నుండెను. ముసలామె భయపడ జొచ్చె. ఇంటనింకెవ్వరు లేరు.

రహస్య వ్యాపార మితరులకు దెలియకూడదు. తుట్టతుదకు తమ యింటిలోని దాసియొకనాఁడు తనకత్యంత పరిచితుండును యనుభవాన వైద్యకళా కోవిదుండును నగు డాక్టరొకఁడు గలఁడనియు నాతఁడవలీలగా కార్యసాఫల్యమొనర్ప గలఁడనియు ధైర్యముజెప్పి వారికి యామరునాఁడే మన వైకుంఠశర్మను బరిచయ మొనరించెను. నాఁటి గోలె వారొకింత భీతిదగ్గియుండిరి.

రాత్రి పండ్రెండు ఘంటలు. ప్రసవవేదన ప్రారంభమయ్యెను. డాక్టరు వచ్చియుండెను. కొన్ని నిముసము లట్లాగెను. వేదనాభరమున నల్లలనాడెను. పిదప డాక్టరు సాహాయ్యమున సుమారొంటి ఘంటకు సుఖప్రసవమయ్యెను. పురుషశిశు వుదయించెను. పసిశువైననేమి? [illegible] పోషించిరిగదా! హా! దుస్సహము. పచ్చికసిగందునట్లు దాసిపాలు నేయ నిశ్చయించిరి. ఇంతలో శిశు వేడ్వసాగెను. ముసలిది నోరెత్తుఁగని చిట్టి నోరు మూసెను. పీక నులిమివేసెను. ప్రాణము లెగసిపోయె. హా! యాచేతు లెట్లాడెనో! వారికవలసిన పనియేమి. ఇంతటికి కారణము సంఘముయొక్క కృత్రిమ క్రోధానలమే గదా.

డాక్టరు వచ్చినపని ముగించుకొని [illegible] వెడలి పోయెను. ప్రసవ వేదనాభరము నొకింత చెవులఁబడిన వెంటనే యావైశ్యదంపతులు మేల్కాంచి యాదృశ్యమునంతయుఁ [illegible] వారెఱుఁగకుండ తెరచాటుననుండి చూచుచుండిరి. వారాదృశ్యమునవలోకించి సహించలేక వేడినిట్టూర్పు విడచిరి. డాక్టరు వెడలిన తోడనే యాపుత్రకుని కెక్కడలేని కోపముదయించెను. ఏమిదెలియని, మాయమర్మము లెఱుఁగని కోమలములైన యవయవంబులు గలిగిన యాబిడ్డను జంపిన ఘాతకులకు దగిన శిక్షనొనర్చిననేగాని పాపము తీఱదని త్వరితముగ తన కాలకృత్యముల దీర్చుకొని పోలీసు స్టేషనున

కేగి రిపోర్టు గావించెను. అదివఱకే తమచేతుల జిక్కిన డాక్టరు శర్మగారి కేసునకు సంభందించిన వాడేనని వెంటనే తమయధికారికి నివేదించి వారంట్లను (Warrants) గొనివచ్చి యాతక్షణమే తల్లి కూతుండ్ర సిద్ధటిని బంధించిరి.

డాక్టరు మొట్టమొదట తప్పిదమును యంగీకరింపక పోయెను. పోలీసులొకింత భయపెట్ట తానందునకు సంబంధించిన వాడు గాడనియు, తానాబిడ్డను పాతిబెట్టుటకు మాత్రమే నియోగింపబడెననియు, అందులకు తగిన బహుమాన మొసంగ దలంచియుండిరనియు జెప్పెను. వారాతని వాంఙ్మూలమును గైకొని శుక్రవారమును విచారణ దినముగా నేర్పఱచిరి.

డాక్టరు కారాగారమున తానొనర్చిన పాపకృత్యమునకు వగచుచూ తనయత్నము కొనసాగనందునకు భగవంతుని దూరుచు కుటుంబ భావిపరిస్థితులెట్లుగా పరిణమించునో యని విచారపడుచు చేయునది లేక యొకనాడిట్లని చింతింపసాగె "నాయూహాలన్నియు నేనిందేయుండుట తటస్థించెనేని వమ్మగును. పోలీసులకు లంచ మొసంగ దలంచితినిగాని యది తప్పుగా గ్రహించి నన్ను చీవాట్లు బెట్టుటయే గాక మానుబుక్కలి పీడింపసాగిరి. నాకుజూడ విముక్తి కల్గునని వాక్యయని దోచెడిని. పాపము! జైలువార్డను (Jail warden) యొకింత దయారసము గల్గినవాడగుటచే భానుమూర్తివద్ద ధనమును గొని నాకు యన్నపానీయములు చక్కగా విచారించుచున్నవాడు. ఏమి జేయుటకు దైవనిర్ణయమున కెదురు లేదుగదా" యని యోచింపసాగెను. అతనికొక నాడొక యూహ జనించెను. వెంటనే పేదకు పెన్నిదబ్బినట్లు సంతసము పురిగొన యానందింపసాగెను. తన సంతస ప్రవాహమును బయలు వెడలనీయక తనయందే యుంచుకొని సమయమునకై వేచియుండెను. తానుచిన్ననాడు నేర్చినకొన్ని

హిందీపాటలను బాడసాగెను.

జైలువార్డన్ పేరు యాఖూబు. అతనికి గానమునిన మిక్కిలి ప్రియము. సంగీతసభ యెచ్చటనైన జరుగునని తెలసినమొదల పనికి శెలవుపెట్టిపోయ్యెడివాఁడు. అందున శతవృద్ధుఁడు. పోలీసు లందరికాతనిపై ప్రేమ మిక్కుటము. ఆతని వృద్ధత్వమునకు యందరు గౌరవించుటయే గాక యూతఁడిలుపిడి యేగుదెంచెడు వేళ వాదనముల వర్షము గురియుచుండును. ఆతనికష్టముచెప్పువాఁరు లేకుండిరి. పోలీసబ్ యిన్స్పెక్టర్ల (Sub Inspectors) కు గూడ యూతనిపై కరుణమిక్కుటము. స్వల్పవేతనమున నుండియు యెక్కువ స్థితి సంపాదించియుండెను. సాయంకాలమయిన ఘంటలుగొట్టుటయే తడవుగ ఎంతపనియున్ననూ సరియే యెక్కడిదక్కడ విడిచివైచి నమాజుచేయ మొదలిడును. ఖురానుపై యూతని కత్యంత ప్రీతి.

వైకుంఠశర్మ యొకనాడెప్పటియట్ల పాటలబాడుచుండెను. యాఖూబు గానమునందభిరుచి గలిగినవాఁడగుటచే యూతనిపాటలు విన కుతూహలుఁడై యూతని గనవద్ద కేతెంచి వినసాగెను. ఆసంగతి డాక్టరు గ్రహించి మఱింత బిగ్గరగానుఁ బువసాగెను. అప్పుడు యాఖూబు “అరే! బొమ్మన్ జీ! తుమ్ అచ్ఛాగవయ్యా వుండావ్రాభే”.

డాక్టరు—సహీం! భాయిః! మైచోటా బచ్చాహూమే క్యోంకీ జరాసి జరాసి తుమారాం బాత్ సిక్ లియా హుఁ, తబ్ శే హిందీ కహానే మేరేకు బహుత్ ఖుషీ. క్యా భాయి! అసుగా పాటల్ యచ్ఛాహై క్యా?

యాఖు—అమారా గజ్జలాంకా మజాదూసరా బాత్ మేన హీంహై. జరాసి సునాకరో! అబ్ యేక గజ్జల్ బోలో?

డాక్టర్ —"హజరత్! - ఆజ్‌తో మేరాగల్లా బరాబర్ నహీ హై. సబాబ్ తో లేగా" అనెను.

యాఖూబు డాక్టరు మాటలవలననూ పాటలవలననూ సంతోష పరవశుండయ్యెను. ప్రతిదిన మాతనివద్ద పాటలు వినవలెననే కుతూహలముతో పదేపదే యాతని గదివైపునకు బోయి యాతని పాటలు జెప్పుమని తొందర పెట్టసాగెను.

డాక్టరు తన యెత్తు ఫలోన్ముఖమగుచున్నాదని సంతసించెను. తాను దాచియుంచియున్న కొన్ని మత్తు పదార్థములను వెలుపలికి దీసెను. ప్రతిదినము తంబాకు సేవించువాడగుటచే చొక్కా జేబీలో తంబాకు నప్పుడప్పుడు నింపుచుండెడివాడు. అయిపోయి నపుడెల్ల యాఖూబు దెచ్చియిచ్చుచుండెను. వైకుంఠశర్మ చిన్నప్పా టొక చుట్టల వ్యాపారమునందుండెను. అందుచే నాతనికి చుట్టలు చేయుట యలవడియుండెను. తనవద్దనున్న కొంత పొగాకును దీసి యందులో కొన్ని మత్తుపదార్థములనునిచి చుట్టలు గొన్నింటిని జుట్టెను. అట్లు జుట్టినవి జేబులో సాతరించెను. తదుపరి తనకు గావలసినవి గొన్నిటిని జేసుగొని యుపయోగించుచుండెను. సమయము సమీపించినపుడు ఆవిష చుట్టల బ్రయోగింప దలంచియుండెను. తాను పాట బాడునపుడు యాఖూబున కొక్కచుట్ట నిచ్చుచుండెడి

ఒకనాడెప్పటియట్లు తనసహజ కంఠమునెత్తి పాటబాడ దొడంగెను. ఆపాట యాఖూబు చెవిని బడెనో లేదో యచటికి బరునెత్తి వచ్చి «డాక్టరుజీ! అచ్ఛా! ఏక్ గజల్ సునావో» యనెను. డాక్టరు «సునాతాహూం! దేఖో» అని యిట్లు బాడదొడగెను.

"అచ్ఛా మొరే లాగీసె § గేనుసేను గేనువా ॥అ॥
చంబూల నైనుతేరా § చంబూల ప్యారితేరా ॥చ॥

అచ్ఛామొరే లాగీసె ! గేనుసేను గేనువా ॥
వహ్వావాజీ, వహ్వావాజీ, వహ్వావా ॥అ॥

ఆపాట వినినంతనే హజరత్ యాఖూబ్ ఖుషీయయిపోయెను. వెంటనే "డాక్టర్‌జీ! శెహభాష్! శెహభాష్!" యని యభినందించి "అభీ ఏక్ సునావో" యని వేడుకొనెను. అంత వైకుంఠశర్మ "హజరతు కొంచెము తాగుము. విశ్రాంతిగైకొననిమ్ము" అని యొక చుట్టను వెలిగించి "హజరతు తుమ్ కెత్తారోజ్ సే బీడీ, సిగరేట్ పీతాహై" యనియడిగెను.

యాఖూ — చోటా వున్మకే ! మేంసే పీతాహూం.

డాక్టరు — (చుట్ట నొకటితీసి) హజరతు! చుట్టా పీయో. అచ్ఛా తంబాక్ యనెను.

యాఖూ — "ముఘతు యిచ్ఛాతొ కోన్ పీతానై" యనిదానిని పుచ్చుకొని వెలిగించెను. దానిఘాటు రొమ్ములదాక "బోమ్మన్‌జీ! అచ్ఛాహై! అచ్ఛాహై" యని "అయిసా మెరేకు ఖైకూదియాసో" యనియడిగెను.

డాక్టరు — ఖైదీలొసగు వాటిని గైకొనుట తప్పనిగదా మీ నియమము.

యాఖూ — "తుమ్! అచ్ఛా అద్మీకా మాఫక్ దిసా హై" యని యింకొక్క దానిని గైకొనెను. డాక్టరు తిరిగి పాటలపాడ దొడంగెను. యాఖూబా పాటలవింటగా చుట్టదాగుచుండెను. మధ్యమధ్య "శెహభాష్" యను కేకలు మిన్నంటుచుండెను. చుట్టదాగిన కొలది యాతని తలదిరుగ నారంభించెను. నిలచుటకుగూడ కష్టమాయెను. వెంటనే తెలివిదప్పి క్రిందబడిపోయెను.

డాక్టరు సంతసించి తనప్రయత్నము సాగినందులకు పరమేశుని

ధ్యానించి ఖాకానివద్దకరుదెంచి వానిమొలనున్న తాళపుచెవుల గుత్తిని దీసి తనదుస్తులనెల్ల దీసివైచి తనదుస్తులనాతని ధరింపజేసి యథావిధిగ తలుపుల బంధించి బయటికేతెంచె. అందుగావలి గాయుచుండు పహారా జవానొకఁడేయుండెను. వాడుకూడ యాంనాడు తనపైయధికారి దండించుటచే చింతచే దిక్కుదెలియక యప్రమత్తుఁడైయుండెను. డాక్టరు యాఖూబు వేషమును ధరించి వాని యెదుటనుండియే బోయెను. వాడు తన యాఖూబేగదా యని మిన్నకుండెను. వైకుంఠశర్మ చరచర నడచి వెళ్ళిపోయెను.

# భానుమతి.

## పదునైదవ ప్రకరణము.

### శుక్రవారము.

నేఁడే విచారణదినము. పదునొకండు ఘంటలప్పుడే గొట్టిరి. మదరాసు శేషన్సుకోర్టు తెఱచియుంచి యుండిరి. న్యాయవాదులొక్కరొక్కరే హాలున కరుదెంచుచుండిరి. జనులు తండోపతండములుగ న్యాయస్థానమున జేరుచుండిరి. వకీళ్లు తమతమ కక్షిదార్లకు చెప్పవలసిన మాటలజెప్పుచుండిరి. ప్రేక్షకుల కంతమే లేకుండెను. డాక్టరు విడువబడవచ్చునని కొందఱు, ఆతఁడుగూడ యందులో భాగస్వామి గాన జరిమానాను పొందవచ్చునని కొందఱు, స్త్రీలకిద్దఱికి శిక్షదప్పదని కొందఱు, ముసలిదానిని వదలివేయుదురని కొందఱు, ఆమె ప్రోత్సాహమే లేకున్న యిట్లు సంభవింపదు గాన నామెగూడ నిందితురాలేయని కొందఱు వారివారికి దోచినట్లు అనుకొనసాగిరి. ఇంతలో జడ్జిగారరుదెంచుచున్నారని గుసగుసలు బయలుదేరెను. రెండు నిముసములావల యంతయు నిశ్శబ్దమయ్యెను. జడ్జిగారరుదెంచి తమ ప్రత్యేక గదిలోనికేగి యాఫీసుకాగితములలో సంతకములనొనర్చి న్యాయస్థాన పీఠమునలంకరించెను. న్యాయవాదులందఱు గౌరవ సూచికముగ లేచినిలువబడి యాతఁడుగూర్చున్న పిదప తాముగూడ యాసీనులైరి.

నాడు విచారింపవలసిన కేసు శిశుహత్యయే మొదటిది. దానిని విచారించుటకు బెంచిగుమాస్తా వచ్చి నిందితుల పిలువనాజ్ఞా పించెను. ధఫేదారు "సుందరాబాయి"ని మూడుమార్లు బిలచెను. పోలీసువారే యామెతల్లిని లోనికిగొనివచ్చిరి. గుమాస్తా వారవద్ద ప్రమాణముల జేయించిన పిదప వారితలిదండ్రుల యొక్కయు వార్లయొక్కయు పేర్లడగి వ్రాసుకొనెను. తదుపరి నిందితురాలిని గొన్ని ప్రశ్నలడిగిరి. ఆమె యన్నిటి కుత్తరముల నిచ్చుచుండెను. అంత నిందితురాలుయొక్క వక్కీలు లేచి— నీపేరు సుందరాబాయి గదా?

సుంద—అవును.

నిం వక్కీలు—నీవును నీతల్లియును యెన్నిదినములుగ యిందీ పురమున గాపురముంటిరి?

సుంద—నాలుగైదు వత్సరములుగ.

నిం వక్కీలు—వర్తకునింటికివచ్చి యెన్నిదినములైనది?

సుంద—మూడు నాలుగు మాసములైనది.

నిం వక్కీలు—నీయజమానుఁడు మరణించి యెన్నిదినము లైనది?

సుంద—బాల్యముననే గతించెను.

నిం వక్కీలు—అపుడెక్కడ యుంటివి?

సుంద—మాతల్లితో జేరుకొని స్వగ్రామమున చదువుకొనుచుంటిని.

నిం వక్కీలు—నీనాథుఁడు మరణించునపుడు నీకువయసెంత?

సుంద—సుమారు పండ్రెండుండెను.

నిం వక్కీలు— ఇపుడు నీకెన్ని యేండ్లు?

సుంద—పదునెనిమిది.

నిం వక్కీలు—యిదివరకు నీకుసంతానము గల్గియుండెనా?

సుంద—లేదు.

నిం వక్కీలు—ఇదియే మొదటి గర్భమా?

సుంద—అవును. (ప్రేక్షకులు నవ్వుచుండిరి).

నిం వక్కీలు— ఉదయించిన శిశువు యాఁడదిగా లేక పురుష శిశువా?

సుంద—పురుషశిశువు.

నిం వక్కీలు—దానినేమి జేసితివి.

సుంద—పుట్టినపుడే యది గిట్టియుండె. పరిచారిక నాకు తెలుగొంత ధనమిచ్చి స్మశానమునకు గొనిపొమ్మని జెప్పితి.

నిం వక్కీలు—అది యట్లొనర్చెనా?

సుంద—అట్లొనర్చియుండునని యే నాకు నమ్మకము.

నిం వక్కీలు—డాక్టరు మీయింటి శిశువును గొనిపోవుచుండెనని జెప్పుచుండెను. దానికేమందువు?

సుంద—అతని ముఖమే నేఁజూచి యెఱుఁగ.

నిం వక్కీలు—వర్తకుని మాటలకేమందువు?

సుంద—అవి యసత్యములు.

నిం వక్కీలు— నిష్కారణముగా నేరము నీపై మోపనేల!

సుంద—వారికిని నాకును సరిపడుట లేదు.

నిం వక్కీలు—ఎందువలన?

సుంద—అతని వశమున వడ్డికని నా రెండు మాసముల జీతమును నొసగితి. ఇప్పుడపహరించుటకై లేదనుచున్నాఁడు.

నిం వక్కీలు—కేసుచేయక పోతివా?

సుంద—అబలను. ఇచ్చినప్పుడు సాక్షులు లేరు. ప్రోనోటు వ్రాసియిచ్చియుండ లేదు. నమ్మకముపై జరిగిన వ్యవహారము.

నిం వక్కీలు—ఎవరితోనైనను జెప్పితివా?

సుంద—చెప్పిన నేమి ప్రయోజనము. రసీదైనను బొందని దానవు నీదే తప్పనుచుండిరి. నాకుకోపమువచ్చినపుడెల్ల వారిని కచ్చితముగ చీవాట్లు బెట్టుచుంటి. అతఁడు నాపై క్రోధమువహించి యిలువెడల నడపెదనని బలుకుచువచ్చె. నేఁడుదానిని యవకాశముగఁగొని యసత్యములన్నిటిని జెప్పుచుండెను.

నిం వక్కీలు—(కూర్చొనెను).

జడ్జి—(పబ్లిక్ ప్రాసిక్యూటరు నుద్దేశించి) మీవాదమును ప్రారంభింపవచ్చును.

పబ్లి—మీరు ట్రెయినింగు నందు తీర్ణులైన దెపుడు?

సుంద—ఆరు మాసములకిందట.

పబ్లి—ఏపాటశాలయందు మీరుండుట?

సుంద—ఇచటికి చేరువనున్న పాఠశాలలో.

పబ్లి—ఏమాత్రపు వేతనము గైకొనుచుంటిరి?

సుంద—ఏబది.

పబ్లి—మీయింటి వ్యయము లేమాత్రమగును?

సుంద—ముప్పదికంటె హెచ్చదు.

పబ్లి—పనిలో బ్రవేశించి యెన్నినాళ్ళయినది?

సుంద—అయిదు మాసములైనది.

పబ్లి—జమాఖర్చు లెక్కలుంచి యుంటిరా?

సుంద—అవును.

పబ్లి—పనిలో బ్రవేశింపకముందు ఋణబాధ యుండినదా?

సుంద—వెయ్యిరూప్యములప్పుండెను.

పబ్లి—తీర్చివేసితిరా?

సుంద—అవును.

పబ్లి—మాసము వరుంబడి యేబది. ఖర్చులుపోను నిల్వ మొత్తం వెయ్యిరూపాయలగునా?

సుంద—మాయిల్లు తాకట్టుబెట్టి తీర్చివేసితిమి.

ప్లీ—ఎవరికి తాకట్టు బెట్టినది?

సుంద—బ్యాంకులో.

ప్లీ—(తనవద్ద యదివరకే వ్రాసియుంచుకొన్న కాగితము నొకమారు దిరుగవేసి) నాథుడు మరణించిన పిదప యెవరిని ప్రేమించితిరి?

నిం వక్కీలు—అట్టి ప్రశ్నలడుగరాదు.

ప్లీ—నా వాయింటుకు సంబంధమున్నది. అడుగక మానను.

జడ్జి—అడుగుడు. (ప్రేక్షకులు నవ్వసాగిరి).

సుంద—(ఊరకుండును).

ప్లీ—చెప్పియే కావలయును.

సుంద—“మానవంతులు నవమాన మొనరించుమాటలివి” అని చెప్పెను.

జడ్జి—“పోనిమ్ము” అనెను.

ప్లీ—నీవు వ్యభిచారిణివి గదా?

సుంద—ప్రేమించిన పురుషునితో కూడుట వ్యభిచారమెట్లగును?

ప్లీ—ప్రియపురుషుండెవరు?

సుంద—నా కళాలాధికారి (ప్రేక్షకులు చప్పట్లు గొట్టసాగిరి).

ప్లీ—నా వాదము ముగిసినదనెను.

అంతకోర్టువారు ఫలహారమునకై లేచిరి. పత్రికలమ్మువారు పత్రికలదెచ్చి విరివిగా యమ్మసాగిరి అందు ముఖ్యమైనది నాటి దినము “పలాయన”అను శీర్షికక్రింద నెవరో డాక్టరు, బందిగాయుంచబడిన వాడు జైలువార్డన్‌ను మోసగించి పాఱిపోయినాడని వ్రాసియుండిరి. జనులాసంగతి విన్నప్పుడు యాశ్చర్య నిమగ్నులైరి. ఎవరో సుందరాబాయితో యాసంగతి జెప్పిరి. ఆమె చాలసంతసించెను.

# భానుమతి.

## పదునాఱవ ప్రకరణము.

---

### కష్టపరంపరలు.

కష్టము లెన్నటికిగాని యొక్కటొక్కటిగ రావు. ఒకటిపై నొకటి వెంటవెంటనే వచ్చి విశేష వ్యాకులత మనంబున కపరిమిత యసౌఖ్యము నొనగూర్చును. కాలచక్రమును దిరిగిన నటులగును. సుఖము గొన్నాళ్ళు. కష్టము గొన్నిదినములు. పురాకృత కర్మనను సరించి సుఖదుఃఖములు గలుగుచుండును. వాటిని వారణోపాయము యనుభవించుట దప్ప వేరొండు లేదు.

భానుమూర్తికిపు డెక్కడ లేని కష్టములు ప్రాప్తించినవి. తండ్రి దుర్మార్గుడని పేరొందుటయేగాక ప్రపంచమున యాతడు సజీవియై యుండుదనుక పట్టుపడి కారాగృహవాస మొనర్పకదప్పని పనియై యుండెను. అన్నదామోదరుడున్నతో త్రాగుబోతుల మేటియాయె. చేతజిక్కిన పైకమును గొల్లపెట్టుచు యింటికే రాడాయెను.

సంసార భారమాతని భుజద్వయముపై బడెను. తండ్రిపేర నెలనెలకు వచ్చు మునియార్డరు పైకమంతటిని దామోదరుడే గ్రహించి విపరీతముగ యింటికొక చిల్లిగవ్వనైన ముట్టజెప్పక వెచ్చపెట్ట

సాగెను. "బ్యాంకు"లలోనుండు పైకమంతయు వైకుంఠశర్మ పేర నుండుటచే వారీతనికియ్యమనిరి. తానదివరకు యుద్యోగము జేసి యెఱుఁగడు. కుటుంబ వ్యయములకు గావలసిన పైకమునకై తహతహలాడ సాగెను. ఎక్కడ దొరకగలదు? విద్యార్థిని నమ్మియిచ్చువారెవరు? అతనెఱిఁగిన వారెవ్వరును లేరు. ఇఁక శెలవులు ముగిసిన పిదప విద్యాభ్యాసమునకేమి పెట్టి జదువగలడు?

ఇట్టి సమయమున పిడుగువంటి వార్త యొకటరుదెంచెను. నాటిదిన సాయంకాలము దామోదరుఁడు చెల్లెలిని వెంటనిడుకొని నారాయణునిగూడి పార్కు (Park) నకు బోయెను. అదివఱకు నారాయణుని తీపి మాటలకులోనైన యాసిచాత్మురాలు సమయము దొరకెనని యదేయదనుగ నాతనితో వెడలి నదితిరిగి యింటికే రాక పోయె. ఆవార్తను విని భానుమూర్తి పట్టరాని దుఃఖమున నేఁమి చేయుటకు దోఁచక తండ్రియుండియు తండ్రిలేని బిడ్డయై, ధనముండి యు తినుటకే గతిలేనివాఁడై యుండవలసివచ్చెను. ఇటులుండ భాను మూర్తికి మఱియొక కష్టమేర్పడెను. కార్పొరేషన్ వారి కివ్వవలసిన యింటిపన్ను నదివఱకు గట్టియుండనందున వారుయింటిని జప్తీచేయు దమని నోటీసు నిచ్చియుండిరి. ఏమిచేయదగును దైవమాయనిగుం దుమండ భానుమతి యాసంగతి నెఱింగి తనమెడలోని బంగారు గొలుసును దాకట్టుబెట్టి యాగండము దప్పించెను. కాని తిరిగిదాని సంపాదించు విధము దెలియదయ్యె. ఇదే రీతిగ కొన్నినాళ్ళుండిన యింటిలోని వస్తువులొక్కటొకటిగ తాకట్టు బెట్టవలసినదే. ఇఁకే వేఱు గత్యంతరమే గానరాకుండెను. అన్నియునైన పిదప దేనినిచ్చి కాలముగడుపుట? యీసాగరము నీదుట యెటులనని బుగ్గపై వ్రేలిడి యోచింప దొడఁగెను.

"ఓయీ భగవానుఁడా! నీచెయిదము లెట్టివోగాని యెంతలో నెంత జేసితివి? ఎట్టిగృహము నెట్టి స్థితికి దెచ్చితివి. తలచుకొనిన గుండెలు పగులుచున్నవి. గర్భనిర్భేద కరంబగు కష్టపరంపరలజిక్కి చరించుట నాకుచేతగాదు. ఎంతటి సిరి సంపదలున్న నేమి? నేటికి గట్టుటకు గుడ్డయు దినుటకు బువ్వయు లేక యవస్థ నొందవలసినచ్చె గదా! దయామయా! నాసుకుమార జీవనము నతికష్ట జీవితముగ జేసితివి. అగ్నివర్షము సందవతరించిన నాకు అన్నయు దండ్రియు జేసిన చెయిదములకు ఫలంపు గలుగ జేసితివి. పరాత్పరా! నా సోదరసోదరీ యంతరాత్మలఁ బ్రవేశించి ప్రబోధించిన సన్మార్గశీలురుగ గావింపుము. అన్నమునకే మొగము వాచిన నాకు బ్రతుకుదెరువు గలిగించి గట్టునకు జేర్పుము. ఇఁక నీకృపరాకున్న నేనీసాగరముననే మునిగి యసువుల బాసెద. పిదప నాత్మహత్యా దోషమునకై నన్ను శిక్షింపకుము. నన్నిట్టి పాల్జేసినవాఁడవు నీవే భక్తరక్షణ పరాయణా! వందనములాచరించుచుంటి, ఇఁక నీదే భారము" అని వృన్మాగమున నొడలు దెలియక తనకు గల్గిన కుటుంబ కష్టముల దల పోయుచు న స్త్రీ మూర్ఛిల్లెను.

అట్లెంత సేపుండెనో దెలియదు. ఉన్నదున్నట్టుండి యాతని కుసికన్నదగనగె. సువార్తఁగొని వచ్చితినిదిగో గైకొమ్ము లెమ్మని దెలుపునట్లు గంధవాహుఁడు మెల్లమెల్లగ వీవసాగెను. ఆచలువ వదనమున కొంకింత దెలివిరా కన్నులనులిమికొనుచు లేచెను. ఇంతలో నెవరో దలుపుదట్టిరి. భానుమతి పరుగిడి తలుపులఁదీయ తపాలా బంటొకఁడు ఉత్తరముల రెంటినిగొని వచ్చి యామెకొసంగెను. రెండును భానుమూర్తి పేరనే వ్రాయబడి యుండుటచే చింపి జదువ నొల్లక బిరబిర దెచ్చి యన్నచేతి కందించెను. భానుమూర్తి యాతురముచే వాటిని రెంటెని జింపి యిట్లని జదువదొడంగె.

"ప్రియమైన భానుమూర్తికి,

నీవు పరీక్షలో మొదటి తరగతి యందుత్తీర్ణుడవై యుంటివని దెలిసికొని చాల సంతసించితి. గురువునకు దగిన శిష్యుండవై భక్తిశ్రద్ధల నెఱపి నందులకు ఫలముననుభవించితివి. భయపడవలదు. నీకు గలిగిన కష్టముల దెలిసికొని విచారించితి. నీవిద్యానైపుణిం గాంచి యెవ్వరైన తప్పక సాహాయ్యమొనర్చెదరు గట్టెక్కితివను కొనుము. చింత జక్కిచరింపుము. నీకు సర్వేశ్వరుండు చిరాయువొసంగు గాక"

ఇట్లు
కళాశాలాధ్యక్షుఁడు

రెండవ లేఖలో నిట్లు వ్రాసియుండెను.

"ప్రియమైన భానుమూర్తికి,

ఆశీర్వాదములు, నీవిప్పుడ నేక కష్టములకు లోనైయుంటివని దెలిసి కొంటిని. భీతిల్ల వలసిన బనిలేదు. నే బంపుచుండు మనియార్డరు పైకమును నీపేర నే యిక బంపగలవాడను. దానిని గైకొని కుటుంబమును పోషింపుము. మదీయతనూజ మైలాపురమునందు సుబ్బశర్మ గారింట బెఱుగుచున్నయది. ఆమెకు దగిన విద్యాబుద్ధులు నేర్ప సామర్థ్యముగల వారెవ్వరును కనుపింపకుండిరి. నీవాపనిని జేయగలవని నానమ్మకము. ఎంతమాత్రము నాలసింపక నే డేయ చటికిబో యి సుబ్బశర్మ గారితో ప్రస్తావించి పనిలో బ్రవేశింపుము"

ఇట్లు
నీ శ్రేయోభిలాషి.

ఆవృత్తరముల జదివినతోడనే గ్రీష్మకాలపు టెండతాకుడు చేకాంతి దొఱగి నీటిబొట్టునకే మొగము వాచి నలతాని కుంజములు జ్యేష్ఠమాసపు తొలకరి వానలకు చిగిర్చి దలయెత్తుకొని దొల్లింటి శోభినిగన బరచురీతి దారిద్ర్యదేవతా గరమున స్రుక్కియున్న భానుమూర్తి భాగ్య గౌరవముల నిచ్చు లేఖావళి నందు కొన్నపిదప హృదయ విచారము దొలఁగ బడగలదని విన్నంతనే నంత నసాగర ప్రవేశ మొనర్చెను. కాని యందు మొసళ్ళు మొదలగు కఠోర జంతువులున్నవని దలంచడయ్యెను. పోయినగౌరవము యిప్పుడైన గొంకింత గట్టెక్కించ గలదని నమ్మెను. పెద్దవారి దాపు దొరికెనని యుబ్బెను.

ఇఁక నూయిట్టిచోట గాపురముండి లోకులచే దూషింపబడుటకన్న గౌరవ ప్రదముగ నే దో యొక సందులో నివసించి ననూభయము లేదని తన బస మైలాపూరి నకే మార్చుకొనెను. ఆగృహ మన్ని విధముల నాతని కనుకూలముగ నుండె. అతివిశాలమైన హాలు. నిర్మలవాయువులు ప్రవేశించు గవాక్షములు, నీటి సౌఖ్యమునకై కొళాయీలు, వివిధ రంగుల గాజు కుప్పెలుగల విద్యుచ్ఛక్తి దీపములు గలిగి యెంతయో శోభాయమానముగ నుండెను.

ఆమరునాడు భానుమూర్తి లేఖలగొని సుబ్బశర్మ యింటికి బోయెను. అతఁడు మేడమీద నుండెను. సేవకుని చేరమ్మని పిలువనంప బడిన తదుపరి భానుమూర్తి లోనికేగెను. సుబ్బశర్మయు గూడ తనకంతకు ముందునచ్చి న లేఖను జదివి కొనుచుండెను.

భానుమూర్తి యాతని యెదుటికి బోయి వందన మాచరించెను. సుబ్బశర్మ ప్రత్యభివందన మొనర్చి కూర్చొనమని యాతని కొక కుర్చీ నిచ్చెను.

సుబ్బ—భానుమూర్తిగారు మీరేనా?

భాను—అవును.

సుబ్బ—ఇంకనూ జదువుచుంటిరా?

భాను—అవును బి. ఎ. జదువుచుంటిని. ఈయేడే పరీక్ష కు గట్టియుంటిననుచుండ పత్రికలోంటి వీరశర్మ తండ్రి వచ్చిగూర్చొనెను.

సుబ్బ—ఈయేడు ప్రశ్నాపత్రములతి కఠినములని వింటిని. మీరు బాగుగనే వ్రాసితిరా?

భాను—జయించియే యుంటి మొదటి తరగతి యందు

సుబ్బ—అదెట్లు? పత్రికలందింకనూ ఫలితములు ప్రకటింపబడ లేదే?

భాను—(జేబుయందున్న వుత్తరమును దీసియిచ్చెను)

సుబ్బ—(ఆశ్చర్యముతో) ఉత్తీర్ణులై యుంటిరని వ్రాసి యున్నది. ఇంక ప్రభుత్వోద్యోగమున బ్రవేశించెదరా?

భాను—ప్రభుత్వోద్యోగుండనై నాసేచ్ఛను జంపుకొనుట కిష్టపడను. ఏదైన నుపాధ్యాయ పదవి నలంకరించి శిష్యుల దేశారాధకులుగ జేయ నెంచితి.

సుబ్బ—మంచియూహయే. మీవంటివారే దేశమునకు గావలసినవారు.

భాను—మహాసీయులెందరో స్ృంఖలాబద్ధయై యున్న భారతావనినుద్ధరించ సమకట్టి త్యాగములను జేసి శల్యావశిష్టులై కారాగారముల మ్రగ్గుచుండ మనమంత మాత్రము జేయకున్న మానవుల మనిపించుకొనదగము.

సుబ్బ—అట్టి త్యాగులు దొరకుటయరిది. మీవంటివారు గలుగుట దుర్లభము. అదియుండనిండు. మా "ప్రమద" కుపాధ్యాయులుగనుండ నంగీకరింతురా?

భాను—మీరాయిచ్చవచ్చినచో—

సుబ్బ—మీయాంగీకారము బడసిన పిదపగదా నేజెప్పవల యును.

భాను—"నాశక్తికొలది జెప్పనెంచితి"ననెను.

అనంతరము వినుచున్న వీరశర్మ తండ్రి (న్యాయవాది) భాను మూర్తినుద్దేశించి యిటనెను.

న్యాయ—"అయ్యా! మావాడీమూరి చక్కగా జదువక ప్రశ్నాపత్రములగాంచినతోడనే భయపడి పరీక్షకే పోడయ్యె. గాన నా తనయునిగూడ మీశిష్యునిగా గైకొనుడు. మీకెంత యివ్వమన్న యంతయిచ్చుకొందు"ననెను.

భాను—"సుబ్బశర్మగారంగీకరించిన నాయభ్యంతరమేమియు ను లేద"నెను.

న్యాయ—"సుబ్బశర్మగారు నాయెడ వేఱుగ జెప్పుదురులెండ"నెను.

సుబ్బ—భానుమూర్తిగారూ! వీరుమనకు గావలసినవారు. మీకు దెలసియేయుండవచ్చు. జగమెఱింగిన వక్కీలు లక్ష్మణశర్మ గారు.

భాను—పరిచయము మాత్రములేదుగాని వారిపేరు కర్ణాకర్ణిగ వినియుంటిని.

లక్ష్మ—సుబ్బశర్మగారూ! మన సుందరమ్మకు గూడ వీరియొద్ద నే పాఠములు జెప్పించిన ముగ్గురును జదువగలరు.

సుబ్బ—"అయ్యా! మీకింకొక శిష్యురాలును గూర్చుచుంటిమి ఆమేపేరు సుందరమ్మ కోపగించుకొనక యంగీకరింపవలయునని వేడుచుంటిన"నెను.

భాను—ఆమెయెవరు?

లక్ష్మ—ఆమెయొక జమీందారునిబిడ్డ. తండ్రిమరణకాల మున మమ్ముల నిద్దరి నామెకు సంరక్షకులుగ నేర్పరచి దివికేగె.

నాటగోలె వితంతు తల్లితోఁగూడ యాబిడ్డ పెరుగుచుండెను. మా పరిమదయును యామెయు స్నేహితురాండ్రు. సహ పాఠకులు. ఆ మెదికూడ పరిక్కయిల్లే.

భాను—సుబ్బశర్మ గారూ! మీయనుమతిపై నొప్పుకొనుచుంటిని.

లక్ష్మి—"(నాకు పనియున్నదని వెడలిపోయెను).

సుబ్బ—"భానుమూర్తిగారూ! రేపటినుండి మొదలెట్టుడు" అనెను. భానుమూర్తి "సరి" యనిదలయూచి శెలవుగైకొని వెడలెను.

మరునాడు భానుమూర్తి గొన్ని పుస్తకముల చేతబట్టి ఖద్దరు ఖాదువా వల్లెవాటుగ ధరించి చేతిబెత్తమును ధరించి క్రొత్తగా నియోగింపబడ్డ పనికిబోయెను. సుబ్బశర్మ యాతనికొక మారు వారి నందటిని పరిచయ మొనరించెను. తదుపరి భానుమూర్తి క్రమము గా తనపని నిర్వహించుచుండెను.

భానుమూర్తికిపుడు కష్టములును, యవమానమును గొంతవరకు దగ్గినవూ దామోదరుని చేష్టలవల్ల యాతని మనము స్థిమితముగా లేదు. ఎపుడునూ నేదో వంక బెట్టి భానునితో పోట్లాడచూచును నానాటికి వాని చేష్టలు కంతములేనందున తనవద్ద నాతనుంచుకొనుట పాముతో చెలగాటములాడుటయే యని తుదకొకనాడు సిద్ధపడి చెప్పవలసినవన్నియు జెప్పెను. వాడు తనతండ్రి పేరవచ్చుచుండిన మనియార్డరు భానుమూర్తి పేరవచ్చుచుండుట జూచి యసూయా పరుండగుటయే గాక చేతనొక్క చిల్లిగవ్వయైన దొరకమిచే లేని వంకలు బెట్టి చీటికిమాటికి భానుమూర్తితో కలహించుచుండెడివాడు; నేడు భానుమూర్తి వేరుపడుట మేలని యనుటయే తడవుగ సంతసము పురిగొన కానిమ్మనెను. భానుమూర్తి శనివదలినదని లోలోన సంతసించెను. దామోదరుడు యింటిలోని సామానుల నన్నిం

టిని వెంటనే గొని వెడలిపోయెను. అతనినింటరానీయకుమని భాను మతికి కట్టడి జేసెను. కాని పురుషులకువలె స్త్రీలకంతటి కఠిన మనస్సు దైవమొసంగమిచే భానుమతి తనయన్న లేనపుడు భాను మూర్తివచ్చిననూ లెఖగొనకవలయు తిండ్ల నొసగుచు సద్బుద్ధుల బోధించుచుండెను. వాడదియ దనుగాగైకొని తమ్ముడు లేనపుడు యింటికేతెంచి కావలసినది గైకొనుచు కాలము గడుపుచుండెను.

దామోదరుడు చేతనున్న పైకమంతయు ఖర్చుపడిపోవ తాను వేరుపడి గొనితెచ్చిన సామానంతటిని దినమున కొక్కటి చొప్పున తెగయమ్మి తనత్రాగుడున కుపయోగించుకొనుచుండెను. కొండ వంటిదైననూ దినమునకొక గుండుదీసి వేసిన యెన్నివాళ్ళుండును? గాన వున్న సొమ్మంతయు ఖర్చుపడిపోవ చేయునది లేక దొంగబుద్ధుల వినియోగించి స్నేహితత్రియమును గూడి వారు చేయు దుష్కార్య ముల బాల్గొనుచు వారుచేయు స్పప్టనలకు తప్పుడు సాక్ష్యములకు సిద్ధపడుచు వచ్చెను. ఒకనాడు వారొసంగినదొంగ చెక్కు (Cheque) నొకటిని గొని తనచెల్లెలింటికేగెను.

భానుమతి యప్పుడే భుజించి నాటిదినపు వార్తాపత్రికనుగొని చదువుచుండెను. దామోదరుడు లోనికేగెను.

భాను—దామోదరా! ఏలయిట్లుంటివి?

దామో—నాకదేలకో కండ్లుమండుచున్నవి. స్నానముజేసె దనని యామె జవాబొసంగకముందే బిరబిర పెరటిలోనికిబోయి వేడి నీటిస్నానమొనర్చెను. పాపము! అన్నదురవస్థ నొకింతదలపోసి భానుమతి యాతని బిలచి ఫలహారములనిచ్చెను. వాడుతిన్నగ మెసవిపడక కుర్చీపైబడెను. భానుమతియు యాతని కెదురుగ నొక కుర్చీపై యాశీనయయ్యెను.

దామో—భానూ! నేనేమో దుర్మార్గుఁడననుచుంటివి. ఇది గో జూడుము చెక్కు (Cheque). ఈమొత్తమును నేదాచియుండిన పైకమును నొకనికి యప్పిచ్చియుంటిని. వాని నేఁడడుగ చెక్కునిచ్చి మార్చుకొమ్మనెను. నీవు దయయుంచి బ్యాంకు (Bank) కేతెంచి చెక్కు మొత్తము నిప్పించవలెనని ప్రార్థించెను.

భాను—నీవుపోయిన నివ్వరా?

దామో—(గద్గదస్వరముతో) నీతో వచించుటకు నాకేసిగ్గగు చున్నది. నాయన యెన్నియో విధముల జదువుకొమ్మని బోధించి ననూ వినక పెడచెవినిబెట్టితి. అందుకు ప్రతిఫలమనుభవించు చుంటి. బ్యాంకునకేగి వారితో మరియావతో మాటలాడుటకూడ నేర్వనైతి. అందున యెల్లరు యింగ్లీషుమాటలాడువారే. నీవు యెప్పుడప్పుడు పైకము జెల్లించుచుందువు. అందురు నీకు పరి చితులే. నేనుకూడ నీ వెనువెంటనే వచ్చెదనని బ్రతిమాలెను.

భాను—(అతనియమాయకత్వమునకును, విద్యావిహీనతకు వ్యసనపడి లోనుండి యేతెంచు అశ్రుకణముల పైటచెరగు సాయ మున దుడుచుకొనుచు) అన్నా! నీవింతగ బ్రతిమాలవలయునా? అవ శ్యము గొనిపోయెదనులే అని చెక్కును బుచ్చుకొనెను.

దామోదరుఁడు బండినిగొని వచ్చెదనని పోయి యొకబాడుగ మోటారు (Taxy) ను గొనివచ్చి యింటిముందర నిలపెను. అంత వారిద్దరు నాశీనులై యింపీరియల్ బ్యాంకు (Imperial Bank) న కేగిరి.

దామో—భానూ! నేను క్రిందనే గనిగనిపెట్టుకొని యుండె దనని జెప్పెను.

భానుమతి బ్యాంకులోనికేగి చేతనున్న చెక్కు (Cheque)

నొకమారు నిటునటు ద్రిప్పెను. "వెయ్యి రూప్యములకు" యని వ్రాసియుండెరి. క్రిందసంతకమును జూచి యాశ్చర్య నిమగ్నయయ్యె తనయన్న భానుమూర్తి సంతకము నెవ్వరో ఫోర్జరీ యొనర్చియుండిరి. తనకు దెలియక భానుమూర్తి యెందులకు యెవరికిచ్చునని యోచించి యింకను నిక్కముగా మోసముజరిగినది. నేడీనిని గైకొని పోకిన తప్పక పట్టుపడెదనని గబగబ పరుగెత్తుకొనివచ్చి దామోదరునికై వెదకసాగెను. దామోదరుడదిజూచి తటాలున యామె హస్తములనుండి దానిని బలవంతముగా దీసికొని యెటకో పరుగెత్తిపోయెను.

భానుమతి బండి నొకటిని గుదుర్చుకొని యింటికిబోయెను. ఇట్లని చింతింపనొడఁగె. "హా! దామోదరా! ఎంతలో నన్ను కొరగాని వానినిగ జేయుచుంటివి. భానుమూర్తి వలదనుచున్ననూ నీకు దాచియుంచి పెట్టుచుంటినే. అట్టినాయెడ యెట్టిపని గావించుచుంటివి. చీనాట్లు బెట్టుదనని మాటలాడక మునుపే చెక్కును గొని బరువెత్తితివే ఔరా! వావివరుస లక్కఱలేదా! ఎవరైనను సరే. మనపని సాగినచాలుననియా! ఏటి ధర్మము. ఎంత ధనము నీకొసంగుచుంటి. ఇదివఱకొక్క దానిని బాడుజేసితివి. నన్ను తుచ్ఛురాలనుగా నెంచుకొంటివిగా? హా దైవమా! నన్నీనీచ కుటుంబమున జన్మింపజేసి యనేక యగౌరవములకు లోనై చావలసిన స్థితికి దెచ్చితివే. పరమాత్మా! నన్నును భానుమూర్తిని గావు"మని వేడికొనుచు ఆవిషయము మనసునకు వచ్చినపుడెల్ల మండిపడుచు యికవాని నింటికి రానీయకూడదనుకొనుచు వ్యసనముచే తలనొప్పి రానెక్కడికేనిపోక బోపనుండెను.

# భానుమతి.

## పదిహేడవ ప్రకరణము.

### వేషధారి.

నేడే శుక్రవారము. వారము పొడుగున వచ్చిన నావల (Steamers) న్నియు తిరిగి వెనుకకో ముందునకో సాగిపోవుచుండును, నేను దప్పిన యిటు తిరిగి శుక్రవారము నాటివరకు ప్రయాణము సాగదు.

"బర్మా" ప్రయాణీకులందరు గుంపులు గుంపులుగాగూడి హార్బరులోనికి బరుగిడుచుండిరి. స్టీమరు కదలుట కింకనూ కొన్ని నిముషములుండెను. ఒక మహమ్మదీయ వేషధారి, నెత్తిపై టర్కీ టోపి (Turkey Cap) ని ధరించి ముఖమునకు లేసి వెండి గడ్డమును దగిలించుకొని, కాళ్ళవరకు షేర్వానీని ధరించి, కాళ్ళకు పంజాబు షరాయిని తొడిగి పాదములకు కాలిజోడును వేసుకొని, కంటికద్దముల జోడును వేసుకొని దన్నెవ్వరైన గుర్తుబట్టెదరని రెండవ తరగతి టిక్కెట్టును బుచ్చుకొని గబగబ యందరి కన్న మొదట స్టీమరు నెక్కుచుండెను. అక్కడక్కడ టిక్కెట్టు పరిశోధకులీతని నిలిపి టిక్కెట్టు నడిగిపుచ్చుకొనుచు తిరిగి వాపసు యిచ్చుచుండిరి. వారె

క్కుడనైన దనగుట్టు బయలు పెట్టెదరేమో యని సందేహాస్పదుండై అడుగుటయే దడవుగ మాటాడకయే టిక్కెట్టునిచ్చి తిరిగి పుచ్చుకొనుచు త్వరితముగ తనగది జేరుకొనెను.

సముద్రయానము హైందవ సాంప్రదాయమునకు విరుద్ధమని యెదరుగాని అదియెంతమాత్రమును గాదు. పూర్వము మనదేశస్థులు బాబిలోనియా మున్నగు దేశములతో వ్యాపారము జేయుచుండిరి. వారికిప్పుడు ధర్మశాస్త్రములగుపడ లేదుగాని యిప్పుడు పూర్వాచార పరాయణుల కంటికి మాత్రము గోచరించుచున్నది. నౌకాయాత్రజేసి పరదేశముల కేగి వారి సాంప్రదాయములు వేషములు, నడవడికలు మున్నగునవి దెలిసికొని వారిదేశమున కవి యెట్టి యుపయోగకరంబులగుచున్నవో దెలిసికొని మనము ఆదరింప దగినవి వున్నయెడల మనదేశకాల పరిస్థితుల ననుసరించి కావలసిన మార్పులు జేసిననేగాని భారతావని పూర్వపు వున్నత్యము గడిప నేఱదు.

మదరాసునుండి బర్మాకు మూడు దినముల ప్రయాణము. మూడు దినములు ప్రయాణీకులు నీటిని దప్ప వేరొక వస్తువునైన గాంచనేఱరు. క్రొత్తగా ప్రయాణము జేయువారికి నౌకాయాత్ర బహుకఠినమైనది. తలదిరుగుడు, సముద్రజ్వరము మున్నగు వ్యాధులకు లోను గావలసియుండును. దృఢకాయులును యారోగ్యవంతులగు మనుజులకవి యేమియును జేయలేవు. కాని యలవడిన పిదప దుర్బలులను గూడ యేమియు జేయజాలవు.

బర్మాదేశముగూడ విశాల భారతదేశాంతర్గత భాగమేగాని వారి సాంప్రదాయములు వేషభాషలు మనలను వారినుండి వేరు జేయుచున్నది. మరియు బర్మాదేశ మొక రాష్ట్రపాలకు నాధీనాధి

కారముననుండి యుండుటచే పూర్తిగా మనదేశమునుండి వేరుపడినట్లు గాన్పించుటయేగాక నాదేశపుచరిత్రయే వేరుగా పరిణమించెను. వారుగూడ నాగరీకులే. సస్యసమృద్ధి గాటపట్టు. వ్యవసాయము నకు గావలసిన నీటిసౌకర్యముల కనువగు నదులుండుటచే వారి కత్యంత ప్రయోజనకారులగుచున్నవి. మఱియు భారతదేశములో యెక్కువగా వర్షించు ప్రదేశమాత్రపదేశయే యగుటజేసివారు మన వలె వర్షధారకు నోలుతెఱచుకొని యుండవలసిన పనిలేదు. కాని జనసంఖ్యను బట్టిజూచిన మనదేశీయులుగూడ యొకభాగముగా నేర్ప డుచున్నారు. వీరలెల్ల వలసపోయి యింగ్లీషువారి టీ, కాఫీతోట లలో కూలీలుగను నౌకర్లుగను బ్రవేసించి పనిజేయుచుండిరి.

ఆదివారము మూడు ఘంటల సమయము. ఇంకకొంత సేప టిలో బర్మా చేరగలమని యాత్రికులందరువ్విళ్లూరుచుండిరి. వాయస సంతానము బారులుదీరి గగనమార్గముబట్టి పోవుచుండ భూభాగము చేరువననేయున్నదని విసుగుజెందిన ప్రయాణీకులు దలంచుచుండిరి. ఇంతలో వారికి రంగూన్ పట్టణమునగల ఉన్నత సౌధరాజముల యొక్కయు, కర్మాగారములయొక్కయు, రాజకీయభవనముల యొక్కయు, శిఖరములు కన్నులపండువొనర్చుచుండెను. త్వరలో బర్మా చేరగలమని యూహించుచుండిరి తుదకా యోడ నాల్గు ఘంటలకు రంగూన్ పట్టణముజేరెను. ప్రయాణీకులందరు తమతమ వస్తుసామగ్రిని గొని పట్టణములోనికి జనుచుండిరి. మనవేషధారి యందరికన్న ముందుగనే దిగి గబగబ నడచిపోయెను.

అట్లాతడు పట్టణమున బడివీధివీధిని జూచుచు తనకుగావలసిన గృహము గానరామిచే విసిగికొనుచుండెను. ఎట్టకేలకు నొక యుద్యానవనమును గనుంగొని యందుదగిలింపబడిన పలకను జదివికొని సంతోషాంతరంగుడై లోని బ్రవేశించెను. అందెవ్వరో

యొక్క మెలనాగ ముప్పది వత్సరముల పైబడినది మధ్య ప్రదేశమున నాశీనయై వార్తాపత్రికను పుచ్చుకొని పడక కుర్చీపై కివిగా గూర్చొని యుండుటనుజూచి మెల్లగా నామెయెదుటికి బోయి నిలచుకొనెను. ఆమె యాతని జూచి ‘‘ఎవ్వరవునీవు’’ అనియడిగెను.

వేష—‘‘నన్నప్పుడే మఱచితివా’’ యనెను. ఆయువతి యాతని మాటలను బట్టి మున్నెన్నడో వినినట్లు దోప పరిచితుడైయె యుండవలెనని యనుకొనెను. గాని గుర్తెఱుఁగ జాలకుండెను. అంత నా వేషధారి “వైకుంఠశర్మను గానా’’ యని తన టోపీనిదీసి క్రిందనునిచెను. వెంటనే కళావతి యాశ్చర్యచకితయై యప్పటి వేషమును గాంచి నివ్వెరపడ జొచ్చెను. తమపరి వారిట్లు మాట లాడ దొడఁగిరి.

కళా—మీరా! ఇట్టివేషము నేలవేసితిరి? కుశలముగనుంటిరా?

వైకుం—ఇంతవఱకు సౌఖ్యముగనే జీవించితినిగాని యిఁక ............’’ మాటలాడలేక పోయెను.

ఆతని దీనవదనముగాంచి యామె జాలినొందెను. తర్వాత ‘‘మీకసౌఖ్యము గల్గించువారెవరు?’’ అని యడిగెను.

వైకుం—ప్రభుత్వమువారు.

కళా—వారికేమి యెగ్గొనర్చితిరి?

వైకుం—చేసిన పాపముననే యిట్టి దొంగ వేషములదాల్చి తిరుగవలసి వచ్చినదని వ్యసనపడ జొచ్చెను.

కళా—అంతటి నేర మేమొనర్చితిరి?

వైకుంఠ—‘‘చెప్పగూడని పనియయ్యు నీతోవచించుచుంటి’’ నని యామె చెవిలో తానొనర్చిన శిశుహత్య మొదలు జైలునుండి తప్పించుకొని పరుగెత్తుగొని వచ్చినంతవఱకు సమగ్రముగా జెప్పెను,

ఆమె యాతనిపై ఖరీనంతటిని దెలుసుకొని నిర్ఘాంతపడి "అయిన దేమోగానైనది. గతించిన దానికి జింతిల వలదు ధైర్యమూనుడు" అనివచించెను.

వైకుం—"నాజీవనమెటుల గడపికొందు" నని దీనస్వరమునై పలుకజొచ్చెను.

కళా—"మీరిక నిచ్చటనే యుండుడ"ని యాతని దోడ్కొని యాతని వృత్తాంతమును రామశర్మకు జెప్పనెంచి అతని గదిలోని కేగెను.

కళా—డాక్టరు గారు మనరాసు నుండి వచ్చి యుండిరి. చూచితిరా?

రాము—ఏ డాక్టరు!

కళా—ఏమీ! అపుడేమరచితిరా. పదునైదు సంవత్సరము లకే మరుపా? వైకుంఠశర్మ నెఱుగరా!

రాము—(ఆశ్చర్యముతో) యెఱుగకేమి? ఏడీ?

కళా—మీవద్దకేతెంచుటకు సిగ్గుపడుచుండె.

రాము— అదేల? బంధువులు బంధువులదరి కేతెంచుటకిగా?

కళా—అందుకుగాదు రూపమును - జూచిన యసహ్యా—పడి యెదరు.

రాము—నీవు చెప్పనదేమిటో నాకర్థమగుట లేదు.

కళా—మనమాతని రక్షించుట మనవిధిగాదా! చాలనూప దలకు లోనైయున్నవాడు.

రాము— అన్నియు నీవేజెప్పుచుంటివే! నన్ను వినుగుజెయించ క సత్వరములోనికి గొనితెమ్ము.

కళా—"డాక్టరుగారూ! రండి" అనెను.

వైకుం—[లోనికేతెంచి] రామశర్మగారూ! వందనములు రక్షించ వలెను. శరణువేడుచుంటి,, ననియాతని కాళ్ళపై బడెను.

రామ—(జాలినొంది) ఏటి వేషమిది? ఇదియెన్ని నాళ్లనుండి?

వైకుం— నాజీవిత పర్యంతం యిట్లుండ వలసివచ్చునేమో!

రామ—అదేల?

వైకుం—మీభార్య నడుగుడు.

కళా—(చెవిలోయంతయు పూసగ్రుచ్చినట్టు జెప్పివైచె)

రామ—లెండు భయపడ వలదు నిన్నటి దినమే నేను "రంగూన్ మెయిల్"లో జమీనుల జూచుకొనుట కొక్కగుమస్తాగా వలెనని ప్రకటించితి. మీరిప్పుడుండు స్థితినిబట్టి యీయుద్యోగమే శ్రేష్ఠ తరమని దెలయుచున్నది. గాన మీరడ్డము జెప్పక స్వీకరింపుడు.

వైకుం—"సంతోష" మనెను.

రామ—"గృహాధి పత్యముగూడ మీకేవదలితి" ననెను.

వైకుం— "చిత్త"మనెను.

నాటగోలె వైకుంఠశర్మ దిగులుడిగి కాలము గడుపజొచ్చెను. కళావతి తనకుగావలసిన దగుటచేత యెట్టియాటంకములులేక రెండవ జమీందారుని వలెచే జిక్కినధనమును చిల్లగింజలవలె వెచ్చింప సాగెను. దానికని దీనికని ధనమునుగొని గొల్లబెట్ట సాగెను. ఇంటి శేవకులాతని విపరీత చర్యలకులో లోనయసహింపుచు కొనుటయే గాక దండింప జూచిరిగాని యజమానుని జూచి యూరకుండిరి.

# భానుమతి.

## పదునెనిమిదవ ప్రకరణము.

### బీచ్.

అట్లుయానాఁడు భానుమతి దామోదరునిచే మోసగింపఁబడి యింటికిఁబోవ యదేలకో యామె మనంబు కలియబెట్టినటు గాఁగా దానికి దోడు శిరోవేదన యధికమయ్యె. చేయునదిలేక తనతండ్రి యుపయోగించుచుండిన గొన్ని మందులను దీసినోటఁ బోసికొనెను. అయ్యౌషధములెవ్వియో గాని తలనొప్పిని నివారించుటకు మారుగ మఱింత నొప్పిని గలుగ జేయుటయేగాక పైత్యము నధికము జేసెను బాధ నొకింత నివారించుకొందమని యొకరిక్షాయందు గూర్చొని సముద్రపు టొడ్డునకుఁ బోయెను.

పైత్యాధిక్యముచే యామె దారిపొడుగునను వాంతి జేసుకొనుచు కడుపున కలియబెట్టినట్లు కాఁగా రిక్షాను త్వరగా బోనిమ్మని హెచ్చరించెను. వాఁడతి త్వరితముగ బరుగెత్తి గమ్యస్థానము జేర్చెను. ఒకింత మనంబును దిట్టతజేసుకొని ప్రేమకులత్రోవ (LOVERS PATH)ను బడినడువ సాగెను. చల్లని మలయ మారుత మామె వదన మండలముదాఁక కొంత శ్రమయుడిగెను కాని పైత్యమింకనూ యటులనే యుండెను.

అప్పుడే సూర్యభగవానుఁడు తనకొలువును చాలించి పశ్చిమ దిశ విశ్రాంతి గృహమున కేగియుండెను. ఆకాశసాగరమున తెల్లని మేఘ ఖండములు రాజహంసలువలె యిటునటు తరంగమాలికాడోలికల నుయ్యాలలూఁగుచుండెను. దినమెల్ల యెండవేడిమిచే స్రుక్కియున్న విద్యార్థులేమి, ఉద్యోగులేమి పురవాసులేమి వారు వీరననేల? సమస్త జనము సముద్రపుటొడ్డున కూర్చుండి కెరటము లనుండి పరతెంచు నిర్మల వాయువుల నాఘ్రాణించుచుండ చిన్న పిల్లలు కెరటములతో నాడుకొనుచుండ, యిసుకనేలలోఁ గలసిన వింతరంగులగల గవ్వచిప్పల నేరుచు కొందరుండ, హాయిగా కాలము నట్లు వెళ్లబుచ్చ నిచ్చగించు విద్యార్థిబృందములందందు పేకాటల నాడుకొనుచుండ, కొందరు తాము ప్రేమించిన యువతులవంక దృష్టులు సారించి మోహనాస్త్రములు వదలుచుండ నొల్లనివారు ముఖము చిట్లించుచుండ యువకులు తమకోపదృష్టులు పదేపదే వారిపై బరపుచుండ, అవియంతయు జూడ నొకనాటక రంగముగ నొప్పుచుండెను.

మద్రాసునఁగల యువతీ యువకులయొక్కయు, కాముకీ కాముకులయొక్కయు సమావేశము లచ్చోట తఱచుగ జరుగుచుండును. ఇట్టికృత్యములు వెన్నెల రాత్రులలో మఱీవిపరీతముగ నుండును.

ఆనాఁడొకఁడు విద్యార్థియైయుండనోపు; ఆతలపై క్రాపింగు, పొట్టిచేతులపోలో షర్టు, చేతికి వెస్టెండువాచ్, జోబికొనకు బంగారు పాళిగల "స్వాన్" కలము యిప్పుడో అప్పుడో పడిపోవనుండు జోబీలోని చేరుమాలఁ ధరించిన వానినిఁజూచిన నవమన్మథుఁడు వోలెగన్పట్టుచుండె. ఆదారిని స్త్రీలెవ్వరైన బోపుట తటస్థించెనేని యాతని తమవశంబు గావించుకొనక మానరు. కానియిట్టి గుణమాతని యందీషణ మాత్రమైనను లేదు.

పాఠకమహాశయా! అతఁడెవ్వరనుకొనుచుంటివి. సర్వలక్షణ సమన్వితుఁడగు వీరశర్మ అత డిప్పటివారివలె పురాణ గ్రంథముల దూషించువాఁడు గాఁడు. వాటి నిజానిజము లెఱింగి తనకు దెలిసినంత వఱకు యితరులకు బోధించ నేర్చువాఁడు. అడిగినవారికి తన వద్దనున్నవస్తువుల లేదనక నిచ్చువాఁడు. తోడిసహాధ్యాయుల కెన్నియో విధముల సాహాయ్య మొనర్చియుండెను. అతని తరగతి యందాతఁడే యధ్యక్షుఁడు. వానిమాఁట కెదురే లేదు. పాఠములందశ్రద్ధ వహించుటచే వెనుకటిసారి తప్పిపోయెను. ఈతూరి భానుమూర్తి ప్రభావముగా నతఁడు తప్పక నెగ్గగలనని యుత్సాహపడుచుండెను ఒకతూరి దెబ్బదినియుండుటచే రాఁబోవు పరీక్షలలో దప్పక మొదటి క్లాసున నుత్తీర్ణుఁడు గావలెనని యిప్పుడే పాఠముల జదువుచుండెను. క్షణ మొక యుగముగా నెంచి చదువుచుండెను. సాయంకాలమైననూ యుబుసు బోసికొనుటకు "బీచ్"కు బోవుట శరీరమునకు చాలాజబ్బు చేయగలదని భావించుచుండెడివాఁడు. ఎక్కడికి బోయిననూ సరే తనకత్యంత ప్రియమగు "కెమెరా" (Hand Camera) నొకటిని దెచ్చుకొనుచుండెడివాఁడు. తన కింపగు స్త్రీపురుషులుగాని, చిత్రములుగాని, వింతదృశ్యములుగాని, భవనములుగాని గన్పడిన వెంటనే తన కెమెరా సహాయమున ఫోటోలనుదీసి తనగదియం దుంచుకొనెడివాఁడు. అధికతర యానందము నొసఁగు చిత్రములను చాలగా జేసి మిత్రులందరి కిచ్చుచుండెడివాఁడు. నేఁడేలనో తన ప్రియస్నేహితులనందరిని వదలి యొంటరిగావచ్చి నంపమురి యందు సృష్టిపై చిత్రమును దిలకించుచూ గూర్చొనియుండె.

అంతకంతకు భానుమతికి బాధ యధికమాయె. ఆమెపుచ్చుకొన్నమందు నల్లమందుతోఁగూడి యుండినదగుటచే నామెకది మత్తు గలుగజేసి తలదిరుగసాగె కాలుజేతు లస్వాధీనములయ్యె నడచుచుం

డ యెక్కడ పడిపోవునో యనిపించుచుండె.

దీనినంతటిని దూరమువనుండి జూచుచున్న పీరశర్మ యామె సుసౌందర్యమునుగాంచి మోహపరవశుఁడయ్యెను. ఎందరో సుంద యాఁగలుపైఁబడ వచ్చినను వలదన్నవాడు అదేలనో భానుమతిపై యతనికి యనురాగ ముదయించెను. ఒక్క త్రుటిలో యతనికి కోర్కె లూరసాగెను. అవును; పాపమాతఁ డేమిచేయఁగలడు? విరుగఁబూచిన మావిగున్నను జేరక కోయిల వున్నతవృక్షమని తాళవృక్షము చెంత జేరునా?

అతఁడిట్లని మనంబున యనుకొన సాగె ॥ దీనిని జూడ చాల చోద్యముగ నున్నదే! యీయామెను జూడ గొప్పయింటిపడుచువలె గన్పట్టుచున్నయది? త్రాగుడల వశీనట్టున్నది? లేకున్న తప్పటడుగులు వేయనేల? లేక నేదైన బాధ నామెనావరించి యుండదు గదా. ఏమో యెవరెఱుఁగుదురు? పరస్త్రీలతో నెట్లు సంభాషింప దగును. హా! ఆకోమలాకార మెంత ముద్దుగనున్నది. ఆకన్నులు, ఆముంగురులతీరు, ఆనాశికాగ్రము సొంపు? ఆయందము వర్ణింప నేరితరము. అదేలనో నామనం బంత కంతకు యామెపై బారుచున్నయది హా! అస్మదీయ సంఘమా! ప్రియంబగు వారితోఁ సంభాషించుటకును, సుందరతరవస్తువులఁ దిలకించుటకును యావసరమైన నోరును చూపులను గట్టివేసితివి గదా? సంఘమను ఘోర కఠోర శాసనమే లేకున్న నావంటివారికి చాలమేలుగలిగి యుండును గదా? వీటినన్నిటిని సంస్కరించి ననే గాని సంఘమువ్యన్నత్యమునకు రానేఱదు. (స్వగతము) నేనట్టి యదృష్టవంతుఁడనా? ఆహా! నరలోక సతిగాదు గదా! నరలోకసతియే యయియున్న యింతటియందమా! కల్ల. నిక్కముగా దేవలోకపు వనితయే గావలయు కాలమా! నీవెట్టి పాపపు దానివి. నిరంతర దురాచార ప్రేరితమై యలరవలెనా?

జ్ఞాన సంపద నలవరుచుకొన నీయువా? కానిమ్ము. నీయాటలవి యెంతవరకో.

దైవమా! నాయెడఁ బ్రసన్నుఁడవై నాకీమెను గూర్చిన నీకు పదివేలు వందనము లాచరించెద. ఏమీ? నాకంతటి భాగ్యమా! కానిమ్ము మెల్లఁగా నామె వెను వెంటనే బోయెద, ఒకవేళ సమయ మబ్బిన ప్రసంగములోనికి దింపి నాకోర్కె నెఱింగించెద.

ఛీ! ఛీ! ఎంతటి యవివేకుఁడను. అంతకంతకు నాబుద్ధి పెడ దారి బడుచున్నయది. పరవస్తువున పేక్షించుటలో తారతమ్యము వలదా? ఆమె వివాహితయో లేక యవివాహితయో దెలిసికొ నకయే లేని కోర్కెలు దగిలించుకొన నేల? (కొంతసే పూరకుండి) మానసమా నన్ను తల్లడిల్ల జేయుచుంటివా? ఆరూపము జూచితివా ఆ చంద్రునిలో కళంకముండుసు గాని అవ్వనజాక్షి వదనమండల మెంత నిర్మలము. పరమేశ్వరా? నే వివాహ మపేక్షించిననే జేసుకొన వలసిన బాల యీయామె యొకర్తెయే. కానిమ్ము వెనువెంట నేగు దునా? ఛీ! అట్టిపని దగదు. దుర్మార్గుఁడెవ్వఁడో నన్ను వెన్నంటు చున్నాఁడని దూరును'' అనియచ్చటనే నాశీనుఁడై భానుమతీ చేష్టల నవలోకించుచు నుండెను.

నల్లమందు ప్రభావ మెక్కుడగుటచే భానుమతి యిఁక నడుచు టకే శక్తిహీనమయ్యె. ఒక్కక్షణములో యెంతప్రమాదము. ప్రక్క న వంతెనలో తాఅఘాతము. అడుగులు తడబడ వంతెనపైనుండి క్రింద బడనుండె. రెండడుగులు ముందువైచిన భూమిపై మన జాలదు. తుదకు శల్యములైన చేఁజిక్కవు.

దూరమునసుండి యీచిత్రముల నెల్ల నవలోకించుచు నుండిన వీరశర్మ దటాలున యామె యొద్దకుఁబరువెత్తి పడనున్న భానుమతిని

బట్టుకొని దాను కూర్చొని వచ్చినమోటారు చెంతనున్న డ్రియివరు నొకకూత వేసి యాతని సాహాయ్యమున నామెను దనమోటారు జేర్చె. జలజమునుబోలు నావదన మొకింత వాడియుండె. నిరంతర విచారవ్యాధి పీడితయని యాముఖమే జెప్పుచుండె వీరశర్మ యది గాంచి తాగియుండదు గదాయను కొనెను. కాని నిజకారణ మరయ నేరక పోయె. కన్నుల దేలకో మూతలు వడియుండెను. తెలివి యొకింతయైనను లేక మూర్ఛిల్లియుండె.

అప్పుడు వీరశర్మకు గుండె దడదడ గొట్టుకొనుచుండె. పర స్త్రీబట్టి మోటారున నుంచుటొక తప్పుగాదా యనుకొనెను. తెలివి వచ్చినతరి తన్నుదిట్టుట యేగాక తనపైన నేరారోపణము జేయునే మోయని శంకించె. కాని తనయనమాన బుద్దినొకమారు స్మరించుకొని మంచికిబోవుచుండ చెడ్డయెదురైన ధైర్య మవలంభించి కార్యసిద్ధియొనర్చువాడే గదా ధీరుడని మనంబున నిశ్చయించుకొని తన డ్రియివ (Driver) రునకు కొంత దబ్బిచ్చి ఐడాబుడ్డీ నొకటిని దెమ్మని బంపెను. తదుపరి తనకింతరాని వస్తువందినందులకు మదినమందా నందంబునొందెను గాని చైతన్యహీనమైన వస్తువుతో నానంతోషమని నిరుత్సాహపడెను. కాని యామృదు మధుర మోహన వదన మండలాకాంతి కిరణ జ్వాలచే నాకర్షింపఁబడియె. వెంటనే జేబురుమాలను బైకిదీసి వీవనవలె విసర సాగెను. నిర్మలానంద దాయుడగు కువలయమిత్రుడు ఒక్కొక్కప్పుడు మేఘమాలికలచే గప్పబడినప్పుడాతని వన్నె కొకింత లోటు వచ్చినను యపి యస్థిరముఁగుటచే యాతని కాంతి కొకింతయు భంగము రానేరదు. అట్లా చెదరిన ముంగురులచే గప్పివేయఁబడిన ముఖపద్మము జేబు రుమాలయను వీవనా భానునిరాకచే వికసించెను. ఆపద్మమును గాంచి వీరశర్మ నిలువ జాలకపోయె. వెంటనే యాపుష్పము నెత్తికొన బోయెను

గాని సరోవర పద్మముగాక యది మున్నెవ్వరో గోయబడి నలిగి యున్న పూవువలె గన్పట్టె. అయినసట్టి పూవుకూడ తన చేతుల చాలకాలముండదని దాని నాఘ్రాణింపనెంచి వారలెవ్వరు జూచుట లేదు గదాయని యంతయు నొక్కమారు కలయజూచినను వారు యద్దంపు చెక్కిళ్ళపైనుండెడు యమృతమును పానముజేసెను. కాని యదియాతని సంతసపెట్టనేరదయ్యె. గాఢ సుషుప్తినియై మరచి యుండు దానితో నాసరసములని యాతనికి వెంటనే యసహ్యత జనించెను. ఇంతలో డ్రయివరు బిరబిర పరువెత్తికొనిరా తనపని కాటంకము గల్గినందులకు రవంత గుందిచేశిన చేతలకు వగచి యా దృశ్యము డ్రయివరు కంటబడ లేదు గదాయని వానితేర పాఱజూచి త్వరగరమ్మని చేసైగసేసె. అంత వాడతి త్వరిత గమనమున వచ్చి బుడ్డీని వీరశర్మ కందించెను. అతండద్దానినిం గైకొని పగులగొట్టి యందలి నీరముల యామెముఖముపైం జల్లె. వెంటనే గ్రహణ కాలమున కేతువుచే విడువంబడిన చంద్రబింబమట్లు విస్ఫుల్లతా ప్రకాశమును నెగడుమంచు ఆమంజులగాత్రి యిటునటు పొర్లసాగెను. దెలివిరా బైకిలేచి యిటునటు బరికించి తన స్థానమును గానక భీతిలి యది కలయా నిక్కవమా యని మనంబునకు దోపందానికి దోడు తన ముంగళ యన్యపురుషుండు నిలువంబడి యుండుటగాంచి యది కలగాదు నిక్కవమే యని నయనముల నొకింత నలిమికొని పయ్యెద సరిజేసు గొని లేవబోవ దాను మోటారుననుండుట గ్రహించి దురాత్ము లెవ్వరో తన్నట్లు గొంపోవుచుండిరనుకొనె. కాని తనపూర్వపు స్థితిమనంబునకురా నిజమరయనెంచి యాపురుషద్వయమునుంగాంచి "సోదరులారా! మీకు నేనెట్టి యపరాధమును గావింపలేదే! అట్టి నన్ను బట్టుగొనిపోవుట మీకు న్యాయమే" యని నుడివెను.

వీర—సుందరీ! నాచెప్పంబోవు వాక్యముల నొకింత విని నా

యది తప్పయిన శిక్షింప వేడుచుంటి. నీవలె నేమలయమారుత
మును భక్షింప నిచ్ఛగించి యీసాగర ప్రదేశము నాల్గుఘంటలకే
వచ్చిచేరితి. నీవును గొన్ని నిముషముల కిటకే తెంచితివి. అపుడు
నిన్నుజూచి నెవ్వరో గొప్పయింటి యాడపడచువలె గన్పట్టి మాట
లాడ దమకించితి గాని పరవనితలతో సంభాషించు టొప్పుగాదని
మిన్నకుంటి.

నీవైఖరిజూడ తెప్పదాగిన దానివలె గన్పట్టె. మనకెందుల
కనియూరకుంటి. అంతకంతకు నీకుమత్తుహెచ్చయి యడుగులు తడ
బడుచుండె. నడుచుటకే శక్తిచాలదయ్యె. అట్లయ్యును నీవీదారిని
బడిపోవ సాగితివి. అదంతయు నేదూరముననుండి గాంచుచుంటిని
నీవీవంతెన దరికిరా నీయడుగులు తబ్బిబ్బులయ్యె. నొక్క త్రుటిలో
యీజారతలోఁబడనుంటివి. అదిగ్రహించి తటాలున యిచటికి
బరువెత్తివచ్చి నిన్ను బట్టుకొంటిమి. అప్పుడు నీవుమూర్ఛానస్థ
జెందియుంటివి. గాన నీల పరుండబెట్టుట యుక్తముగాదని మదీయ
మోటారుకారు నందునిచితి. కొంతవడి సేదదీర్చి జలము నొకింత
జల్లి దెల్వినొందితివి. ఇది తప్పయిన నన్ను నీయిచ్చచొప్పను
శిక్షింపుమని శిరమువంచుచుంటి''నని తలవాల్చెను. భానుమతి యా
మాటలన్నియును విని లజ్జించి నిష్కారణముగ వారిని దుర్మార్గులుగ
నెంచినందులకు లోలోన దన్నుదానిట్టుకొని యశ్రుకణముల కనుగొన
లనుండి వాలతలవాల్చి ''ఆర్యోత్తమా! తమ మేలుమరువ శక్యమే.
జారతలోఁబడి మరణింపనున్న నన్ను మృత్యుముఖమునుండి దప్పించి
రక్షించిన మీపాద సరోజములకు వందనములాచరించుచుంటి. మీరు
నాయందు లేని కళంకము తెలియకాపాడించితిరి. ఆకారణము
వేరొకప్పుడు వచించెద. ఈపాటికి మాగృహమున నన్ను వెదకుచు
నుందురు. గాన బోవలయును. మీరుగావించిన సాహాయ్యము

చిరస్మరణీయము. ఇదిగో దానికి ప్రతిఫలము నేజేయువందనము" లని కృతజ్ఞతజూపె. వీరశర్మ యామె వాక్కుల కెంతయు నలరి సంతసము వెల్లువయై పార తనకాకుసుమకోమలగాత్రితో స్నేహిత మొదవినందులకు గడుయుబ్బి "సుందరీ! నీనామధేయమును నాచెవిని బడవేయు" మనికోరె.

భాను—"ఆర్యా! మరొకప్పుడు జెప్పెదనులే" యని మరి యొకమారు వందనమాచరించి తానుగొనివచ్చియున్న రిక్షానుబిలచి యుందాశీనయై వెడలె. ప్రియతమమగు వస్తువెడబాయుటచే కలిగిన వ్యసనమున కొంకెంత వీరశర్మ నొచ్చికొనుచు యావయ్యారిపై దృష్టించి యామెచూపులలోఁ దనచూపులగలపి కన్నులకు మరుగగు వఱకుండి పిదప నింటికేగెను.

# భానుమతి.

## పంతొమ్మిదవ ప్రకరణము.

### బెంటో హొటల్

చిత్ర విచిత్రంబులగు మద్యపానపు సీసాలతోడనూ, భోజ్య నియములగు వివిధ భక్ష్యములతోడను, నివసించుట కనువగు యలంకార శోభితములగు చిన్ని చిన్ని గదులతోడను, భోజ్యవస్తువుల నంగముగ నమర్చియుండు గాజు బీరువాలతోడను, తాగుబోతుల నాకర్షించుటకుఁ దగినట్లు సోఫాకుర్చీలతోడను, శోభాయమానముగ నుండునటుల వివిధ తెఱఁగులగానుండు ''ఎలక్ట్రిక్ పంకాలతోడను, విద్యుద్దీపములతోడను నిండబడి దారినిబోయ్యేడి సత్పురుషునిగూడ యొకించుక చలింపజేసి యాకర్షించు నాబెంటో హోటలు'' యాంగ్లే యాచార పద్ధతులు గలిగి నగరమధ్యప్రదేశమున విలసిల్లియుండుటచే జనుల ననేకుల మద్యపానాసక్తుల జేసి విరాగుల నొనర్చుచుండెను.

ఒకనాడు స్నేహితత్రయము బజారున గృమ్మరుచుండ వీనుల విందులలర సంగీత రసవాహిని యారీతిగ వీనులగురియుచున్నదో యనునటుల నెవ్వరో పాటబాడుచుండ యందొకింత యాగిరి. ఆహా! ఆగానము వాణిదేవి వాయించు వేణునాదమట్లు, హరిభక్తి యారీతి యవతారమెత్తి దాయనఁగ వినెడివారి యాత్మను దోచునట్లు, కోకిల కంఠమట్లు మధురగాత్రము హార్మోనియం స్వరములతో

నమున్వాయించి పాటఁ బాడుచుండ తోఁవన బోవుచున్నాడి వారినందరి నచ్చోట యొకింత గూర్చొనఁ జేయుచుండిరి.

సంగీతమా! నీవంటి హృదయ విదారద వాసలము నవ్వులఁ బారద్రోలు బాణము వేరొండు ప్రపంచమున నుండ నేరదు. నీకుండు శక్తి యసమానము. నీదివ్య నినాదంబులచే పిపీలికాది బ్రహ్మ పర్యంతము యెల్లరు వశ్యులు వశీయుండనలసినవార లే ఏమి నీమహి మయొక్క విశేషము? తుదకు క్రూర భుజంగములను గూడ యొకింత యూరకుండ నిచ్చుచుంటివిగదా? గానమా? నీయమృత వాహినిచే సకల చరాచరము లెల్ల యుల్లల నాడించుచుంటివిగదా.

అట్లా స్నేహితత్రియమా గాన మాధురిచే యాకర్షింపఁబడి తత్ప్రదేశమున యొకింత యాకునటుల జేసెను. నారాయణుఁడది విని ‹‹కోకిల స్వరమువలె పాడు వారెవ్వరు? ఎంత హాయిగనున్నది దామోదరా! పాడున దెవ్వరో దెలియునా?›› అని యడిగెను.

దామో—ఎవ్వరో యననేల మాచెల్లెలే.

నారా—చెల్లెలా! మాకొకనాడుగూడ జూపలేదే.

దామో—ఇదే! మనము నిలుచున్నదే యిల్లు మాతమ్ముఁడు భానుమూర్తిది.

నారా—ఏమీ! తమ్ముఁడొకడుండెనా?

దామో—అవును.

నారా—దామోదరా? రమ్ము! లోనికిఁ బోవుదము. ఒకింత చెవులార విని వెడలుదము.

దామో—‹‹భానుమూర్తి యుండిన మనము బోవుటతగదు. ఇదిగో! నేవెళ్ళి కనుగొనివచ్చెదనని యింటిలోనికేగి తిరిగివచ్చి ‹‹నారాయణా! రమ్ము›› అని వారినిద్దరిని దోడ్కొని బోయెను.

భానుమతి యాదివఱకు దామోదరుఁడు తన కొసర్చిన యుపకృతికి మండిపడుచుండెను. దానికి తగు జవాబివ్వనుండెను. గాని యితరులెవ్వరో యుండుట తెలిసి యటను గాదనుకొని మిన్నకుండెను. హృదయమునందాకోపాగ్ని రగులుకొనుచునేయుండెను. అంత దామోదరుఁడు వారిని వెంట నిడుకొనివచ్చి యాసీనుఁడయ్యె. భానుమతి పరపురుషులకంటఁబడ నొల్లక గదిలోనికి బరువిడెను. దామోదరుఁడదిఁజూచి "భానూ? వీరందరు మనకు గావలసినవారలే. చిరపరిచితులు, అన్యథాభావించక నీవొకమారు పాడి మావీనుల విందు సేయుము" అని యడిగెను.

భాను— (క్రోధమునణఁచుకొని) అన్నా! నాయనంబెఱిఁగి యుండియు నన్నడుగుట యుచితమా?

దామో—వేడి వచ్చిన స్నేహితుల కవమానము గాకుండ గాపాడుమనుచుంటి నంతియే.

భాను—తెలుసుకొనని వారితో విశేషించి చెప్పుట యనుచితము.

దామో—నావమానము గాపాడవలదా?

భాను—పరపురుషుల యెదుట నాట్యమాడి సంతోషపరుపవలయునా? ఎంతటి యవివేకుఁడవు.

దామో—నాట్యమాడ మంటినా?

భాను—అదియొకటునుగనందుకు క్షమించితినిలే.

నారా—దామోదరా! పోనిమ్ము. ఆమెనెందులకు బాధించెదవు.

నీల—"నారాయణా! పోదమురమ్ము" అనివారిని దోడ్కొని వెడలి పోయెను.

అట్లు పోవఁబోవ వెంటోహోటపెదురయ్యె. పుష్పమధుర

సారమును గ్రోలు తేనెటీగ వికసించిన పుష్పమెదురయ్యెనేని యమం దానంద మొందినట్లు మనస్నేహితవర్గమా బెంటోప్పాటలు సమీపించినంతనే వారి దేహములకుల్లాసమబ్బె. ముకుళించిన పద్మములు పద్మమిత్రుని రాకచే భాసిల్లునట్లు వారి నాశ్రయించిన దుఃఖసముదాయము పటాపంచలయ్యెను. అవి యేమనములకో? వారికే దెలియవలెను గాని యితరులకుఁ దెలియదు. ఒకవేళ దెలిసినవారును వారివంటి వారే గావలయును.

ఆహా! ఏమిపేరి మూర్ఖత్వము? ఎందరు యమునసికొనుచుందురో? అసహ్యాకారంబులకు పనులెన్ని జేయుచుందురో? ఎందరు తెప్పతాగి విగత వస్త్రులై మొగుడు లాడుచుందురో! వలచుకొన్న గుంటెలు బగులు గాబోలు మనచర్యల నవలోకించిన వారలు నవ్వుదురని యొకింతయైన దలపోయక, సిగ్గు బిడియములు లేక మానాభిమానములు త్యజించి, మూర్ఖత వహించి చెడ త్రాగుచుండిరి గదా! ఇంట నున్నదంతయు కొల్లబోయెనని యిల్లాలేడ్చుచుండ, తినుటకు గూడును కట్టుటకు గుడ్డయును లేక నిర్భాగ్యులై పిల్లలు వగచుచుండ వంశమునకు కళంకమాయెనని బంధువర్గము కుందుచుండ లేని తలవంపుగలిగెనని సంఘము పరితపించుచుండ ప్రాణముపవిత్ర స్థలమునకు చంక లెగవైచుకొనుచు ప్రణయగీతలు బాడుకొనుచు నేగుచుండిరిగదా? సంసారము బట్టి బండలపాలైయు నవుడా ప్రణయగీతలు?

హా! భ్రాంత సంతానము నవ్వులపాలయ్యెనే? ఎంతటి హైన్యము. గర్భముల భేదించు చేతలుగాని వేరొండుగావు. ఇస్సా త్రాగి యూరకొనుచుండిరా యల్లరుల పాలై పోరాటముల సాగించుకొనుచు ఒకరినొకరు దిట్టుటొక్క విలాసముగ భావించుకొని నట్టనడి వీధిని చేతుల జేతులు గలిపిన యంతకన్న యవమానము వేరొండుండునా?

పరమేశ్వరా! యీనిర్భాగ్యులుండబట్టిగదా మాదేశమంత కంతకు క్షీణించుచున్నయది నానాటికి వృక్షము పెరగిపోవుచున్నయది. దీని నొకటి వేళ్ళతోం బెకలించి వేసినగాని దేశమున్నత స్థితికి రానేరదు. ఓనారాయణా! అమెరికా దేశీయులవలె అస్మద్దేశీయుల హృదయక్షేత్రమునందు సన్మార్గ సత్కార్యములకా బీజములనాటి యీఘోర కలికాల సురాపిశాచమును బారదోలు నటుల జేయుము. లేకున్న త్వరలోనే లెక్కలేనన్ని సంసారములు కూలిపోవును.

అట్లు స్నేహితత్రయము మాబొటొహోటలు బ్రవేశించి యందమర్చియున్న సోఫాలపై నాశీనులైన పిదప నారాయణుడు "బట్లర్! బ్రింగ్ షోక్ బాటిల్సు విస్కీ" అనెను. బట్లరు "ఎస్" యని గొనివచ్చి యిచ్చెను. వారు కావలసినంత సీసాలలో బోసి కొని గుటగుట ద్రాగుచూ మధ్యమధ్యన ప్రసంగమును సాగించుచూ దానికి దోడుగ నంజుడుగ "కేక్సు" మొదలగు భక్ష్యముల దినుచు యంతకంతకు మత్తు హెచ్చుగా యిట్లు మాటలాడ దొడంగిరి.

నారా—దామోదరా! నీచెల్లెలు బహుబాగున్నదిరా?

నీల—నీకు తగియున్నదిరా. నిజముగా నీవు బెంగ్లాడిన చిలుకగోరు వంకలాగ నుండును.

నారా—వహ్వా! నీలకంఠా? నీవిమర్శన బహు బాగున్నది. లెస్సగా జెప్పితివి.

నీల—నారాయణునివంటి గురువువద్ద శుశ్రూషజేసిన యీ నీలకంఠుని ప్రజ్ఞ యడుగవలయునా?

దామో—కాదామరి. ఆగురువునకు యీశిష్యునికి సరిపోయి నది. మాభానుమతి కాలిగోటికిగూడ యీడుగాని వాడవు. నిన్ను నీవే బొగడు కొనుచుంటివే.

నీల—నారాయణా! దామోదరుని మాటలు వింటివా?

నారా—వాని మాటలకేమి లే.

నీల—దామోదరా! అట్లయిన నారాయణునికి మీచెల్లెలిని గూర్ప నాదేమిరా?

దామో—ఈవఱకొక్కదాని నీపొట్ట బెట్టుకొంటివి. ఇంక నీనిని జూచితివి. పాపము! నీకళ్లోర్పవేమో?

నారా—ఏమిరా! నాకళ్లోర్పవా? ఛీ! యింకొక మారను ము. ఏమి చేసెదనో తెలియును.

దామో—ఏమిజేసెదవు?

నారా—ఛీ! బుద్ధిహీనుడా! నోరుమూయుము. నాసొమ్ము దిని నన్నే వెక్కిరించుచుంటివా? భద్రము జాగ్రత.

నీల—దామోదరా! వాదనలెందుకు?

దామో—ఏవమురా పిచ్చి? మా చెల్లెలినీతని కొసంగిన సమయాట లేకున్న నేను బుద్ధిహీనుడనట. ఒకదానిని మ్రింగి నీన్ను దాచినాడు.

నారా—అదిగో! అదియే నీపేర్లువద్దన్నది. నిప్పువట్టి మూర్ఖుండవు ప్రపంచజ్ఞానమే లేదు. ప్రౌఢ వివాహములు వితంతూద్వాహములు గావించుడని దేశము ఘోషపెట్టుచున్నయది. అట్టితరి నింతర వ్యాకులాప్నిచే మాడుచున్న నీసోదరిని చేగదీసి యీమె వ్యాకులతను బాపి సంతోష సాగరమున నోలలాడించినం దులకింత మాత్రము కృతజ్ఞత జూపితివి. మీరుమిక్కిలి నన్నే దూరుచుంటివిగా. సరి బాగున్నది.

దామో—(అతని మాటలమృత వాక్కులవలె సోకచెవులు వేర్లవై చెను. అతని మాటలు నిజములనుకొని) ఆమె చక్కగా జదువుకొన్నది. తనకు బ్రియమైన వాని బెండ్లాడును గాని చెప్పెడి మాటలచే వివాహమాడునా?

నా రా—నీవామెకు నాహోదాను దెలియజెప్పుము. నాకు గలయాస్తిని దెలియజేయుము సాలునకువచ్చు యాదాయమును జెప్పుము, ఇంకను నీకు నేర్పవలయునా? మనమందర మొకే తరగతి లోని వారి మగదా?

దా మో—ఆమెవద్దకు బోవుటకు నాకుసిగ్గు. మరియు నిష్టము లేనిది నేబోవుటెట్లు?

నా రా—ఇష్టములేదా? ద్రోహీ! నావంటివాడు నీచెల్లెలికి దొరుకుట మహాభాగ్యమనుకొనక మీదు మిక్కిలి యిష్టములేదను చుంటివా? నీ తల్లి కాలిపోను. ఆమెకు నావిషయము జెప్పితివా రెక్కలుగట్టుకొనివచ్చి నా మోలవాలదా?

నీల—(చేతితో వారించుచు) "దామోదరా! ఏలమామిత్రత్వము జెడగొట్టుకొనియెదవు?" అని నారాయణుని జూచి "నారాయణా! కొంచెమాగుము. తొందర పడినపనిసాగునా? ఇదివఱకొక్క దాని జేర దీసితివి: చిల్లిగవ్వనైన మన దామోదరుని కొసంగనైతివి. ఇప్పుడైన యియ్యక తప్పదు."

నా రా—అట్లడుగుము. ఇప్పుడు నావద్ద నిల్వనొక కానైనను లేదు. మన ఖర్చులకే జాలకున్నయది. అయిన నేమి? యిల్లు దాకట్టుబెట్టి సొమ్ముగ్రహింప నెంచితి. సొమ్మువచ్చినంత నే నిచ్చెదను. అంగీకారమే మోయడుగుము.

దామోదరుడు రూపాయలు అనిన మాటనువినినతోడనే మెక్కడలేని యానందము యాతని ముఖమున దాండవమాడె. ధనములభించు నంతియే గావలసినది. కులము, మానము, గౌరవము వీటితో పని లేదు. వావి వరుసలు బనికిరావు. చెల్లెలేగిన సరే తుదకు తన యర్ధాంగి యేగినను సరే. ఇట్టి బెంటో హోటల్ మరగిన కృూరకర్మునకు వావి వరుసలొక లెక్కలోనివా?

నీల—దామోదరా! ఏల యోచించెదవు?

దామో—కానిమ్ము! ప్రయత్నించెదను.

నారా— ‹‹ప్రయత్నించుటగాదు కార్యసాఫల్య మొనర్పవలెను. ఇదిగో! నీకు ముందుగనే యిచ్చుచుంటినని›› నూరు రూపాయల నోటు నొకటినిచ్చెను.

దామోదరుఁడు గైకొని సంతోష భరితుఁడై పేదకు బెన్నిదబ్బిపల్లుబ్బితబ్బిబ్బులై పోగా కుటుంబము చెడినను సరే యని మనంబున వితర్కించుకొని కులము చెడినను వ్రతము దక్కెననురీతి వారికి వాగ్దానమునర్చె. నారాయణుఁడాతని మాటలకు కడుంగడు యుబ్బి యిఁక స్వర్గ సోపానముల నెక్కగలనని గాలిలో రథ్యహర్మ్యముల గట్ట నెంచి దామోదరుని వెంటఁబెట్టుకొని పోయి తనవద్దనున్న విలువగల వలువలను, వివిధములగు స్వర్ణభూషణములను గొన్నింటినిచ్చి భానుమతికి దనపై వలపు గలుగ జేయనెంచి దన్ను బెండ్లాడునట్లు జేయుమని పంపెను.

హా! మానవంతులు విమర్శితమనుజులు వలువలచేతను, నగలచేతనూ మోసపోయ్యెదరా? తావుల విరజిమ్ము విరుగబూచిన మావి పూపొదను జేరును గాని దేటి యతివిలాసవంతముగ చూచువారల మనంబు నాకర్షించు మోదుగపూవొరకు నిచ్చగించునా? ఎంత విలాసమున్ననేమి దాని సౌరభ్యతను గదా గమనించును. గుణము కాని యాకారమది యేల? నీచమానవులది గ్రహింతురా?

భానుమూర్తి యప్పుడే యెచటికికో యేగియుండెను. గృహమున భానుమతి దప్ప యితరులెవ్వరు లేరు. అదే సమయమనుకొని దామోదరుఁడు తనకు నారాయణుఁడొసగిన వలువలు మొదలగు వాటిని చంక నిడుకొని ఒకవేళ దానొనర్చిన కార్యమునకు చెల్లెలు

చీవాట్లు పెట్టునని లేని వ్యసనమును ముఖమునకు దగిలించుకొని మెల్లగా నడుచు వచ్చుచు భానుమూర్తి యెచ్చటనైన యుండునని శంకించి యడుగుల చప్పుడైన పుట్టనీక బెదరుచు నక్కవలె వెనుదిరిగి జూచుచు నింటిలోని కేగెను.

దామోదరుఁ డింటిలోని కడుగిడినంతనే భానుమతి "ఛీ! దుర్మార్గా! అవలఁ బొమ్ము. నా ముఖమును జూడకుము". అని ధిక్కారభావములు గురిపించెను.

దామో—చెల్లెలా! ఏమియు దెలియని మూర్ఖుని నన్ను మాఱుమూలన బెట్టుచున్నావని కంచెయే చేను మేసినట్లు నీవు నన్నీరీతి యారడిబెట్టిన నే నిక యెవరి దాపున జేరువాడను. అయ్యో! నాకింక దిక్కెవ్వరు! ఒకవేళ నేనేదైన యపరాధము గావించియుండినచో నన్ను క్షమింపుము" అని కన్నుల నీరుంచెను.

భానుమతి—(స్త్రీ స్వభావాతిరేకమున నయనములనుండి నీరు గార) అన్నా! కోపగించుకొనని యొకట నే జెప్పెదను వినుము. నాథు నన్ను కారాగారమున కధికుఁ బాలిని జేయుచుంటివిగదా! ఎంతటి మూర్ఖుఁడైనను చెల్లెలి నవమాన పరుపఁజూచునే!

దామో—చెల్లెలా! ఎంతటివాఁడైనను చెల్లెని మోసపుచ్చు ఘాతకుఁ డుండునా? చదువురాని కతముననే నెన్నికష్టములకులోను గావలసివచ్చినది. అదంతయు నా పురాకృత కర్మముగాని వేఱు గాదు. తెలిసియుండిన దానికై కొని యుందునా?

భాను—స్నేహితులే యిచ్చియుందురనుకొనుము, తిరిగి నేవచ్చి మాటలాడునంతలోపల నావద్ద యుండిన కాగితమును గైకొని పలాయన మొనర్చిన దేల?

దామో—భానూ! నామాటలందు నీకు విశ్వాసముండిన

వినుము. లేకున్న వినుము. సత్యమెుతింగించుట మానను. నాడు నీవది దొంగచెక్కు (Cheque) అని వచించిన తోడనే దానిఁ గైకొని యిచ్చినవానిని బరిమార్చవనేగాని నాకోపము చల్లారకుండె. కోపాగ్నిచే రగుల్పఁబడి నీతో మాటలాడుటకే యవకాశము లేక వాని యొద్దకుఁబోయి చీవాట్లుబెట్టుటయే గాక వానికసిదీర ప్రాయశ్చిత్తము జేసితిని.

భాను—(వాని మాటలను పూర్తిగా నమ్మెను) అన్నా! పోనిమ్ము. నీవానాఁడెవ్వరినో వెంటబెట్టుకొని వచ్చితివిగదా, వారందరు నారాయణానుచరులేగద. అట్టి దుర్మార్గుల వెంట నిడుకొని వారి యెదుట వారాంగనవోలె పాటల భానుమని సన్నాజ్ఞాపించుట జూడ నీబుద్ధియెుందేగె. నీవాడిన మాటలకు నాకెక్కడ లేని కోపము దయించె స్నేహితుల యెదుట యవమాన మొనర్చుట వాడిగాదను కొంటిని.

దామో—భానూ! వారు దుర్మార్గులుగారు. నారాయణుఁడు జమీందారుని బిడ్డఁడు. అతని యనుచరులు మేము దుర్మార్గులమా!

భాను—నాకెందులకావిషయములు. పోనిమ్ము. నీచంకక్రింద మూటయేమి? బట్టల మూటకాదుకదా?

దామో—అవును బట్టల మూటయే,

భాను—ఎవరికి? ఎందులకు గొని వచ్చితివి?

దామో—మనకేగద. నీకుగా గొనివచ్చితినిదిగో! దీసికొమ్ము.

భాను—(అందుకొని మూటను విప్పి యందలి దువ్వాలువల గాంచి విస్మయమొంది) చాలబాగున్నవి. బహుఖరీదైయుండవలయు. మనవంటి సామాన్యులకెందుకు?

దామో—మనబోటి సామాన్యులవి గావనిదేవే. అదెట్లు?

మనము గోరిన మనవిగాదా?

భాను—మనమంత భాగ్యవంతులమా? అట్టి వలువల గట్టి సంతసించుటకు.

దామో—మనకే గొనివచ్చితిని గదా యింకేమి గావలయు.

భాను—మన కంతడబ్బెక్కడిది?

దామో—డబ్బు లేకనే యీసంగబడినవి.

భాను—డబ్బు లేకనే యిచ్చువారెవ్వరు?

దామో—నారాయణుఁడు.

భాను—(కను లెఱ్ఱజేసి) నారాయణుఁడా యిచ్చువాఁడు. ఆ ఆహో! హీ నన్నొక వారాంగనగనెంచితివా? నీచుఁడా నీవెట్లాతని మాయలలోఁబడి నన్నుగూడ యవమాన మొనర్పఁజూచితివా? ఆ తుచ్ఛుని పేరెత్తిన నాకడుపు మండుచుండును. నీవెంతలకు గాని వచ్చితివి. వాని సఖ్యముననే బారవేసుక పోతివా!

దామో—భానూ! అన్యథా దలంచకుము. నీ శ్రేయోభిలాషిని నీకెగ్గొనర్పఁ జూతునా? వాని చెల్మిబట్టియేగదా మనకష్టము లన్నియు గట్టెక్కును. జమీందారుని తనయుఁడుగదా.

భాను—"ఆ నీచుని విషయమిఁక ప్రస్తాపించకుము. పొమ్ము. ముందాబట్టలాతని ముఖముపై వేసి రమ్ము". అని గదిలోనికి వెడలి పోయెను.

దామో—భానూ! చక్కగా యోచించుకొనుము. వాని మూర్ఖక్రూరత్వములు మనమొక్క తృటిలో బోగొట్టలేమా? ఏమాలోచించెదవు. వేయేల? నీవిష్టపడినచో స్వర్గమున కూర్చొనబెట్టనా?

భాను—నీస్వర్గము నాకువద్దు. వానిమాటలిఁక గట్టిపెట్టుము. తక్షణమాతని దుస్తులాతని కిచ్చివేయుము. తెలసినదా?

దామో—(ఇకతన మాటలు సాగిరావను కొనెను. మెల్లగా

మాటలాడ నౌడఁ(గెను) చెల్లెలా! భానుమూర్తి యెటుబోయె?

భాను—వచ్చువేళ్లైనది. ఈపాటికాతఁడు వచ్చుచుండును.

దామో—(భానుమతినెగాదిగఁజూచి) భానూ! యివ్వాళ విశేషములేమి? ఈయలంకారము లేమి?

భాను—ఏటేట బంగారు పతకమును బడయులకై పీపుల్సుపార్కు (Peoples Park) నందు బాణసంచాను తయారు చేయువారు తమతమ నైపుణి వెలయ బాణముల తయారుచేసి యుదుదెంచిన ప్రేక్షకుల మనంబలరఁజేసెదరు అందున జయముగాంచిన వారికి గవర్నరు బంగారు పతకము నొకటి దయచేయుచుండును. ఈ యేడు మైసూర్కెర్కిడినుండియో యెందు విశేష ప్రజ్ఞగల శిల్పాములెందరో యుదుదెంచినారట. వారి విద్యానైపుణ్యము నివ్వేళ ప్రదర్శింతురట. అందుకైనా సహాధ్యాయులందరు పోనుంచిరి. వారితోఁగూడి నే గూడ పోనెంచితి.

దామో—అన్న సమ్మతించెనా?

భాను—నా యుపాధ్యాయురాలు మా వెంటవచ్చునని తెలుప సమ్మతించె.

దామో—జాగ్రత. దుష్టులు కొందఱుగాండ్రెందరో యచటికి వత్తురు.

భాను—నేనుండఁగా నుండ భయము లేదులే.

దామో—"సరి. మంచిది. అదిగో! భానుమూర్తి వచ్చుచున్నట్లున్నది. నేబోయెద"నని వెడలిపోయెను.

దామోదరుఁడు పోవుచూ "ఆహా! నామాటల వినునని యెంచితి. నాప్రయత్నములు రిత్తయయ్యె. అంతసొమ్ము పోగొట్టుకొనవలెనా లేక తగిన ప్రతిక్రియ జేయుదునా? నామనంబు నిర్బంధమే శరణ్యమని ప్రబోధించుచున్నది" అని గొణుగుకొనుచు వెడలెను.

# భానుమతి.

## ఇరువదియావ ప్రకరణము.

### అగ్నిహోత్రుఁడు.

ఏటేట క్రిస్మస్ వేడుకలతో బాటు బాణ వేడుకలుగూడ పార్కునందు జరుగుచుండును. వాటిని జూచుటకై జనులు తండోప తండములుగ వేర్వేరు ప్రదేశములనుండి యరుదెంచెదరు.

ఆవత్సరము బాణవేడుకలకై ప్రత్యేకముగ ధనము నధికముగ వెచ్చింపదలఁచి దూర ప్రదేశములగల ప్రవీణుల నెల్ల బిలపించియుండిరి. ఎవరి బాణములధిక ప్రశస్తములని నిర్ణయింపబడునో వారి కొక స్వర్ణపతకమును గవర్నరు దంపతులివ్వ దలఁచియుండిరి. అందులకై బాణసంచాలయందు ప్రవేశముగల వారెల్ల తమ విద్యల నగుపరచి మెప్పువడయుటకై పిలవని వారుగూడ వచ్చియుండిరి.

నేడే బాణప్రశస్తమును విమర్శించ నిర్ణయింపఁబడిన దినము. జనులప్పుడే పార్కంతయు కిటకిటలాడుచుండిరి. ఏవైపుజూచినను ప్రజాసమూహము దప్ప వేరొకటి గానరాకుండెను. జనులకై ప్రత్యేక స్థలముల నేర్పరచి యుండిరి. ఉద్యోగులకై వేరొక స్థలము నమర్చి యుండిరి. స్త్రీలకై ప్రత్యేక సౌకర్యము లొనర్చియుండిరి.

సాయంకాలము తొమ్మిది ఘంటలు మీరియుండెను. గవ

ర్నరు దంపతులప్పుడే వచ్చి కూర్చొనిరి. జనులెల్లరు నిశ్శబ్దముగ
కూర్చొనిరి. అంత మొదలిడవచ్చునని గవర్నరుగారు దెలియజేసిరి.
అనుటయే దడవుగ బాణకళా కోవిదులెల్లరు రంగములోని కరుపెంచి
తమతమ బాణముల నొక్కటొక్కటిగ కాల్పజొచ్చిరి. ఒకరి
బాణముకంటె యింకొకరిది పైకిబోవుచుండెను. దానికంటె పైకి
బోనివ్వదలచి వేరొకడు ప్రయత్నించుచుండెను. దీనినంతటిని విలో
కించుచుండిన ప్రేక్షక బృందము మంచి బాణములు కాల్చినప్పుడెల్ల
చప్పట్లు గొట్టుచు, కేకలు వేయుచు తమ సంతోషమును వెలిబుచ్చు
చుండిరి. ఇట్లు రమారమి యరఘంట కాలము తారాజువ్వల పోటీ
మాత్రమే జరిగెను.

స్త్రీ ప్రేక్షక గుంపున కొక ప్రక్క ప్రత్యేకముగ భానుమతి
సహచరోపాధ్యాయ సంఘముగ వరుసగ కూర్చొని వేడుకల నానందిం
చుచుండిరి. తారల మధ్య చంద్రునట్లు, పుష్పగుచ్ఛములోని
గులాబియట్లు, వజ్ర నిర్మిత భూషలలోని మణియట్లు దేదీప్యమాన
రత్నఖచితాంగుళీకము దాల్చి యశోలావణ్యాం బుధినప్పుడే మునిగి
బయటికి తెంచెనో యనునట్టుల దోష సంపూర్ణ చంద్ర కాంతి సమాన
ధావళ్య సౌందర్యంబు గలిగి యచట గూర్చొనియుండ వాగుంపులో
గల యంగనామణులకెల్ల మేటియనిపించు కొను భానుమతి తదేక
నిష్ఠతో వేడుకల నవలోకించుచుండ ఆ నయనములందలి యమృత
ధారా వాసనలు ప్రేక్షక జనంబుల నెల్ల యాకర్షింప జేయుచుండెను.
జనసమూహమున కొక్కింత యప్పుడప్పుడు చిన్నపిల్లలు తమకుయాగు
పడని కారణమున వెనుకవారి కడ్డుదగులుచుంటిమని భావింపక నిలచి
చూచుచుండ వెనుకనుండి "కూర్చో! కూర్చో!" యను కేకలుతఱచు
గవాడబడుచుండెను. భానుమతి కూర్చొనియుండిన ప్రదేశమున
కొకింత ముందున యొక చిన్నపిల్ల పదేపదే నిలువబడి భానుమతికి

గోపమును పెద్పుచుండెను. ఆమె చేయునదిలేక సూర్యాన్మ్రాని చేస్సైగ సేయుచు, జనులు వత్తిడిచే గల్గిన యలసటను బోగొట్టు పైట చెఱగుతో విసరికొనుచు నతివిలాస వంతముగ చేతితో చెదరిన ముంగురుల దుద్దుకొనుచు క్రీగంట దూరప్రదేశమున గల వేడుక వస్తు సముదాయమును బరికించుచుండ మోహాంధులు యువజన సంఘము నంతటిని యాకర్షింప జేయుచుండెను. దీనినంతటిని యొక యువకుండు మలిన వస్త్రధారి చేకనిష్ఠతో నామెపై దృష్టుంచి జూచుచుండెను. ఆమె చేయు ప్రతిచేష్టయు వాడు పరికించుచుండ నాతని జూచి వేడుక జూడవచ్చినవాడుగా గన్పట్టుచుండె ఆగంతకుడు గాబోలు. బహుశ మోహాతిరేకమున గల్గిన మదన తాపమునడచుకొన జూచుచుండె నేమో యవని కెఱుక?

ఇంతలో యుష్ణముష్ట్రాండి భాగమునుండి వెలువడిన యగ్ని కణమొక్కటి తాత్కాలికముగ నిర్మించిన వెదురు పాకలలోనికి చొరబడెను. ఎండిగడ్డి పోచలవలెనుండు నావెదురు చూర్ణయగ్నిచే రగుల్కొంబడి వెంటనే పెద్ద జ్వాలగా పరిణమించెను. దానికితోడుగ వాయుదేవుడు సహాయుడయిన యిక జెప్పవలయునా! పాపము! విలాసవంతముగ, వివిధ వస్తు సముదాయములతోడ చిత్రవిచిత్రంబుగ నలంకరించి బారులుదీరిన దుకాణములన్ని నొక్కమారుగ యగ్నియంటుకొనెను. ఆయగ్ని జ్వాలా ప్రభావముచే గలిగిన శోభనునను జనులుడికిపోవుచుండిరి. హా! అతిరమణీయంబుగ నలంకరింపబడ్డ వాన్యాగమొక్క నిముసములో బూడిదయై పోయెను. మంటల తాకుడుచే విద్యుచ్ఛక్తి తంతులెక్కడనైన జెగి ప్రమాదము వాటిల్ల గలదని యధికారులు వాటిని శక్తిహీనములుగ జేసిరి. ఒక్కనిముసములో దేదీప్యమాన కాంతులచే విరాజిల్లు విద్యుద్దీపమయంబగు నావిశాల ప్రాంగణము నొక్కమ్మడివి సీలమయంబుగాగ యేతెంచిన జనం

నాఁడు భానుమతి తనమాటలకు సమ్మతింపమి చాలమండిపడి స్వార్థ పరుఁడై నీచకృత్యమునిగూడ యోచించక స్నేహిత వర్గమున కామె యసమ్మతిని దెలియపఱచి వేరొక విధమున సాధించెదనని ప్రతిజ్ఞ బలికి తత్ప్రధానమును వారికి జక్కఁగ భోదపఱచి పార్కునఁ జెఱబట్టుటకై తగు పన్నుగడను బన్ని తనయభీష్టము నెఱవేర్చుకొనెను.

బండి వేగముగా బోవుచుండెను. డ్రయివరుగూడ యందు గూర్చున్నవారి కెంతమాత్రము దీసిపొయ్యెడివాఁడు కాడు గాన మొనలు దెలియక ప్రమాదము సంభవించునని యైనదలంచక బండి నతివేగముగా బోనిచ్చుచుండెను. అంతటి త్వరితగతిని పోలీసువారు గమనించినచో తప్పక నిలపిచార్జి బెట్టుదురని వారు సందుమార్గముల బడిపోవఁజొచ్చిరి. ఎంతదూర మేగినను కట్టకడ కొక చౌకమును దాటియే పోవలసియుండెను.

బండిలోని వారెల్ల నానంద సాగరమధ్యమున దిక్కుదెలియక నాటలాడుచుండిరి. అందున దామోదరు నానందమే యానందము. ఇఁక కొలది కాలములో ద్రవ్యము తనచేతిలో జిక్కునని సంతసించెను రాఁబోవు ద్రవ్యము నెట్లు వ్యయమొనర్చవలెనో యిప్పుడే మోఁబాగు లోనే యాలోచింప మొదలిడెను. గాలిలో సౌధములు గట్ట నారంభించెను. నీలకంఠుఁడు తన స్నేహిత శ్రేష్ఠుఁడగు నారాయణుని యభీష్ట సిద్ధికి తోడ్పడి యాతని మన్ననకు పాత్రుఁడనైతిగదా యని యుబ్బుచుండెను. నారాయణుఁడు దావలచిన గన్య నవలీలగా దొంగిలించి కొంటిననె గర్వపడజొచ్చెను. డ్రయివరు కాసంతపనికి కొండంత బహుమానము రాగలదనియువ్విళ్లు రూరించుకొనుచుండె.

నాటి దిన జన సమ్మర్దమును జూచి "యెలిఫిన్ స్టన్" (Eliphinston Picture Palace) సినిమావారు తమవద్దగల ఫిలుము

లలో కెల్లను త్కృష్టమగు "ముగల్దీసర్" (క్రీస్తులీలలు) యను ఫిలుమును ప్రదర్శించియుండిరి. ఆజన సముదాయమును జూచి దినమునకు మూడు ప్రదర్శనములు జూపుచున్నను ప్రేక్షకుల సంఖ్యదరుగకయుండెను. వారదిజూచి ప్రవేశ రుసుము లధికముజేసిరి. ఏమి జేసిన నేమి? ప్రేక్షకుల సంఖ్యగూడ యధికమొత్తము నిచ్చియే యధిక సంఖ్యాకులుగ బోవుచుండిరి. అది మోదములకో గాని దెలియుట లేదు. శ్రీకృష్ణ భగవానునిపై బ్రీతిచేతనో లేక యాతని దైవిక క్రీడలజూచి సంతసించి తన్మయత్వము జెందనభిలాషచేతనో గాని యెంత యివ్వమన్న నంత యిచ్చుటకు సంసిద్ధులుగ నుండిరి.

సినిమా ప్రేక్షకుల సంఖ్యలో చాలమట్టుకు విద్యార్థుల సంఖ్య మిక్కుటము. ఏప్రదర్శనమైనను సరే హాజరగుచుందురు. వారి ధనమునిన లక్ష్యమే లేదు. సంపాదించిన గదా దెలియును, వారి తలిదండ్రులే గంజియంబలి త్రాగియో, నగలు భూములు దాకట్టు పెట్టియో, ప్రాంసరీలు వ్రాసియిచ్చియో, యిండ్లు నమ్మియో, గడించిన ధనము నేమో తమ్ము జదివి యుద్యోగమునచ్చి పోషించెదరని తమతమ బాలురను పట్టణములకున్నత విద్యకై జనుప బంపెదరు కాని వారది యెంత ధనమైనను లెక్కగొనక డ్రామాలకని హోటళ్లకని, సిగరెట్లకని, పేకాటకని వెచ్చించి తుదకు విద్యయైనను చక్కగ నేర్చుకొనక పరీక్షలందు తప్పి పోవుచుండుట దెలిసియే యున్నది. ఏయిద్దరో గాని చదివి యుద్యోగము జేసి తండ్రిని పోషించువారు మొల్లముపై చెప్పంబడిన మహాభాగ్యమును గలిగియుందురన్న యసత్యముగాదు.

పండ్రెండు ఘంటల సమయము. సినిమా ముగిసినది. ప్రేక్షకు లందరు వెడలుచుండిరి. ఒక్కరొక్కరే తాము గొనివచ్చిన రిక్షాలనో, మోటారులనో నెక్కి పోవుచుండిరి. ఇద్దరు విద్యా

ర్థులు తిన్నగా మాటాడుకొనుచు సినిమా యద్భుతముల విమర్శించు కొనుచు; సమవయస్కులు గాన ఒకరి మెడపై నొకరు చేతులువై కొని మెల్లగ దాటినడచుండిరి. ఇంతలో నొక మోటా రతివేగ ముగ వచ్చుచుండెను. విద్యార్థులొకింత మార్గమునొండి తప్ప కొని నడువసాగిరి. జట్కావాడొకడు పాపము నాటిదినము కూలి దొరకనందున సినిమానుండి వెడలు ప్రేక్షకుల నెక్కించుకొన వచ్చి యుండెను. కాని వానిదుర దృష్టముచే వానిబండి నడిగిన వారే లేరు. అందుచే గలిగిన యాయాసముచేయ న్యమనస్కుడై తిన్నగా తనబండి నిముజ లించుకొని యింటికేగు చుండెను. దూగ మునుండియే తెంచుమోటారును గనుగొని యొకింతప్రక్క కొదిగి బండిని తోలుచుండె. మోటారు డ్రయివరు దెప్పదాగిన వాడగు టచే యెదురుగా బండిపోవు చున్నదని గూడ గమనించక ఘరీవేగ మున వచ్చి యాబండిపై బడెను. జట్కాతుత్తునియలయ్యె. మోటా రు తలక్రిందయ్యె. మోటారులోనివారు పరుగిడిరి. డ్రయివరు మూర్ఛితురాలైన స్త్రీయును మిగిలిరి. ఆదృశ్యము నవలోకించిన విద్యార్థు లిరువురా ప్రదేశమునకు బరువిడి వచ్చి వారినిరువురిని లేవ నెత్తిరి. దైవవశమునబండ్లురెండును పాడయ్యెనే గాని మనుష్యుల కెవ్వరికిని ప్రమాదము సంభవింప దయ్యె. స్త్రీకొంతసేపటికి మెలకువ గాంచె. కన్నులువిచ్చి నలుదెసల పరికించి "నన్నెవడో దుర్మార్గుడు పార్కున బంధించు చుండ దెలివిగొని యుంటి; తదు పరి నేమైతినో వాడెచటికి నన్నుగొని పోయెనో యిల్లుయిట పడియుండుటకు కారణమెయ్యదియో దెలియ రాకున్న దని" యను కొని దనయెదుటనున్న విద్యార్థుల జూచి "అయ్యలారా! నే నిచ్చ టెచ్చట నుంటినో జెప్పెదరా? "అని అనియడిగెను.

విద్యా—"ఎలిఫిన్ స్టన్ సినిమాలయమువద్ద నుంటి" రనిరి.

భాను—అయ్యో! నేనిట కెట్లు వచ్చితినో నాకే దెలియరా కున్నది. మీకు దెలిసి యున్నదయ యుంచినా కెఱింగింపుడు.

విద్యా—మీరెందుండి వచ్చుచుంటిరో దెలియదు గాని మీరీ మోటారున నుంటిరని మాత్రము చెప్పగలము. ఇంత కొక్క యిరువది నిమిషములకు ముందీ మోటారీ త్రోవను బోవవచ్చి యీ జట్కాకు ఢీకగిలి తల క్రిందయ్యె. యట్లగుటయే దడవుగ బండి లోని వారు కాలికి బుద్ధిసెప్పిరి. మీరును డ్రైవరును మిగిలితిరి. డ్రైవరు మూర్ఛయందు మునిగి యుండె. మీరిప్పుడే దెలివిదీరి యుంటిరి.

భాను—ఆహా! యెంతటి ప్రమాదము. దుర్మార్గు లెవ్వరో గాని నన్ను బట్టి మూర్ఛిలజేసి యెచటికో గాని పోవుచుండిరి. దైవవశమున యీరీతిగ పరిణమించెను.

విద్యా—తప్పించుకొన్నది యదృష్టమే.

భాను—"దుర్మార్గులను బట్టుకొని యుండిన బాగుండును. ఈ మోటారు డ్రైవరుకూడ వారి జట్టులోనివాడే గావలయు లేకున్న నన్నుగొనిరానేల? గాన వీనిని బట్టుకొన్న వారి కథ దెలియగలదు. రండు! వానిని నిర్బంధిత" మనెను.

విద్యా—"సరి యనిరి" అంతవారందరా డ్రైవరు బడి యున్న ప్రదేశమునకు బోయి వానిముఖముపై కొంతనీరమును జల్లినేద దీర్చి జేబురుమాలచే కొంతకాలము వీవకన్నువిచ్చి చూడ సాగెను. బండినుండి క్రిందబడుటచే గలిగిన తాకుడునకు మూర్ఛిల్లి యుండెను. వారాతని లేవనెత్తి కూర్చొన జేసి యందు కాపాడు చున్న పోలీసు వానిని బిలచి యాతనికా వృత్తాంతమును దెలియ జేసిరి. వాడనంతయు వ్రాసుకొని బండి నతివేగముగా దోలుటయే గాక ప్రమాదమును సంభవింప జేసినందుల కాతని చార్జిజేసి

మీాను మిక్కిలి భానుమతీ సమాచారమారసి యెఱిగి యుండెనేమో
కనుగొనుటకై యాతని బట్టుకొని "నీవెవరో! నిక్కము వచింపుము.
నీ వీమె నెందులకుగొని వచ్చుచుంటివో సత్యమెఱింగింపుము. లేకున్న
నీ నాలుక గోయించెదనని" బెదరించెను.

డ్రైవరు—బాబూ! నే నీమెనుగొని రాలేదు. ఎవ్వరో
కొందరు, దుర్మార్గులేమో నాకు దెలియదు. ఈమెను గొనివచ్చి
పార్కున గలిగిన యగ్ని ప్రమాదములో గాయపడినదిగాన యవుష
దాలయమునకు గొనిపోవలయును త్వరగా బోనిమ్మని నన్ను
తొందరబెట్టిరి. ప్రమాదావస్థలోనున్న యామెను రక్షించుట నా
విధాయకమని పట్టుకొని వారిని కూర్చుండబెట్టి జనరల్ ఆస్పత్రి
వైపు బండిని ద్రిప్పవారచటికివద్దని యీమార్గమున బొమ్మనిరి.
ఇటు వచ్చుచుండ ప్రమాదము సంభవించె. ఇంతకన్న నిక్కన
నెఱుంగ. "యని కల్లబొల్లి మాటల నల్లి జెప్పెను.

పోలీ—నీవుచూడ బడానోక్రవలె నున్నావు నడువుము.
ఠాణాకు "అని వాని మెడబట్టి నెట్టుకొని పోయెను.

భానుమతి తనకు సాయమొనర్చిన విద్యార్థుల సంభాషణలవిని
యందులో నొక్కనియెప్పుడో జూచి నట్లును, వాని మాటలు విని
నట్లును మనంబునకు దట్టగా వారినుద్దేశించి "అయ్యలారా!
మదీయ ప్రాణదానమొనర్చిన మీానామధేయము లెవ్వియో నా చెవిని
బడవేయుడు. మీాఋణము నే దీర్పజాలుదునే "యనియడిగికొనెను
విద్యార్థులలో నొక్కడు "అబలా! మున్నొక్కనాడు నిన్ను సము
ద్రపు టొడ్డున గాపాడియుంటి జ్ఞప్తికి దెచ్చుకొనుము" అనెను.
భానుమతి జరిగిన సంగతిని మనంబునకు దెచ్చుకొని "అయ్యా! ఈ
నిర్భాగ్యురాలిని మన్నింపుడు. తమరెవ్వరైనది యనుగ్రహింప నందు
లకు ననుమన్నింపుడు. ఇదివఱకు నాకురెండు మాఱులు ప్రాణ

దాన మొనర్చి సాయపడితిరి. మీసాహాయ్య సంపత్తిని రుపమా-
నము. మీయాదరణాభిలాషి యగణ్యము. మీఋణమునే వేయి
జన్మము లెత్తినను దీర్పజాల" నని వారికి వందనములాచరించెను.

విద్యా—"మీరంతగా కొనియాడవలయునా? మానవ జన్మం
బు పరోపకార చింతనంబు. దాన మావిధిని నెఱవేర్చితి" మనిరి.

భాను—మీబుద్ధి వికాసమునకు నేనేమందును. నిక్కముగా
మీరుగొప్ప వంశీకులు. అందరికిట్టి పరోపకార బుద్ధియల
వడునా?

విద్యా—మీరు మాయందుగల దయావిశేషముచే నట్లంటిరి
గాని మేమంత గొప్పవారముగాము.

భాను—గొప్పవారెన్నటికైన జెప్పికొనియెదరా? గులాబి
తానతి సౌందర్య సౌరభ్యమునని జెప్పుకొనునా? దానివాసనయే దాని
రంగే దానినంతటి దానిగా నొనర్చుచున్నయది. అట్లు గొప్పవారి
చేతలే వారిని గొప్పగానొనర్చుచున్నవి.

విద్యా—మిమ్ములజూడ చాలడస్సియున్నట్లు గన్పట్టెడిని.
బండి నొకదాని మాట్లాడనా?

భాను—"అయ్యా! క్షమించుడు. ఎంతమాత్రమువలదు.
నడచిరాగలనని" దారి నడువసాగెను

త్రోవలో విద్యార్థులు "మీగృహమునకు మార్గమియ్యది
యేనా?" యని యడిగిరి. భానుమతి "అవునని" జెప్పి "సినిమా
విశేషము లేమి? బాగుండెనా?" అని యడిగెను.

విద్యా—క్రిష్ణలీలలు బ్రదర్శించిరి బహు బాగుండెను.

భాను—క్రిష్ణలీలలా! మీరెంత ధన్యాత్ములు. నేనెన్ని
దినములనుండియో జూడ నభిలషించుచుంటి, నాకు సమయమబ్బి

నదిగాదు. సమయము దొరికినప్పుడు బ్రదర్శింపరు. ఇంతకూ మాఅన్నయనుగుతించినగదా! శ్రీకృష్ణ పరమాత్మ విశ్వరూప ప్రదర్శనము బాగుండెనా?

విద్యా—అందు జూడవలసినదే యది యశోదాదేవి కృష్ణుడు మన్ను దినుచున్నాడని యాతని బట్టి కట్టి కొట్టి బెదిరించుచూ యాతని నోటను తెఱువుమని యాజ్ఞాపింప నాదయామయుఁడు; లోకబాంధవుఁడు, నవనీతచోరుఁడు దననోట మన్ను లేదని బొంకుచు నోరు విప్పి పదునాల్గు లోకములనందు జూపింప తనముద్దులపట్టి నోట విశ్వమును గనుకొని చకితయై నమ్రదామఱచి చిన్నారిపట్టికే సాష్టాంగ దండప్రణామము లాచరించె. గోపాలకృష్ణుఁడు వెంటనే తన నోరును మూసియుంచి తల్లిని లేవదీసి "అమ్మా! తనయుని కైదైన తల్లి దండమిడునే" యనుసరి కామెమొక్క పరుగున నాచిన్నిగోపాలునుబట్టి కౌగిటదాల్చి ముద్దాడె. యాదృశ్యము నవలోకించిన గాని జెప్ప నేరితరము? చిత్రములే యట్లుండ నిజముగా నాడాదృశ్యమును గన్నులారగాంచిన గోపికలెంత ధన్యులోగద. నిక్కముగా నీసినిమాలవల్లగూడ జనులకెంతో బ్రయోజనమున్నది. అందున ముఖ్యముగా జనసామాన్యమునకు భక్తి ప్రబోధించవలయు, నన్న నిట్టివి చాల ప్రయోజనకారులగును.

భాను—మీమాటలను వినుచుండుటచేతనే నానోర నీరూరుచుండె ప్రత్యక్షముగ జూచిన వేఱుగ జెప్పవలయునా? భక్తిరసభరితములగు ఫిలిములను మాత్రమే ప్రదర్శించునట్లు ప్రభుత్వము వారు చట్టము జేసిన బాగుండును. వాటి ప్రయోజన మెక్కువ విలువగలదై బ్రకాశింపగలదు.

విద్యా—అవును.

భాను—ఇపుడెన్ని గంటలు?

విద్యా—పండ్రెండు మీరినది, ఎందులకు?

భాను—మరేమియును లేదు. మాయన్న నాకొఱకై వెదకుచుండును. ఎంతయో బ్రతిమాలి యనుజ్ఞ గైకొన్నదాన నింత యాలశ్యముజేసిన చీవాట్లు బెట్టక మానడు.

విద్యా—అంతగా మీయన్న దిట్టునేని మేమరుదెంచి జెప్పెదము లే.

భాను—"మీకెందులకాశ్రమ. అదిగో! ఆత్రోవన బడి పోయిననే బోవుదు" ననెను.

ఇంతలో తన స్నేహిత సహాధ్యాయ ఉపాధ్యాయ బృందము దవ్వులగాంచి సంతసించి "అయ్యో! నాతోడి వారదిగో గృహాభిముఖులై బోవుచుండిరి. వారితో నేగిన యేచీవాట్లును రావు. వారితో జనక తప్పదు. గాన తమకింతవరకు శ్రమయిచ్చినందులకు క్షమింపుడు. మిమ్ములను రేపటిదినము బీచ్‌లో గలసికొందు" నని చెప్పి వెడలుచు మరిమరి వారిపైననే దృష్టుంచి జూచుచుతోడి వారల జతజేరి యింటికేగెను.

# భానుమతి.

## ఇరువదియొకటవ ప్రకరణము.

### రహస్యము బయలుబడుట.

మనకథాభాగము నొకింత బర్మావైపు మఱలింతము. డాక్టరు క్షేమములారయుదము, ఏమిజేయుచుండెనో దెలిసికొందము

వైకుంఠశర్మ "అల్పునికధికారమొసంగిన యర్ధరాత్రమున గొడుగు బట్టుమను" లోకోక్తి ననుసరించి తనకట్టిదశలో యట్టి గౌరవప్రదమగు నుద్యోగమబ్బినందునకు వినయశీలత విడనాడి తన యధీనమునందున్న సేవకులనెల్ల బెదరించుచు వచ్చెను. సేవకులలో నెవ్వరైన పనియుండి వచ్చుటకొకింత యాలస్యమయ్యెనేని వారినితొలగింపించెదనని బెదరించుచూ యానాటి తప్పుకై లంచమును గైకొనుచుండెను. పాపము పొట్టకూటికై భానిసత్వము జేయు నాసేవకుల మనంబున కోపాగ్నిరగులుకొనుచున్నను యజమానురాలి కాప్తుడని నివురుగప్పిన నిప్పువలె మిన్నకుండిరి. అదిదెలసి వైకుంఠశర్మ మఱింత నిక్కిచూచే జిక్కినదెల్ల గొల్లవెట్టుచుండెను. కళావతికి ప్రియమైన వస్తువుల సమకూర్చుచూ, యామెకింపైన దువ్వాలు వలదెచ్చి యిచ్చుచు, యిష్టపడిన చోటికిగొని పోవుచు, కోరిన తిండిని దెచ్చి పెట్టుచు పూర్తిగా యామె యభిమానమును జూరగొనెను. ఎన్ని

పనులున్ననూ సరే కళావతి యెదురైన వాటినట్టే విడనాడి యెదు రేగివచ్చిన దని విచారించుచూ యామె కేది ప్రియమో కనుగొను చుండును. ఇట్లు యీసంభాషణ వృద్ధియగుకొలఁది ప్రేమాంకుర ముత్పన్నమయ్యెను. అది తిన్నతిన్నదిగా బెరుగజొచ్చెను. ఆప్రే మాంకుర మెన్నినాళ్ళు రహస్యముగా నుండగలదు, ఎన్నటికైన బయటికి రావలసినదేగదా?

వారిద్దఱు తఱచుగ తమరహస్య ప్రసంగముల నెవ్వరికిగాని దెలియనీయక సమయము దొఱికినప్పుడెల్ల సాగించుచుండిరి. ఈరీతి కష్ట ములనుండి గట్టెక్కి సుఖమునకు నెలవగు స్వర్గసమానమైన ఈయింటిని బ్రవేశించి తనభాగ్యమున కచ్చెరువందుచు తనసొత్తు ఫలించినందుకు లోలోన సంతసించెను.

జమీందారుని గృహమునకు వెనుకభాగమున చంద్రభవన మొండుగలదు. దానిచుట్టుకొని యొకవుపవన మొకటి యలరారు చుండెను. అందు సమస్త కుసుమఫల భరితంబులగు లతాని కుంజ ములు తమయాకుల మధ్య శుకపికాది విహంగ సంతతులకు లాయ ములు గలిగి చూపరులకు హాయిగొలుపుచుండును. ఉదకపూరితం బగు నొకచిన్న తటాకమావనపు మధ్యభాగమున విలసిల్లి పిల్ల కెరట ములను వీవనాళిగలిగి యందు విహరించు మానవాళికి హాయినిచ్చు చుండును.

అయిదు ఘంటలు మీఱియుండవచ్చును. సూర్యభగవా నుఁడు పశ్చిమాంబుధిని మునిగె. ప్రాతఃకాలమేగిన విహంగ పుంగవ సంఘములు ముక్తాహారంబులవలె బారులుదీర్చి తమతమకు లాయములు జేరుచుండెను. వాటివరుసలు నభోభాగమున కొక క్రొత్త సోయగము దెచ్చిపెట్టినట్టుండి చూపరులకు వినోద

కరంబుగానుండెను. మేతలకు బోయిన యాలమందలు పోతరిం
చిన కడుపులతో గృహాభిముఖులై సంతసమున పరుగిడి వచ్చుచుండ
తమతల్లులజూచి దూడలంబాయని యఱచుచు దోకలుబైకెత్తి
గంతులు వైచుచుండె. ప్రభుత్వ కార్యాచరణులగు నుద్యోగ బృంద
ము గొడుగుల కేలబూని తమతమ గృహముల జేరుచుండిరి. అట్టి
సంతోష సమయమున సాయంకాల మేఘమొత్తబునటకు నారుగ
నెక్కడనుండియో వచ్చిన చల్లగాలి తాకుడుచే వర్షనీరములచే నిండి
యంధకార కృతమయ్యె. తుంపరలు ప్రారంభమయ్యె. పాపము!
పూబోండ్రు తమ ప్రియులగూడి వనవిహారము సల్పుట కవకాశము
దప్పినందులకు చింతనొందుచుండిరి. కాని విలాసవతులు ప్రకృతి
యొనర్చిన యుపకృతికి నెంతమాత్రము వగవక తమమేడల జేరి
సరసము లాడుచుండిరి.

తోట గావలివాడు వానకు జడిసి కాబోలు పరుగెత్తి పోవు
చుండెను. అదేలకో యాతడా చంద్రభవనమువద్ద నొకింతయాగె.
హా! తెలిసె. అందెవ్వరో యిద్దఱు స్త్రీపురుషులు వినోదముగ
మాటలాడుకొనుచుండిరి. అరెరో! నేదియో వినుచున్నాడు.
ఏమిది? వాని ముఖము కోపము సూచించుచున్నది. వినగూడని
సంభాషణము గాబోలు నేవియో గొణుగుకొనుచున్నాడు. అది
యేమైయుండనోపు? మఱల నిక్కినిక్కి భవనమున నేమి జరుగుచు
న్నదో జూచుచున్నాడు. లోనికురుకుటకు బ్రయత్నించి విఫలమనో
రథుడయ్యె. ప్రమాదము వాటిల్లుననియో మరియే కారణముననో
వెనుదిరిగి యింటిలోనికి బరువెత్తెను.

రామశర్మ దన మందిరమున నేదో యాలోచించుకొనుచుండెను
నాటి ముందునాడు సేవకుడు వైకుంఠశర్మపై జెప్పిన మాటలందలి
సత్యాసత్యములు విచారించుకొనుచుండెనేమో. అందులకే దలుపుల

మూసి నొక్కుచో నశీనుఁడై యోచింప మొదలిడెను. అట్టి సమయమున తోటమాలి బిరబిర పరుగెత్తుకొని వచ్చి రామశర్మకు ప్రణమిల్లి నిలుచుండెను.

రామ—"ఏమిరా? పరుగెత్తుకొని వచ్చితివి" అనియడిగెను.

తోట— దేవా యేమని చెప్పుదును. ఏమిచెప్పుటకు నాకు నోరాడకున్నది.

రామ—నాతో వచించుటకు సందియమేల? నిర్భయముగా జెప్పుము.

తోట—నేజెప్ప బోవునది రహస్యమైనది. హృదయవిదారుణమైనది.

రామ—అది యెట్టిదో చెవిని బడవేయుము.

తోట—నిష్కళంక యశోమండలమగు మీదేహమునకు మీదేవేరి కళంక మాపాదించినది. గొప్పగొప్పబిరుదాళులచే బేరొందియసమాన్యకీర్తి గడించిన మీరు నాయీవార్తచే కృంగిపోయెదరని నామనంబు తత్తరపడుచున్నయది.

రామ—(ఆతురతతో) త్వరగా వచింపుము, ఊరకయేల కాల యాపనమొనర్చెదవు?

తోట—"దేవా! అవధరింపుడు. అమ్మగారును డాక్టరుగారును బ్రతిదినము చంద్రభవనమున గలిసికొని మాటలాడుచుండుట గలదు. ఏమో యజమానురాలు గదా చేయవలసిన కార్యముల విశదపరుచుచుండునేమో యనుకొనుచుంటిమి. నేడా విపరీతమేమని వచింతుము. ఆకృత్యారభకర్మమును నానోటితో వచింపజాల" నని యూరకుండెను.

రామ— (కోపముతో) ఇంకనూ యూరక్కసులచ్చుటనే

తోట—ఉండవలయు.

రామ—"నీవిందేయుండుము" అని బిరబిర నడచిపోయెను.

అప్పుడు కళావతి "నాథా! మీరాకవలన నాకపరిమిత యానందమును సమకూర్చితిరి. మీముద్దు మోమును తనివిదీర దగ్గరనుండి జూచుభాగ్యము పరమేశ్వరుఁడు లభింపజేసినందులకా దేవదేవునికి మ్రొక్కులిడితిని".

డాక్ట—ప్రేయసీ! మనగుట్టు యెవరికి దెలియ లేదుగదా?

కళా—ఎవరికి దెలియును. ఘాలాక్షునకైన యీరహస్యము దెలియదు. ఇఁకమానవ మాత్రులెంతటివారు?

డాక్ట—ప్రేయసీ! నాకుగలిగిన కష్టపరంపరలన్ని పటావంచలయ్యె. నీదాపు నన్ను గట్టుకెక్కించె. ఇఁక నన్నుగాచుభారము నీయదియే.

కళా—మీరు చింతనొందకుడు. వలసినంత ధనమున్నది. సౌఖ్యము నొసఁగ నేనుండ మీకు కొఱతగలునే?

డాక్ట—కాంతా! నీవిన్ని కష్టములకు లోనయ్యె నాయండనే జూచుచుంటివి గదా. నీఋణము నేదీర్పజాలుదునే? మనసౌఖ్యమునకెప్పుడు యడ్డు గలుగుచుండును. ఇకనూ యెన్నినాళ్ళిట్లు రహస్య ప్రవర్తనము. బందముల దెగగోయ ప్రయత్నింతము.

కళా—ఆముసలిగాడిదెను ప్రేమింతునని కొంటిరా? నన్ను జూచి యానందించవలసినదే గాని సుఖించుట కాతనియొద్ద రసికత యెక్కడిది. ఇన్నినాళ్ళు మీకొఱకై వేచియుంటి. ఇఁక ప్రయత్నమొనర్తము.

వీరిప్రసంగము నంతటిని రామశర్మ చెట్లమాటుననుండి వినుచుండె. ఇఁక తామసించిన వెడలిపోయెదరది యే సమయమని

హరిణంబుపై బడు వ్యాఘ్రంబు పగిది నొక్క దూకున వనలోని కత్తినిదీసి దాసితో నొక్క వేటున దెగవేయ లోనికి లంఘించి తలుపును నొక్కి వైచి వైకుంఠశర్మపైబడి యొక్క తన్నుదన్ని కత్తితో నరుకఁ జేయి బైకెత్తెను. వాఁడదరిపడి దిగ్భ్రమజెంది చేసిన తప్పిదమునకై మనంబు గుంద చేతులు కదలమెదలకుండె. అంత రామశర్మ వానిరొమ్ముపై గూర్చుండి "ఇదిగో! నేటితో నీప్రాణములు దీరె"నని చేయిబైకెత్తెను. కళావతి యీప్రమాదమును గనుఁగొని తటాలున రామశర్మ చేయినుండి కత్తిని లాగిపారవేసెను. అంత రామశర్మ "ద్రోహీ! నిన్ను రక్షించినందులకా నీకిట్టి దుర్బుద్ధి. నీకంటె యధమాధముఁడు వేరొకఁడుండఁబోఁడు. దురాత్మా! నీ ముఖముజూడరాదు. నీమేనగోడలు ప్రాణము నాశించితివా? క్రూరా! ఉత్తమ వంశసంజనితుఁడవయ్యు నిట్టి పాపకృత్యమా? నిన్నేమి జేసినను పాపము రాదుగదా?"

డాక్ట—(కోపమున) ముసలిగాడిదెవునీవు గూడ నన్ను దూరుచుంటివా? పిచ్చుకపై బ్రహ్మాస్త్రమెందులకని యూరకుంటినిగాని లేకున్న నిన్ను బరిమార్చుటకొక లెక్కలోనిదా?

రామ—ఛీ! దుష్టా! నిన్ను ప్రాణపదముగ జూచుచుండిన యజమానునికడనే యిట్టిపని నొనర్చితివా? విశ్వాసఘాతకా! నిన్నేమి చేయుదునో తెలియునా? నీసమాచారమంత పోలీసు కెఱిగించి నిన్ను బట్టియిప్పించుచున్న నేరామశర్మనుగాను.

డాక్ట—ఈగ్రుడ్డి బెదిరింపు లెవరికన్న జెప్పెదవు? నీమాటలకు భయపడుదుమని దలచితివా? నన్ను బట్టియిచ్చుటకు ముందు నిన్నునే బట్టియివ్వకుందునా? నాతల నీచేతనున్నది. నీతల నాచేతనున్నది. ఒకరికొకరు భయపడవలసిన ప్రమేయము లేదు. నీయింటిని నీవు చక్కదిద్దుకొనక నన్ను నిందించిన నేమి చేయుదును? ఈసాధింపులు

నన్నేమియు చేయఁజాలవులే!

రామ—"దురాత్మా! వెళ్ళుము నాయిల్లువీడి. ఇఁక నా యింట యడుగుపడిన నీమస్తకమును నిట్టునిలువున నే జీల్పించి వైచెదను. పాపాత్మా! ఎంతపని జేసితివి. నాపేరు ప్రతిష్ఠలన్ని నీ చెలిమిచే నశించె గదరా! ద్రోహీ! వెళ్ళుము. ఒక్కనిమిసముండఁగూడ" దనెను.

డాక్టరు కోపముతో నేమియో గొణుగుకొనుచు యిలు వెడలి పోయెను.

రామశర్మకు యొడలంతయు దహించినట్లాయెను. మేఘమాలికచే షోడశకళాన్వితుఁడగు హరిణాంకుని వదనము కప్పబడినట్లు యవమాన పరంపరలచే రామశర్మ పూర్తిగా గప్పివేయఁబడెను. నోటిలో నలదూర్చి రోకటిపోటునకు వెఱచిన లాభము లేదని చేయునది లేక యిట్లని చింతింపఁ దొడఁగె. "ఎంతటి సాహసమెంతటి సాహసము! నన్ను పరిభవించినది హితురాలైననేమి తుదకు ధర్మపత్నియైననేమి? విడచిపుత్తునే! అవంచకురాలిని! అకులపాంశనిని! ఆపాపాత్మురాలిని! భర్తృద్రోహిని! పరిమార్చకున్న నాకెక్కడిది బ్రతుకు". అని కన్నుల నీరుగార "ఎంతపసికి పాల్పడనుండిని! స్త్రీలనేమి జేయఁదగును? వారి నేమియుననరాదు, ఇదియంతయును పురాకృత ఖర్మముగాని వేరొకటిగాదు. దీనిరూపము కాలిపోన! దీపమును జూచిపండుగా దలంచి భ్రమింప జూచు పురుగు మాడ్కి దీనిమాయల జిక్కి పూర్తిగా దహింపఁబడితినిగదా! హా! స్త్రీలెంతటి సాహసవంతులు? వారి యూహలు బ్రహ్మకైన దెలియరావుగదా! ఏమియనుకొన్న నేమి ప్రయోజనము. నాయపకీర్తి బోవునా? హా! ఘాతకీ! ఎంతజేసితివే! దానినేమి యన్ననేమి ప్రయోజనము? ముసలి ముప్పున రెండవమారు వివాహము గావించుకొనుట నాయది యేదప్పు. వృద్ధుఁడగు నేను పుత్రార్థినై వివాహము గావించుకొన

నేల? ఇప్పుడీ యవమానముల బాల్పడనేల. ఎంతటి యనర్థము! దీనినెట్లు బాపికొందు? పరమేశ్వరా! నీవుదప్ప నన్నీ విపత్సముద్రము నుండి లేవనెత్తు వారీ యేడులోకముల గానరాకుండిరి. నిన్నే నమ్మితి. ఎట్లు జేసిననట్లు జేయుము. నీయాజ్ఞలు మీరుటకు నాకుశక్తి యెక్కడిది". అని పరిపరి విధంబుల చింతించుచుండెను.

# భానుమతి.

## ఇరువదిరెండవ ప్రకరణము.

### ప్రమదాభానుమూర్తులు

భానుమూర్తి యొకనాఁడు నెప్పటియట్ల తన శిష్యురాలగు ప్రమద యింటికిఁబోయెను. ఆమె యప్పుడే తలకుస్నానమొనరించి గూర్చుండి బోసికొనుచుండెను. ముడివిప్పగానే యాతల వెంట్రుకలు జలజలమని పాదములవఱకు బడి నీలమువలె నిగనిగ మెఱయుచుండెను. మఱియు సూర్యకిరణప్రసారమున దళదళమను యమునానదీ జలములకు సాటివచ్చుచుండెను. పాదములవఱకును బడుటయేగాక ఆశరీరమెల్లను నల్లని చీరవలె గప్పిన యాతల వెంట్రుకలా నాఁడా ద్రౌపతీదేవికే యున్నయెడల దుశ్శాసనభంగమగునేమో యన్న బెంగ యాసాధ్వీమణి బొందియే యుండదు. అట్లు నిలువఁబడి తల వెంట్రుకల నారవేసుకొనుచుండిన ప్రమదను భానుమూర్తి దిలకించి ముగ్ధుండై దనమనంబున నిట్లనుకొనె ,,దీని నెన్ని దినములనుండియో పెండ్లియాడవలెనను కుతూహలమున్ను బీడించుచున్నది. దీని సౌందర్యమునకే మానవమ్ము; కమలభవుఁడు చిరకాలము ఘోరతపమొనర్చి యాకమలముఖిని సృజించియుండవలె. లేకున్న ఆవిమలత్వము, ఆసొగసు, ఆవాలుచూపులెవ్వతెవద్ద గనుపించును. ఇట్టి తరుణీమణిం గూడని నాజన్మంబదియేల? అనేక మందయానలదిలకించితిఁగాని యీమందచందంబులగల సుందరవదన నెందును గాన? ఇక్కాంతామణిం జూచి నపుంసకులైన మారుండు నాపై శరంబులు బఱపుచుండును. అవివాహితయగు యీబాలికామణియొక్క మూర్తి

కన్నులలోనుండి యమృతము వర్షించుచున్నది. ఆకన్నుదమ్ము లెట్లు కర్ణాంతములై యుండెనో కనుబొమ్మలునట్లె దీర్ఘములై చిత్రించి నట్లున్నది. ఆముక్కునూవు పూవును బోలియున్నది. లలాటము చూర్ణకుంతలావృతమై యర్ధచంద్రాకార స్ఫుటమై యొప్పుచున్నది. ఆమెయధరభాగమెంత మధురమోహన కళాలలితమైయున్నది. ఆసద్గుణవారాసిని, సౌభాగ్యసుశీలను, మంగళాకార విగ్రహమును భగవంతుఁడు నాకు భార్యగా నొసగూర్చిన నేనెంత కొనియాడుదునో గదా. అని" ఏమీ! అంత కంతకు నాబుద్ధి పెడదారిని బోవుచున్నదే. అందనిద్రాక్షకు కళ్లు జాచినట్లున్నది. నక్కయెక్కడ! నాగలోక మెక్కడ! దుర్మార్గునికి బుత్రుఁడనై త్రాగుబోతుఁకు దమ్ముఁడనై దురాత్మురాలగు సోదరి కన్ననైన నే నక్కడ! సకల సౌఖ్యముల ననుభవించుచు సౌధాంతర్భాగముల దూగుటుయ్యాలలో గూర్చుండి హాయిగ కాలమువెళ్లబుచ్చు యీ భాగ్యవంతుఁడగు జమీందారుని పుత్రిక యేడ! నేనూరక గుటకలుమ్రింగవలసిన వాడనే! అనియనుకొనుచు పూర్తిగా మోహజలధి నొకమారు మునిగి తెప్పరిలి యుచ్చాటనాశీనుఁడయ్యె. ప్రమద భానుమూర్తిని దవ్వులగాంచి బిరబిర లోనికేగి పుస్తకముల కేలంబూని యచటికి తెంచి గూర్చొనియె.

మదనతాపముచే గలంచబడిన భానుమూర్తికి శిష్యురాలు సమీపమున గూర్చున్నకొలది యాతనిమనం బంతకంతకు యానందపరవశంబుగాగ దిక్కుదెలియక బెదరిన హరిణంబుపగిది దిక్కులుజూడజొచ్చె. ఆతనికంటికొక్క పచ్చనికాగితముగటి గనుపడెను. ఆతఁడద్దానినిగైకొని యిటునటుపరికించి యాశ్చర్యముతో "ప్రమదా! మేనెల పదమూడవ తేదియట. నీలకంఠశాస్త్రియట, వివాహమట ఇదిజూడ చాలచిత్రముగనున్నదే నీవింతవర కవవివాహితయని యే

యనుకొంటిని అదేల నాతో జెప్పవైతివి? నన్ను వివాహమున కాహ్వా
నించను గూడ తీరిక లేకపోయెనా? పోనిమ్ము! గురు దక్షిణమైన
నొసంగితివా?"

ప్రమద—ఆర్యా! ఏల మీరూరక భ్రమపడియెదరు?

భాను—ఏమీ నీకింకనూ వివాహము గాలేదా?

ప్రమద—మీకు లేనిదే!

భాను—"ఏమిది! దీనికేమందువు" అని కాగితము నిచ్చెను!

ప్రమద—అదియొక పెద్దగాధ.

భాను—ఊరక మాటలచే నన్ను గష్టపెట్టక జరిగిన దేదో నా చెవి
ని బడవేయరాదా?

ప్రమద—"వినుము. మా మామగారు నాకు వివాహము జే
యను సుమారు రెండేండ్లనుండి ప్రయత్నించుచుండిరి. నేనెప్పటికప్పు
డు దప్పించుకొనుచుంటిని కాని మామయత్త మాయిల్లిద్దఱు మాటి మా
టికి నన్ను నిర్బంధపఱుప తుదకు సమ్మతించితి. ఆదుర్మార్గుఁడెక్కడ
నుండి దాపురించెనో గాని వానివేషభాషలను మావారు పూర్తిగా
వంచింపబడిరి. మాటపట్టులు నిశ్చితములయ్యె. ఆహ్వానపత్రి
కల బ్రమరించిరి. గావలసిన పనులన్నింటిని సమకూర్చుచుండిరి.
మీరు దేనికి జేయుచుండిరో గాని నాకు వివాహమిక యొనిమిది దినములు
న్నదనఁగ నే మామామ నాగదిలోనికే తెంచి "ప్రమదా! నీకు వివా
హము స్థిరపడినది. నేటికెనిమిది దినములకు వివాహము" అనెను.
నాశ్చర్యచకితురాలనై "యిది యేటి పెండ్లి! వరుని నేనసలే జూడనైతి
నాకు దెలియకనే వివాహము స్థిరపఱచుటెట్లు?" అని నేనడుగ నాతఁ
డు మనకు జిరపరిచితుఁడేయనియు నీలకంఠశాస్త్రియే యనియు, చ
క్కగా నింగ్లీషు జదువుకొన్నాడనియు, మంచిసంబంధమనియు జెప్పె
ను. నేనాతని స్వభావమెఱింగినదాన నగుటచే యట్టిదుర్మార్గుని గ

ట్టుకొనుటకన్న నన్నొక్కపెట్టున నూతినిబడవేయరాదా! వానివద్దనే గుణములున్నవని నిశ్చయించితిరి. వానితండ్రి మంచివాడై యుండ వచ్చు. వీడన్ననో త్రాగుబోతు. ఒకింత నింగ్లీషుముక్కలు నోట యుచ్చరింప చేతనైనంతమాత్రమున పండితుడని నమ్మితిరా? వానినడత నెంచవలదా యనియంటి. అందుపై మామామ నన్నుయేమియు దెలియని దానవనియు మేమంత మూర్ఖులముగామనియు మొదలగు మాటలచే వప్పింపజూచెనుగాని నామాటనిమాటలు పెడచెవిని బెడితి. అంతనా వివాహమాగిపోయె.

భాను——చాలజరిగినదే! నీవుమాత్రము మీయత్తమామల మాటల జవదాటుటతప్పు నీశ్రేయోభిలాషులగు వారిమాటల వినక పెడదారిబట్టిన వారెంతకొమ్ముకాసెదరోగద!

ప్రమద—— దీనికంతటికి మీరే కారణము.

భాను——(ఆశ్చర్యముతో) అదెట్లు?

ప్రమద——మీరు నిలకడలేని చేష్టలన్ని బరికించి యుండుటచే నాడుమీ వివాహము నొక్కిన నాటినుండి వానిగుణాగుణములను జెప్పుచుంటిరి. అట్టిసచ్చాత్ముని వరించిననిక మీశిష్యత్వమున కేపాటి విలువయుండునో మీరేయూహించుకొనుడు.

భాను——ఏమీ! వానిగుణములొకవేళ నేవచించినంత మాత్రమున నీకిష్టమై నీయంతరాత్మచే ప్రబోధితంబైన వానిచే బట్టుట ధర్మముగాని, నీకిష్టముండియు నాపలుకులకు వెఱచివద్దనుట సమంజసమా! ఏటి మాటలివి?

ప్రమద——ఆహ్హా! పరిహాసమున కట్లంటిగాని వానినే వరింతునా? వానినడత నేనెఱుంగనా?

భాను—(ప్రమదచనువిచ్చి మాటాడుచున్నందుకు లో లోన సంతసించి తనమనోభావము దెలియజేయ నుద్యుక్తుఁడై) ప్రవాహోగ్రా రాలవైయున్న నీవుత్వరలో యెవ్వరినైన చెట్టబట్టవలయును యింకెద డయుట పాడికాదు! మీయుత్తమగుణములు నీకునంబెట్టింగిన వారగుటచే నీవునీకోర్కె దెలియజేయుసంతవరకు నివ్వాప్రస్తావనలో దింపరుగాన నీవే యెవ్వరినైన జేపట్టి సుఖింపుము.

ప్రమద—(మారాడక సిగ్గుచే దలవంచుకొనెను).

భాను—నావద్ద నీకేలసిగ్గు.

ప్రమద—(ముఖము వెనుకకు దిప్పుకొనెను)

భాను—ప్రమదా! ఏలయింతసిగ్గు సభినయించు చుంటి''వని యామె కరద్వయమును బట్టి యాడ్చి "కలగ నాతో వచింపరాదని యా''యనెను.

ప్రమద—(చేతులు విదళించుకొని కోపముతో) "మీపాద ములతో గోనీయక యిట్టి ప్రశ్నలతో మీకేమిబని. యువ్వనవతుల యెడనా మీసరసప్రసంగము చాలు చాలు మీగురుత్వము'' అని చురచుర జూచెను.

భాను—(భయముతో గడగడవణికి) ప్రమదా! నాయుదియు పరాధమైన క్షమింపరాదా! న-న్ను-దూషింప ద-గు-నా?

ప్రమద—చాలుచాలు మీప్రయభాణములు. చేయిబట్టుకొని గద్దించి యడుగుటయేగాక మీదుమిక్కిలి మాటలతో మన్నింపుమను చుంటిరా—

భాను—ప్రమదా! నేనదివరలో నీచేతులుబట్టుకొనలేదా? నేడదితప్పుగా భావింపనేల? నీకదితప్పుగాదోచిన చెప్పరాదా? ఇంక

నాప్రసంగముల గట్టిపెట్టి మనపాఠముల బ్రవేశింతము” అనిదీనము గాబల్కెను.

ప్రమద—మీరు వచ్చినప్పుడే మొదలిడక యింతవరకు నేల వ్యర్థప్రసంగముల బోనిచ్చితిరి?

భాను—“మాటిమాటికి నన్నేల తీక్ష్ణ భాషణములచే నొవ్వజేసెదవు? తప్పయిన క్షమింప మంటినే?” అనియామె మోలివాలి యూరకొమ్మని వేడికొనెను.

ప్రమద—(వాని వైఖరినంతటిని జూచి యొకవంక నవ్వు నొకవంక గురువు మనంబును నొవ్వజేసినందులకు విచారము పెనగొన) ఆర్యా! మీరింతటి బేలలని యెఱుంగనైతి. తప్పొనర్చిన వారలు గప్పిపుచ్చి మీరుమిక్కిలి యెదుటవారినే గద్దింపజూచుట స్వభావము. మీరట్లుగాక గడగడవణక జూచ్చితిరే! విచారమొందకుడు. మీమనం బెఱుంగగోరి నేబల్కినమాటల లెక్కగొనకుడు వినుడు! త్రికరణశుద్ధిగా జెప్పుచుంటి. మిమ్ములనుదప్ప యన్యులవివాహామాడనని నామనంబున నాడే నిశ్చయించుకొంటి. కానిసిగ్గుచే నాయభిమత మెఱింగింపనైతి. నేడుమీరే ప్రసంగమున దింపితిరిగాన నాకోర్కె దెలిపితి. నన్నుద్ధరించుభారము మీయదియే.

భాను—ప్రమదా! ఎంతటిజాణవే! నన్నుబూర్తిగా పరిభవించితివిగదా! కానిమ్ము! నిన్ను నేను పరిభవింపకున్న భానుమూర్తినిగాను సుమా!

ప్రమద—ప్రియురాలు జేయుదప్పులు ప్రియుఁడు మన్నించుటొప్పుగాని ప్రతిక్రియ జేయదగునే!

భాను—(లేనికోపమును దెచ్చిపెట్టుకొని) ఒల్లనివానివద్ద నేల నీవ్యర్థప్రసంగములు పాఠముగానిమ్ము.

ప్రమద—(విచారముతో) నాథా! కపటపు మాటలాయివి? లేక సత్యంబు లేనా?

భాను—నాథా! నాథా! యని యెవరు? ఇంకను నీకు నాథు డెవడు? ఇంక నన్నట్లు బిలువకుము. చాలు చాలు.

ప్రమద—(అశ్రుబిందువులు నేలగారగ) నిక్కమా! నన్నొల్లరా! ముమ్మాటికి నిజము లేనా?

భాను—నామాట లెందెంతమాత్రము యసత్యము లేదు. ముమ్మాటికి నిజము లే.

ప్రమద—(తటాలున నేలబడి) ఆర్యా! ఇంతకుముందు మీరు బల్కినమాటల కేమందురు? నాకరద్వయము బట్టి యూడ్చి వాక్రువ నక్కునఁజేర్చినదంతయు కపటమేనా? హా! పురుషులెంతటివారలు?

భాను—నిన్ను బరీక్షింప నట్లు జేసితినిగాని నిజమనుకొంటివా? అంచులకే పొసంగిన బ్రిత్యుత్తరంబునకు నీసుగుణ పుంజపురాసికి నే నెంతయులోలోన మెచ్చుకొంటి.

ప్రమద—హా! ఇఁక నాజవ్వనమంతయు వ్యర్థముగావలసిలదే నా? అడవినగాచిన వెన్నెలపగిది నాయవ్వన మడవిపాల్జేయ వలశిన దేనా? ఆర్యా! చరణములంటి వేడుకొనుచుంటి? నీటముంచిననూ పాలముంచిననూ మీరేసమర్థులు. బూరుగవృక్షము నాశ్రయించిన చిలుకరీతి మిమ్ములగన్న దాదిత్వదీయ చరణకమలములే నాకుగతి యిన స్థిరనాకల్ప మొనర్చుకొని మనంబున నాకనువగు జంటనుదయూ

రుజేసినందుల కాపరమేశ్వరుని ప్రేమాతిశయమునకు గీర్తించుచుం
డ నేజెట్టి వాక్యములు మీనోటవిన తటస్థించె! హా! నామనంబంగీకరిం
చిన వానినిజెట్టబట్టి యానందింపని యీశరీర మేల? (కన్నీరుగారు
చుండ) నాథా! మీమాటలే నిక్కములగునేని నాకిక గరళమే శర
ణ్యము ..అనిపైటచెరగు ముఖమున కడ్డముగ గప్పికొని లోనుండి
దుఃఖమును దిగమ్రింగి కన్నీరుమున్నీరై గార నేలపై బడిపోయెను.
భానుమూర్తి యా దృశ్యమునుగాంచి యామెనిష్కళంక ప్రేమాభిలా
షకెంతయు లోలోనసంతసించి ప్రియద మాటకు వ్యాకులచిత్తకొనర్చి
నందుల కెంతయు మనంబున గుందిచేయిజాచి యామెముంగురుల
సరిజేయనెంచి తలపైబెట్టి మెల్లమెల్లగ నిమురుచు కన్నీళ్ళొత్తి
"ప్రియదా! ఎంతటిజెలవే!" అనునంతకి ప్రియద తలిచేవేనుసేయుబడి
కాననంబున భీకరంబౌని కుంజములచాటున నిలువబడి యేడ్చుచుండ
బిడ్డదప్పులు తనవల్లినిగాంచినచో నెంతయానందంబున రివ్వునబరుగిడి
తల్లికౌగిట జేరి తన్నట్టి విపత్తువాల్జేసినతల్లి నొకిందమూరుచుండ యామె
ముద్దుబిడ్డనొదార్చుచు నెత్తుకొని ముద్దిడునో యట్లు విచారనిమగ్నయై
నిరాశజెంది తనువుపై నిస్పృహజెంది మనంబు నాకర్షించిన తనూవ
ల్లభుండొల్లమిని రాశాపీడితయైన ప్రియదనట్లు భానుమూర్తి తనకర
మునాచి కురుల నిమురనొక్కమ్ముననె హర్షవదనారవిందయై తనకౌగి
ళ నాలనిజేర్చి పొంగిపొరలివచ్చు నానంద భాష్పములనొత్తికొనుచు
..నాథా! మీరెంతరసికులు" అని వచింప భానుమూర్తి ..ప్రియదా!
యీపాటికింతి చాలును. మనపనుల సాగింతము మనయభిప్రా
యముల మనమనోపేటికల భద్రపరుపవలయును. ఎవరైనగాంచిన
చో ప్రమాదము వాటిల్లగలదుగాన చింతదక్కి చరింపు"మను నతికి
గ్రీష్మకాలతపమునకు స్రుక్కివరుగ్గై పడియున్న బూరుహము వర్షబిం
దువులు బడినతోడనే యెంతచురుకుగా తలయెత్తి సంతసముగొల్పు

నో నట్లు ప్రమద సంతోషసాగర మధ్యమందు లీనయై భావిపరిస్థితుల నొక్కమారుదలంచుచు సవినయముగ "నాథా! నేటికి పారములుజాలు!" అనిచిరునవ్వునవ్వి .. రేపు పెందలకడనే— అనిమోముక్రిందికి వాల్చెను.

# భానుమతి.

## యిరువదిమూడవ ప్రకరణము.

### వీరశర్మ—భానుమతి.

నాడు దనకు బ్రాణాపాయము బాపిన వీరశర్మతో దాను మరునాడు "బీచ్" వద్ద గలిసికొందునని మాటయిచ్చియుండిన భానుమతి మరునాడాతని గలిసికొనెను. క్షేమము లరసినపిదప నీక్రింది విధముగ వారికి ప్రసంగముజరిగెను.

భాను—ఆర్యా! మీవాగ్దానము జెల్లించితిని గాదా?

వీర—"నేనుగూడ చాలసేపటినుండి వేచియుంటి" ననెను.

భాను—మహాశయా! నాడు మీరు లేకుండిన నాదుర్మార్గులు నన్నుగొంపోయి యుందురుగదా? నిక్కముగా మీరునాపాలిట భాగ్యదేవతలుగాని వేరుగారు.

వీర—దుర్మార్గులు జాడ లేమైన దెలిసినవా? మీకెవ్వరైన శత్రువులు గలరా?

భాను—మాకెల్లరూ గావలసినవారే కాని ఆ ద్రాగుబోతు నారాయణుడుగూడ యందు జేరియుండునని నామనంబున నొకశ్రయూహాజనించుచున్నయది.

వీర—ఎవ్వడా నారాయణుడు? త్రాగిదిక్కు దెలియక వీధులలోబడి పొరలుచుండు జమీందారుని తనయుడా?

భాను—వాడే! నిక్కముగా వాడేగావలయును. తన్నువివాహ మాడుమని రాయభారముగావించి యుండె. నేనునిరాకరిం

చుటయేగాక కులకాంతులయెడ మెలఁగు విధానముగూడ దెలియని మూర్ఖపశువును గట్టుకొను సంతటి బేలనుగానని చెప్పియుంపితి. అం దుపై వాఁడు నాపై గినుకవహించి బలిమినిబట్ట సాహసించె నేమో?

వీర—మీకు వానిపై యనుమానముండినచో వానినేల రక్షక భటుల స్వాధీనము జేయకపోతిరి.?

భాను—అతఁడే గావలయునని నేను దలంచితినిగాని నిక్కము గా వాఁడేనని దెలిసినగాదా?

వీర—అయినప్పటికిన్నీ వానిచేష్టలొకింతవిచారించి కార్య సాధనమునకు గడంగుట భావ్యము.

భాను—అందుకనే నేనూరకుంటి. ఇంతకూపైవము మమ పాలిట నుండునంతవఱకు మనల నొరు లేమి జేయఁగలరు?

వీర—మీరు సురక్షితముగా నిల్లు చేరగల్గితిరని మీనోట వినినందులకు సంతసించితి. నేను మీతో వచించినగతి వచ్చుటకె న్నియడ్డంకులో! సహపాఠకులకిడిచి వచ్చుటయే చాలాకష్టమనిపించె. ఒక్కనిమిషము గానరాకున్న వెతకుచుట్టివారి నేమూర్చి మీక్షేమము లదెలిసికొను కౌతుకమున బిరబిరవచ్చి చేరితి. గాని మీరింమగాన రారైతిరి. ఇఁక రారుగదాయను వెడల నుద్యమించితి నంతలో మీరు గాన్పించితిరి.

భాను—"అంతయు మీ ప్రేమసూభిలాషయేగాని వేరొండుగా దు." అని చిరునవ్వునవ్వెను.

వీరశర్మయుగూడ తనమనంబున గుప్తముగ భద్రపరుపఁబడి న మోహాము నణపజాలక నొక్క చిరునవ్వునవ్వెను. ఆనవ్వులలో

నెంతమాధుర్యముండెనో గాని వారిద్దరుల మనంబుల నాహ్లాదజనితములుగ జేసెను. అంతవీరశర్మ "మిమ్ముల నెన్నినాళ్లనుండియో"—అని చెప్పిన నూరకుండెను.

భాను—అదేల నర్ధోక్తిలో—నిర్భీతిగ వచింపుడు.

వీర—మరేమియుగాదు మిమ్ములనాడు జూచినది మొదలు నామనంబు పరిపరివిధముల బోవుచుండెను. నూతనపరిచయమును యిట్టి ప్రసంగములతో మొదలిడిన కలహకారణ మగుటయేగాక మీరు మిక్కిలి హేయభావ మనుకొందురని నామనంబున లేకపోలేదు. కాని యదార్థవాదినగుటచే మనమొండొరు లొకింత విద్యావంతుల మగుటచే యన్యథా భావింపరని యెంచి నాకోర్కె దెలియబఱచితి. ఇంకను పై మీయిష్టము. ఒకవేళ మీరు నిరాకరించినచో నాజీవితము నిట్టే నడవిగాచిన వెన్నెలమాడ్కి వృధాశేయ సంకల్పించితి. మీహృదయ మిదివఱకే యెవరిపైనగాని లగ్నమైయుండిన నాయీ సాహసము క్షమించ ప్రార్థితుడను." అని సిగ్గుచే దలవంచుకొనియెను.

భానుమతి తనహృదయము దడదడమనిపింప నిర్భీతిగ వీరశర్మ యాడిన మాటలకు నొకవంక తనమనోరథము నోటమూదర వాక్కులు వెలువడినందులకు లోలోన భగవంతునికి నమస్కృతు లొనర్చుచు కామాతిరేకమున నోటమాట వెలువడక మూకీభావము వహించెను. అంత వీరశర్మ—మీయెడనపరాధము గావించియుండినచో నన్ను మన్నింపుడు. వేరొకనిపై లగ్నమైన మిమ్ములనిట్టి హృదయదారుణమగు ప్రశ్నలతో చీకాకుపరచిన యీపాపి వీరశర్మను నేమిజేసినను పాపము లేదు." అనిదీనావనుఁడై నోటమాటరాక కాలితో క్రిందనేమోగోకి కొనువానివలె నటించెను. భానుమతి యిఁక కాలయాపజేసిన హృదయవల్లభుని మానసమును క్లేశావంతముగ జేయుట

యేగాక పట్టుదప్పిపోవునేమోయని భీతిలి "ఆర్యా! పురుషులెంతటి వారలు" అనిచిరునవ్వునవ్వెను.

వీరశర్మ భానుమతి ముఖకమలమునందలి హాసభావ పూర్ణిమా శశాంకుని కిరణజాలములచే పరితప్త హృదయుఁడై పట్టరాని యానందముచే కెంజిగుర్లనంటి కోమల కరములబట్టుకొనెను. మనోనాథుని హస్తస్పర్శచే అయిస్కాంతము సూదిని బట్టురీతి గలిగిన మోహాతిరేకముచే భానుమతి మెల్లగ నవపల్లవ కోమలబాహుద్వయముచే వీరశర్మ మెడను నులవేసెను. ఆ బాహు పంజరమునఁజిక్కిన కిశోరమట్లు వీరశర్మ పండిన దొండపండునుబోలు యధరభాగమును మెల్లగకొరికెను అట్లొకని మేమకాలమొండొరులట్లు మైమఱచిరి. దవ్వులనెదో చప్పుడుగాగ వొండొరులు దూరముగ గూర్చొని యొకింతహాయిగ కాలముఁ వెళ్ళబుచ్చి పొద్దుబోయినపిదప నింటికి వెడలిరి.

యువతీ యువకుల ప్రథమ వీక్షణమతిపావనము ప్రేమయే యందుండిన చో నొక్కత్తృటిలో సూదంటురాయివలె నతికికొనును. లేకున్న నెంతబ్రయత్నించినను కానేఱదు. నాడువీరశర్మ భానుమతులు మొదటిపర్యాయము గలిసికొన్నప్పుడే వారమానసము లొండొరులపై లగ్నమయ్యెను. కాని సమయమేరుదెంచమి కూడి రావయ్యెను. నేడుయవి పూర్తిగా నేకీభవించెను అట్లువారు ప్రతిదినము "బీచి"వద్దగలిసికొనుచు హాయిగతమకాలము వెళ్ళబుచ్చుచుండిరి.

రాత్రిగావచ్చినది. ఇల్లు తాళము వేయబడియుండెను తనవద్దనున్న చెవితోవానినిదీసి దీపమును వెలిగించెను. నాటిదినపు వార్తాపత్రిక నొకమారు నటునిటుదిప్పి "ఇంకనూ రానికారణమే

మైయుండును? ఎన్నడు యిట్టివేళ కింటికివచ్చియే యుండెడిదే!" అనియప్పుడే టంగు టంగుమని గొట్టుచుడియారా శబ్దమునాలకించి లెక్కపెట్టి "ఏడుగంటలుదాటెనే! ఇంకనూ సముద్రపు గట్టున నేమి జేయుచున్నది. లేకున్న స్నేహితురాండ్రింటి కేమైనబోయియుండెనా! పోయిననింతసేపా!" అనియనంబు పరిపరివిధములబోవ లేచిగదిలోనుండి పడసాలలోనికి, పడసాలనుండి గదిలోనికి బచారుచేయ మొదలిడెను. అంతటిలో తృప్తిపడక చెల్లెలిగదిలోనికేగెను. అందున్న మేజాలోపలి భాగమున కొంతమిగిలిన భాగము బయటప్రక్కన వ్రేలాడుచుండెడి కాగితము నొక్కదానిని దిలకించెను. ఆతురమున నట్లు జేసియుండవలెననుకొని దానిని బూర్తిగా లోపలనిడ యత్నించి బయటికిదీసి నదియేదియో యొకపరిజూచి లోనబెట్టుదమని దీపపువెలుగున నిట్లు జదవదొడగెను.

"నాప్రియమైన ప్రేయసికి—

అనాధుండు వ్రాసుకొన్న విజ్ఞాపనము—

నీబుద్ధియిట్లు మారునని కలనైన దలంపనైతి. ఇన్నిదినములకు నీచెలిమి లభించెగదా యని సంతసించితి నిన్నునాస్వంతముగ భావించుచూ నీవుబెట్టిన వివాహపుగడువును దినదినము లెక్కించుచుంటిని. నామీదదయదప్పి రెండుదినములుగా నిచటికి రాకయున్న నాహృదయము పరిపరివిధముల బోవుచున్నది. నాపై గొంచెమైననూ జాలిలేక నిట్లొనర్చుట భావ్యమా? ఏదయిన బాధలో రాజాలకుండిన నాకు కబురంపిన రెక్కలగట్టుకొనివచ్చి నీమోములవాలనా! ఒక్కనాడు నీసుకుమార సుమసమాన సువదనము గాంచనిచో గల్గెడి హృదయతాపమే యిట్టులుండ రెండుదినము లెట్టెటులనో గడిపితి. నీవు మెఱపుదీగవలె నన్ను భ్రమింపజేసి యెండమావువలె నిరాధారునిజేయు

ట భాన్యమా! కోమలీ! నాహృదయతాపమడంచ పైనుండివచ్చిన ధన్వంతరివలె నన్ను నేఁడుగలిసికొనుము. లేకున్న నీమాటలన్నిఁటిని పొల్లులుగా దలంచెదనని నమ్ముము.

హా! ఆనాడునీవు ప్రమాణముగా వచించిన మాటలన్నియు గల్లలేనా! నన్ను నీస్వంతముగా నంగీకరించిన పిమ్మట నీదర్శనమే గగనకుసుమముగ గావించితివే! నమ్మించి మోసముచేయుట యేటిధర్మము? ఇట్లునిరాదరణ వహించిననాకు వేరుగతియే లేదు. నీస్నేహమునునమ్మి ప్రాణపదమువంటి సత్స్నేహవాస సహపాఠకుల నందరిని ద్యజియించితి నే!

నాస్నేహమే యుఁకనూ యభిలషించితివేని నన్నే తిరస్కరణ శుద్ధిగా నమ్మియుంటివేని నీవు త్వర మందినవెంటనే యెప్పటికయాలో వచ్చి నాప్రాణముల నిలుపుము.

సదా నీస్తోత్రముల జేయు

"V. R, S."

జాబు జదువుట ముగిసినతోడనే భానుమూర్తి కెక్కడలేని కోపముదయించెను. హృదయమున కారుచ్చిచిన ట్లుయుంజెను. అట్టిసమయమున దనచెల్లెలే యచ్చటయుండ దటస్థించి యుండెనేని యేమొనర్చియుండునో యెవ్వఁడు జెప్పగలడు. అట్లుకోపశపాయుత లోచనుఁడై దిక్కుదెలియక యిట్లని పలువరించె. "హా! స్త్రీలకు స్వేచ్ఛయన్న నిట్టిదే కాబోలు. పాపీ! ఎంతటిదానవే! ఏమియు మెఱుఁగని నంగనాచివలె మెలఁగుచుంటివే! అన్నియుకల్లలేనా? స్త్రీజాతిని నమ్మవచ్చునా? నేనుతలచుగా విహరించుటకుగూడ యనమ్మతి

జూపుచుంటినే! ఎంతమందలించుచున్నవేమి? బుద్ధిపెడదారినే బోయె గదా! వీడెవ్వఁడో నావంశలతకు చీడపురుగువలె దాపురించెనే! వీనిచెలిమి నెట్లు సంపాదింపగలిగె? రహస్య విషయములుగూడదాచక చనువుబట్టి చెప్పుచుండెడిది. యిట్టిరహస్యదుర్వ్యాపార మెన్నినాళ్ళనుండి సాగించుచున్నదోగదా! ఇప్పుడిప్పుడే కష్టములనుండి దొలఁగి సుఖదినములకొరకై నిరీక్షించుచుండ పెద్దపెట్టుననేకట్టి దురాగతము దెలిసికొంటిని? ఇంతకునాయది దురదృష్టమేమో" అని లోనుండి యేతెంచు దుఃఖబాష్పముల కనుగొనులనుండిగారి వస్త్రముచే దుడిచికొనుచు విచారమున స్పృహఁడై యెట్టకేలకు పడక కుర్చీపైఁబడిపోయెను.

భానుమతి తనమనోవల్లభునిగూర్చి సరసప్రసంగానందవశమున పొద్దుదెలియక నింటికేతెంచువరికి చాలాపొద్దుబోయియుండెను. అన్న భానుమూర్తి దప్పక తన్నుచీవాట్లు పెట్టకమానడనియనుకొని కుల్లగా కిటికీలోనుంచి తొంగిచూచెను. భానుమూర్తి చేత నేదియో కాగితమును బట్టుకొని దీర్ఘవిచారమున మునిగియుండుటను గ్రహించెను. ఆదృశ్యమును గాంచి భానుమతి తానుచేసిన తప్పును గ్రహించెను. తనరహస్య వ్యాపారము భానుమూర్తికి దెలసెగదాయని చింతించెను. చేయునదిలేక యన్ననే బ్రతిమాలుకొని తప్పుక్షమింపమని వేడనుద్యమించెను. తాను ప్రేమించిన యువకునకే వైవాహిక మొసర్చుమని యడుగదలఁచె. కానియట్టి రౌద్రమూర్తియైన యన్న సముఖమునకుబోవ కాళ్ళువెనుకాడెను. కాని యిఁకను తామసించిన యింకేమికీడు మూడునోయని పరుగు పరుగున యేమియు నెఱుఁగని దానివలె యతివినయము మోమునగానుపింప తిన్నగా తనగదిలో బ్రవేశించెను. భానుమూర్తి చెల్లెలేతెంచినంతనే కనులెఱ్ఱజేసి "ఓసీ! దూర్తురాలా! అంతకంతకు నీవును త్రోవకువచ్చు

చున్నట్టున్నది. చాలు చాలు నీయట్టిదానిని నా తో యిం క నూ నుండనిచ్చిన పరువుదక్కదు. పాపమని బోధ్చినందుల కిట్టియ పయశము దెచ్చితివే! వెళ్ళుము నీమనోహరుఁడెవ్వడో వానివద్దకు. కులటా! ఏదోయిన్నినాళ్ళకు సుఖదినము లబ్బెగదాయని సంతసించు చుండ దిరిగ నన్ను దురంత చింతాక్రాంతుని జేసితివే! ఏమొ నర్చిన సంకనాకళంకము దీరగలను. వాఁడెవ్వఁడో, ఏకులభ్రష్టుఁడో యెవ్వఁడెఱుఁగు? హా! నీనక్కవిసయముులందెంత విషముండునే" అని పండ్లు పటపట గొరుకుచు రోషకషాయిత లోచనుఁడై వెఱ్ఱివానివలె యిటునటుదిరుగుచు "సరే! నీకును నాకును ఋణముదీరినది" అని వి చారమనస్కుఁడై మరియొకమాఁకు పడకకుర్చీపై బడిపోయెను. భా నుమతి నోటనూటలే వెలువడవయ్యెను. ఆమెహృదయము నందలి విచారాగ్ని రవులుకొని మండిపోవుచుండెను. కంటిలో భాష్పబిందు వులు కాల్వలవలె దుముకుచుండెను. ఆమెయప్పటి దృశ్యము చూ చువారలనుగూడ విచారమున స్కులుగ జేయుటయేగాక భ్రమింపఁజే యఁజాలియుండెను. ఆమెకపోలయుగళము శ్వేత వర్ణోజ్వలమై పాలి పోయెను, గిచ్చువేసినను రక్తపుబొట్టను నయనా సుధాకరాసన మున నాడుగనప్పట్టుకుండెను, వీరశర్మయే యప్పటిదృశ్యము గాంచి యుండినచో గుర్తుబట్టెడువాడు గాడేమో! భయంకరముగు హృద యామయమతుల జ్వాలాయుతమై యుండెను, ధావళ్యము దేటప డు సింధుపూర్ణిమా చంద్రసమానముగు నావదనమండల మొక్క తృటిలో నెంతగామారెను, మేఘమాలికలచే గప్పబడిన హరిణాం కుని పగిది కాలవశమున గట్టువడియుండెను.

ఆమె నప్పటిస్థితిలో భానుమూర్తి గాంచుటతోడనే హృ దయ మొక్కమారుగ జల్లారిపోయెను. విచాగవేశమున శరీరమిా

పాదమ స్తకము పశ్చాత్తాపమునకంపించి పోవుచుండెను. తానాపా పాత్మురాలి ముఖమునే చూడకుండవలయునని యనుకొన్న వాడా మెముఖమునందలి విచారభావము జూచుటతోడనే పూర్తిగామారి పోయెను. చేసినదానికి కోపపడిన ప్రయోజనము లేదనుకొనెను. వెంటనే యామెచేష్టలంగాంచి "వెఱ్ఱిపిల్లా యిదియేమి" అని చిరునవ్వు నవ్వెను.

భానుమతి హృదయము గంపింప దేహముపై స్మారకము లేనిదై గభాలున యన్నపాదద్వయముపై బడిపోయెను.

భానుమూర్తి యామెను లేవనెత్తి చిన్నతనమునుండి వో ద్రికతో జరిగిన చనువునుబట్టి తనయంకమునందు గూర్చుండబెట్టుకొని యామెకన్నుల వెంబడి ప్రవహించుకన్నీటిని చేతితోదుడుచుచు "నాకు దెలియజేసియుండిన బాగుండెడిదిగదా" అనిచిన్నగ మాటలదింప ప్రయత్నించుచు "భానూ? ఎప్పటికిగాని నీవుజేయు ప్రతికార్యము నాతోనచించుచుండిన నింతగాపరిణమించి యుండదుగదా" యనివ చింప భానుమతి చెదరినధైర్యమును పోగుజేసుకొని యతిదీనావదన యై "నేజేసిన కార్యమతి నీచమైననూ పురుషులకుజెప్ప జాలినదిగాదని యూరకుంటినిగాని"—అని దుఃఖమాపుకొనజాలక మాటలాడ లేక బోయెను.

భానుమూర్తి యామెనోదార్చి "భానూ! భయపడవలదు. నీశ్రేయముగోరి నిన్నీరీతి బ్రశ్నించినందుల కెంతమాత్రము నొచ్చు కొనకుము. నీవుప్రేమించిన యాతఁడెవ్వఁడో కులశీలములెట్టివో యొకింత పరికింపవలదా! మంచివాడైనపక్షమున యాతనిపరిచయము జేసుకొని వివాహప్రయత్నమొనర్ప సంకల్పించితి. అంతియేగాని

నీ వెట్టిసంశయములకును లోనుగాకుము.'' అనియాభయమిచ్చెను.

భానుమతి దనయన్నదనకు దోడుపడినందులకు లోలోన సంతసిల్లి యది కల్లయో నిక్కమో యెఱుగునంతవఱకు తానుజెప్ప నిరాకరించ సనుకొట్టి ''అన్నయ్యా! నాతప్పును బూర్తిగా క్షమింపుము సింగపుకడుపున మేకపిల్లజనించునే! నేనంత యవివేకురాలనుగాను. నామాటలందు విశ్వాసముంచుము. నేనింతవఱకు పరమపావనినే సుమా! లేఖలోని విషయములు నిన్ను నమ్మకుండ జేసినను ప్రేమసముదాయపు మాటలేగాని వేరుగావు త్రికరణశుద్ధిగా జెప్పుచుంటిని'' అనెను.

భానుమూర్తి యాయుదంత మాలకించి సంతసిల్లెను. మనోహరుని నివాసము, గుణగణము, కులగోత్రములు మొదలుగాగల వన్నియును నొక్కటొక్కటిచే యడిగి దెలిసికొని తనమనంబున బొడమిన యూహ నిజమాగాదాయని సరిపోల్చుకొనుచు తనశిష్యుడేనా గాదాయని శంకించి దెలియబోవుదానికి విచారణ యేలనని మనమున చిక్కబట్టి ''భానూ! నీమనోహరుడటకు రేపీపాటికి గొనివచ్చెదవా'' యనియడిగెను.

భానుమతి సిగ్గుచే దలవాల్చుకొనియెను. అంత భానుమూర్తి యామెను జిరసంశయించ బనిలేదనిజెప్పి తప్పకగొనిరమ్మని చెప్పి తన పనిలోనిమగ్నుండయ్యెను.

మరునాడు భానుమతి వేకువనే మేల్కాంచి కాలకృత్యముల దీర్చుకొని తనమనోహరుని కొకవుత్తరమును వ్రాసిబంపెను. అతండా వుత్తరమును జదువుకొని సంతసించి నప్పుడే యేతెంతునని బుత్తెంచెను.

భానుమూర్తిగూడ యతనిరాకకై నిరీక్షించుచుండెను. ఒకవేళ యాతఁడు దనశిష్యుఁడే యయియుండెనేని సమ్మతింపదలఁచెగాని వానితలిదండ్రులు తనవంటివానితో సంబంధము చేయుదురాయని యాలోచనానిమగ్నుఁడై యుండ వీరశర్మ లోనికేతెంచెను. భానుమూర్తి యాతనిగాంచి "వీరశర్మా! రమ్ము! లోనికిరమ్ము" అనిచేసైగ జేసెను.

వీరశర్మ దనగురువక్కడనుండుటఁ గాంచి యాశ్చర్యచకితుఁడై యొకింత వెనుకకు దగ్గెను. భానుమూర్తి యాతనివైఖరినిగాంచి దిగ్గున లేచి యాతనిబట్టుకొనివచ్చి తనప్రక్కనాసీనునిగ జేసుకొని "వీరశర్మా! భయపడవలదు నీవుజేసినపని సమ్మతమేగాని యిఁకముందుత్తరములుమాత్రము వ్రాయకుము. అవి నాకపాయములు గలుగజేయును." అనివచించెను.

వీర—"మహాశయా! మీరా చెల్లెలిని సంతసపెట్టఁగఁ జేసిన పనికి నన్ను క్షమింపుడు. నేనప్పటింక జాలనైతిని."

భాను—"వీరశర్మా! నీవేమాత్రము భయపడవలదు. నాకుగూడ సమ్మతమే యిమ్మాటకే చెప్పుచుంటి నిక్కమును. కాని మీతలిదండ్రులంగీకరింతురా" అనియడిగెను.

వీరశర్మ తనగురుఁడే సూనృతివర్తనింప లోలోనసంతసిల్లి "మహాశయా! మీతో నిర్భయముగా మాటలాడినందులకు క్షమింపవలయును. నేనిదివఱకే యావిషయమాలోచించుకొని యున్నవాఁడను. ఒకవేళ మాజననీజనకులు నాయీసంబంధమే యంగీకరింపకున్న నేనింటనుండుటయే తటస్థించదనుకొనుఁడు. మాతలిదండ్రులకు నే నేకమాత్రపుత్రుఁడనగుటచే నామాటకు వారడ్డుసెప్పరు గానమీరెంతమాత్రము సందేహింపకుఁడు." అని నిర్భీతిగవచించెను.

భాను—నీవింకను చిన్నవాడవు. ముందువెనుకలు దెలియని వాడవు. కొన్నిదినములు దాళవలయును. తదుపరి మనము వివాహప్రయత్నము జేయుదము" అని చెప్పెను.

సీత—"సరి"యని దలయూచెను.

అంతభానుమూర్తి యాతనికి దనయింట షడ్రసోపేతముగ నిరతవింతరుచుల భక్ష్యాదులచే విందొనర్చి సంతృప్తుని గావించి పంపెను

# భానుమతి

## యిరువదినొల్గవ ప్రకరణము.

## సుందరి.

అమిత మెప్పటికిని చెడ్డదియే. అధికానందము గూడ దుఃఖప్రదమే. గాన నేదియు మితముమీరియుండరాదు. మానవులానందాంబుధి నోలలాడుచోతమ ముందటి, రాబోయ్యేడి పరిస్థితులొకింతయైన విచారించరు. వారికప్పుడది గోచరింపదు. ఎట్లన నానావిధ పుష్పజాతులనుండీ శేకరించబడిన మరందమును గ్రోలుయీగ ననాయాసముగ లభించిన మరందామృతమును గ్రోలునానందమున దానిలోబడి మరణించుపగిది మానవుఁడు సుఖదుఃఖములు రెంటికిని దలయొగ్గ నియోగింపబడ్డవాడు ఆనందమును మాత్రముచే బట్ట నెంచునుగాని దానిలోబడి దుఃఖభాంబుధిజేరునని యొకింతయు దెలిసికొనడుగదా!

భానుమూర్తి యనాయాసముగ తనకోర్కెలుదగిన తనకంటి కింపైన, మనంబున కుహాయినిగూర్చు ప్రియుదా పరిచయావిషయాను రక్తుఁడై పాఠములందరశ్రద్ధజేసి సుందరీగృహమునకు బోవుటయేమ రచె. ప్రమదయొకనాడు సుందరి తనతో భానుమూర్తి యింటికి రాడనివచింప నామె భానుమూర్తితో సుందరి బల్కినమాటలువచింప నాతఁడు దాజేసినపనికి మిక్కిలిచింతించి తనపాఠముల శీఘ్రముగ ముగించుకొని సుందరీగృహము ప్రవేసించె.

ఆరుఘంటలప్పుడే గొట్టియుండిరి. ఇంటదీపము వెలిగించబడెను. సుందరియింట నొంటిరిగా నావిశాల ప్రాంగణమున నొక

మూల నొదిగియుండుగదిలో నొకపడకకుర్చీపై దీర్ఘాలోచనా పరురాలై మనంబున బీడించుచున్న వలపునణచుకొనజాలక మోహోద్రేకము హెచ్చుకొలఁది విరహతాపమునక లంచఁబడి కోర్కెకుఁదగిన పురుషునిగూడి సుఖించనుద్యుక్తయై మనంబునకింపైన బూరుషుఁడొవ్వనో లేదోయని యొకవంక శంకలుబాడమ చింతాక్రాంతయై పరిపరి విధంబుల వాపోవఁజొచ్చెను. ఇంతలో భానుమూర్తి యెప్పటియట్ల లోనికేతెంచెను.

వెంటనే సుందరి తలుపోరజేసి దీపము నొకింత ముందుభాగమున నునిచి పుస్తకముల దమువుగాను నెపంబున యందందు చరించుచూ దావలచిన భానుమూర్తి యేతెంచినందులకు లోలోన సంతసించి యెపుడు కౌగలింతునాయని మనంబు వ్విళ్ళూరనొకానొక క్రొత్తపోయగము శరీరమునందగుపడ వయ్యారముగ నట్టకేలకు నొక చిన్న పాత్రమును కేలబూసి భానుమూర్తి దరికిజేరె. అంతనాతఁడు ‘‘సుందరీ! నేబనియుండి యీనాల్గుదినములు రానైతి. అదేలనింట నెవ్వరు నగపడుటలేదే! పరిచారకులు నహితమెందేగిరి? అంతయు జూడ చిత్రముగ నున్నదే’’ అనెను.

సుం—ఆర్యా! మాయమ్మయిప్పుడే నెక్కడికో బోయె. పరిచారకులిప్పుడే యిందు కేగిరి.

భాను—అదేమి యిప్పుడే! ఇంత వేగిరమా! నేను వెడలునప్పుడుగదా వారును దమయిండ్లకేగుట.

సుం—వారికేదోపనియుండి యొకింతపొద్దుండగనే వెడలిరి.

భాను—నీవుయిఁకనూ పిన్నవయస్కురాలవు. ఇంటమీవారెవ్వరును లేరు. అందున పరపురుషుండను నేను మీయిల్లుజొచ్చు

టయేదవ్వు. గాన నేనెంతమాత్రము నిందుండరాదు. గాన నీవువె డలి మీయమ్మనిటకు దోడ్కొనిరమ్ము.

సుం—౯.ఆర్యా! తమకేలనంతటి సంశయము. మనపాఠము ల బ్రారంభింతము. మాయమ్మ యిప్పుడే రాగలదు'' అని తలుపొ కింతమూసి యాతని సమీపమునకొచ్చి కూర్చుండెను. భానుమూ ర్తి యదిగాంచి యామెవిపరీతమునకు లోలోనదిగులొంది కొంత యెదిగి కూర్చుండెను, కాని సుందరి మఱింత సమీపమునకు బో యెను. అదివఱకే యామెమేనెల్ల బూసికొనిన పునుగుజవ్వాజివాస నలు గమ్ముగమ్మన తన్పైట నొకింత సడలించి జారునట్లుజేసె.

ఆహా! యిపుడా బడతినిగాంచినచో నేమనిజెప్పదగును? ఆ హేమరూపమునకు దగినమోము సంపూర్ణకళానిలయమోయన గ న్పట్టె. శశిరేఖల స్నేమైన దొంగలించి దగిల్చికొనియెనా యనుకొ నకమానరు.

పాఠములంద ప్రమత్తుడైన భానుమూర్తియుగూడ యెట్టెదుట నచ్చుబోసిన సుందరవద నారవిందముగలిగి వగలబోగులుచుండెడి సుందరీవిగ్రహముగాంచి యొకింత నోటనీళ్లూరించుకొనెనుగాని దా జేయుచున్న పనిమనంబునొల్ల నదియగుటచే హృదయమును మార్చు కొని దిట్టతనహించి “నేడేల నీతీరుననున్నది. నిక్కముగా నీమెతల్లి యెంతటియవివేకి. నవయవ్వనో జ్యోతులుదేలు సుందరాంగియగు యనుగు కూతునకింకనూ వివాహమొనర్పక యుంచుట యెట్టిబోర పాటు, వారిమానసములా మృదువులు. తీపిమాటలుబల్కు పు రుషావళి మాటలకు నొక్కత్రుటిలో జిక్కుదురు. మఱియునీకు కోపస్వభావ ఇష్టపడనియెడల సాహసించి బలిమినినైన దనపనిని కొనసాగించుకొను నెఱజాణ. అట్టిదుర్గుణావతి నేడేల నీతీరునను

న్నది. బహుశ పంచశరుని బాధకులోనై యుండెనేమో! అయిన నాయెడ నిట్టి ప్రవర్తనము గావించుటా! కానిమ్ము! దీనినింతటితో వారింపజూచెద" నని మనంబున నూహించుకొని "సుందరీ! ఇది యేటి పని? పరస్త్రీవి, నవయువ్వన సుందరాంగివి, శృంగారపరివేష్టితవు, అందముగా నలంకరించుకొని పరపురుషుండనగు నేవద్దనుచున్నను మితిమీరి యంతకంతకు సమీపమున కరుదెంచుచుంటివే! చాలు చాలు దూరముగా బొమ్ము! ఎవ్వరైన జూచిన నేమనుకొందురు! అందులకే దొట్టతొలుత నే జెప్పలేదా?" అని కోపముగా బల్కెను.

సుంద—"ఆర్యా! ఏటికింకనూ సంశయము? అదేల నన్ను జూచి రిచ్చపడియెదరు. నేను మీ చరణదాసిని. మీపైనున్న యాశ, మీయందలి యనురాగముచే నిన్నిదినములు గాచియుండుట సంభవించె. నేడు గదా సమయము. నింటనింకెవ్వరు లేరు. గాన మీ యుదారకృపాకటాక్ష వీక్షణములచే నన్ను ధన్యురాలిని జేయ వేడుచుంటి. కామాతురయున లజ్జను బాటింపక నాయీ భాషణముల మన్నించి నన్ను గోరివచ్చితి "గాన దరిజేర్చి ధన్యతగాంచు" డని బాహువుల నెత్తి నాతని మెడ నులిమి వేయబోయెను. భానుమూర్తి యయ్యది గాంచి కొంత వెనుకకు దగ్గి "సుందరీ! కొండ ముదిరి పూసరిల్లియైన దన్నట్లు నీ ప్రసంగము లికజాలింపుము." అని నిష్ఠూరోక్తుల దిట్టెను. అంతనా సుందరి "కోపగించితిరని నే వెనుకాడుదునని దలంచితిరా! మీసొగసు, మీవిలాసము, మీనవమోహనాకృతి, మీ యెలప్రాయము నే నెన్నడు గాంచితినో నాడే నా మనోహరులు మీరే యని మనంబున నిశ్చయించుకొంటి. మనోజబారికి సహించి పొంచితి. నేటికి సమయమబ్బె. ఎపుడు గైకొందు, నెపుడు ముచ్చటలు దీరు, నెపుడు నావిరహాగ్ని జల్లారు నెపుడు ఆనూనందసమయ మబ్బున

నఁగొంటివి. నేటికా పరమేశ్వరుని కృపచే యింట నెవ్వరు లేకుండుటయు దటస్థించె. గాన మీదరి జేర్చుకొని సమరతుల దేలింపుము." అనుసరికి భానుమూర్తికి మేనెల్ల చెమ్మటలుగ్రమ్మె. అచ్చెరుపాటును రిచ్చపాటు నెక్కొన కొంతసేపటు లూరకుండి "మూర్ఖురాలా! ఇది నీకుదగునా? ఎంతటిమాటల నా చెవిం బడవేసితివి. ఈసంగతి దెలిసిన నాకెంతటి యుపయశము. ఓసీ! పాలవంటి నిర్మలకులమున నుదయించిన దానవు. నీతి యొక్కింతయును లేక యిట్టిపని నాచరింపనుంటివి. ఇంతేకాదు యావివాహితవు. అనతికాలములోనే వృత్తమువంశసంజాతునొక్కని బెండ్లియాడి వైభవముల కాటపట్టగు జమీందారిణీయా జమాన్యమును జేపట్టనుంటివి. అట్టిదానవు నీవిట్టిపనికి బాల్పడ భావ్యమా!" అని బుద్ధిగఱప "మహాశయా! నీతులు దెలియని దానననుకొంటిరా" యన "అన్నియు దెలిసినిట్లు నాచరింపనుంటివా! చాలు చాలు నేనిటనుండవగదు" అని లేవబోవ సుందరాంతన వక్షస్థలము నొకింతయుబ్బించి పయ్యెటవేసి యాతనిపై బడెను. ఆతండు కోపోద్దీపితుండై "కులటా! నీనామాలకుజిక్క నేనమాయకుండను గాననుకొనుము." అని దప్పించుకొని దలుపు దెరువబోయెను. అయ్యది గాంచి సుందరి "ఎక్కడికేగెదవు నన్ను వీడి—రా! రండు!" అని యాతని యీడ్చి తనవక్షస్థలమున గానించుకొని బాహుపంజరము నాతని బంధింప "పాపీ! నీవేమి జేసినను నేనొల్లని కార్యము జేయువాడను గానని తనహస్తముల యామెబంధముల విడిపించుకొని తొందరపాటున తన "రిష్టువాచ్" (wrist watch) నేలబడిపోవ నదియుగమనించక సింగమునుజూచి బెదరుజింకవలె నొక్కగంతున గదియావలకుమికి గబగబ బరుగెత్తెను.

సుందరి దనకుజరిగిన పరాభవానలమున కోపోద్దీపితయై "జొ

రా! యెన్నివిధములఁ బ్రతిమాలుకొన్నను వినఁడయ్యెఁగదా! అతని మనస్సెంత కఠినమైనది. వలచి పైఁబడ నిరాకరించు పురుషు లుందురే! హా నాయీ సింగారమదియేల? యీభూషలలవియేల’’నని యొక్కటొక్కటి గవిసివైచి యొడలంత రక్కి రక్తమయము గావించుకొని మూల్గుచు నొకమూలఁబరుండెను. ఇంతలో సుందరి తల్లి యేతెంచి ఆవ్యవస్థను విలోకించి తనకూఁతు బ్రతిమాలి యిట్లుండుటకు కారణంబేమని యడిగె. సుందరి తన్నా భానుమూర్తి పలుభంగుల జెప్పినను వినక యవమానపరుపదలఁచి పయ్యటదీసి కౌగలించుకొనుటయేగాక వలపు వలపు మన్ననా ముద్దిడి నాయమ్మ రానియమ్మ! నీపనిబట్టించెదను, అనుసరికి నోకేపరుగున దిక్కుదెలియక చేతినుంకొక్కటునకుండెడి ఘడియారము క్రిందబడిపోవ దానినైనను దీసికొనిపోక పరుగెత్తెనని జెప్ప నామె తోకద్రొక్కిన త్రాచువలె మండిపడి “జారా! నీకెంతకండకావరము. పరస్త్రీయని యినుమంతయు వలంచక నీయిచ్చకంబులు నలుపనెంచితివా కానిమ్ము! నిన్నేమిజేసెదనో యని పరుగు పరుగ పరుగులిడి పినిశర్మ యింటికేగి నాతనిజనకునితో నావృత్తాంతమంతయు సవిస్తరముగా దెలుప నాతఁడు ‘‘శివ! శివా! ఎట్టిమాటలు వినవలసివచ్చె. కానిమ్ము! వానిపనిబట్టింతము వాడెందు బోగలఁడు. నీవింటికరుగుము. నేనాసమాచారమును కనుగొనెదగాక’’ నని యామెనంపివైచి తనసేవకులకు నాడుభానుమూర్తి దనుయింట కాలిడిన మెడబట్టి యవతలికి గెంటివైచుఁడను యాజ్ఞయిచ్చెను.

# స్త్రీ సాహసము.

ఔరా! స్త్రీలెంతటి సాహసవంతులు. వారియూహలు బ్రహ్మకైన దెలియరావుగదా! వారు జేపట్టినకార్యము గొనసాగకున్న యెంతటికైన వెనుదీయరుగదా. పాపభీతియను నదవారెఱుంగరు కాఁబోలు చంచలహృదయులుగావుననే రాజులు తమరమణుల నంతఃపురముల నునిచి తుదకు గోటలోగనైన చొరనివ్వకుండుట. స్వేచ్ఛానుసారము నిహాన్యదేశములుగూడ యీపద్ధతి నవలంభించెదరు. ఇదివారిని రాటంక మగ్వాపారమున కొకనిర్బంధకము.

వీరశర్మ భానుమూర్తి పైకొండంతనేరము మోపఁబడినందులకు చాలావిచారించి నిజానిజములెట్టిదో లోకమునకు సత్యవార్తదెలియ జేయనుద్దేశించెను. మఱియు నాతఁడొకవేళ భానుమూర్తి యపరాధియైనపక్షమున నాతనిపరిచయము వదలుకొనవలసియుండుటయేగాక భానుమతీ పరిణయముగ గడుకష్టసాధ్యమగునని చాలచింతించెను. ఏది యెటులున్ననూ సత్యము తెలిసిగాని కర్తవ్యమును నిర్ణయింపగలండెను. అందులకై భానుమూర్తి యింటికిబయలుదేరెను.

"అయ్యో! ఇంట నెవ్వరు లేరని జెప్పినప్పుడు తిరిగియిచ్చటనే నాశీనుఁడనై యిట్టిపరాభవానలముచే దహింపబడనేల? ఇఁక నేడేమికీడు మూడనున్నదోగదా! ఆసుందరి నాకెక్కడనుండి దాపురించె. ఒకవేళ దానికోర్కె నేఫలింపజేసియుండిన యిట్టిసంకటములకు లోనుగాకుండ నుండెడివాఁడనేమో! ఛీ! ఛీ! అట్టినీచవృత్తికి బొల్పడునంతటి యవివేకినా! నాయునన్నును జూరగొన్నయువతీ స్నేహమొక్కటి దప్ప యన్యుల దలయెత్తియైన జూడదలంతునే! హా! ఆవార్త యంత

టితో మునిగిపోయిన మేలే! కానినేనింకెటుల దలయెత్తికొని దిరుగు వాఁడ. దైవమా! నీలీలలు మానవాళికి గ్రాహ్యములు గానివిగదా! ఘడియకేమివచ్చునది యెవఁడుజెప్పగలఁడు. కాలచక్రమెటుదిరిగిన నటులగును. కానున్నది కాకమానదుగదా''యని భానుమూర్తిమ రునాఁడు దనయింటిలో విచారమనస్కుఁడై దనకుగలిగిన యపనింద నొకింతదలపోసికొనఁజొచ్చెను.

వీరశర్మ భానుమూర్తిని బరామర్శింప నుద్యుక్తుఁడై భాను మూర్తి యింటిలోని కడుగిడినంతనే యాతఁడు దిగ్గునలేచి వీరశర్మను దనప్రక్కన నాశీనునిగ జేసుకొని మెల్లఁగా ,,వీరశర్మా! సుందరియె ట్టినీచురాలు. హా! సన్న్యాకగవ్వకైన బనికిరాకుండ జేసెగదా! అ యిననేమాయె లోకులే నిజము నిర్ణయించెదరుగాక''యని యూర కుండెను. వీరశర్మ తలవనితలంపుగ తనకునువచ్చెఁడే ఆప్రసంగము నడుదింప దటాలునయందుకొని ,,మీరేయామెను బలవంతపఱచితిర ట. వద్దనుచున్నను నామెపైబడి...............'' ,,ఏమేమీ! నా మెను.........బలవంతపఱచితినా! ఓపరమేశ్వరా! నీవే సాక్షి. అని'' వ్యాకులభారమున మనంబుక్రుంగ దలవాల్చికొనియెను.

,,ఆర్యా! మీగుణంబు లెవ్వరెఱుంగరు. కాని స్త్రీలమా టలే లోకులు బాటింతురుగాని మనవచనములు సత్యంబులైనను య సత్యంబులేగదా!''

,,లోకులేమనుకొనుచుండిరి''?

,,జనులెల్లఱకు దెలుసునో దెలియదో నాకు దెలియదుగాని యావార్త మాతండ్రివిని చాలగా కోపించుటయేగాక మిమ్మల మాయింటికి సహితము రానీయకుఁడని సేవకులకనుజ్ఞయిచ్చె''

"కులటా! నీకు నేనొనర్చిన యుపకృతికి నాకెట్టియుపయశము దెచ్చితివే! వీరశర్మా! తొట్టతొలుతనే సుందరీపరిచయమేవలదని మీ తండ్రితో వచించితి. మీతండ్రి భరవసాపైన నేనాపనికియ్యకొంటి. కానియిట్టి యనర్థములున్నని యాయనమాత్రము కలఁగాంచెనా! అయిన దేదో యైనది. చింతించిన బ్రయోజనమేమి. జరుగవలసిన కార్యక్రమమునకు గడంగుటమంచిదిగాదా! నాకుజూడమనంబున నొక్కయుపాయము దోచుచున్నది. అదిపూర్తిగా ఫలించునను నా శగలదు. వినుము వచించెద. సుందరిని, జననీ సమేతముగ మీతండ్రి నిటకు దోడ్కొనివచ్చిన నాయత్నము ఫలింపగలదు. వారినే మొగముబెట్టుకొనివత్తు? వారిఁక నామాటలు విశ్వసించెదరా! కల్ల. నీ వీసహాయమొనర్చిన నేకృతజ్ఞుడను. సుందరి నన్ను వలచియుండుట నిజము. నేనిరాకరించినందుల కీపాట్లుగలిగినవి. అయిన నూతిన మరిగినకుక్క దెబ్బలుదినుచున్ననూ లక్ష్మైట్టక యింటిలోని దినుబండములు రుచిచూచుటమానదు. గాన నేనొక ప్రణయలేఖ నతిచమత్కారముగ నాకొకులిఖించెద. ఆమెయా లేఖయందలి భావముచే నిజముగ పరిభవింపబడగలదు. ఉత్తరమందినతోడనే యిచటికి గాకమానదు. గావనీవంతిలోపల నీచంద్రికిని సుందరిని జననీసహితముగ నిటకుగొనిరమ్ము. అంతమాత్రపు సాహాయ్యమొనర్పుము." అని బ్రతిమాలుకొనెను. వీరశర్మ భానుమూర్తి సలహాను శిరసావహించెదనని యప్పుడే యింటికేగి యావృత్తాంతమంతటిని దనతండ్రితోడ వచింప మొట్టమొదట యాతఁడునమ్మక మీదుమిక్కిలి యాతనినే దిట్టెను. ఎట్టకేలకు వీరశర్మ పట్టుబట్టుటచే యంగీకరించెను.

అనంతరము వీరశర్మ దనతండ్రి నంగీకరింప జేసితినిగదాయని మనంబున సంతసిల్లి యావార్త భానుమూర్తికి దెలియజేసె. భానుమూర్తి నిజమెప్పటికైన దెలియకుండునాయనుకొని వారిరాకకై నిరీ

క్షించియుండె. అంతలో నెవ్వడో యొకడొక చీటీని దెచ్చి యిచ్చె. అందున భానుమూర్తి యంపిన యుత్తరమునకు బ్రత్యుత్తరముగ సుందరి యప్పుడే యరుదెంచునని వచించియుండె. తన యెత్తులు ఫలోన్ముఖమైనందుకును దానంపిన ఉత్తరమునందలి తెల్వితేటలకు లోలోన సంతసిల్లెను. నిష్కారణ యుపనింద పటాపంచలగుచున్నందుకు గౌరీ మహేశ్వరునికి నమస్కృతులొసగ్గెను.

ఎట్టకేలకు సుందరి నూతనాలంకారశోభితయై వలదన్న పురుషుండే రావలచి వచ్చి బిలచి దరిజేర్చి కౌగిట జేర్చెదనని జెప్పి దనకింతకన్న భాగ్యమేమియనుకొని రాబోవు యాపద నొకింతయైన గమనింపక యిన్నినాళ్ళకు దనకోర్కె ఫలించినందులకు నమందానందమునొంది కన్నుగానక మందగమనమున వచ్చి భానుమూర్తి యింట బ్రవేశించెను. ఆమెకై వాకిట గాచికొనియుండిన భానుమూర్తి కపటమోహమును వెలిబుచ్చుకొని నతివినయముగ "సుందరీ! మొట్టమొదట నీవు రావనుకొన్నాను. కాని చదువుకొన్నది వలచిన పురుషుడు నిరాకరించియు తన భావిపరిస్థితులు దలచికొని యేదో యొకరీతిగ నభ్యముభిలషించిన నిరాకరించదనుకొంటిని. రా రమ్ము! లోపలికేగుదము" అని చూచి ముందోడ్కొని పడసాల నొకమూలనిడియుండిన కుర్చీపై గూర్చుండ నియమించిన "సుందరీ! నీవాంఛలన్నియు మోహాపేక్షితములేనా? లేక నిక్కములా" అనియడిగెను.

సుం:—ఆ ఆఁ! ఎంతటిమాట. మీరు నిరాకరించి యిలువిడి పరుగెత్తునప్పుడు మీపై నాకెనలేని కోపముదయించెను. కాని యిప్పుడన్నియు యవియేల? నిక్కముగా నాయీ దేహము! నాఆత్మ! నాప్రేమవేయేల? నాసర్వస్వము మీకేయొసంగ నిశ్చయించితి. నన్ను ధర్మపత్నిగా స్వీకరింతురని విన్నంతనే నాకింతకంటె గావలసినదేమి. బంగారమునకు దావిమబ్బినట్లగదా."

అప్పుడు సుందరి పున్నమచంద్రునిబోలు;——సన్నని యాకుపచ్చని చీరగట్టుకొనియుండెను. రక్తాధరమునకు తాంబూలరసముచే నొకక్రొత్త రంగునుబూసుకొని చూపరుల కువ్విళ్ళూరింప జేయుచుండెను. మెడనిండ కనకమయ విభూషణములు, చేతులకు వింతైన గాజుల పేరులలంకరించుకొనియుండె యామన్మథరాణి రతీదేవియే యనుదెంచినట్టులుండె.

“సుందరీ! నీవిన్నినాళ్ళూరకుండి నిన్నటిదినమేల యంతపనికి బాల్పడితివి”.

“ఆర్యా! నేనొలుతనే వచింపలేదా? సమయమువచ్చినగదా. అంతటికి మీరేకారకులు. మీనవమన్మథాకారమే నన్నాకర్షించినది”.

“సుందరీ! బలవంతబ్రహ్మచర్యమెట్లు చెల్లుబడిగాదో యట్లే నామనంబన్యాయమైనప్పుడు నీవు బలవంతపరచిననెట్లు? నేనిదివరకే నొక్కవనజాక్షికి నాప్రేమ, నా దేహము నాధనము వేయేల నా సర్వస్వమర్పించియుంటి. నామనంబు చూరగొన్నదాని తారత్నమునీడ నాడురోజాపుష్పమైన నేడు కంటకంబులకుబుట్టినిల్లగుదాని వరింపనేర్తునే! ఏటికి నాపై వలపులిక విడిచి చరించుట యుక్తంబుగాదా”.

“ఆర్యా! మీహృదయమెంత కఠినమైనది. మీపలుకులెంత విషమంబులు మీకు ప్రియయనునది లేదా?”

“లేదు. ముమ్మాటికిని లేదు”

సుందరి నేత్రములు లశ్రుపూరితములయ్యెను. పైటకొంగుతో కన్నులదుదుముకొని రుద్ధకంఠము నొకమారుసవరించుకొని కోపముతో “ఏమేమీ! అవమానపరచుటకా! కానిండు మిమ్ముల నేమిచేయద

లంచితినో చూడుడు'' అనునరికి తెరచాటున దాగియుండిన యాపెద్దలి
యు, వీరశర్మ, యాతనిదండ్రియు బయిటికేతెంచిరి. వారినిగాంచి
నతోడనే సుందరిమనంబు కంపించె: ఒడలంతయు ముచ్చెమటలు
బోసె. నిలువగాళ్ళాడనయ్యె. ఆమెకప్పుడు ప్రపంచమంతయు
నొక్కకలగాదోచె. అంతసుందరితల్లి "ఓసీ! ఎంతటిమాయలమారి
వే'' అన సుందరిదేహము జలదరింప, తల గిర గిరదిరుగ నింకనచ్చట
నుండదగదని మెట్టకేలకు మొండిధైర్యము వహించి కనులెత్తిజేసి
భానుమూర్తి యొనర్చినయుపకృతికి మండిపడి పండ్లుపటపటగొరుకుచు
గన్నులు వికటముగ జూచువారిని చుఱచుఱజూచుచు మాటాడకయే
గులుపిడెను.

# భానుమతి

## యిరువదిరెండవ ప్రకరణము.

### భానుమతి మాయమగుట.

అన్నా! నేడేల నింతత్వరగా నెక్కడికి ప్రయాణము?'' అని భానుమతి యడిగెను. ‘‘చెల్లెలా! నాశిష్యులును, నేనును గింజీపంచె ములజాడ నేగుచుంటిమి'' అనిభానుమూర్తి వచించెను.

‘‘ మరలివచ్చునది''

‘‘ఎనిమిది ఘంటలకే''

‘‘అదేల నంతవరకచ్చట నేమిజేసెదరు''

‘‘అచటనే నేము కాలమువెళ్ళబుచ్చ నిశ్చయించితిమి''

‘‘ఇంటనే నొంటరిగానుండగలనా''

‘‘ఇంతమాత్రమునకే వెఱచిననెట్లు? ''

‘‘భయమునకుగాదు. నొంటరిదాననెట్లు ప్రొద్దుబుచ్చుదుననీ''

‘‘ఇంటికి తాళమువేసి ఎక్కడికైన నేగుము''

‘‘నేనునదియే దలంచుచుంటి''నని భానుమతియన్నకు గొన్ని తినుబండములు మూటగట్టియిచ్చెను. అతండవిగొని ‘‘పోయివచ్చె ద''నని వెడలిపోయెను.

దామోదరుఁడు భానుమూర్తి సంతదవ్వులగనుగొని యాతని కంట బడరాదనుకొని యందుండిన నొకసందుతోవ్రేవన బడిపోయెను.

భానుమతి యన్ననుసాగనంపి తనగృహకృత్యములనెల్ల దీర్చు కొని ప్రొద్దుబోనందున కేల నొకనవలనుబూని పుటలు దిప్పివేయు చుండెను. అంతదామోదరుఁడు లోనబ్రవేశించెను. భానుమతి వాని గూర్చుండనియమించెను. వాడంత ‘‘భానూ! అన్న యెక్క డికిబోయె''నని యడిగెను.

భాను— "గిండీపంచెముల జూచుట కేగె."

దామో—"తిరిగివచ్చునది?"

భాను—"ఇంక రాత్రివరకు రాడు."

దామో—సరి. భానూ! తలకుస్నానమొనర్చి చాలదినము లాయెను. నేడినీళ్ళుండిన స్నానమొనర్తువా?"

భాను—"అభ్యంతరమేమి? ఉన్ననీళ్ళన్నిటి నిప్పుడే దోడిపోసితి. కొంతసేపాగుము. ఒకింతపొయ్యిక్రింద మంటవేసివచ్చెద" నని వెడలెను.

దామోదరుఁ డవకాశ మొదవెనని యామె గదిలోనికిబోయి యందుండు మేజాలోనుండిన కొన్ని కాగితముల సంగ్రహించి గుప్తముగ దాచుకొనెను. చిన్నవాడలవడిన స్వల్పవిద్య నుపయోగించి యాజిఘంటకు యందులిఖించియుండిన "ప్రియురాలా! యునిసంభోగనా వాక్యమునుమాత్రము కొంచెమించుమించుగ జమవగలిగెను. తనకుగావలసిన కాగితములు దనచేతబడినందులకు లోలోనసంతసించి యాయుల్లాసమును బయిట కగపడనీయక గోముఖవ్యాఘ్రంబు కరణి నటించెను. తనమిత్రుల ప్రీతికి పాత్రుండగు కార్యముసాధించితినిగదాయని మనంబున కుతూహలుండయ్యెను. అంత భానుమతి "అన్నా! రమ్ము! నీళ్ళు కాగినవి" అనిబిలచెను. దామోదరుఁడంత దలయంటుకొని స్నానమొనర్చి యామెయొసంగిన భక్ష్యములనొకింత మెక్కి చెల్లెలొనర్చినయాదరణకు దృప్తిపొంది యథేచ్ఛఁజనియె.

నాలుగుఘంటలు సమయము. భానుమతి పడకకుర్చీపై గూర్చొనియుండెను. అప్పుడొక చిన్నవాడొకండొక కాగితమును భానుమతి హస్తములనునిచి వెడలిపోయెను. అందీవిధముగ లిఖించబడియుండెను.

"ప్రియురాలగు భానుమతికి,

వీరశర్మ యాశీర్వాదములు. నేనత్యంత యవసరపని మీద గ్రామాంతరగతుఁడగుచుంటి. మనకు గొన్ని దినము లెడబాటు గలిగినందుల కెంతయు చింతులుచున్నవాఁడ. నేనీయుత్తరము వ్రాయుట నాప్రయాణము భానుమూర్తి యెఱుఁగరాదనియే. నా తలిదండ్రులు నన్నొకపనికి నియమించినారు. మీయన్న నన్నుగూడ గిండీకి రమ్మని చాలబ్రతిమాలెను గాని పనియున్నదని దప్పించుకొంటి. నేనుయీరాత్రి ప్రయాణమగుచుంటి. అందులకే సిన్నంతగా బ్రతిమాలునది. గాననీవు నామొరాలకించి వృథాశేయక తక్షణము నన్ను "బీచివద్ద మనమామూలు ప్రదేశమున గలిసికొనుము. నేనావంతెనపై గాచుకొనియుండెద. జాగ్రతి. సమక్షమున మాటాడుకొందము. తొందఱలో వ్రాసితి. క్షమింపుము.

సతతము నీక్షేమముఁగోరు,

"వీరశర్మ"

భానుమతి ఉత్తరము నామూలాగ్రమును జదివి "ఇదికల్పిత పుత్తరమైయుండదుగదా. అందలియక్షరములకును నాకు మునుపు వ్రాసియుండు లేఖలలోని యక్షరములకుజూడ గొండంతభేదము గానవచ్చుచున్నది. కానితొందఱలో వ్రాసితినని వచించియుండె. బహుశ యప్పుడు తొందరసమయమున వ్రాయవలసివచ్చుటచే భేదమేర్పడియుండవచ్చు. గాననేనచటికిబోక తప్పదని నూతనాలంకారసోభితగా మనంబుననిచ్చగించి మంచివిలువగల చెంగావిచీర దీసి కట్టుకొని, బంగారంచుగల పూలరవికెనుదొడిగి, వదనాంబుజమున జవ్వాజిచారికదిద్ది' గొప్పగా నెఱజాఱు కొప్పుబెట్టి, గమగమవాసనలీను సుగంధపరిమళ ద్రవ్యముల నొకింత దేహమునకు బూసికొని,

మినుకుమినుకు మనునట్లు కాటుక రేఖ కన్గొనలదగిల్చి ఒకమారు ఒయ్యారమును నిలువుటద్దమున జూచుకొని ప్రియునిగలయ ప్రయాణమయ్యెను.

ఆహా! అప్పుడామెనుజూచిన స్వర్గలోకమునుండి యూడిపడిన గంధర్వ కన్యవలె గన్పట్టు. తమ్మిచూలి దండ్రి చేతిచక్రమురీతిగా మె చెవులకమ్మలు ధగధగమని మెఱయ, కాలిమెట్టెలు గిలుకుగిలుకుమన, కందర్పసామ్రాజ్య లక్ష్మియనంగ యాగజయాన నవమన్మథప్రాణియై యింటివెనుక పెరటిముల్లెదీగ నప్పుడే విరియబూచిన బొండుమల్లెలనెల్లదెచ్చి కొప్పునదురిమి మరియొకమారు దరహాసితవదనారవిందమును యద్దములోజూచుకొని వీధిగుమ్మమున నిలుచుండి యందుబోవు నొకబండివానిని బిలచి యందుగూర్చుండి "బీచ్"కి దీసికొనిపొమ్మనిచెప్ప నాతఁడతివేగముగ బండిని బోనివ్వసాగెను. ఇంక "బీచి" కొన్నిగజముల దూరమున నున్నదనఁగ భానుమతి తనప్రియకాంతుని సన్నిధిజేరుచుండ యందముగ గన్పట్టకున్న బాగుగనుండదనియెంచి, చెమటచేజారిన తిలకంబును నీటుగా కొనగోటదద్ది, చెదరిన ముంగురుల చక్కఁగ దువ్వుచు, తలనుండి ముత్తియములట్లు మల్లెలు జల జల మనిరాల మడతపడిన పైటను సవరించుకొని బండిదిగి గమ్యస్థానముజేర చిన్నగా నడుగులనిడుచు బోవసాగెను. అచటికి నతిదూరమున విశ్రాంతికై యేతెంచియుండిన బాలురాయుంద చందంబులుగల నారీరత్నమునట్లు నివ్వెరపాటున నిక్కి నిక్కి జూచుచుండిరి.

ఆమెయవియన్నియు గమనించక తిన్నఁగా నడచిపోయి దవ్వులగల నంతెనపై నాశీనయై హృదయచోరునికై దిక్కులజూడసాగె. కాని మనోకాంతుఁడెందును గానరాడయ్యె. ఇంకనూ వేళగాలేదు కాబోలునని యందే యొకింత దనభావిపరిస్థితిఁ దలపోయసాగెను.

అట్లెంత సేపుండెనో గాని అయిదు ఘంటలు మీఱిపోయె. ఇంకనూ తనమనోవల్లభుఁడు వచ్చునని యాశయడుగంటె. తనయలంకారములన్ని వృథాయయ్యెననిగుండె. అయిన దానికి జింతించిన బ్రయోజనము లేదని మనస్సు కుదుటబరచుకొని "ఆజాబు కల్పితమే మోగదా! ఒకవేళ కల్పితమే యనుకొందము. కల్పించివ్రాయుట కెవరికంతెపని. అందున వారికేమి లాభము రాగలదు. బహుశః యాతఁడు పనియుండి నిలిచిపోయి యుండవచ్చు. అయిన నెవరితో నైన జెప్పియంపరాదా! లేదు లేదు. ఇందుజూడ నేదో వంచన కృత్యముగా దోచెడిని. చీకటుల నలుగడల గ్రమ్ముకొనె. నేనింకదడయరాదు. ఇట్టిచోట నొంటిరిదాన నుండదగదు" అని యనుకొని యచటినుండి లేచి కొన్నియడుగులు బెట్టెనో లేదో సంత నలువురు మనుజులు ఆవైపు బరువెత్తి వచ్చుచుండుటగనెను. వచ్చువారిలనుజూడ వారిముఖములందు దుర్మార్గత దాండవమాడుచుండెను. వారికంటబడుట నుచితంబుగాదని బిరబిర బండినిజేర బరువెత్తసాగెను. అంతనామనుజులామె వెనుకనుండిజనుదెంచి నామె నొక్కపోటున క్రిందబడవైచి నాసికారంధ్రముల వద్దనేదియో యొక ద్రావకమును వాసనజూపి మూర్ఛితురాలినిగజేసి వెనుకనుండివచ్చుచున్న మొటారుకారునటునా గనియమించి యందామెనుబడవేసి నలువురునుగూడ గూర్చుండినపిదప "పోనిమ్మని" యందులోనొకఁడు డ్రయివరును హెచ్చరింప నాతఁడతివేగముగ బోనిచ్చుచుండెను.

భానుమూర్తి నేడింటికే తెంచెను. తనవద్దనున్న తాళము చెవితో యింటిబీగమునుదీసి దీపములను వెలిగించి యందమర్చి యుండిన పడకకుర్చీపై బడి దనలో దానిట్లనుకొనసాగెను. "చెల్లెలింకనూ రానికారణమేమి? ఏదైనబనిమీద బోయియుండెనా లేక స్నేహితులెవ్వరింటికైన నేగెనా? ఒకవేళ దనకత్యంత యవసరకార్య

మేమైననుండిన నాతోఁ దప్పక జెప్పుచుండెడిదే! అదియు నేనింటినుండి బయలుదేరునప్పుడు "నేనింట నొంటరిదాన నెట్లుండగలను" అనినది దానింతవఱకక్కడ నేమిచేయుచుండె. అంతపనియుండిన యింట నొక్క కాగితపుముక్కను వ్రాసిపెట్టిపోఁగూడదా! ఏమో తనగదిలో నేదైనవ్రాసి యుంచియుండెనేమో జూచెదగాక" అనిభానుమతీగది నిబ్రవేశించెను. మేజాపై నొకయుత్తరమునుజూచి చేతికిదీసికొని చదివి యాశ్చర్యనిమగ్నుఁడై "ఏమిది? వీరశర్మసంతకము చేయబడినది. ఇప్పుడేగదా వీరశర్మ నావెనువెంటనే యింటికేగెను. కాదు కాదు నిక్కముగా వీరశర్మసంతకమే. స్పష్టముగా దెలియుచున్నది. తాను ప్రాతఃకాలము బయలుదేరుసంగతి వ్రాసియుండెనేమో అట్లు వ్రాసినవాడు కాచికొనియుండక నాతోనేల బయనమాయెను. చూడజూడ యాశ్చర్యముగనున్నదే? నేనిదివఱకు నొకటిరెండుమార్లుత్తరములు వ్రాయవద్దని మందలించియుంటినే! ఇంకనూ యిటువ్రాయనేర్చునా! కాదు. ఇందేదో మోసముయుండవలయు. లేకున్న భానుమతి దురాచారసమితిలో సభ్యురాలై యుండవలెను. కానిమ్ము నిజమెందుదాగగలదు." అనిధైర్యమువహించి చేతనొక లాంతరునుబూని వీరశర్మ గృహాభిముఖుఁడై వెడలెను.

వీరశర్మ యప్పుడు భుజించుచుండెను. ఆతనితండ్రి వసారాలోఁగూర్చుండి నాటిదినపు వార్తాపత్రికను జూచుచుండెను. అంతలో భానుమూర్తినో తేరమ్మని చేసైగజేసి చెంతనున్న కుర్చీనిచ్చి కూర్చొనినపిదప వచ్చినపని యేమనియడిగెను. వీరశర్మతో పనియుండివచ్చితిననెను. అంతనాతఁడులోనికేగి వీరశర్మను దోడితెచ్చెను. వీరశర్మ భానుమూర్తి వచ్చినకారణమేమొ యూహింపజాలక యాతని వదనమండలమునగల దీనత్వమును దిలకించి యంతకుయఱఘంటకాలమునకు ముందాతని తోడనేయుంటినే! అప్పుడు లేని జరూరుపని

యిప్పుడేమి తలపెట్టించెనని మనంబు పరిపరివిధములబోవ త్వరితముగ దనదుస్తులను దగిలించుకొని భానుమూర్తి వెంటనేగెను. కొంత దూరముబోయినపిదప భానుమూర్తి వీరశర్మను దగ్గఱకుబిలచి "నీకె న్నిమారులిట్లు వ్రాయవద్దని బోధించినను నీబుద్ధిమానవైతివిగదా" యని తనజేబులోనుండిన యుత్తరము నందిచ్చెను. ఆతండద్దానినిజ దివికొని నివ్వెరపడి "ఆర్యా! దీనినెవ్వరునొనివచ్చిరి. ఇదివంచన కృత్యముగాని వేరుగాదు. నేను మీతోగూడ గిండీకివచ్చియుంటినిగదా. మఱియు నిందలియక్షరములన్నియు కల్పితములు. నా యక్షరములవలె వ్రాయజూచిరిగాని కృతకృత్యులు గాకపోయిరి. మీరునాతో నుత్తరములు వ్రాయవద్దని మందలించిననాటినుండి మానివేసితి. నెమాటలాడ నిచ్చగించియుంటినేని మీగృహమునకే యేతెంతునంతియేకాని నిట్లువ్రాయుదునా! ఇందేదో మోసకృత్య మొనర్చుటకు బన్నినపన్నుగడదప్ప వేఱొకటిగాదు. అయిననాకు జూడ యాశ్చర్యము గల్గుచున్నయది. నాపరిచయము మీకుదప్ప నితురుల కెవ్వరికిగాని దెలియదు. అట్టిరహస్యమే బేధింపబడి దు ర్మార్గులకు యనుపైపోయినదే. వీరెవ్వరో దీర్ఘకాలమునుండీ మన చుట్టుదిరుగుచు మనరహస్యవ్యాపారములుగూడ గనిపెట్టుచుండిరిగా బోలు. లేకున్ననింతటి కల్పనకార్య కలాపమెందులకు? ఇంతటికి నామె యీయుత్తరము నిజమని యీప్రదేశమునకుబోయెనా? ఏమిజరి గినదట? మీకేమైన దెలియవచ్చెనా? లేక మీరునన్ను మందలించు టకువచ్చితిరా?" అనియడిగెను

భాను—"ఉత్తరమందలి సంగతులు విశ్వసించి మాచెల్లెలా ప్రదేశమునకు బోయెనేమో యెవ్వనికెఱుక? ఇంతవఱకుజూచినను నింటికేతేరదయ్యె. ఈవిషయమై నిన్నడిగిన దెలియగలదని వచ్చితి" ననెను.

వీరశర్మ విభ్రాంతపడజొచ్చెను. క్రూరులెవ్వరో తమగుట్టును దెలిసికొని యిట్టి యనుచితకార్యము లొనర్చుచుండి రనుకొనెను వారినెట్లైన పట్టుబెట్టిననేగాని వారి యకార్యకలాపముల కంత ముండదనుకొని "ఆర్యా! మనమాప్రదేశమునకుబోయిన యామె జాడ లేశమైన దెలియునేమోగదా! గాన యెంతమాత్రమాలశ్యమొన ర్పక వెడలుద"మనెను.

భానుమూర్తి యందులకు సమ్మతించెను. తదుపరివారు "బీచి"త్రోవను బడిపోవసాగిరి.

విషయములెట్లుండునో యేమోనని త్రోవలోగల పోలీసుస్టే షనులోనికిబోయి నొకరిపోర్టును గావించినతర్వాత తమప్రయాణమును సాగించిరి. ఒకింతసేపటికి కాప్రదేశమును జేరిరి. వారికందేమియు గానరాదయ్యె. అంతయు నిశ్శబ్దము. రాత్రిగంభీరము. సము ద్రతరంగముల యలజడిచే గలిగిన యొక భీషణఘోషదప్ప వేరొకసంచ లనమే లేదు. వారికచ్చట బనిలేమిచే వెనుకకు మరల నుద్యుక్తులై రి. అంతలో వారికెక్కడనుండియో సన్ననిమూల్గుడు వినవచ్చెను. ఆయార్తనాద మెచ్చటనుండి యేతెంచుచున్నదని దెలిసికొనజాలక భీతిచే తారాడ మొదలుబెట్టిరి, కొంతసేపటికి ఆమూల్గు యొకవంతె నక్రిందనుండి వచ్చునట్లుదెలిసికొని వారువంతెనక్రిందికి దిగిచూడ నొకడు గాయములబాధచే మూర్ఛితుడై దెలివి వచ్చినపుడెల్ల మూల్గుచుండెను. వారంత వానిని బయిటికీడ్చి కొంతనీరమును దెచ్చిచల్లిరి. కొంతసేపటికివాడు దెలివినొంద యట్లు పడియుండు టకు గారణమడిగిరి. వాడు దానొకబండివాడనియు తానా నాడొ కయువతిని "బీచి"కి గొనవచ్చియుండెననియు, నామెను రాక్షసులెవ్వ రో కొందరు బలవంతముగలాగి మోటారున నుంచుచుండ తానది జూచి పరుగెత్తిరాదన్నట్లు చావమోది వంతెనక్రింద బారవేసి అద

యూరముఖులై బారిపోయిరని వచించెను. వారతనికి గొంతసేదదీర్చి శక్తిగలిగిన తరువాత యచ్చటికి సమీపముననుండినవాని బండిలో గూర్చుండబెట్టగా నతఁడు మెల్లగా బండినిదోలుకొనుచు నింటికేగెను.

మేఘమాలికలచే బ్రచ్ఛన్నుఁడైన తారకాపతియింట వెలయమిచే యాతని ప్రేయసియగు ప్రకృతి కాంతగూడ యొకింత చింతానిమగ్నయై యుండెనేమో యనునట్లు గంభీరముగనుండెను.

భానుమూర్తి యంతటితో దృప్తినొందక ఆయంధకారముననే యెడయూరు ముఖుండయ్యెను. అట్లువారొకింతకాలము పోవబోవ వారికొక తరుణవయస్కుఁడు యెడయూరునుండియేగాబోలు వచ్చుచుండుట జూచిరి. ఆతనిచామనఛాయ, బలిష్ఠమైన యంగములు, ముఖమున కాంతిహీనము జూడనాతఁడు దేహక్లేశమునకు బాగుగ యలవాటు పడినవాఁడుగ దోచుచుండెను. కాషాయవస్త్రములు ధరించి గడ్డము జటాజూటమువహించి యొకచేతి కమండలము వేఱొకచేత పొడుగాటి కఱ్ఱను దాల్చియుండెను. వారాతని పలుకరించి తమవృత్తాంత మాతనికిదెల్పి యామెజాడ తేమైన దెలియునేమో యడిగిరి. ఆతఁడు తనకావిషయము దెలియదనియు దానుపరోపకారియగుటచే దానావిషయము కనుగొన బ్రయత్నింతుననియు యెడయూరు నందునగల సమస్థము తానెఱింగియుంటిననియు వారిప్పుడు వృథాకాళ్ళీడ్చుకొని యటకేగుట ప్రమాదకరమనియుజెప్పి, మరునాడు దప్పక తమకారహస్య మెఱింగింతుననియు దెలసినతర్వాత నెఱిగించుటకు వారి నామధేయ నివాసాదులనడిగి దెలుసుకొని తనదారిని బోయెను.

భానుమూర్తి చేయునదిలేక మరునాడు బ్రయత్నింతమని యింటికి మఱలెను.

# భానుమతి

## యువది యాఅవప్రకరణము

### నిర్భందవాసము

---

"దైవనిర్ణయమున కెదురు లేదుగదా! ఆతని శాసనమే శాసనము. ఒకవేళ రాజ్యము నేలు చక్రవర్తి ప్రపంచమున దనకన్న బలులెవ్వరు లేరని ఒకనిరపరాధుని, తనకపకారియని దోచిన వానిని బలవన్మరణము పాలు జేయుచున్నాడనుకొందము. ఆతనియాజ్ఞ యెంతమాత్రము కొనసాగదు. నిందితుని కానాటి కాయుఃప్రమాణమంతరించి యుండిననేగాని రాజాజ్ఞ నెఱవేఱజాలదు. దైవగతి యనలంఘనీయము. సమస్త చరాచర ప్రపంచము దానికి లోబడియుండవలసినదే. అది తనయిచ్చవచ్చినరీతి జీవుల నాటలాడింపగలదు. ఆతనిశక్తి కంతమే లేదు. ధనవంతుని నిర్ధనునిగను, నిర్ధనుని ధనవంతునిగను, సుఖజీవికున్న దున్నట్లుండి యెనలేని దుఃఖమును, దుఃఖజీవికి యెనలేని సుఖమును గలుగజేయును. ఇది దైవశక్తియే గానిచో నాకీదుర్దశ యెక్కడనుండి రాగలదు? సకలసుఖంబుల యనుభవించుచూ యగ్రజునితో గాలముగడుపునే నేడ? జూచుటకు రమణీయంబుగనున్ననూ బలవంతముగ గొనివచ్చి నుంచినమాత్రమున యీసౌధరాజముయొక్క నివాసము నాయన్న లేనిది, నామనోకాంతుడు లేనిది రుచించునే? ఏయువకోత్కృష్టున పేక్షించి యింతదూరము వచ్చితినో వానిసందర్శనాభాగ్య మబ్బియుండిన నింతవిచారముండకపోవచ్చును. కాని నాకట్టి యదృష్టము బట్టక దుర్మార్గుల వశురాలనై యుండవలసెగదా! అభిలాష నెఱవేఱజాలక పోవుట యేగాక మీదుమిక్కిలి దుస్సహమగు కష్టములు లభించినవి. హా! ఆకలి

వేయుచున్నది. వీరియాహారము నేచవిజూతునే! హా! ఇంక క్షుత్పి
పాసలచే మలమలమాడి యిచ్చటబడి చావవలయుననియే గాబోలు
నాదురాత్ములు నన్నుబట్టి తెచ్చి నీ గృహమున బంధించినది. ఏమి
జేయుదలంచిరో గదా!

ఆహా! ప్రియునిపై బ్రేమ మెంత కఠినమైనది. ఎంతదూరము
నన్నాకర్షించినది, కల్లజాడైనను, అందుప్రియుండు బ్రియురాలా
యని సంభోదించి యున్నంత మాత్రమున మేనబులకలెత్తునట్లుగ సం
తసించితినే, గమ్యస్థానము జేరితి. కాని యభిలషిత కాంతుని గాంచ
లేకపోయితి. ఇంక యీ నిర్భాగ్యురాలి బ్రతుకింతియే గాబోలు”
నని మిక్కిలి విసిగికొనుచు విచారించుచు, పశ్చాత్తాపపడుచు క్షుత్పి
పాసలదూలుచు, దుఃఖభారమున సోలుచు నొకజవ్వని రమారమి ప
దునాల్గుండ్లు పైబడినది అడయారు (Adyar) ననొక్క దివ్యప్రాసా
దమున నొంటరిగా నొక్కచో తన దుస్థితిని గూర్చి దలపోసికొనుచుండె
ను, సంతతవిచారంబున నాయువతి వదనారవిందము వాడినదై
యుండెను. పండు తమలపాకువంటి కోమలదేహము భయముచే
మిగుల కృశించి పోయియుండెను. అయినను సహజముగు నవయౌ
వ్వన సౌష్టమా యువతి సుందరీ విగ్రహము చాటుమండకపోలేదు
దివ్యసుందరి విగ్రహముగు నా యువతి ఆప్రదేశమునగల క్రూరులచే
తబడి మరణించునో లేక అభిలషిత ప్రియకాంతుని మృదులహస్త
పల్లవములసని మెప్పగాంచునో యెవ్వండు జెప్పగలండు?

నిశాకాంత కాటపట్టయిన నాగదిలోని కప్పుడే యుదయిం
చిన బాలభానుని కాంతి చొరబడి నాప్రదేశము వెలుంగుచే నింపబ
డినదో యనునట్లు విద్యుద్దీపములున్నవి యున్నట్టుండి వెలిగింపబడ నా
దివ్యప్రాంతము నొక్క వింత సోయగముదాల్చెను. తనకుసంభవిం

చిన దుస్థితి దలపోసికొనుట కామె యాచీకటినే గాంక్షించెను గాని
యావెలుతురామె నొకింతయు సంతసపఱచినదిగాదు. ఒకవేళ నా
దీపము తనకందియుండెనేని యామె దానినప్పుడే విరుగఁగొట్టియుండె
డిది. ఆమెకై నాగదిలో పలురకముల భక్ష్యముల నిడియుండిరి.
పండుకొనుటకొక మంచమొకటుంచబడియుండెను. వివిధఫలముల
ను యందమర్చియుండిన మేజాపై నిడియుండిరి. వాటిని దఱిగికొ
నుటకొక చిన్నకత్తినిగూడ యుంచియుండిరి.

ఆసౌధరాజములోకెల్ల నాగదియే యుత్తమగదియని జెప్ప
వచ్చు. అనేకచిత్రపఠములచే నరాజిల్లుచుండెను. అదియొకజమీం
దారుని గదిగాని సామాన్యునిదిగాదు. లేకున్న నంతవిలువైన దు
స్తులా గదిలోని గూటములకు దగిలించియుండరు. రజితపాత్రము
లుకొల్లలుగా పేర్చబడియుండెను.

సౌఖ్యనిలయమెంత వస్తుసముదాయము గలిగియున్ననేమి?
ఏదియునామె నాకర్షింపజాలదయ్యెను.

అట్లామె చింతానిమగ్నయైయుండుతరి యచ్చటికొక ముసలి
యవ్వయేతెంచెను. ఆయువతి ముసలిదానిపై కోపదృష్టులు బఱ
పించెనుగాని ముసలిది యెంతమాత్రము చలించక నచ్చటి కొకింత
దూరమున నాసీనయై "అమ్మా! ఏలనీవూరక చింతించుచుంటివి? గృ
హాధిపతిని సామాన్యునిగా దలంచితివా? జమీందారు నారాయణ
రావుగారి గృహమిది. ఆతఁడు నిన్నువివాహమాడుటకే యిచటికి
నిన్ను గొనివచ్చియుండుఁ. ఏమాత్రము శంకించబనిలేదు. నీకు
గావలసినవి కోరుకొనుము. తెచ్చియిచ్చుటకు సంసిద్ధురాలను" అని
యూరకుండెను. అంతనాయువతి నారాయణునిపేరు విన్నంతనే

యువతి—(కోపము నాపుకొనజాలక) "చాలు చాలు. నీ ప్రసంగములిక గట్టిపెట్టుము. కులటా! నీముఖముజూడరాదు." అని తలుపుబిగించివైచి మంచముపైకూలబడి "అయ్యో! ఎన్నిరాత్రి బవళ్ళీరీతిగ నుండవలయునోగదా! కట్టా! నిరపరాధియగు నాకెన్నికష్టములుగలిగె! నాకుజూడ రాత్రియంతయు మేల్కొనియుండుటయే శ్రేయస్కరంబని దోచెడిని. దుర్మార్గులకృత్యము లెవ్వరికెరుక? హా! ఆకలిబాధ యంతకంతకు జ్వలింపజేయుచున్నది. ఏమిచేయగలదాన"నని లోనుండివచ్చు దుఃఖము నాపుకొనజాలక మెల్లగా దనలోదానె యేడ్వసాగెను. పాపము! ఆమెరోదన మరణ్యరోదనమే గదా!

అట్లామె దుఃఖించి దుఃఖించి వచ్చియురాని నిద్రచే యొకింత తూగెను.

పండ్రెండు ఘంటలు గొట్టిరి. గడియారపు శబ్దముదక్క వేరొక సందడి వినబడుట లేదు. ప్రపంచమునంతటిని నిద్రదేవి గప్పివైచినది. రాత్రికాలము. సముద్రశీతల వాయువులచే గదియందలి కిటికీలు కిర్రుమనుచుండెను. వాటికామె యప్పుడప్పుడులికిపడి లేచుచు దిరిగి పండుకొనుచుండెనుగాని చక్కగా నిదురవబోవ లేదు. ఇంతలో నెచ్చటనుండియో యెవరో నడచివచ్చునట్లు యడుగులు శబ్దమువినవచ్చెను. ఆమెయదరిపడి లేచి నేమియుగానరానందున దిరిగి పండుకొనెను. కానియట్లు కొన్నినిముసములైనబడదపు వున్నదు స్నట్టుండి యాయువతిపండుకొనియుండిన మంచమునకెదురుగా యమర్చియుండు కుర్చీక్రిందిభాగమున నొకతలుపు తెరువబడెను. ఆమె యాదృశ్యము నవలోకించి భయపడజొచ్చెను. అట్టివింత దర్వాజాలుగల నాగదినిజూచి పిశాచగృహమనుకొనెను. ఇంతలో క్రిందినుండి యొకవ్యక్తిపైకరుదెంచెను.

ఆతనిమేనెల్ల సువాసనలు గుప్పుగుప్పున చెలరేగుచుండెను. నోటమాత్రము సహింపరాని దుర్గంధము వెడలుచుండెను. ఆజానుబాహుఁడు. నల్లనివాఁడైననూ ధరించినదుస్తులు వానిశరీరమున కొకింతకాంతి నిచ్చుచుండెను. హస్తమునకు దగిలించుకొన్న హేమభూషణములు, చేతివ్రేలులనుండిన స్వచ్ఛవైడూర్యము విద్యుద్దీపకాంతిలో దళుకు దళుకు మనుచుండెను. హా! నారాయణా! నీవెంత శృంగారించుకొనిననేమి? గాజురాయిన వరింప నేర్చు వారుందురులే?

పాపము! సింహముచెంగట కురంగమట్లు నాయువతి చేయునది లేక ముఖమునకు శాలువగప్పికొనెను. అంతనారాయణుఁడు పైకరుదెంచి దానరుదెంచిన కవాటమును బంధించి తనయందమునొకమారు నిలువుటద్దమున జూచుకొని మెల్లఁగా నచ్చట యిడియుండిన భక్ష్యముల గొన్నింటినిదిని, నీరమును గ్రోలి యాందుకుర్చీపై గూర్చొని యిట్లనుకొనసాగె "హా! నాభాగ్యమేమనవచ్చు. అభిలషించినకాంత నొక్కత్రుటిలో దెచ్చికొంటి. నాయభిమత మీడేర్చుకొని ధన్యుఁడనయ్యెదగాక. ఈమెయిప్పుడు గుఱ్ఱువెట్టి నిదిరించుచున్నయది. లేపికౌగిట జేర్చుకొనియెదగాక" నని యచటికేగి యామెపైనుండిన ముసుఁగును దీసివైవ నామె నటాలున తోకద్రొక్కిన త్రాచువలెలేచి "దురాత్మా! యావలబొమ్ము. నన్నంటిన నీబాహువులు పుచ్చి పుండ్లు గాకమానవు. దుర్మదాంధా! మద్యపానాసక్తుఁడవగు నీవిట్లు బలత్కారముగ నిర్మలయశఃకాములగు యువతీరత్నముల చెరబట్టిదెచ్చినా నాబాధల నొందించి నీచకృత్యముల ననుసరింప జేయుచుంటివా? కానిమ్ము! నీయాటలకు మాటలకు వేశ్యకాంతలు లొంగెదరుగాని కులస్త్రీలు లొంగుదురే"అని కోపోద్దీపితయై గద్దించి యడుగసాగెను.

నారా—“ఓసీ! నీమాటలకు భయపడుదునని దలఁచితివా? నాచేపట్టువడియుందువు గాని, విద్యార్థులెవ్వరో నీపాలిటనుండిరి. తప్పించుకొంటివి. నీయన్నచే జెప్పిపంపితే దూలనాడితివట. కులటా! ఇపుడెవ్వరు నీకు సాయమొనర్పువారు. ఇంకెందుపోగలవు. నే జెప్పినట్లు జేసితివాసరి. లేకున్న బలవంతమే శరణ్యము.” అనిచురచురఁజూచి గంభీరాకృతిఁదాల్చె.

యువ—“ఛీ! చాండాలా! నీముఖముజూచిన పాతకమురాగలదు. పొమ్మావల. నీబెదరింపులకు లక్ష్యపెట్టుదాననుగాను. నిరపరాధిని నన్నిట్లు నిర్బంధపెట్టు నివంటిదుర్మార్గులకెల్ల మృత్యువుదరికే తెంచినదనుకొనుడు.” అని మెల్లఁగా నాతఁడు గ్రహించకుండునట్లు స్వదేహ రక్షణార్థమై మేజాపైనుంచిన కత్తినిదీసి చేతనుంచుకొనెను.

నారా—“ఓసీ! గయ్యాళీ! తెలివిదెచ్చుకొని సుఖపడనెంచితివా బ్రతికితివనుకొనుము. లేకున్న బ్రతుకింతే కారాగారమే శరణ్యము. కాన చక్కఁగా యూహించుకొనుము.”

యువ—“దురాత్మా! ప్రేలకుము. నీనీచవాక్యులకు లోబడుదునని యెంచితివా! నామేనబ్రాణము లున్నంతవరకు నీవు నన్నంటజాలవు.”

నారా—(వికటముగనవ్వుచు) “అహాహా! నిక్కముగానా! చూతము. నీకెవరుసాయమొనర్చెదరో”అని యామెపై బడబోయెను. ఆమెకాలితో నొక్కతన్నుదన్ని “పాపీ! అబలలకాలితన్నులదిను నీమొండిబ్రతుకు బ్రతుకుటకన్న నూతిలోబడి మరణించిన బాగుండునుగదా! ఇదిగో! ఇఁకనన్నంటవచ్చితివా యీకత్తికెరయయ్యెదవు. జాగ్రత నీకు దెలియదుగాబోలు. బలవంతపరుప

జూచిన నీవంటి నీచాత్ముల గతి యేమగునో! దిక్కెవ్వరు లేరని బలిమి నిగ వయనెంచితివా! ఇంకొక్క మాఱిటు యరుదెంతు వేని ప్రాణము లపై యాశవీడిరమ్ము. లేకున్న వచ్చినదారిబట్టుము." అనెను.

నారా—ఎంతటిమాయలాడివే! శీలరంగనీతులుగూడ నేర్చితి వా? తన్నితివని విఱ్ఱవీగుచుంటివా? రేపటి కీనరికి నిన్ను ద్వాహమొన ర్చుకొనకున్న నారాయణుండనుగాను. బుద్ధిదెచ్చుకొని భావిగతి యోచించుకొని యొప్పికొంటివా సరి. లేనంతట నాచేతనైనది గావింపక మానను. ఇంక నీమాటలు సాగిరావు పెంకెపట్టువీడిరమ్ము నాద రికి" అని యామెకరమును గట్టిగాబట్టుకొనెను. ఆమె వెనుకకుదిరిగి తనచేతనున్న కృపాణముచే నొక్కపోటు పొడచెను. దానినాతండు దప్పించుకొని దూరమున నిలుచుకొని "ఎంతటి శక్తివంతురాలవే! కానిమ్ము అప్పుడేయేమాయె. రేపుగదా నీపరిభవ కథాప్రారంభ ము. తొందరపడ నేల? ఒక్కదినముగడువిచ్చితి. బ్రతుకుదెరువు యోచించుకొనుము" అని చేయునది లేక వచ్చినదారిబడి వెడలి పోయెను.

యువ—"మూర్ఖా! నీయదృష్టము బాగున్నది. తప్పించు కొంటివి. భయపెట్టిన మాత్రాన నీయధీనురాలనయ్యెద ననుకొం టివా! కలలోనివార్త. కానిమ్ము! నీవేమొనర్ప నెంచితివో అది జేయు"మని మంచముపైబడిపోయి "అన్నా!" యనియొక కేకవైచి మూర్ఛిల్లెను. పలువరించెను. మూర్ఛనుండి తేరినపిదప తిరిగి నారాయణుండెక్కడనైన యరుదెంచునేమోయని భీతిల్లి యారహాశ్య కవాటము ఈమారు రాకుండునట్లు యడ్డముగల సోఫాలు, కుర్చీలు వేయేల? వస్తుసముదాయము నెల్ల దానిపైవైచి కలువరించుచు నిదు రోరామి యిటునటు పొరలాడుచు రాత్రియంతయు గడిపివేసెను.

సంతోషదాయకమగు ప్రభాతము దెంచినను నాశాలేశర హితహృదయ యగునక్కాంతామణి నింతేని సంతస పెట్టదయ్యె. ఇఁక వేఱు గత్యంతరము లేమిచే మృత్యుదేవతా యనుగ్రహమునకై వేఁడుటయో లేక మృత్యుముఖమునుండి వెలువడుటకై చేయఁగల మార్గమునకై యోచింప మొదలిడెను. రాత్రిజఱిగినచర్యలు జ్ఞప్తి కివచ్చినపుడెల్ల గడగడవణఁకఁజొచ్చె. ఎట్టకేలకూరక చింతించిన మాత్రమున నాపదలు దూరమునకుఁబోవని ధైర్యవతియై కిటికీనిడె అది క్రిందికి తొంగుచూచుచు దనదుస్థితఁబాప సమర్థులగు పుణ్యాత్ములెవ్వరేని యగపడుదురేయని చూడసాగెను.

# భానుమతి

## యిరువది యేడవప్రకరణము.

### పలాయనము.

పద్మినీ మిత్రుఁడు బ్రహ్మావేషము దాల్చునపుడు బట్టిన తెర యోయనునట్లు తూర్పున వెలుఁగు గన్పట్టుచుండెను. చుక్కలఱేఁడు తనగురువర్యుఁ డేతెంచుచుండుట గ్రహించి దానిఁకనచ్చోటనుండ దనుకొని పశ్చిమదిశకుఁబోయెను. అంతఁబ్రభాతమరుదెంచె బంగారు చాయల ప్రజ్వలించు సుగంధకుసుమ సమూహములనుండి సేకరించఁబడిన పుప్పొడినే పసుపుగాఁ బూసికొని, కొండతేనెతిలకంబుదిద్ది, పయ్యెద చెఱఁగు జారఁజిరునగవు ముఖమున దాండవమాడ పద్మినీ కాంత తనపతియగు ప్రభాకరునికన్న ముందుగనే లేచి యాతని రాకకై నిరీక్షించియుండె. అంతపద్మినీ ప్రియుఁడల్ల నల్లనకన్నుల నులిమికొనుచు తనప్రచండ తాపము నొకింతతగ్గించి నిదురమంపరచే తిన్నతిన్నఁగ బైకెగయఁగా నప్పటి యాతని దృశ్యము, మందయానలు శిరములదాల్చు కెంపుల బిళ్ళయో లేక మెరుఁగుబెట్టిన బంగారు తట్టయో యనునట్లుణకాంతులు నిగనిగమని మెరయఁ దన రాకకై వేచియున్న సతిని జేరదీసి ముద్దాడె. ఆమనోహర దృశ్యము నవలోకించి యాతని సేవకాబృందములగు శుకపికశారి కాని కాయములెల్ల మంగళవాద్యములోయనునట్లు తమతమ గూళ్ళనుండి బయలువెడలి కిచకిచనినాదములు చేయసాగె. కాయకష్టముచే సుఖనిద్రఁజెందిన దంపతులు భాస్కరుఁడప్పుడే లేచె నిఁకదడయుట బాడిగాదని తమ సౌఖ్యమున కంతరాయము గలిగెనని తిట్టుకొనుచు లేవసాగిరి.

అంతఃపురమున నేమిపనియుండెనో పాపమొక సన్యాసి అడయారునగల దివ్యప్రాసాదములలో నొకదాని చెంత పూలచెట్లు మధ్యమునబోవు కాలిత్రోవనుబడి మెల్లమెల్లగ నడుగులనిడుచు చూచి చూడనట్లు ప్రాసాదము నొకక్రీగంట దిలకించుచు యందలివస్తువుల నరయుచు వానినుూర్కొ చరించుచూ బోవుచుండెను. పైనుండి యాతని నడవడిక నంతటిని గనిపెట్టుచుండిన చెలికత్తెలకు నిడుముల గుడుచుచుండు భానుమతి యాతనిబలుకరింప నెంచెనుగాని మాటాడిన నేమికీడు మూడునోయని భీతిలి యిటునటు బరికించి చేయునది లేక దీనావదనయై యట్టిమోమును మాత్రమాతనికి గనబరచి తనబాధను దెలియజేయ సమకట్టెను.

సన్యాసి యిటునటు ననేకమార్లా ప్రదేశమున బచారుచేసెనుగాని దానభిలషించిన వస్తువెందును గానబడమి చింతచే నచ్చటనుర్చియుండిన "రాతిబెంచి (Bench Rock) పై కూర్చొని దీర్ఘాలోచన జేయుచుండ నాతఁడా సౌధాగ్రమునగల గదినుండి క్రిందికి తొంగుచూచు నారీరత్నము భారవిందము నవలోకించి యందలి దీనభావము స్పష్టముగా గానబడ మనంబున సంతసిల్లి దనపైనుండిన యుత్తరీయమును బయటికిదీసి యాడింపసాగెను. భానుమతి యాతని సైగలగ్రహించి యచ్చటనే యుండుమని వేడి బిరబిర నొకకాగితమునుదీసి దనయన్నకొక్క జాబును అసన్యాసి కొక్కజాబును వ్రాయనెంచి తన యన్నకిట్లని వ్రాసెను.

"అగ్రజా!

నమస్కారములు. నారాయణుఁడనువాడు నన్నిచట చెరబట్టి యున్నవాడు. నీవు సత్వరము తగుపరివారసమేతుఁడవై యేతెంచి యాపదలోనున్న నన్నుద్ధరింప వేడుచున్నదాన. ఆలశిం

చితిలేని నామానాపహరణము కాగలదు.

నీరాకకై నిరీక్షించు యనుంగుచెల్లెలు,
" భా ను మ తి "

సన్యాసి కీవిధముగ వ్రాసెను.

" మహానుభావా!

నమస్కారములు. మీరెవ్వరో నేనెఱుంగ. మిమ్ములజూడ పరోపకారధురీణులవలె గన్పట్టెదిని. నన్ను పలుకరించినంతనే నా పాలిట నా భగవంతుండే మీరూపమున సాక్షాత్కరించెనని సంతసించితి. మీముఖమునుజూడ నాకోసమై వెదకబంపిన గూఢచారివలె గన్పట్టెదిని. ఒకవేళనట్లయిననూ గాకున్ననూ యిందలిజాబును విలాసాదారుని కొసంగుడు. మీ యీ ఘనకార్యమునకు నేకృతజ్ఞురాలను.

ఇట్లు సాయమపేక్షించు,
"భానుమతి"

అనివ్రాసి రెండింటిని క్రిందబడవైచెను. సన్యాశి వాటినందుకొని తనలో దాను మెల్లగ జదువుకొని గుప్తముగా నాజాబులను మడచి దాచుకొన యత్నించుచుండ నంతలో నెవ్వరో వెనుకనుండి వచ్చి నొక్కపోటున నాసన్యాశిని గూలనేసి యాతని హస్తములనుండిన లేఖలలాగికొని పారిపోయెను. నిశితాఘాతముచే క్రిందబడి మూర్ఛిల్లిన యాసన్యాసి నేదదీరినబిదప నచ్చటొక్క నిమిషమైన నుండక రివ్వున కాలికిబుద్ధిచెప్పెను.

నారాయణరావు తనగదిలోని కగుదెంచి తనసేవకులనెల్ల రావించి నీలకంఠ దామోదరాదులగూడ బిలవనంపి వారువచ్చినపిదప

"మనమొక కష్టమైన కార్యము జేయవలసియున్నది. ఒకఘంట లోపల నామెనొక మోటారులో వైచుకొని గమ్యస్థానము జేరవలయును. మీరందరు ద్వాహమునకై గావలసిన పరికర సామాగ్రి సంతటిని మరియొక మోటారున నునిచికొని నాబండి వెనుక నే రావలయును. అదిగో! మోటారులువచ్చి నిలచినవి. అన్నిటిని సిద్ధము జేయుడు. మేమామెను గొనిపత్తుము" అనియాతఁడు నీలకంఠుని తోగూడ మేడపైకెక్కి తలుపులుదట్టగ కట్టివైచియుండుటచే నవియూడిరావయ్యెను. అంతవారు రహస్యకవాటమును దెఱువయత్నించిరి అదియును గాదయ్యెను. వారాశ్చర్యచకితులై చేయునది లేక సేవకుల నిద్దఱిసరావించి తలుపుల బగులగొట్టించి లోనికేగిరి. పాపము! భానుమతి భీతిచే నొక్కమూల నొదిగి కూర్చొనియుండెను. నీలకంఠుఁడామెవెనుక భాగమునుండి యేతెంచి తనవద్దగుప్తముగ దాచియుంచియుండు ద్రావకము నామెనాశికారంధ్రములవద్దజూఁప వెంటనే యామె కెవ్వుననొక్క కేకవైచి మూర్ఛితురాలాయెను. అదే యదనుగొని వారామెను గొనిపోయి మోటారున నునిచిరి. అంత నారాయణుఁడు మోటార్లను బోనిమ్మనిచెప్ప డ్రయివర్లు నడుపసాగిరి.

అట్లు పరాభవింపబడిన సన్యాసి భానుమూర్తి గృహమునకు బోయి యడయారునందలి వృత్తాంతముము తనకు జరిగిన పరాభవమును దెలియజేసి పోలీసుల కావార్తనెఱింగించి కొందరిని దమవెంట నిడుకొని వచ్చిచూడ నాసౌధరాజము నిర్మానుష్యమై తలుపులన్నియు బంధింపబడి తాళములు వేయబడియుండెను. వారది గాంచి యాశాభంగమైనందులకు విచారించి యాలశ్యమే కారణమనుకొని వచ్చినత్రోవనే మఱలిరి.

ఆహా! పరమాత్ముడెంత క్రూరస్వభావుఁడు. నిష్కపటసత్య సంధులగు మహానుభావులకే లెక్కలేని కష్టముల నొడగూర్చును గదా! బహుశ వారినిష్కాపట్యమును, సత్యసంధతను బరీక్షింపనెంచి యిట్టియిక్కట్టుల గూర్చునేమో! ఆహా! ఆతనిచెయిదము లద్భుతములుగదా!

# భానుమతి

## యిరువది యెనిమిదవ ప్రకరణము.

### ఆత్మహత్యా ప్రయత్నము.

నారాయణుఁడు తనసహచరులతోఁటి యొకపల్లెయందు విడిసి యుండెను. వారినివాసమొక విశాలమైన గృహము సత్రమువలె యనేకగదులచే నిండియుండెను. గృహపుమధ్య ప్రదేశము పైకప్పు లేనిది. అందుననే యొక మంచినీళ్ళ చేదభావి జలముసమృద్ధిగా నుండెను. దానికావల మైదానప్రదేశము. ఫలవృక్షములచే నొప్పారుచు నంతయునొక చిన్నవనమువలె గన్పట్టుచుండెను. దట్టముగ నందందు బెరిగిన ముండ్లపొదలు మాటున నెవ్వరైన దాగికొనిరేని యితరుల కగుపడరు. చాలకాలమునుండి యాభవనముపయోగింపమిచే కాంతిహీనమై భయము గొల్పుచుండెను. అందందు రాసులురాసులుగ బడియున్న మురికి పెంటలు దుర్గంధ పూరితములైయుండెను. నారాయణుఁడు వాటినెల్ల దొలగింప మనుష్యుల కొందరిని నియమించి నిర్మలవాయువు లాప్రదేశమున విహరించుటకు వీలుకలుగ జేయుచుండెను.

సేవకులాతనియాజ్ఞనుగొని యోపినకొలఁది పనిజేయుచుండిరి. నారాయణుఁడు వాంకొకింత సమీపమున నొకయున్నత ప్రదేశమున నాసీనుఁడై వారినప్పుడప్పుడు హెచ్చరించుచూ తనయభిలాష యీడేరనున్నదని మనంబున మందానందఁబునొంద కావలసిన కార్యములకై వలసిన సామాగ్రిని యుచితస్థానముల నుంపించి పురోహితులింకనూ రానందున నెవరినైనబంపి పిలువనంపెదగాక యని

నిర్ధారించుకొని నీలకంఠునికై వేచియుండ నంతలో యాతఁడేతెంచె ను. నారాయణుఁడు "శాస్త్రీ! అన్నిఁటిని సిద్ధపరచితివా?" అని యడిగెను.

నీల—సర్వము సిద్ధమైనది. పురోహితులుగూడ గానున్నారు. నీవొకసారులోని కరుదెంచి యామెను సమ్మతింపజేయుము. ఆమెకుగా దెచ్చిన దుస్తులు, ఆభరణములు మొదలగునవి నచ్చట నే యుంచియున్నాఁడ. అవ్వాను శృంగారింపమనుము.

నారా—ఇదిగో! నేవెడలెద. దామోదరుఁడుగూడ వచ్చె.

దామో—నారాయణా! నీయాజ్ఞ మేరకు యన్నిఁటిని చక్క జేయించితిని. ఇఁక సంతకముమాత్రము జేయవలసియున్నది. సాక్షులక్రింద నేమను నీలకంఠుడును జేసెదము లే! పురోహితు లొకరి ద్దరు సంతకము జొప్పనజాలరా?

నారా—చాలు. చాలు నీవిక వివాహమంటపమున గావలసిన సామానుల దెచ్చిపెట్టుము. నేనామెవద్దకేగి విషయమెఱింగించివచ్చెద.

దామో—నారాయణా! నీవిగ్రహము జూచినచో నామెభీతిల్ల గలదు. గాననీవు సౌమ్యమువహించి శాంతిమార్గములచే యభీష్టము నెరవేర్చుకోదగును. ఒకవేళమించి యంగీకరింపకపోయిన బలవంతమే శరణ్యము. అంతయూ నేనొనర్చిన పనియే. త్వరలో నీవిఁక గృహస్థుఁడు కాగలవు. ఏమో! నిన్నాశ్రయించుకొన్నందుల కు నీవు నాకు వాగ్దానమొనర్చినరీతి నాకీయకతప్పదు.

నారా—ఇప్పుడంత తొందరయేల? వివాహకార్యము ముగియ

నిమ్ము. దాన మన కష్టములు గట్టెక్కగలవు. నామనంబున నీ వొనర్చిన సాహాయ్యమునకు బహుమాన మీయవలయుననుకొని యున్నవాడ. నా యీ వివాహమువలన మనలకు స్నేహమేగాక బంధుత్వముగూడ కూడికొనున్నది. నేప్రేమించినకన్య నాచేజిక్కినది. నాకోర్కె ఫలించనున్నది. నాకదియే గావలసినది. నీ సాయము నేను మరతుననుటగల.

దామో—నారాయణా! పురోహితులతో ముచ్చటించితి. వారుకూడ మన జట్టులోనివారే. వారికీవార్త నెఱింగింప పరమ సంతోషమున యంగీకరించుటయేగాక నిట్టివివాహములకు మంత్రములతో బనిలేదనియు వివాహమైనట్లొక కాగితమున్న జాలుననిరి.

నారా—"మంచిపనియే. మనకు మఱెంత యనుకూలమైనది. పొమ్ము. నీపనులను జూడుము"అని తానులోనికి బోయెను.

నారాయణుఁడు తన కన్నివిధముల కార్యసాఫల్య మొందుచున్నందులకు చాల సంతోషించెను. ధనమెంతనష్టమైననూ లెక్కగొనడు. కార్యసిద్ధియైనజాలు.

ఆనాడతని సంతోషమునకు మేరయే లేదు. "ఇఁక సనతి కాలములోనే వివాహము చేసికొందునుగదా! నాకీప్రపంచమున నన్నాశ్రయించి ధర్మానువర్తినియై బరగునట్టి సాధ్వీలలామ నాకుదొరికినది. అంతయేచాలు. ఇఁకవిషయలంపటుఁడనుగాను" అనితన మనంబున ననుకొనుచు భానుమతిగది బ్రవేశించె.

భానుమతి పరిచారకులు చేయుచున్న పనుల దిలకించి వారివర్తనములు వివాహావశ్యకతని రూపించుచుండ "ఎవరికి వివాహము"

అనియడుగ వారు తమకేగదా! ‘‘ఎంతటివారలమ్మా! మీవివాహము మీకే దెలియదా!” అని బదులిడ దుర్మార్గులు దన్నిట్లు నిర్బంధ వివాహమొనర్ప నెంచిరి గాబోలునని చింతాక్రాంతయై గుందుచుండ వీరశర్మ విగ్రహము కన్నులగట్టినట్లుండ ‘‘వీరశర్మా! మనయాశలన్నియు నిరాశలైనవిగదా’’ యని క్రిందబడి మూర్ఛిల్లుచు; సేదదీరినపిదప అదంతయు నొక కలయనుకొని యొకవేళ నారాయణుఁడు బలిమిని నేదైన కార్యము చేయనెంచిన మరణమే శరణ్యమనుకొని ధిట్టత వహించి నొకమూల నొదిగికూర్చుండి విధాత తనకట్టి కష్టముల నొడగూర్చినందుల వ్యసనముచే యశ్రుబిందువులు ముత్తియములట్లు నేల రాల పైటకొంగుచే దుడుచుకొనుచుండెను.

నారాయణుఁడు లోనికేతెంచి ‘‘భానుమతీ! నీకన్నియు నిది వరకే దెలసియుండును. నేను వేరుగ జెప్పనక్కఱలేదు. కొన్ని ఘంటలలోనే మనపరిణయము పూర్తికాగలదు. అదిగో! దాసి నీకై మంచివిలువగలవిదుస్తుల గొనివచ్చుచునది. వాటినిగొని తగురీతి నలంకరించుకొని సిద్ధముగమ్ము. ఇఁక నీమంకుపట్టు వీడుము.”

భాను—(గద్గదస్వరమున) అయ్యా! మిమ్ములనేను భ్రాతగా దలంచుచుంటి. నేనుమీసోదరిని. నన్నీరకబాధపెట్టి బలత్కరించిన ప్రయోజనమేమి. మీసుఖముగోరిగదా మీరువివాహమాడ నుండుట. అట్టితరినొల్లని నన్నిరీతిబాధించుట న్యాయమా?

నారా—‘‘నీనక్కవినయములిఁక గట్టిపెట్టుము. అన్నియు సిద్ధమొనరించితిమి. నాడే నిన్నుబడసియుందును. పాపము! ఏమియు దెలియని దానినప్పుడే బాధించుట పాడిగాదని యూరకుంటి. ఊరకున్నంతవరకు నీబిగువుమాట లధికమగుచున్నవి. కానిమ్ము! ఇదిగో!

నేఁబోవుచున్నవాఁడ. మాదాసియగుదెంచును. దానితో నీయుచ్చక ములేమైన నున్న దెలియఁబఱపుము. అంతియేగాని సమ్మతింపక యూరడిపెట్టి నిన్నోదార్పువా రెవ్వరిచ్చట లేరు." అని బిరబిర వెడలి పోయెను.

భానుమతి తానున్న దుర్గతి నొకమాఱు దలంచుకొని మనంబు జలదరిల్ల "దైవమా! నాకెట్టిగతి దెచ్చిపెట్టితివి. అయ్యో! భానుమూర్తీ! ఒక్కనిముసము గానరాకున్న వెదకఁబంపువాఁడవు రెండుదినములైనను నాజాడ లెఱుఁగకుంటివే! తల్లియు దండ్రియు వేయేల సర్వస్వము నీవే యనుకొంటినే. హా! సన్యాసి జాబైననీ కందియుండిన నన్ను విడిపింపయే తేరవా? నాకట్టి దివిభాగ్య నొసలవ్రాయలేదు గాఁబోలు. హా! దలఁచికొన్న గుండియలు ఝల్లుమనుచున్నవే! నీచుఁడు నారాయణుఁడు బలిమిమై కంఠమున పుస్తెగట్ట నెంచెనే! ఇఁకవాని చేతులచే కంఠమున మంగళసూత్రమును గట్టించుకొని భువిపై మనుటకన్న నొక్కచిచ్చిటిలో జచ్చిన మేలుగదా! హా! హా! భావినిబరికించినచో ......దుర్భరము. సహింపజాల. నేటికి రెండుదినములాయె. నోరెండుకొని పోవుచున్నది. మంచినీటిని బ్రీతితో నొసంగు పుణ్యాత్ముఁడే దొరకఁడయ్యె. అయ్యో! నా రణమతి స్వామిత్యమున నున్నది. నేనిహలోక వాసనలనెల్ల ద్యజించితి. పరమేశ్వరుఁడే గతి యనినమ్మితి. అవనిపై నాకుఁగల బంధువర్గములారా! మీకివే నాకడపటి వందనములు. వీరశర్మా! నీపేరు విన్నంతనే నోటనీళ్ళూరు. నీనామమే నాకుశరణ్యము. నీతోటి యిహలోక ఋణముదీరినది. నీరాకకై సురలోక మందిరద్వారముకడ వేచియుండెద. నేఁబోయితినని వేరొకవనితను బరిణయమాడినను నీమనోహర విగ్రహమే నాహృదయపీఠమున నునిచి సదా భజించుచుండెద. ఇదిగో! నీకివి

నా ప్రేమపూరిత యశ్రుకణము లర్పించుచుంటి. గైకొమ్ము. నాకిక
శెలవు,'' అని తిరిగి ''భానుమూర్తీ! చిన్ననాటనుండి నన్ను నాజననీ జన
కులు కనిపారవేసి నదేగాని నన్ను చేరదీసి విద్యాబుద్ధుల గరపి నన్నిం
తటి స్థితికి దెచ్చి యనవరతము నాక్షేమము లారయుచుండిన నీపదాబ్జ
ములకిదే కడసారి వందనములు. నేనేదైన తప్పులొనర్చియుండిన
క్షమింపుము. క్షమించితివా! చాలును. పాపపంకిలమునుండి
సుమార్గ సుఖానంద సురపట్టణ, సువాసవమే యిక నాకుగతి.
దైవమా! నన్నిక నీలోజేర్చుకొమ్ము! ఆత్మహత్య యొనర్చుకొంటినని
నన్నుదూరకుము. నాకియ్యదియే గత్యంతరము.'' అని బిరబిర దన
కంఠమున కొకత్రాటిని దగిలించుకొని త్రాటియొక్క రెండవకొనను
గవాక్షమునకు దగిలించి క్రిందికి వ్రేలాడెను.

# భానుమతి

## యిరువది తొమ్మిదవ ప్రకరణము.

### సుందరీ వివాహము.

మార్గ్గి లొకమారు పట్టువడి శిక్షింపబడిననూ; అంతటితో బోక తిరిగి తమ దుష్టత్వమును కొనసాగించుదురేగాని యూరకొనరు. ఏదో కానివేళ దుర్గతి సంభవించె నింకనైన సత్ప్రవర్తనతో మెలఁగుదమని యొకింతయైన దలఁచరు.

వైకుంఠశర్మ మదరాసునుండి బహిష్కృతుబోయి యచ్చటంతటితో నూరకుండెనా? లేదు తన దురాగతములన్నియు దేట తెల్లమయ్యెను దాన సహింపరాని యావమాన కళంకములు గలుగుటయేగాక యిఁక జన్మాంతము వరకు దన్ను చేరదీసి రక్షించు పరమ సాధుశీలుఁడగు రామశర్మ కోపాగ్నికి పాత్రుఁడై యాతని యెదుట గానవచ్చినచో యిఁక ప్రాణములతో గూడ నుండనీయఁడనంతటి స్థితిని దెచ్చుకొనెను.

అట్లు పరాభవింపబడినపిదప నచ్చట నిలచియుండుట శ్రేయస్కరము గాదనుకొని తిరిగి మదరాసున కరుదెంచెను. ఈమారు దన వేషమును వేరొకరీతిగ దాల్చెను. మహమ్మదీయ వేషమునకు గావలసిన గడ్డము మొదలగునవి యిదివరకే పెంచుకొనియుండుటచే నేఁడాతని నూతనాలంకార వేషమునకు బనికివచ్చెను. నొసటకొన్ని విభూతిపిండి కట్లురాచుకొని మెడకు రుద్రాక్షనొకటిని బంగారు తీగచే నల్లించి వేసుకొనెను. తనకు చిరపరిచితమగు వైద్యమునకు దగినట్లు కొంతజోతిష్యమును యలవరచుకొని యుండుటచే యాతని యప్పటి వేషమునకు చాల సహాయకారిగానుండెను. తొట్టదొలుత

తాను బర్మాలో రహస్యముగా సేకరించిన ధనమును కొంతకొంత ఖర్చుపెట్టి జీవయాత్ర గడుపుకొనుచు దనవద్దకే తెంచువారలకు దన పాండితీ మహిమలెల్ల వివరించుచు వారికి కలవిలేనివి రెండు కల్ల మాటలజెప్పి వారిచ్చు ధర్మబిక్షతో యనాయాసముగ కాలము వెళ్ళ బుచ్చుచుండెను. దానంజేసి యాతనిపేర చిరకాలములోనే గొప్ప జ్యోతిష్కుండని యెల్లరకు దెలసిపోయెను.

ఒకనాడు సుందరి దనకు గలిగిన పరాభవానల జ్వాలలుమైసోక యిట్లనిపలువరించె "ఆహా! ఎంతటి యవమానమునకు బాల్పడితి జనకసమానులగు సుబ్బశాస్త్రాదులతో వైరముగల్పించుకొంటి. దురాచారిణి యనుబిరుదమును శిరమునదాల్చుకొంటి. ఇకనాచదువు, నాధనము, నాభూసంపత్తి, నాయందము నాసయ్యారము యన్నియు మట్టిపాలు గావలసినదేనా? లేక యవమానముల పాల్జేసిన కూరాత్మునిబట్టి తెచ్చి నానాయిడుములగుడిపి తుదకు చంపిపారవేయవలెనా? ఏదియు నామనంబునకు రాకున్నయది. (క్రోధముతో) హా! దురాత్మా! ధూర్తమూర్తీ! నీకెంత కండకావరము. "చూడుము నిన్నేమిజేసెదనో" యన్న నాటిమాట నాప్రతిజ్ఞా భాషణము చెల్లించుకొన్నగదా నామనస్సున కూరట గలుగుట. అంతవరకె క్కడిది నాకానందము. నాజీవనమే వ్యర్థమొనరించిన దురాత్ముని జంపి నాకళంకపు చిహ్నము లాతని రక్తముతో గడిగికొని ఆ యానందమున హాయిగా నాయీదేహమును బాపినగదా సుందరెంత సాహసవంతురాలు ధీరమానసయని కీర్తింపబడుట" యని చేయబోవు భావికార్యక్రమమునకు పునాదులు వేయసాగెను. అట్లుదీర్ఘాలోచ నానిమగ్నయైయుండ వీధిలో నెవ్వడో యొకవృద్ధుడు పండితుండు వోలె గన్పట్టువాడు యెక్కడికో యేగుచుండ నాతని యింటిలోనికి

బిలచి కూర్చుండబెట్టి "అయ్యా! మీ రేయూరు. ఏపనిమీద నిచటి కేతెంచియుంటిరి" అనియడిగెను.

వృద్ధు—అమ్మా! మేము దక్షిణాత్యులము. నాకుజ్యోతిష వైద్యములందు సమాన పాండిత్యముగలదు. నావృత్తిచే జీవింప నిట కేతెంచితి.

సుంద—అయిన నేనొక్కమాట యడుగదలంచితిని వినుడు. ఇప్పుడు మాతల్లిగారు దమపుట్టినింటి కేగియుండిరి. వారిప్పుడేదో జబ్బుచే భాధపడుచున్నారనియు, జీవించుననెడి యాశ లేదనియు వ్రాసియున్నారు. ఆమెయింకనూ యెన్నినాళ్ళు జీవించునో దెలుప గలరా?

వృద్ధు—అమెకిప్పు డరువది సంవత్సరములు. మీరేయామె కట్టకడపటి సంతానము మీకుముందుదయించిన వారీలోకము బాసియుండిరి. ఆమెనిప్పుడు మనోరోగమే బాధించుచుండునది. ఇంక నామె జీవింపదు. నేటికి మూడుదినములలో మరణింపగలదు. నామాటలనమ్ముడు. ముమ్మాటికి నిజములు. నేజెప్పిన పై సంగతులన్నియు నిజములుగావేమో వచింపుడు.

సుంద—(ఆశ్చర్యముతో) మహాత్మా! మిమ్ముల నెంతకొనియాడుదు. మీమాటలం దెంతమాత్రము యసత్యము లేదు. అన్నియు జక్కగావచించితిరి. మీపాండిత్య మసమానము. నే యొనర్పుపనుల కాటంకము గలుగుచున్న మాజనని యింక నాలుగు రోజులలో—సమాప్తి నొందగలదు. నాపనులకిక యభ్యంతరమే లేదు. అయ్యా! మీమాట లెంతవిశ్వసనీయములు.

వృద్ధు—అమ్మా! తల్లిమరణించునని సంతసించు వారుందురే!

సుంద—నాసుఖమునుజూచి యోర్వలేని దల్లియుండిననేమి? మండిననేమి? అత్యంతానందమునుగూర్చు మీ యీ యమృతవాక్యముల కేరీతిని బహూకరింతును. మహాత్మా! మీతో నేనొక రహస్యము వచింపనెంచితి. నాకుసాయముచేయుదురని బాసయిచ్చితిరేని వచింతును.

వృద్ధు—అదియెట్టిదో వచింపుము.

సుంద—మీకుమంత్రతంత్రము లేమైన దెలుసునా?

వృద్ధు—ఎఱుంగుదును. వాటితో నిపుడేమిపని?

సుంద—(చెప్పుటకభినయించి) అయ్యా! మన సిగ్గుమాట లాడుచుంటి. నాయీవచనము లన్నృతములుగావు వినుము. సిగ్గు విడచి చెప్పుచున్నందులకు మన్నింపుము. కొన్నిదినముల క్రిందట భానుమూర్తియను యొకయువకుని ప్రేమించితిని. ఆతఁడు నన్నెల్ల నఁదున యాతనిపై ప్రేమచే బహుభంగుల బ్రతిమాలితి. అంతను వినకున్న పైబడ నెంచితి. తెగించితి. ఇఁక చెప్పజాల—కాని యే మొనర్చిననేమి. ఆతని హృదయమున యనురాగము లేశమైన లేకపోయె. వలచి పైబడనెంచిన నాయట్టి సుందరాంగిని సంతృప్తిపరచి యంతటితో నూరకుండక యెల్లకాలమానందాబ్ధినిదేల్ప వివాహమాడమంటి. అందుకును యియ్యకొనడయ్యె. అపుడు నాకెన లేసి కోపముదయించి యనరానిమాటలంటి "నిన్నుచేపట్టుకున్న నే సుందరిని గానని" ప్రతినబూనితి. ఇంతవరకా ప్రతినచెల్లింపకుంటి. నామదికలంచి వైచినది. పంచశరునిభాధ యతిదుస్భరముగా నున్నయది. గాన నేవిధముననైన నాతనిజేపట్టవలయు. అది నెరవేరకున్న నాతని యింతటితో మట్టుబెట్టి మదీయ హృదయతాపము నణంచుకొనెదను. ఈరెండింటిలో మొదటిది సామభేద దండోపాయముల చేత సాధించవలయును. నెఱవేరకపోయెనా రెండవదే శరణ్యము దీనికిమీరేమందురు.

వృద్ధు—కార్యము కష్టకార్యము. విఘ్నములు దటస్థించెనా మనమిరువరులు దగులొ్కన వలసినదే. కానిండు! ప్రయత్నించెద నాప్రయత్నము లెన్నటికిని వ్యర్థములు కావు.

సుంద—మంచిది. మీవుపకార మెన్నటికిని మరువజాల. మీకృతజ్ఞత కేను బహుసూన మొసంగెదను లే.

వృద్ధు—"అంతయుమీదయ. మాభాగ్యము. ఇఁక నే నిచట నుండజనను. వేరొకపనిమీద బోవలయు. నేటినుండి మీ పనిఁబ్రవేశించెద. అంగీకరించెనా సరి. లేకున్న యీరాత్రియే యన్నియుజరిగిపోవును." అని గంభీరముగా బల్కి వెడలిపోయెను.

సుందరి యాతని గంభీరవాక్యములకు యొకింతచలించెనుగాని తనప్రతిజ్ఞ నెఱవేఱుచున్నందులకు లోలోనసంతసించెను.

ఇఁకనూ యమావాశ్య రెండుదినములున్నది. ఆరుఘంటలు మీగుటయే దడవుగ యెక్కడనుండియో వచ్చిన చీకటులు ప్రపంచమును గప్పివేయుచుండెను. గాఢాంధకారబంధురమై వర్షధారాపాతమై మెఱుపులచేత వినీలాకాశము యప్పుడప్పుడు వింత వెలుఁగున మినుకు మినుకు మనుచు చూచువారలకు వినోదమును ప్రయాణీకులకు భీతిని గలుగజేయుచుండెను ఎట్టి ధీరచిత్తుఁడైన నట్టివేళ బయటికి బోవుటకు దిగులొందకమానడు. చరించు మానవకోటికి "కార్పొరేషన్" వారు ప్రసాదించిన లాంతరులుదప్ప వేరెవ్వియును లేవు. అవియునుగూడ కొన్ని యారిపోయియుండెను. అట్టినిశీధమున గొందరు నిశాచరులవోలె వేషముల దాల్చినవారు భానుమూర్తి గృహమునుండి నేదియోయొక పెద్దవస్తువును సంగ్రహించి తమభుజస్కందములపై వైచుకొని మెల్లఁగ వీధిలోనికి నడువ

సాగిరి. ఆవస్తువెయ్యదియో యెందునిమిత్యమట్లు గొనిపోవుచుండిరో దెలియుట లేదు. వారట్లుపోయిపోయి యదివరకే సిద్ధమొనర్చియుండిన మోటారునందావస్తువును నునిచి తాముగూడా యందాశీనులరై జయనమయ్యిరి. సుమారు పండ్రెండు ఘంటలు మీరియుండ వచ్చును. అప్పుడందులోనివాడొకడు "యిదేగమ్యస్థానము" యని యఱచెను. వెంటనేబండి నిలుపబడెను. బండిలోని వారావస్తువును యందుండిన దేవాలయమునకు గొంపోయిరి.

వివాహకార్యము జరుగుచుండెను. పెండ్లికొమార్తె యొకత్తెయే పీటపై నాశీనురాలై యుండె వరుడు మరియొక పీటపై బండుకొనియుండెను. కల్యాణ వివాహ కార్య కలాపమంతయు నెప్పుడిగా వరుడు గూర్కొన నదేజరిగిపోయెను. వివాహమైనట్లు లగ్నపత్రికలు మొదలుగాగల వంతకుముందే వ్రాయబడియుండెను. సాక్షులక్రింద సంతకము లొనర్పబడినవి. అన్నియు సిద్ధమొనర్పబడి యున్నవి. ఇక మంగళసూత్ర ధారణ మొకటియే మిగిలియున్నది. అదియునుగూడ పురోహితుడే యొనర్చియుండునుగాని అదేలనో పాపము అదివరకు మూర్ఛయందుండిన వరుని యొకింత సేదదీర్చిరి. ఆతడు లేచి తనచుట్టును జరుగుచుండిన కార్యమంతటిని దిలకించి ఆ యపూర్వశోభ కచ్చెరువంది అదికలయో నిక్కమో యని దేరి పాఱజూచి యదినిక్కమేయని గ్రహించి తనజన్మ మధ్యమందు గలుగని యానందంబుగని సంతోషపరవశుడై వారు చేయుచున్న కార్యముల కడ్డుజెప్పక తనకదివరకే గట్టియుంచిన పసుపువస్త్రములును దనప్రక్కన దలవంచికొని గూర్చొనియుండిన సుందరాంగి మోమునుగల చిరునగవుజూచి ముగ్ధుండయ్యెను. నేనుగూడ యేదోవిధమున గృహస్థుండనైతిగదాయని యూరకుండెను. పురోహి

తుఁడొకఁడు వివాహపత్రిక యొకటుంచి యందుసంతకము జేయుమన నాతఁడత్యంతానందమున పరపర నేదియో గీకివైచెను. తదుపరి మాంగల్యమునుదీసి వధువు మెడలోఁగట్టుమన నెమ్మదిగా గట్టివైచెను.

భానుమూర్తితో యాదినమున వైకుంఠశాస్త్రి పెద్దతడవు సుందరీ వివాహవిషయమై మాటలాడ యాతఁడు మండిపడి తోక ద్రొక్కిన త్రాచువలె కోపోద్దీపితుఁడై కానిమాటలచే నాతనిదిట్టగా నాతఁడు సుందరి యింటికి మరలి యాతని నారాత్రియే గృహమునుండి రహస్యముగ యెత్తుకొనిపోవుటకు సంకల్పించితినని జెప్పి వివాహమునకు గావలసిన పనులన్నియు నారహస్య దేవాలయమున జేసియుంచుడని జెప్పె యెట్టులైనా నాటిరాత్రి వివాహము బలిమినినైన గావింప నుద్యుక్తుఁడై యదేప్రకారముగ నాటిరాత్రి పాపము! భానుమూర్తికిమారుగ యందుబరుండియుండిన దామోదరుని దీసికొనిపోయిరి.

సుందరి సంతోషమునకు మేరయే లేదు. తాబట్టిన కార్యము ఫలించినందులకు ముదమందెనుగాని దైవవిధి వేరుగనుండెను. కావలసిన కార్యమంతయు దామోదరునికే జరిగిపోయెను. భానుమూర్తి చెల్లెలనుబోగొట్టుకొని చింతాక్రాంతుఁడై దిక్కుదెలియక విచారించుచుండ దామోదరుండెదురుపడ నాతనిచేరదీసి "నాయనా మనబ్రతుకేరీతిగ బరిణయించె నీకనైన సద్వర్తనముగలిగి వర్తింపు" మనిచెప్ప నాతఁడు సరియని నాటగోలె యప్పుడపుడు దమ్మునింటికి వచ్చిపోవుచుండెను. నాటిరాత్రి దామోదరుఁడు తన తమ్ముఁడు భానుమూర్తి యింటనిదురించుచుండ వైకుంఠశర్మయు నాతని సహచరులును సుందరీవాగ్దానము ననుసరించి ఆతనియెత్తుకొనిపోయి ఆ రహస్యదేవాలయమున దొంగతనముగా సుందరితో బరిణయము

గావించిరి. అదంతయు నిశానమయమున జరిగిపోవుటచే నెవ్వరు
గాని మోసము గుర్తింపజాలరైరి.

మరునాడు వారందరు వేకువనే లేచిరి. సుందరి తనమనోవల్లభుఁ డింకను మేల్కాంచలేదని యాతని గదిలోనికేగి యందుబరుండి యుండిన దామోదరునిజూచి మోము వెలవెల బారఁ వివర్ణవదనయై చేష్టలుడిగి మేనెల్ల చెమ్మటలుగ్రమ్మ దేహముపై స్మారకము లేక మొదలంటు నరకిన కదళీతరువువలె క్రిందబడిపోయెను. ఆసందడివిని మిగిలినవారెల్ల బరువిడివచ్చి యామెను లేవనెత్తి సేదదీరనిపిమ్మట జ్యోతిష్కుఁ డామెచెంగట గూర్చుండి "అమ్మా! మోసమును మేము గూడ నిప్పుడే గుర్తించితిమి. అయినదేదో అయినది. దానికై వగచుట ధీరులనదగు వారల లక్షణములుగావు. మీకిష్టము లేకున్న నేజెప్పినచొప్పున వర్తింపుడ" నెను.

సుంద—అయ్యో! పండితులవారూ! ఎంతటిపనిగావించితిరి. ఇంతటితో నాయాశాలతను కూకటివ్రేళ్ళతో ద్రుంచివైచితిరే! మీకే యుపకారమొనర్చితి. నన్నీరీతి యవమానములపాలు జేసితిరే! హా! ఇఁక నాతనితో పత్నీత్వము నెఱపజాలుదునే. ఛీ! యిట్టిబ్రతుకు బ్రతుకంజాలుదునే?" అని కన్నులవెంట నీరుమున్నీరై ప్రవహింప వెక్కి వెక్కి యేడ్వసాగెను.

జ్యోతి—"అమ్మా! మనమొకటి దలఁచిన దైవమొకటి దలఁచును. ఆపదలు వచ్చినమాత్రమున యధైర్యపడుట వాడిగాదు ఇదిగో! వినుడు. మీకు వివాహమైనట్లు మనకేగాని యితరులకెంత మాత్రము దెలియదు. వివాహపత్రిక లాతనివద్దనున్నవి. అందు లకుగా మనమాతని కేమైనయిచ్చినచో వాపసుయివ్వగలడు. గాన నేనాతనివద్దకేగి మాటలాడి పర్యవసానము మీకెఱిగింతునులే" అని

బిరబిర దామోదరుని గదిలోనికేగి యాతనితో మాటలాడి యందుకు పరిహారముగా రూ 5000—0—0 వేల రూపాయల నిప్పించెదనని జెప్పి వప్పించి సుందరి కావిధమెరిగించి యామె చేనప్పుడే బ్యాంకు చెక్కు నొక్కదాని నిప్పించి యాతనివద్దనుండిన కాగితముల నన్నిఁటిని వాపసుదీసికొనెను.

# భానుమతి

## ముప్పదియవ ప్రకరణము.

### భానుమూర్తి—కారాగారము

రామశర్మ తన పుత్రీపుత్రులనుజూడ మద్రాసు వచ్చియుండెను. ఒకనాడాతని బావమఱది సుబ్బశర్మ ప్రసంగవశమున "బావా! మనప్రమదకు యుక్తవయస్సు వచ్చినది. వివాహ మింకనూచేయ కుండుట పాడిగాదు. ఇప్పటికాల పరిస్థితులు చక్కగ లేవు. యవ్వనము వెన్నవంటిది. అతిస్వల్పకాలములోనే కరగిపోవునది. మీతోవచించిన మేమొక వరుని నిశ్చయించి పరిణయ ముహూర్త మునుగూడ నిర్ణయించితిము గాని ప్రమద యంగీకరింపమి నిలిచిపోయె. ఇపుడు మీరుగూడ యిచ్చటనేయుండుట తటస్థించినది. మంచి సంబంధ మొకదానినిగూర్చిన బాగుండును. ఫాల్గుణమాస మరు దెంచు చున్నయది. ముహూర్తములొకటి రెండుదప్ప చాలాలేవు. గాన విచారించి తగుప్రయత్నము జేయుట యుక్తముగాదా" అని యడిగెను.

రామ—ఆకోర్కెపైన నేయిచటి కేతెంచియుండుట. మన సాంప్రదాయములకనువైన వారెవరైన నుండిన విచారించెదరా?

సుబ్బ—ఉన్నారు. ఒకరిద్దఱిని దోడితెచ్చెదను. కాని ప్రమద యంగీకారము బడయవలదా? దేనికిగాని యామెకోర్కెపై జేయుట శ్రేయస్కరంబు.

రామ—అట్లయిన మీరొకమారు ప్రమదనిటుబంపుడ"నెను.

సుబ్బశర్మ లోనికిబోయె. ప్రమదవచ్చి తండ్రిప్రక్కన గూర్చొనియె. అంతరామశర్మ "అమ్మాయీ! ప్రమదా! ఈ మాఱైన బరీక్షయందు నెగ్గగలవా?"

ప్రమ—ఏమో! ఎట్లుచెప్పగలదాన.

రామ—నీవుచక్కగా జదువుచుండిన బరీక్షలో నుత్తీర్ణురాలయ్యెదవని యెఱుఁగవా?

ప్రమ—నెగ్గగలననియే నా విశ్వాసము.

రామ—అమ్మా! నేడునినొక్కప్రశ్న వేయదలఁచితి. నీవు చదివినదానవు. నీకితరులుజెప్ప నశక్యులు. చెప్పుటగూడ యనవసరమే. కాని నీక్షేమాభిలాషులమగు మేము నీపై యొకవిధమైన భాద్యత వహించియుంటిమి. ఇపుడు జెప్పవలసిన విషయమేమన; నీవు వివాహమున కర్హురాలవైయుంటివి. వివాహమతిత్వరలో చే జేయనుంటిమి. ఇందు నీవద్దజెప్పక నిప్రేమకు బాత్రుఁడైనవాని కోరికొని మదీయవంశము నుద్ధరింపవేడుచుంటి. నీయభిమతము వచించిన విచారింపనెంచితి. ఇందులకు నీవేమందువు.

ప్రమద—(సిగ్గుతో దలవాల్చికొని) తండ్రి స్త్రీలెన్నడేని సిగ్గువిడచి వచింపనేర్తురే!

రామ—తల్లీ! అట్టి దివిదుషీమణుల లెక్కగొనరనుకొంటి.

ప్రమద—నవనాగరీకుల చందములవిగాని కులస్త్రీలు విద్యనేర్చినను సిగ్గుబిడియము గలిగియుండవలసినదే!

రామ—అమ్మా! ప్రమదా! నీవుజెప్పకున్న మాకెటుల దెలియగలదు. నేను క్రొత్తవాడననియా! నేనునీనిజ జనకుండను.

కారణాంతరములచే దూరదేశముల నివసించుటఁ జేసియు నిన్ను, నీవు పుట్టిన పదిదినములనుండి జూడకుండమియు యొకరి కొకరు క్రొత్త వారమే. కాని యిప్పుడైన నన్నెఱింగి యుంటివిగదా! ఇకనావద్ద నేల దాపరికము.

ప్రమద—జనకా! మిమ్ముల నేనెఱుంగక బోవుటలేదు. చనువు తక్కువ యెక్కువలు సిగ్గునకేల వర్తించును. కానిందు మదీయ హృదయ మెఱుఁగఁగోరితిరి. గాన నేవచింపక తప్పదుగదా! అదిగో! ఆబల్లపైనున్న పుస్తకాముఖమున యెవ్వాని నామాక్షరములు విలసిల్లుచున్నవో వాని...............అనిసిగ్గుచే మాటలాడజాలక మెల్లఁగ నటనుండి తప్పుకొనియెను.

సాంబశర్మ పుస్తకమునుదీసికొని యందుగల "భానుమూర్తి" యను యక్షరముల జదివికొని నిర్ఘాంతపడఁజొచ్చెను. "దైవమా! నీచేతలు పరమాద్భుతములు గదా! సోదర సోదరీల నేవనగూర్చనుంటివే! హా! నేనీలోకమున లేకుండినచో వీరిద్దరు వివాహము గొనదుర్కొని యెట్టిపాపమున కెరయగుచుండిరి. అయ్యో! యిపుడేమిసేయువాడ. భానుమూర్తి నాతనయుఁడన్నచో సుబ్బశర్మాదులు నమ్మరుగా! నమ్మినను నమ్మకున్నను ప్రమదమనంబు ద్రిప్పజెల్లు. ఆమెమనంబు లేత మొక్కవంటిది. విఱిగెనా యెంతటితో పరిసమాప్తినొందగలదు. గాన యీమెకొకింతయు దెలియసేయరాదు. ఆమెపూర్తిగా నాతని ప్రేమించినది. నేనేమి జెప్పినను వినజాలదు. నేనొకవేళ భానుమూర్తి సోదరుండగునని జెప్పినచో నిజమారసి బ్రహ్మచర్య మాసించునేగాని కులాంగన వలచినవాని వదలి వేరొకనిపై మనంబుద్రిప్పునా? కల్ల. దీనికేది యౌషధంబు. నాకుజూడ యొకటిదోచుచున్నయది. నేనీవిషయములనెల్ల సుబ్బశర్మ

కెఱింగించి యామె మనంబన్యాయత్తమగునట్లు జూడవలయును. నేనిచటయున్నచో భానుమూర్తి పరిచయము వీడగొట్టుటకు దోడ్పడి నది నేనేనని చక్కగా దెలిసిపోగలదు. గాన నతికాలములోనే మద్రాసు వీడవలయును" అని తనమనంబున వితర్కించుకొనుచు నేదో యొకింత హాయిగా నిచ్చటనైన కాలము గడపెదమనుకొంటిని గాని యిచ్చటగూడ కష్టములు దప్పవయ్యెనని చింతాక్రాంతుడై యట్లే మైమరచి నిద్రించెను.

ఒకనాడు కళావతి సముద్రపుటొడ్డున విహరించుటకై బోవుచుండ మార్గమధ్యమున వైకుంఠశర్మ యెదురుపడి పరిచయ మొనరించుకొన యామె సంతసించి తనతోరమ్మన నాతడు వల్లెయని దానుగూడ బోయెను. వీరటు బోవుచుండ రామశర్మ నవుకరొకడు కళావతీ సహాయార్థమె వెనువెంటనే వచ్చుచుండెను. కళావతి యాతనిజాడ లెఱింగినదిగాదు. రామశర్మ తనభార్య కళావతి మానసము దుష్కర్మ సంయుక్తంబని యొకకంట జూచుచుండుటయేగాక తన కత్యంత విశ్వసనీయుండగు రామలింగమనువాని కళావతీమనోగతముల నెల్ల దెలిసికొని తనకు నివేదించుచుండవలయునని యాజ్ఞాపించియుండెను. వాడు రామశర్మ యాజ్ఞచొప్పున వర్తించుచూ నొకవేళ తనచేతనే కార్య విధ్వంస కార్యసాఫల్యమగునేని రామశర్మకు జెప్పి యదివరకే వ్యసనముచే కృంగిపోయిన మనంబును మఱింత కృంగజేయుట పాడిగాదని దానే తగిన ప్రతిక్రియ మొనర్చుచుండెను.

వైకుంఠ—చాలాకాలమునకు యపూర్వసమ్మేళనము. ఇదియే కడపటిదనుకొనెద. మనవాగ్దానములు రిత్తయైనవిగదా!

కళా—ఏమీ! మనవాగ్దానములు రిత్తయగునా! కల్ల. త్వర

లోనే మనయెత్తులు ఫలోన్ముఖము కాగలవు. అందులకే నేడు మిమ్ముల నాదయామయుఁడు నాయెదుటికిబంపుట

వైకుంఠ—సంతోషము. ఎన్నినాళ్ళ కిట్టియమృతవాక్కులు వినదటస్థించె నేడుగదా నాకుపండుగ.

కళా—కొన్నిరోజులిట్లు దాళియుండుడు. దినదినము పండుగయేయగును.

వైకుంఠ—అంతయు నీదయా ధర్మముపై యాధారపడియున్నది

కళా—మన మాశాసౌధము త్వరలో పూర్తిగానున్నది. గాన మీరీసమయమున నాకండయైనిల్చి నామనోరథము దీర్తువని దలంచెద.

వైకుంఠ—నాయిప్పటి పోషణమే గష్టముగానుండ నేనెట్లు నీకుసాయమొనర్తును.

కళా—ఏసహాయము గావలసియున్ననూ నేనుండ లేదా?

వైకుంఠ—అన్నిటికిని ధనమే ప్రధానము.

కళా—కావలసినంత వెచ్చింతము లే.

వైకుంఠ—మీకోర్కెను దెల్పుడు.

కళా—మనయానంద విహారమున కడ్డుదగులుచున్న వ్యక్తి నింతటితో పరిసమాప్తి నొందించినచో బాగుండును గాదా!

వైకుంఠ—(భయకంపితుండై) హా! ఎట్టి కట్టడికార్యము.

కళా—అదేల నిట్లు భీతిల్లుట.

వైకుంఠ—సహజమేగద. కానిమ్ము ఇపుడంత తొందరయేల?
కళా—కార్యసాధకులు సమయమును విడనాడుదురే!
వైకుంఠ—అట్లయిన యవశ్య యాచరణీయమే!
కళా—కార్యసమాప్తి కేమందురు.

వైకుంఠ—"ఉన్నదున్నట్టుండి యొకమాను పరిమార్చిన లోకులు శంకించుటయేగాక మనగుట్టు వెల్లడిగాకమానదు. ఇదిగో! ఈమాత్రల నొకమండలము సేవించినచో ననాయాసముగ నిరభ్యాంతరముగా నెవ్వరికిగాని దెలియకయే మనపీడవదలిపోవును."

కళా—(సంతోషమున) ఇకనూ మండలమా! కానిండు. ఏమి చేయుదము. ఆతనికే నెటులనిచ్చునది. భుజించు పదార్థముతో జేర్చియివ్వవలదా?

వైకుంఠ—అదెంతపని. తుదకాతఁడుద్రాగు నీటియందిచ్చిననూ సరే.

కళా—అరుచి గలిగించి సంశయింప జేయదా?

వైకుంఠ—ఏమాత్రము అనుమానమును గలుగనీయదులే. నీవేమియు యోచింపబనిలేదు. అనాయాసముగ నన్నియు జరిగిపోవును. (ప్రొద్దువంకజూచి) ఇకనిచ్చటనుండదగదు. కాలాతీతమైనది. నేజెప్పినచొప్పున యొనర్పుము. మనమికమీద రహస్యముగా కలిసికొందములే'' అని శెలవుపుచ్చుకొని వెడలెను.

వీరిసంభాషణయంతయు చాటుననుండి నౌకరు రామలింగము విని చాలమండిపడి యిట్టిసమయమున దానుమాటలాడుట దప్పుపని యని యూరకుండుటయేగాక కళావతి తనభర్తకొసంగు పానీయము

లన్నింటి నతిజాగ్రత్తతో పరిశీలించి విషప్రయోగమైన వాటిని పార వేసి బహులు నిర్మల పానీయముల నుంచునట్లు వంటవానితో జెప్పెదమనుకొనెను. మఱియు నిట్టిసమాచారము లొకవేళ రామ శర్మకు దెలసెనేని యప్పుడే భార్యాభర్తలకు గల సామునయించుట యేగాక దనకెక్కడనైన జీవనోపాధియగు నౌకరీ యెగిరి పోవునని భీతిల్లి స్వామి నపాయములనుండి రక్షింప నెంచెనేగాని యాతనికి నిజము బుత్తెంప నిచ్ఛగింపడయ్యెను.

కళావతి యొకనాఁడొంటరిగా గూర్చొని యిట్లని విచారింప దొడఁగె "ఇదియేమి చిత్రము? ఒకటి దలంచుకొన నెంచిన మఱొకటి యెదురై కాలికి జుట్టుకొనుచున్నదే. ఇఁక రామశర్మ పీడవదలు; సౌఖ్యమొనగూరునని యెంతయో మురియుచుండ నంతలోనె పిడుగు వంటి వార్తవినవయ్యెనుగదా! భానుమూర్తితన తనయుడేసట. నన్ను వంచించుట కాతఁడు మరణించెనని దుర్వార్తఁదానే వ్యాపింప జేసెనట. హా! పీడవదలి పోవునని వదలపెట్టి పోయినట్టున్నది. వైకుంఠశర్మ, మన్మనోనాథుఁడు, మదీయహృదయచోరుఁడు గూడ నిజ్జుట్టులోనుండెనా? లేకున్న నాసవతి కుదయించిన పురుష శిశువప్పుడే మరణించెనని యేల బొంకెను. బహుశః రామశర్మనుండి ధనము లాగుటకేయయి యుండును. ఎట్లయిననేమి? అతని మనంబంతయు భానుమూర్తిపైన నున్నదేగాని నారాయణు నొక్కమారైన దలఁచడుగదా! అతనిగ నొక్కమారైన బిలువనంపెనా! ఏదియును లేదుగదా! నేనేయాతఁడేదో కార్యముపై గ్రామాంతరమేగి యుండెనని విచారించి దెలిసికొంటి. అంతకంతకుజూడ తొండముదిరి యూసరవెల్లియైన దన్నట్లు భానుమూర్తిపై మక్కువచే నే డాతని యింటికి జని యాతనికి తన్నెఱింగించుకొనియున్న యాస్తిని యాతనికే వీలు (will)

వ్రాసి యివ్వదలఁచెనట. ఔరా! వీఁడెక్కడనుండి దాపురించె. ఇఁక
దడయుట నిష్ఫలము మూట గట్టుకొన్నట్టగును. ఏదేని యుపాయమా
లోచించి భానుమూర్తి నెంతత్వరలో మట్టుబెట్టిన నంత మేలు. లేకున్న
మాభావిస్వేచ్ఛా సౌధనివాసవిహారముల కడ్డుదగులక మానఁడు.''
అని మనంబున దలపోసి భానుమూర్తి గృహోన్ముఖుఁడై బోవుచు
న్న రామశర్మను గలిసికొనెను.

భానుమూర్తి యప్పుడే యరుదెంచిన వార్తాపత్రికను చేత
బూని యందుగల విచిత్రములనెల్ల నొకపరివీక్షించి చెల్లెలు జ్ఞప్తికి
రా విచారావేశమున బల్లపై చేతులనానించి యిఁక జేయవలసిన
కార్యమునకై యోచింపదొడంగె. అంతలో నెవ్వరివో యడుగుల
చప్పుడు వినబడ నొకపరి వెనుదిరిగిజూడ రామశర్మ కళావతాదులు
గానుపింప యదివరకు వారినిజూడ కుండమిచే యాశ్చర్యనిమగ్నుఁడై
డ దేకదీక్షతో వారిమోముల దిలకించుచుండ రామశర్మ "భాను
మూర్తీ నీకు కుశలమా! కొన్ని దినములనుండి దేహమస్వస్థతగా
నుండెనని వింటిని. ఇప్పుడెటులనున్నది.? మంచియౌషధమును
గైకొనుచుంటివా?" యనిప్రశ్న పరంపరల గురిపించెను. భాను
మూర్తి యపరిచిత వ్యక్తి యపూర్వ భాషణములు బల్కుచుండ
కొంతదడపు శంకించి "అయ్యా! మీరలెవ్వరు? మదీయ నామధేయం
బేరీతి గనుగొంటిరి? నాకేరీతిని స్నేహపాత్రులైతిరి! అని మున్నగు సవి
వచించి నాశంక బాపుడని వారి నుచితాసములపై యుపవిష్టింప జేసి
బ్రతిమాలెను. రామశర్మ యొకమారు నవ్వి యీరీతి చెప్పదొడంగె.
"మా స్వగ్రామము చెన్నపురియేగాని కారణాంతరములచే నేనిపుడు
బర్మాయందు నివసించుచుంటి." అనుసరికి భానుమూర్తి దనకు నెల
నెలకు "మణిఆర్డరు" ద్వారా పైకమును బంపి దక్షేమము లార

యుచుండిన దీతఁడేమోనని భ్రాంతిజెంది దనకానాటి కేనిమిది దిన ములనా డరుదెంచిన “మణియూర్ధరు కాగితముపై లిఖించిన లేఖను గొనివచ్చి యాతనికిజూపి దీనిలోని సంతకము మీయదియేనాయని యడిగెను. రామశర్మ యవునని దలయూచి యాతనికిని దనకును గల బంధుత్వమునంతటిని మరుగుపరచి యిట్లనియె. “నీవు చిన్న ప్పటినుండి మీతండ్రియు నేనును సహాధ్యాయులమేగాక దూరపు బంధువులముగూడను. ఆతడున్నయాస్తిని పోగొట్టుకొంటివనియు, నాకుటుంబపోషణ మతికష్టమై పోవుచున్నదనిలిఖింప నేను స్నేహ వాత్సల్యమునుబట్టి యేదో చేతనైనంత సాయమొనర్చుచుంటినని” బదు లిడెను. భానుమూర్తి దనజనకసమానులగు వారిని గనుగొని యా నందభరితుఁడై వారికానాడు పలువిధంబులగు భక్ష్యంబులతో విం దొనర్చి తనకృతజ్ఞతను గనబరుపనెంచి దామోదరుని బిలచి వారికి గావలసిన వేరు వేరు పదార్థములనెల్ల పూటకూటింటనుండి గొనితెమ్మ ని యాజ్ఞాపించెను. ఆతఁడు సరియని చెప్పినదానికంటె యొకిన్ని యెక్కువగా దెచ్చిపెట్టెను.

రామశర్మాదుల భానుమూర్తి యాతిథ్యమునకు జాల సంతోషించి యానాడచ్చటనే నిద్రించిరి.

రాత్రి పండ్రెండు ఘంటలు సమయము. నిద్రివశమున యెల్లరు నైమరచియుండిరి. అంధకారమెల్లడల వ్యాపించియుండెను, ఒకరికొకరు గానుపింపనంతటి చీకటి. అట్టిసమయమున గళావతి మెల్లఁగ పడకపైనుండిలేచి “నేటిదినచర్యను బరికించినచో నాయాశ లన్నియు రిత్తగాకమానవు. నేఁడో రేపో యీభానుమూర్తిపేర దనయాస్థినివ్రాయు రామశర్మ యెంచియుండెగదా! నాపాలిట బెను పిశాచియై వీఁడెక్కడినుండి దాపురించె. ఎక్కడనుండి యననేల?

నాదౌర్భాగ్యమునుండియే దాపురించె. ఆలశించినచో నాకార్యము విఘ్నముగాకమానదు. ప్రతీకార మిప్పుడొనర్చిననేగాని లేకున్న మించిన సరిదిద్దుటకు వీలుపడదు. మీామిక్కిలి మనగుట్టు బయల్పెటకమానరు. హా! దలంచుకొన్న గుండెలు నీరైపోవునుగదా. హృదయమా! ఆగ్రహము జెందకు. బూరుగవృక్షము నాశ్రయించిన చిలుక గతియయ్యెనుగదా! ఏమీా! కళావతీ పరిభవము రామశర్మ యెఱుఁగడా? కానీ! దీనికి నేప్రతీకారమొనర్పకున్న కళావతి నా! భానుమూర్తి! నీమాయము వీనాటితో యంతరించిన దనుకొనుము.'' అని బిరబిరఁ గుప్తముగ దాచియుంచియున్న కృపాణము కేలధరించి భీకరాకారమూర్తియై నాథుమహిషాసురుఁజంపబోవు కాత్యాయిని వోలె మండిపడుచు కన్ను లగ్నిగోళములై బ్రజ్వలింప యెవ్వరెఱుఁగకుండ భానుమూర్తి గదినిబ్రవేశించి యందుబరుండియుండిన వ్యక్తి నొక్కవేట్రుటున నరుక నావ్యక్తి ''అయ్యో'' యని యొకపెను కేకవైచి దీర్ఘనిద్రను బొందెను.

ఇఁకనచ్చటుండదగదని కళావతి బిరబిర ద్వారముకడనిలచి ''నాథా! నాథా! ఎవరికేకలివి? నాకుభయమగుచున్నది. లెమ్ము! లెమ్ము!'' అనిబిలువ రామశర్మ యదరిపడిలేచి దీపమును వెలిగించె. అంతలో భానుమూర్తియుగూడ వేరొకగదినుండియే తెంచెను. కళావతి యూతనిగాంచి నివ్వెరపడజొచ్చె. తానుపరిమార్చిన వ్యక్తి యెవ్వరై యుండుననిశంకించె. అన్యాయమొనర్చినందులకు దేహముగంపింప నోటమాటరాక నిశ్చేష్టయై క్రిందబడిపోయెను. అంత భానుమూర్తి రామశర్మలు చేతిలాంతరు నొకదానినిగొని గదిలోనికి బోయిజూడ పాపము! దామోదరుని కంఠమునుండి కారు నెత్తురు వరదయై పారుచుండెను. ఇఁకనూ ప్రాణమొకింత యుండుటచే కాలుశేతులు విలవిల దన్నుకొనుచుండెను. అదృశ్యమును

గాంచి వారాశ్చర్య నిమగ్నులైరి. ఎవ్వరీకృత్యము గావించిరి? అంతయుఁజూడ చాలచిత్రముగ దోచెడిని. వీధితలుపులుగూడ దీసి యుండిరి. "ఎవ్వరో యీయమానుషకృత్యమొనర్చి పలాయనులై యుండవలయు. ఆహా! ఎన్నిదినములనుండి యిట్టిపని జేయుటకై గనిపెట్టి యుండిరోగద. వారిఘాతుకకృత్య మీనాటికి నెఱవేఱి నది." అని రామశర్మయనుచుండ, మనంబు కలంచివైచినటులకాగ హృదయవిదారుణమగు దృశ్యమును గాంచి "అన్నయ్యా! దామోదరా!" యని భానుమూర్తి నేల గూలిపోయెను.

కళావతి రక్తముప్రవాహమై పాగుచుండ అందుదాను పడి నందువలన తనదుస్తులన్ని రక్తమయము లయ్యెను. తన కదివరకే రక్తమంటు కొనియుండుటచే గుట్టు బయట పడునని యెంచి కపట నాటకమాడ దలచి మూర్ఛిల్లినట్లు నటించి యప్పుడందే బడిపోయి దుస్తులరక్తమయము గావించుకొనియెను. పాపము రామశర్మాదు లామె మూర్ఛాకారణము గ్రహింప జాలక పోయిరి. అంతకళావతి తెప్పరిలి లేచి "నాథా నాథా! నానోటమాటలే వెడలకున్నయవి. మనంబున యంతకంతకు భీతి జనించుచున్నయది. ఇంకనిట్టిచోట నుండుట ప్రమాదకరంబు. మీకిష్టమైన మీరుండుడు. నే నేమాత్రముండజాలను." అని వెళ్ళిపోయెను. పాపము! మూర్ఛాక్రాంతుఁడైయున్న భానుమూర్తిని రామశర్మ లేపి "భానుమూర్తీ! భయపడ వలదు. నీకే యాపదనుగూడ రానివ్వనులే. ఒక వేళ ప్రమాద మొచ్చిన నేనునీయొడనుండి తత్ప్రతికార మొనర్చెదనులే. ఇదిగో! నేనిప్పుడే వెడలి యీవార్తను పోలీసుల కెఱింగించి సుబ్బశర్మాదుల వెంట బెట్టుకొని వచ్చెద. అంతదనుక వోపిక బెట్టుకొని యుండుము. తప్పక యనుదెంతు"నని ధైర్యము జెప్పి వదలిపోయెను.

కొంతసేపైన పిదప రామశర్మ పోలీసులను సుబ్బశర్మను మొదలగు వారిని దోడ్కొని వచ్చి వారికి మొదటినుండి దానెట్లు కనుగొన్నది సవిస్తరముగా వారికి దెలియ జెప్పెను. పోలీసు వారంతయు వ్రాసికొని యడిగరకే భానుమూర్తికిని దామోదరునికిని సరిపడదని దెలసికొని యుండుటచే యనుమానము పైన భానుమూర్తిని "అరెష్టు" గావించిరి. రామశర్మ తాను జామీనొసంగెదనని చెప్పిననూ విడువక కోర్టులో జామీను "పిటీషన్" దాఖలు చేయుడని సలహా నొసంగి భానుమూర్తిని కారాగారమునకు గొంపోయిరి.

# భానుమతి

## నారాయణుని పరాభవము

### ముప్పది యొకటవ ప్రకరణము.

"పెండ్లి కొమార్తెను వేదికపైకి గొనితెండని" పురోహితుఁడు త్వరపెట్టసాగెను.

పిన్నవయస్కురాలు, వచ్చియురానియవ్వన మావదనాబ్జమున విస్పష్ట మగుచుండెను, సంపూర్ణ గర్భవతి గాకున్నను యారు నెలల గర్భమని చెప్పవచ్చును. పాపము! వచ్చియుకాని యవ్వన ప్రాయమునకే గర్భమా! ఆమె యేలనో కంటపడి వెట్టుచు నొక్కగదిలోనికేగెను. ఆశ్చర్యము! అచ్చటనేమి గాంచెనోగాని దిగ్భ్రమ జెంది యాలశించినచో ప్రమాదము సంభవించునని సత్వరము గది వెడలివచ్చి కత్తి నొకదానిని దెచ్చియందు గవాక్షమునకు వ్రేలాడు చుండిన భానుమతి యురిత్రాళ్ళన్నిటిని పరపర తెగగోసెను. భానుమతి దప్పున క్రిందబడిపోయెను. అంతనాయువతి బిరబిర బయటికేతెంచి కొంతనీరమును దెచ్చి యామెముఖారవిందముపైజల్లి పైటకొంగు సాయమున విసరుచు సేదదీర్ప గొంత సేపటికి భానుమతి లేచి గూర్చుండి నోటమాటరాక నిశ్చేష్టయై గొంతు కనదిమి పట్టుకొని యల్లాడు చుండ యాసైగను గ్రహించిన తక్షణమే నాయువతి మరింత నీరము నాభానుమతినోట బోసెను. కొన్నినీరములు కడుపున బోయెనో లేదో వెంటనే కన్నువిచ్చి యిటు నటు జూడసాగె. అంత నూతనయువతి "భానుమతీ! భానుమతీ! ఎంత సాహసివే! నేడు నే లేకున్న నీవీపాటికి యమసదనమున కథితివై యుండెడి దానవుగదా!"

భానుమతి గద్గద స్వరమున ''అమ్మా! నీవెవ్వరి దానవు? ఏల యీనిర్భాగ్యురాలి నెందుల కుద్ధరించితివి. నాసురణమున కేల యడ్డు పడితివి? ఆనిర్భాగ్యుని హస్తములచే పుస్తెగట్టించుకొని దుఃఖించి దుఃఖించి చచ్చుట కంటె నొక్కట్టుటిలో యీలోకము బాసి యుండి యుండెడిదానను గదా! అయ్యో! నాకు దెలివి గలిగించి పూర్వపు స్మృతిని గలిగించి నన్నుదిరిగి శోకసముద్రమున ముంచితివే! తల్లీ! నీకరము నలంకరించిన కళకు గతిలో ఏమాత్రము సంశయింపక యీపాపిని నరికితివా? నీకెన లేని పుణ్యముబ్బు. అయ్యో! దలచు కొనిన దేహము గంపించునే! వివాహము, నన్నాతఁడు బెండ్లాడుటలు. హా! భయము వేయుచున్నది అమ్మా! నన్నుద్ధరించి నాకెన లేని వ్యస నమును గూర్చితివే! నాజీవితమంతరించె. నాకష్టములు దప్పెనని నిశ్చింతతో యశువుల బాయనుండ నీవెక్కడినుండి యరుదెంచితివమ్మా! అంతకంతకు హృదయమున శూలములచే బొడిచినట్లున్నయది. ఈ బాధకునే నోర్వజాలనే తల్లీ'' యనితిరిగి క్రిందబడిపోయెను. పాపమా యువతి దిరిగి యామెను లేవనెత్తి సమీపమున గూర్చుండ బెట్టుకొని ''అమ్మా! ఆత్మహత్యా పాపమతిఘోరము. ఉత్తమజన్మమే యింక దొరుకుటరిది. శాస్త్రము లాత్మహత్యాపరాధము గావించిన వారు పైశాచికవృత్తిలో జీవించ వలసినదే గాని సద్గతులు గలుగ నేరవని ఘోషించుచున్నవి. అట్టిది నీవునట్టి బేలవై ప్రాణములు త్యజింప నెంచితివే! పతివ్రతామతల్లులు సాధ్వీలలామలు దమయంతి, సీత సావిత్రి, చంద్రమతాదులవంటి వారికే కష్టములు దప్పనపుడు మన మెంతటి వారము. వారనుభవించిన కష్టపరంపరలలోని సహ స్రాంశమైననుండు నామన యాపదలు. మనవలె యాపదయరుదెంచు నని భీతచే తస్కులై వెరగొంది యాత్మహత్య గావించు కొనిరా! ధైర్యమువహించి సహించి సత్యాన్వేషణమునకు దొరకొనిరి

గాదా! అట్లు నీవును ధైర్యము వహించుట సమంజసము గాని యశువులు బాయుట యేటికృత్యము. జీవించి సాధింపవచ్చును గాని చచ్చి యెవరిని సాధించుట. నేననుభవించు చుండు కష్టములలో నీవి యెన్నవ పాలు. చూడు! నాముఖముపై నింతైన విచారమున్నదేమో!'' అని నీతినిగరుప భానుమతికి యీవాక్సుధారసము వీనుల బడినతోడనే యొకింత వివేకముగలిగి యిట్లనియడిగె ''అక్కయ్యా! నీవాక్కులు నన్ను ధన్యురాలినిగా జేసినవి. కాని నీనోటనుండి నీవు గూడ విపత్తుకులోనై యుంటివని వినినంతనే నావంటి వారలచే కులీభునిని యెన్నని కష్టములు బడుచుండుట నేడే వింటిని. ఎట్లు సహింతునో గాని నాకుసాధ్యము గాదు. ఏదీ! నీదీనచరితము నావినుల బడవేసి నేనింపుండి దప్పించుకొనుమార్గ మేమైన నుండిన దెలియ బరుపు'' మని వక్కాణింప నక్కాంతసరియని దనచారిత్రి మిట్లని జెప్పదొడంగె. ''సోదరీ! భానుమతీ! నాపాపజీవనమే మని దెల్పుదు? తొట్టదొలుతనే వచింపుచుంటి. కులభ్రష్టు రాలనని కోపగించు కొనకు. నీవలెనే నేనుగూడ వంచింప బడితిని. నీవన్ననో చెరబట్టబడితివి. నేనానరాధముని మాయలజిక్కితి సుమారు రెండువత్సరములాయె నాయున్నతాశయము నశించి. నా తలిదండ్రులు చాలధనవంతులు. ఆధనమే నన్నిట్లుజేసినది. నేనొకనాడు నాతోడివారలతో సముద్రపుటొడ్డున నేయుండి మాకాలము వెళ్లబుచ్చనిచ్చగించితిమి. మాభోజనములుగూడ యందేయారగించితిమి. సాయంత్రముకాగానే నాడు పున్నమయగుటచే నాటి వెన్నెలలో కొంతదడవాడ నిశ్చయించితిమి. ఆనాయానందమే నన్నింత జేసినది. నిండినిమిడీకృత్యమైయున్న ఘోరవారాసిలో చంద్రికాసహితకురంగాంకుండుదయించుచుండ నీలివన్నెగలయీ సముద్రపునిరంత దెలుపై జూపట్ట యీదృశ్యముజూచి ముగ్ధులై యుక్లే మేమొకరితోనొక రాడు

చూ పాడుచూ యలవడిన కవితా సామర్థ్యమొకింత దేటబడ వర్ణిం పుచు "అక్కా! నీమోము పున్నమచంద్రుబోలు" నని యొకరినొక రొక పక్కెములాడుచు హాయిగా గూర్చుండి వినోదించుచుంటిమి. అట్లెంతసేపుంటిమోగాని మాయానందమున పొద్దే దెలిసినది కాదు. సుమారర్ధరాత్రమై యుండవచ్చు. అట్టివేళ నొకయువకుడు మా కన్నులయెదుట గానవచ్చె. ఆతనిరాకచే మాయానందసామ్రాజ్య మొకింతసడలె. నాతోటి చెలులాతనిజూచి వెరగొంది నావద్ద కరుదెంచి "ఇక రావే! పోవుదము. వేళాయె. నిచటుండదగదు" అని వచింప నాయానందము తనివిదీరమిచే యికనూ గొంతసేపుండి వెడలుదమంటి. వారందులకు సమ్మతించిరి. మా యాప్రసంగమంత చాటుననుండి వినుచున్న నాయువకుడు "చెలులారా! మీ యాటలకంత రాయముగల్పించిన నా యీనిర్భాగ్యుని మీమృదుల హస్తములచేగొట్టిననూ పాపము రాదుగదా" అన వానిమాటలకు చెలులెల్ల ఫక్కునవ్విరి. నేనుమాత్రమా యువకుని నదేకదృష్టితో జూడసాగితిని. ఆతనిజాలిచూపులు నన్నాకర్షించె ఆజాలియే నన్నింతజేసె. అంతటితో నేనూరకుండక "అయ్యా! మేమిందు జేరి సంతసంబున యాటలాడుచుండ యెచటనుండియో వచ్చి మా యానందనౌకను నీటినుండి గట్టునకు ద్రోసివైచితిరే. దయయుంచి మీరిచటనుండి వెడలిన మేమెంతయు కృతజ్ఞులమని" యుక్తి యుక్తముగానంటి. అందులకాతడొకింత చింతాక్రాంతుడై మమ్ముల జూచి "చెలులారా! నేనుగూడ మీవలెనే వెన్నెలతేటను దర్శించి పోవుదమని యిచటకరుదెంచితి. నేనిందు దోసమొనరించిన క్షమింపుడు." అని మరింత సమీపమునకేతెంచె. నావెఱ్ఱి యానందమున మునిగినదాననైయున్న నాసుధా వీచికలబరపు దివ్యతేజోమూర్తియెదుట నిలచిమాటాడు నాయువకుని దివ్యమంగళ విగ్రహ

మును జూచినంతనే నాకావేశము గల్గెనోయనునట్లు మోహము నన్నా
వరించె. ఆమోహమే నన్నింతకుదెచ్చెను. అట్లొకింత సేపు సిగ్గుచే
నేనామూర్తిని దిలకించి పూర్తిగా మోహాబ్ధిమునింగితి. మాయా
చూపులలో యొండొరుల చూపులుగలసె. చూపులే స్నేహము
నెఱపె. అంతనా చెలులను బిలచి ,,చెలులారా! మనముందర మా
తనిగూడి యాలనాఁడా గోపికారమణుఁ డల్లారుముద్దుగ వినోదముగ
ఖేలన మొనర్చినరీతి నేనొకింతకాలమట్లు గడుపుదమా'' యని యనుగ
వారంములకు సమ్మతించిరి. సమ్మతింపకుండియుండిన నెంతో బాగుం
డెడిది. ఇపుడేమనుకొన్న నేమి? అట్లొక ముహూర్తకాలము విహ
రించితిమి. తమపరి యొక్కొక్కరే కంఠములెత్తి నాల్గవస్థాయిని
సంగీత రసమంతయు వెడలగ్రక్కితిమో యనునట్లు పాటలు పాడ
జొచ్చితిమి. అతఁడుగూడ తనమృదుకంఠము నెత్తి హాయిగూర్చె.
అప్పటి యాసంగీత రసమే చునవచ్చు. నాహృదయమే యననేల?
నా చెలులుగూడ మోహపరవశులైరి. నాకేలకో యది మిక్కిలి
రుచించె. అదియే నన్నుఁజెఱచె. అనంతరము మేము మా మా
యిండ్లకుబోతిమి. కాని మామానసము లాతనిపైనే యుండెను.
ఇతరుల కెట్లుండెనోగాని నాకుమాత్రమాతని విగ్రహము కన్నులగట్టి
నట్లుండె. నాటగోలె యాతనిపై నాకెనలేని మక్కువ
యుదయించె. ఎప్పుడైన నాతనిజూచు భాగ్యము లభించునాయని
యువ్విళులూరుచుంటి. ఒకనాడాతఁడు మాయింటిముందర వెళ్ళుట
దటస్థించె. ఎవ్వరు లేరని దెలసికొని యాతనివెనుకనే చాలదూరము
బోయితి. ఆతఁడు వెనుదిరిగిజూడ నేగానబడితి. ఆతఁడు సంత
సించె. నాటినుండి మానమావేశము లధికమయ్యె. ఒకనాడాతఁ
డొట్టకేలకు నన్ను దనతో దీసికొనిబోయెదనని తిఱముగా జెప్పుచూ
వచ్చె. నేనెప్పటికప్పుడు మాప్రణయమున కంతరాయము గలుగు

అని రేపు మాపని కొన్నినాళ్ళు గడిపితి. క్రమక్రమముగా మా వాండ్రోరుల ప్రేమ మెండయ్యె. ఏకనిముసము గానరాకున్న యుండజాలని స్థితి యేర్పడియెను. నన్నొకనాడు ఖండితముగా మరునటి రోజున దనతో లేచి రాకున్న నాడుకొంపలు "నీముఖమే జూడ"నని వర్తమానము బంపెను. చేయునది లేక ప్రేమబంధమును ద్రెంప జాలకపోయితి. తెగించితి. వెంటనే "మీయాజ్ఞను నెరవేర్తునని" తెలియబరచితి. నాటిరాత్రి నామనంబు పీడింపసాగెను. నిదుర రాదాయెను. యెంతయాలోచించినను వానితో లేచిపోవుటదక్క వేరొక మార్గము గోచరింపదయ్యె. వెంటనే దీపమును వెలిగించి కావలసిన దుస్తులన్నిటిని మూటగట్టితి. కల యాభరణముల నెల్ల దాచికొంటి. ఇంక జెప్పవలసిన దేమి? మరునాడే ప్రయాణము. కాదు కాదు. పలాయనము సాగించితి. ఇంకనటకు నేవరించిన యువకుడే నా రాక్షసుఁడు. నన్నప్పటినుండి దన యధీనమునం దుంచుకొని బయటికి బోనీయక ఖయిదీని కావలిగాచు రక్షకభటుని మాడ్కి నన్నా చెరయందునునిచి దనయభీష్టము దీర్చుకొనుచుండె. అట్లొకింత కాలముంటి. నాదలిదండ్రులజూడ నభిలాషయంతకంతకు యధికమగుచుండె. పోవుటకు దారిగానక చింతచేయూరకుంటి. నాగతియింతేయనుకొంటి. ఒకవేళ యవకాశ మొదవినచో యిట్టి వేషమున నేనింటికేగిన తలిదండ్రులు రానిత్తురే. కులపాంసిని! యని నన్ను దూరకుందురే. చాలు వీని వివాహమాడి నావ్రాతకొలఁది గానిమ్మని యనుకొని వివాహమాడుదని నిర్బంధింపసాగితి. కానిమ్ము! ఆకార్యమెప్పుడు గాకూడదని యాట్లేగడిపివేయుచు వచ్చెను. అంతలో నీవెట్లో దుర్మార్గుని దృష్టిపథమున బడితివో గాని నాటినుండి నాపైనుండిన ప్రేమయంత పాఱిపోయె. నన్నుజూచినంతనే యసహ్యించుకొనసాగె. కొన్నిదినముంక్రిందట నే ఖండితముగా యడుగ

సిరాకరించుటయేగాక వెళ్ళిపొమ్మని జెప్పివైచె. ఏ మొగము బెట్టుకొని యింటికేగుదానని యట్లేబడియుంటి. ఇపుడన్ననో ఆరు మాసముల గర్భము. ఇట్టిస్థితిలో నేనింటికేగిన మాతలిదండ్రు లింట జేర్తురా? వారు నాకై యెంతగా విలపించుచుండిరో! రెండు సంవత్సరములు గడచినవి." అని దనచారిత్రమునంతటిని సంగ్రహముగా వచింప భానుమతియుగూడ చాలదుఃఖించి "అమ్మా! నాకొక్కయుపాయము దోచుచున్నది. నీవందుల కంగీకరించినచో దానివలన నీకుసుఖమును నాకిష్టముదీరుటయు రెండును దటస్థించును. వినుము. చెప్పుచుంటి. నాయందుగరుణవహించి నీ యీ దుస్తులనిటు దెచ్చి నా యీదుస్తుల నీవు దొడగికొనుము. ఇందేయుండిన వారరుదెంచి నన్ను బలిమిమెయి దీసికొనిపోయి వైవాహిక మొనర్పక మానరు. దాన నీపని పూర్తియగును. నేనన్ననో నీదుస్తులదాల్చి మెల్లఁగ యీగృహమునుండి బయటికేగితినా యెచ్చటనేని తలను దాచుకొనియెదనుగాక. అక్కయ్యా! నేజీవించియున్నచోఁ దిరిగినిన్ను గలిసికొనియెదనులే!" యని వచించె. అందులకాకాంత యంగీకరించి భానుమతికి దనదుస్తులనొసంగ నామె వాటిని దొడిగికొని దొడ్డిత్రోవను బడిపోయె. అప్పుడే తొలికోడి కూయసాగె. అట్టిసమయమున భానుమతి దనకు సాయమొనరించిన కాంతను దలచుకొనుచు యచటికి చేరువనున్న పల్లియాత్రోవనుబడి పోవసాగెను.

# భానుమతి

## ముప్పది రెండవ ప్రకరణము.

### పరాజయము.

మాయాభానుమతి యొకమూల బరుండియుండెను. నారాయణుఁడు దానంపిన పత్రికత్తె యింకనూ భానుమతి నేలదోడితేలేదని సంశయించి తానేగదిలోనికి బరతెంచి "ఓసీ! దుష్టురాలా! చంద్రమతీ! యింకనూ యేమిజేయుచుంటివే! వేళమీరిపోవుచుండ మాటలకు గూర్చుంటివా" యని గద్దించెను. కాని యందు చంద్రిమతి గానరాదయ్యె. అంతనాతఁడాశ్చర్యచకితుఁడై భానుమతినుద్దేశించి "భానుమతీ! చెప్పవలసినదంతయు నిదివఱకే నివేదించుచుంటి. లెమ్ము! ఊరకనేల చింతించెదవు. ముహూర్తవేళ యతిక్రమింపగలదు." అని సవినయముగ బ్రతిమాలెను. భానుమతి ముఖము నావలకు ద్రిప్పుకొని యేడ్వసాగెను. నారాయణుఁడు "భానుమతీ! అన్నియు సిద్ధమైనది. వివాహపత్రికలు మొదలుగాగలవన్నియు వ్రాసియుంచితిమి. సంతకములుమాత్రము చేయదగియున్నవి. నీవింకనైన గరుణించి నన్నుధన్యునిగ జేయుగదే" యని ప్రార్థింపగా నామెమండిపడెనుగాని దానవల్ల బ్రయోజనము లేదని గ్రహించి "అయ్యా! నన్నేల బెదరించెదవు? మీకుగోరినట్లే నాకుగూడ కోర్కెలు వేరువిధముగనుండ మీపై మనంబుంచమని బలవంతపరచుట న్యాయమా?"

నారా—నీహృదయాధినాథుఁడెవ్వఁడో జెప్పరాదా?

భాను—ఇదివరకు నేనెవరినిగాని ప్రేమించియుండలేదు.

నారా—కల్లలాడెదవే! నాకు దెలియదనుకొంటివా? అలనాడు నీవు బీచివద్ద కే తెంచుటకు గల్పించిన లేఖలోని వాడెవ్వఁడు?

భాను—( ఎఱుఁగకున్నను దెలిసినదానివలె నటింపనెంచి ) అన్నియు దెలసి సన్నిట్లు పరభామినిని చెరబట్టుట న్యాయమా?

నారా—చాలునిఁక నీవేదాంతోపన్యాసము. వాటినివినుట కిప్పుడు వ్యవధి లేదు. వేరొకప్పుడు ముచ్చటించుకొనవచ్చును. ఒక్కమాట యడుగదలంచితి, వేరుమాటలు పెక్కులేల? నీవీతక్షణంబు నావెనువెంట యేతెంతువా లేక బలవంతముచే దీసికొని పోవలయునా? చెప్పుము. రెండింటిలో నేది యిచ్ఛగింతువు.

భాను—(గద్గదస్వరమున) ఆర్యా! మగవారలెంత కేని దెగియింతురుగదా. తానొకటిదలంచిన దైవమొంకటి దలంచుననెడి సామెత నాయెడ యదార్థమయ్యెనుగదా. హా! ఇఁక నామనంబొల్లని నిన్నే జేపట్టనలయు లేకున్న మరణింపవలయు. రెండేమిగిలియున్నవి. అయ్యో! ఏమనుదాన. ధరణిలో యాడపుట్టువు బుట్టుటకన్న మరణమొందుట శ్రేయంబుగాదే! వేరుగత్యంతరము లేదుగదా! కానిమ్ము! మనసా! మరణమున్న నా దేహము జలదరించును. బ్రతికి యున్న బలుసాకైన దినిబ్రతుకవచ్చు. చచ్చిసాధించెడిదేమి? ఆర్యా! మీమాట యంగీకరింతునుగాని వ్రతముచెసిననూ సుఖము దక్కెనన్నట్లు మిమ్ముల చెట్టబట్టెదననుకొనుడు. కామోద్రేకమున మీరీనాడు వన్నువరింపవచ్చు. రేపటిదినము విడచిపెట్టవచ్చు. గాన నాకేదైన జీవనోపాది గలిగించినగదా?

నారా— (సంతోషముతో) అట్లడుగుము. ఇదిగో! నా కుండు యావదాస్తిని నీవడుగకమున్నే నీపేర వీలునామ్రాసి యిచ్చియుం

టిని, చూడుము'' అని తనవద్దనున్న కాగితములకట్టయందించెను. ఆమెవాటినెల్ల జదివికొని సంతసించి వాటినిబధ్రముగ దాచియుంచుకొని "ఆర్యా! మీయపూర్వభిమానమునకు సంతసించితినిగాని నేనొక్క విషయము మిమ్ములఁ బ్రతిమాలనెంచితి. మఱేమియు లేదుగాని మీరు త్రాగుడు మానవలయు, దుష్టస్నేహితవర్గము ద్యజింపవలయు, కుటుంబవ్యవహారములు జక్కబెట్టుకొనవలయును. వీనిని నెరవేర్చినచో——————"అని సిగ్గుచే దలవంచుకొనెను.

నారాయణుఁడన్నింటిని దప్పక నెరవేర్తునని బాసచేసి యామెను యలంకారింపజేసి దనవెంట పెండ్లివేదికపైకి గొంపోయెను. పురోహితుఁడు వివాహమతిత్వరలో ముగించెను.

రాత్రి రహశ్యవివాహము వర్ణింపమావశముగాదు. చదువరులే యూహించుకొనవలయును. మేళతాళములు లేవు. బంధువులెవ్వరురా లేదు. పురజను లంతకు లేరు. ప్రేక్షకగణము మందునకైన గానరాదు. ఏవియు లేకనే యన్నియు శాంతముగా జరిగిపోయెను.

వివాహానంతరము వున్నవారందరు సహపంక్తినిగూర్చొని విందారగించ మొదలిడిరి. మాయాభానుమతికూడ పంక్తిని తనమనోహరుని ప్రక్కనే యాశీనురాలై భుజింపసాగెను.

నారాయణుఁడు దనకోర్కెకుదగినట్లు వివాహమాడితిగదా! నాకంటె ధన్యాత్ముఁడీ యుర్వినుండజాలడని సంతతానందమునమునింగి భానుమతిపైనున్న ప్రేమచే ప్రక్కనున్న నామెముసుఁగుదీసి ‹‹ప్రియా! నీవు మూన్నాళ్ళనుండి నిరాహారివి. కావలసినవి సిగ్గుపడక వేయించుకొని భుజింపుమని''జెప్ప నామెదలయెత్తి ‹‹సరి''యని దిరిగి

మునుపటియట్లే యుండెను. అందేమిగాంచెనోగాని వెంటనే భుజించు చుండిన నారాయణుఁడట్లే లేచి కాలితో నొకతన్నుదన్ని “ఓసీ! గయ్యాళీ! ఎంత మోసమొనర్చితివే యింతవఱకు భానుమతి వనుకొంటినే. నిజమెఱిఁగింపుము నాభానుమతి నెచటదాచితివో. లేకున్న యిదిగో! నీకాయువంతరించినది” అని దఃగాలున మొలనున్న కఱవాలమును బయటికితీసి ఝళిపించెను.

చంద్రి—మూర్ఖా! నీవంచనకంటె నామోసకృత్యమధికమా! పరాధమా! నాజీవితమును బాడుసేసితివే! నట్టేట ముంపజూచితివి. వివాహమాడెదనని మిషచే నన్నుగొనివచ్చి పూర్ణగర్భవతినగు దాని నిపుడు భానుమతి నుద్వాహమాడి నన్నుదరిమివేయ దలంచితివా? నీవేమియు చేయజాలవు. నీయాయువంతయు నాకొసంగిన కాగితములలో నున్నయది. ఇప్పుడే నేను నాజనకునింటికేగి నీయాస్తినెల్ల గైకొనకున్న చంద్రినుతిని గాను. మంచినడవడికగల్గి చరింపనేర్చితివా నాతోరమ్ము. పోవుదము. సుఖముగానుందుము మార్గమారాయుదము.” అని నిశ్చితిగ వచించె.

నార—ఓసీ! పాపీ! నాకొంపగూల్ప యేతెంచినమారీ! చూడుము! నిన్నేమిజేసెదనో” అని కనులెఱ్ఱజేసి కరవాలమును కేలబూని యామెమస్తకమును దెగనేయ చేయిబైకెత్తెను. అంతలో నచటుండిన నీలకంఠుఁడు మొదలుగాగల పరిచారకు లాతనిహస్తమును బట్టుకొని “నారాయణా! సాహసమువలదు.” అనికత్తిని బెరకివైచి “పూర్ణగర్భవతినిజంప నీచేతులెట్లాడెనురా. పాపము ధర్మపత్నికన్న నెక్కుడుగ జూచుచుంటివే? అట్టియామెను జంపితివా నీతోటిస్నేహితమీనాటితో యంతరించినదనుకొనుము.” అమ్మా! హతాశుఁడైన నారాయణునితో యిపుడుండుట పామువడగను గప్ప

నశించుట యెట్లనాచరణీయమో యట్లే నీవును కొన్నినాళ్ళు తనకా భానుమతిపై బిచ్చివదలునందాక నీజననీ జనకుల గృహమునకు పొమ్ము." అనివచింప చంద్రమతి "సరి"యని తనవెంటనొక పరి చారకుండు రానెక్కడికో వెడలిపోయెను.

నారాయణుఁడు తనయాశలన్నియు వమ్మాయిననూదన్నట్లు పరాభవించి బసువెత్తిన భానుమతిని నేచేపట్టవలయు లేకున్న నామె నింతటితో మట్టుబెట్టవలయు. రెంటిరెంట నేదిజరిగిననూ సంతో షమే. ఆహా! సింగము బోనునుండి యెట్లుదప్పించుకొనెను. కానిమ్ము. మించిపోయిన దేమియు లేదు. వంటయింటిలుండే తెందుబోగలదు. పట్టితెచ్చి భక్షించెదగాక"యని నొక్కగంతున ద్రొడ్డిగున్నముదాటి యవతల బారిపోయెను.

# భానుమతి

## ముప్పది మూడవ ప్రకరణము.

### రైల్వే స్టేషన్.

భానుమతి పోయిన దొక చిన్నపల్లె. నిశీథమున యాగ్రామము మాటుమణగి యుండెను. ఆకాశము మేఘావృతమై యుండెను. వర్షకారణమున వీధియరుగులపై నొక్కరుగాని బరుండియుండ లేదు. నక్షత్రములు సహితమానాడు ప్రకాశింపమి వెలుఁగనునది గోచరమగుట లేదు. ఆచిమ్మచీకటి కపుడపుడు మెఱుపులు మాత్రము వెలుఁగునిచ్చుచుండెను. అట్టిభయంకర నిశాసమయమున భానుమతి యాపల్లియ బ్రవేశించెను. పాపమామె కపుడెవ్వరు దిక్కు? తలుపులుదీసి రక్షించువా రెవ్వరు? కటకటా! అపారమగు విచారతరంగము లామెనల్లలనాడించెను. అనేకదారుణ విషయము లామె హృదయమునదోచెను. ఆదారుణవిషయములకెల్ల మిక్కిలి దారుణంబగు విషయమొకటి తలఁపునకురాఁగ చాలపరితపించెను. అది యేదన దనయున్నగతి యేమాయెనో యని తలపునకు వచ్చినపుడెల్ల హృదయాన విషాదము జనించుచుండెను. పాపమామెరోదన మరణ్యరోదనము.

సుకుమార కుమారియగు నాభానుమతి రాత్రియంతయు చలిలో యల్లాడెను. పల్లెలోని జాగిలములు దన్నుజూచి మొఱుగునపుడెల్ల భీతిల్లెను. తనకింకనూ యెన్నికష్టములు రానున్నవోయని చింతింపసాగెను. భయముచే గజగజ వణకసాగెను. పాపము! సత్యవంతులకేగద దురంత కష్టసముదాయములు.

తెల్లవారినతరి కాపువాఁడొకఁడెదురుపడి "అమ్మా! మీరెవ్వరు? మీ రిచటికిరా కారణం బేమి? చాలడస్సియున్నట్లు గన్పట్టెదరు. రాత్రియంతయు చలికెట్లోర్చితిరి." అనియడిగెను.

భాను—అయ్యా! నేనొక నిర్భాగ్యవనితను. మూన్నాళ్ళనుండి నిరాహారిని మొట్టమొదట నాయందు కరుణించి మీ గృహమునకు దోడ్కొనిపొండు. నాచరితంబు సవిస్తరంబుగా దెలిపెదను.

కాపువాడు కరుణార్ద్రహృదయుఁడగుటచే జాలివహించి యింటికి దోడ్కొనిపోయి యుచితస్థలమును జూపించి ఆమెకుగావలసిన పదార్థములనెల్ల దెచ్చియిచ్చెను. ఆతనియిల్లాలు చాలమంచిదగుటచే దనయజమానునాజ్ఞను సారమతి గారాబమున నామెను జూచెను. భానుమతి వారినిష్కాతుక దయావాత్సల్యమునకు సంతసించి దనకట్టిస్థితిలో సాయమొనర్చినందుల కృతజ్ఞతను గనబరచుటకు మనంబున దీర్మానించుకొనియెను.

భోజనానంతరము భానుమతి కాపువాని భార్యతోను యాతని బిడ్డలతోడను మాటలాడుచుండ పొలమునుండి కాపువాడరుదెంచి "అమ్మా! భుజించితిరా! నాయిల్లాలు మిమ్ములచక్కఁగ నాదరించెనా" అనియడిగెను.

భాను—అయ్యా! మీయాదరణనే జీవించినంతవఱకు మఱువజాల. నాభాగ్యదేవతలనియని నయతిశయోక్తి కానేఱదు.

కాపు—అమ్మా! మాయందుగల దయచే యట్లంటిరిగాని మాయాధిక్యత యెంతమాత్రముగాదు. మాకృత్యము మేము నెఱవేర్చితిమి. పరోపకారము మానవులకుచితముగాదా?

భాను—ఎందరినో గాంచియుంటినిగాని మీయిల్లాలువంటివారి నెందునుగాననైతిని. పరమసాధ్వి. సరళస్వభావ.

“అదియట్లుండనిందు. మీదీనచరిత మెయ్యదియో దాన మీ కేయాపద తటస్థించినదో దెల్పిన మేము చేతనైనంతవరకు సాయము జేయుదుము. మిమ్ముల గాంచినప్పటినుండి మీ నోటవిన వలెనని చాలయాతురపడుచుంటి” నని కాపువాడనెను.

భానుమతి దానుపుట్టినదాది గలిగిన కష్టములు యుగ్రీజుం డెట్లు దుష్టచరితుండైనదియు, తండ్రి తమ్ముడినాడి యేగినదియు నారాయణరావు చెరబట్టుటయు, వివాహకార్య భంగమెట్లొనర్చి నదియు మొదలుగాగల విషయములనెల్ల వారికి సవిస్తరంబుగా దెలుప కాపువాడాశ్చర్యమొంది “అమ్మా! చాలగండముల దాటి యుంటిరే! అయిన నారాయణరావు తప్పక మిమ్ములవెంటాడియే యుండును. యిప్పటికో యింకకొంతసేపటికి యిచటికి రాకమానడు. మీరు దాగియుండుట మంచిదికాదా?

భాను—నేనిచటనుండిన యపాయము రాకమానదు. నన్ను వెదకుచూ యాతండు వచ్చియేతీరును. మీరు నాకొక సాయమిప్పుడు జేయవలసియున్నది. నేనీరాత్రియే వెడలిపోవలయును. ఇప్పటి స్థితినిబట్టి నేనీవేషమున బోయిన చాలప్రమాదకరంబుగాన నాకు జూడ పురుషవేషము————మీరునవ్వెదరని నాకుదెలుసునుగాని యాపదవేళలో ధైర్యమేగదా సర్వార్థ సాధకంబని పెద్దలనుడి ననుస రించి చిక్కులనుండి బయటపడితినా యింకజెప్పవలసినదేయున్నది? నారాయణుండింక భూమిపై మనజాలడు.

కాపు—అమ్మా! మీరంతగా భయపడెదరేల? అంతగా పరిణయించిన నేనుండలేదా? వాని నొక్కపిడికిట గృద్దితినాసరి; జీవి తము లెగిరిపోవలసినదే!

భాను—“పోటలాడుట కిదిసమయముగాదు. నేను త్వరితగ తిని బోవుచున్న మాభానుమూర్తినాకై చాలగుందుచుందును. ఆతని దరిజేరి నారాయణుని బరిమూర్చిననేగాని నాకెక్కడిది నిబ్బరము. గాన మీరుదయయుంచి నేనొసంగు ద్రవ్యమునుగొని పురుషదుస్తులు యువకులు దగిలించుకొనునట్టివి గొనితెండని” మెడలోని హారమును దీసి “దీనిని నమ్మివైచి తీసుకరండ” నెను. పాపము! కాపువాడామెకు దటస్థించిన యాపదను లోలోనచింతించి సరియని హారమును గొని వెంటనేవెళ్ళెను.

రాత్రి పదిఘంటల సమయము. ఆగ్రామమునుండి మరియొక యూరు కేగువారందరు బండ్లనెక్కి రైలునకు బ్రయాణ మగుచుండిరి. భానుమతియుగూడ దనకుదెప్పించుకొన్న పురుషదుస్తుల ధరించుకొని యొకమారప్పటి యాకృతిని యద్దంబులోగాంచి సరిపోయినందులకు సంతసించి దానట్లు వేషము దగిలించుకొనవచ్చెగదా యని చాలసేపు విచారమొంది యెట్టకేలకు ధైర్యమువహించి దుస్తుల విలువపోగా మిగిలిన యేబది రూప్యములనుదీసి దన్నంతగా యాదరించిన కాపువాని యిల్లాలు చేతనునిచి “అమ్మా? నేబోయివచ్చెద. ఇదిగో! వీటినెంతమాత్రి మద్దుచెప్పక స్వీకరించి నన్ను కృతార్థురాలినిగా జేయుటయేగాక కష్టములనుండి విముక్తిగమ్మని యాశీర్వాదము జేయుముదల్లీ” యని సాగిలబడి మ్రొక్కెను. పాపము! కాపువాని భార్య యామెనుగాంచి యశ్రుకణములు నేలరాల “అమ్మా! భానుమతీ! మాకు నీతోగలిగిన పరిచయము చాలకొద్దిదైనను నిన్ను బాయ మనసొప్పకున్నది. సత్వరమాపదలనుండి విముక్తురాలవై యపూర్వ వైభవోపేతముగ చిరంజీవివైయె వర్ధిల్లెదవుగాక” యని దీవించెను. ఆమె మాటలకా భానుమతి సంతసించి కాపువానితో “నేజీవించియే

యుండినచో మిమ్ముల త్వరలో గలిసికొందు" నని శలవుగైకొని వెడలి పోయెను.

రైలింకనూ అయిదు నిమిషములలో రాగలదు. జను లప్పుడే సామానుల కేలబూని ధూమశకట నౌకాస్థానవేదిక జేరు చుండిరి. భానుమతియుగూడ నొక్క మొదటితరగతి టిక్కెట్టును గొని బండికై వేచియుండెను. ఇంతలో గప్! గప్! మని ధూమశక టమాసదెంచె. జనులందరొక్కుమ్మడి బండిలోనికి దూరనారం భించిరి. భానుమతి యెట్టులో జనసమ్మర్దముదాటి బండిలోని కెక్కగలిగెను. అనంతరమా రైలు మెల్లగా బోవసాగెను. అంత నొక యువకుఁడతి త్వరితగమనమునవచ్చి టిక్కెట్టు నొకటినిగొని బరు వెత్తివచ్చి భానుమతియున్న బండిలో నెక్కి కూర్చొనెను. భాను మతి యా నూతన పురుషుఁడెవ్వడని యా కిటికీలో దొంగిచూచు చుండ దానాతని వెనుకటి భాగమును బరీక్షింపసాగెను. వాడొక సిగరేటును ద్రావుచూ ధూమమునా పెట్టె నింపివేసె. భానుమతి ధూమరాసి సహింపజాలక మందలింపదలచి „అయ్యా! పొగనావల విడువుఁడని" హెచ్చరించెను. నూతనాగంతకుఁడా మాటలు చిర పరిచితులగువారి నోటనుండి వెలువడినట్లుండ నాశ్చర్యచకితుఁడై యాతఁడెవ్వరని తదేకదృష్టితో యాతనిజూచి యంతకంతకు నాశ్చర్యముప్పతిల్ల మనంబు సంతసంబుజెంద „భానుమతీ! ఎంతటి మాయలమారివే! ఇక నెందుబోగలవు. నీకెవ్వరడ్డుపడియెదరో జూచెదగాక" యని నారాయణుఁడు వెదుకబోయిన తీగ కాలికిజుట్టు లాగ ముదంబంది భానుమతిని తనకౌగిలిజేర్చు నుద్దేశముతో కర ములుసాచి భానుమతి శిరమును బలిమినిబట్టియాడ్చి ముద్దిడబోయె. భానుమతి యాతని యుద్దేశము గ్రహించి పట్టువిదల్చుకొని (కోప మున) „దురాత్మా! ఇక్కడికిగూడ వచ్చితివా? కానిమ్ము! నీవేమి

చేయదలంచితివో చేజూచెదగాక." యనికనులెఱ్ఱజేసి రాబోయ్యెడి కయ్యమునకై సిద్ధపడెను.

నారా—"ఏమనిదలంచితివో గాని యీనారాయణుఁడు జీవించి యుండునంతవఱకు భానుమతికి సుఖమెక్కడిది? నారాయణునినే వివాహమాడవలయు. దాని సౌఖ్యమనుభవింపవలయు. అంతే కాని నీవావీరశర్మను బెండ్లాడుట కలలోనివార్త. ఇంతకూనిన్నే నాకు విడచిపోయినగదా నీబాగోగులు నిర్ణయించుకొనుటకు" అని భానుమతిపైఁబడెను.

భానుమతి యాతని బారినుండి దప్పించుకొని "ఓరీ! దుష్కులాధమా, కామాంధకారనిమగ్నా! ఏమనికూశెదవు? మాననీయమైన బ్రాంహణ కులజురాలనుగానా? నీవొకమానవుడవని యెంచియున్నగదా మాటలాడుట. దుడుకుమాటలికఁ గట్టిపెట్టుము. చాలు చాలు. నీగ్రుడ్డిబెదరింపులు. మానిని మరుగుపడియున్నంతవఱకు గదా దానియబలత్వము? ముందరికరుదెంచితి. నీయట్టి మూర్ఖుని లక్ష్యపెట్టనేర్తునా? గ్రద్దకు వచ్చినటుల నీకేండ్లు వచ్చినవి. కాని బుద్ధిరాదాయె. ఓరీ! బ్రాంహణకులవంశపాంశనా! నీయానంగుచెల్లెలను పరులుబట్టి బాధించినతరి నీమానసమెటులుండునో యోచింపవైతివిగదా! ఛీ! ఛీ! నీముఖమునుజూచిన పాతకములు చేకూరు. నామేనయుష్ణము బాయునంతవఱకు నన్నేమియుచేయజాలవు" అని గంభీరముగా బల్కెను. నారాయణుఁడామాటలనాలించి తోఁక ద్రొక్కిన త్రాచువలె కటకట మండిపడి పండ్లుపటపట గొరుకుచు "ఛీ! చాండాలీ! నోరు మూయుము. ప్రేలకుయింక." యని కామాతురుఁడై గవయనెంచి భానుమతి నొక్కతన్నుదన్ని క్రిందబడ వేయనెంచెను. పాపమామె యబలయగుటచే చేతులనడ్డంబుగా

బట్టుకొని రైలుపెట్టెయొక్క చిలుకునుదీసివైచి తలుపును దెఱచి యుంచి "మూర్ఖా! నాప్రాణములనైన బాయనొకింతునుగాని నీచెర లోబడుదునే' యని గట్టిగా నాతని శిరముపై నొక్కపోటుబొడిచె. దానితో నాతఁడు వెనుకకు దగ్గెను.

ఇంతలో రైలొకవంతెనపై బోవసాగెను. భానుమతి యాతఁడెట్లయిన దన్ను మార్కొనక మానఁడని యెంచి "నరాధమా! నీకు జిక్కమనే'' యని గుప్పించి రైలునుండి క్రిందపారుచుండిన నదీజలములోనికి దుమికెను.

# భా ను మ తి

## ముప్పది నాల్గవ ప్రకరణము.

### ఎ గ్మో రు .

అప్పుడే రైలువచ్చి నిలచెను. ఆశాభంగ మొనర్పబడిన నారాయణుఁడు విషాదవదనుఁడై బండిదిగి ‚‚టాక్సి" మోటారొక దానిని మాటలాడుకొని యందాసీనుఁడై బోవసాగెను. వీరశర్మ యచటికి రాదటస్సించి యల్లంతదవ్వున నారాయణునిగాంచి మోటారునాపమని డ్రయివరును హెచ్చరింప వాడాపివేసె. తత్క్షణమాత్రఁ డందెక్కి ‚‚ఓరీ! నీనీచకృత్యములన్ని బయల్పడినవిలెమ్ము! భానుమతి నెక్కడదాచితివో నిక్కమెఱిఁగించితివాసరి. లేకున్న నీకు కారాగార ప్రాప్తియేగతి. దురాత్మా! ఇట్టివాఁడవని కలలోనైన దలంపనైతిగదరా! కాని! నిన్నేమిజేసెదనో జూతువుగాక'' యనిగద్దించెను.

నారా—(ఒకింతైన చలింపక) ‚‚వీరశర్మా! నీ వెవరితో మాటాడుచుంటివో యించుక యోచింపుము. పిల్లియెదుట నామూషికముయొక్క ప్రలాపములు. ఒడలుదెలియక పేలుచుంటివా? దిగిపొమ్ము నామోటారునుండి! నిన్నెవ్వరెక్కుమనిరి. అని'' కోపముచే నాతనిగెంటివెచి మోటారు నతివేగముగా బోనిచ్చెను.

పాపము! వీరశర్మ మోటారునుండి త్రోయబడుటచే క్రిందబడి కొద్దిగా యాతనికి గాయములాయెను. కాని మెల్లఁగా లేచి నారాయణుని దిట్టుకొనుచు వానినప్పుడే బట్టుటకు రక్షకభటులకు దెలియచేయ నుద్యుక్తుఁడై సమీపముననగల రక్షకభటాలయము (Police-Station.) నకుబోవుచుండెను.

ఆహా! ఈశ్వరునిసంకల్ప మెవ్వరికిగాని యెఱుఁగ రానిదిగదా! మూడుదినములలో నెట్టియాపదలా మూడుకుటుంబములకు దటస్థించె. ఔరా! ఆమూడుకుటుంబముల గతులే యట్లుండ సర్వప్రపంచమును క్షణమేరీతిగ మారుచుండెనోగదా!

భానుమతి దొరకమిచే భానుమూర్తి గుందుటయు, ఆతని క్షేమము లారయుటకు కరుదెంచిన రామశర్మ కొడుకు హత్యాపరాధమునకై నిర్బంధింపబడుటయు, దామోదరుఁడు నిష్కారణముగా వధింపబడుటయు, నారాయణుని యత్నములన్ని నిష్ప్రయోజనములగుటయు, వైకుంఠశర్మ తనకుమారుఁడు తనకన్నుల యెదుటనే వధింపబడుటయు దానుచింతించినచో దనగుట్టు బయలుపడునని దనలోనె కుళ్లిపోవుటయు, బర్మాకు బయనమవు రామశర్మను గళావతి ధర్మపురమునకేగ నిర్బంధించుటయు, భార్యకోర్కెను ద్రోసిపుచ్చుటకు ధైర్యము చాలమి రామశర్మ యంగీకరించుటయు మొదలగునవి యన్నియు నొకేమారు సంభవించెను.

నారాయణుఁడు దనగుట్టంతయు దెలసిపోయెనని భయపడెను. రానున్నయాపదకై చాలవిచారమొందెను. ఇఁక తన్నెట్టులైన రక్షకభటులు బట్టుకొనక మానరు. ఇంతకు యిప్పుడీచటనే నున్నసంగతి యెఱింగినవారు వీరశర్మ యొక్కఁడేగదా! వాని నేరీతి బంధించెదగాక! యనిమనంబుననే దోదోప శరవేగమునబోయి యొకయౌషధలయు నొద్దదిగి యందుండిన వైద్యాలయాధికారాతనికి చిరపరిచితుఁడగుటచే యాతని గాంచినతోడనే మందహాసము గావించి కూర్చొమ్మని కుర్చీనిచ్చెను. నారాయణుండాశీనుఁడై "మిత్రమా! నేనొక యవసరపనిమీద వచ్చియుంటి. మరేమియు లేదుగాని వీరశర్మయను వానికి యిరువదేడులుండును; నాకుప్రబల శత్రువై యున్న

వాడు. వాని యీనాటి చేష్టలఁబదలంచుకొన్నచో గుండెలు నీరుగాక మానవు. నేనతనే విధమునైన నామార్గమునుండి యడ్డువదలించుకొనవలయును. అట్లుచేయుటకు గలమందు నీవద్దనున్నది. అదియే దంటివా నీవాతని పిచ్చివాడని రుజువత్రము (Certificate) నిచ్చి తత్క్షణమే యాతని "పిచ్చియావుషధాలయము"న జేర్చునట్లు జేయవలయును." అని దీనముగా బ్రతిమాలెను.

వైద్యు— "మిత్రుఁడా! తొందరపడకు. దిగులుడుగుము. నీకుసాయము జేయకున్న నింకెవరికి జేయవలయు. నీవొనర్చిన సాయమునకు గృతజ్ఞత జూపవలదే" అని బిరబిర నేదియోవ్రాసి తత్క్షణమాతని నిటకు గొనివచ్చినచో యిప్పుడే యవుషాధలయమున కింపెదనని యభయమొసంగెను.

నారాయణుడు సంతసించి కొందరి మనుష్యులనుగూడ తోడుజేసుకొని యతివేగమున మోటారును దోలుకొనిపోయెను.

వీరశర్మ మోటారునుండి క్రిందబడుటచే గలిగిన గాయముల బాధకు దాళజాలక మెల్లమెల్లఁగ నడుగులిడుచు యవనస్థానమునకు బ్రతీకార మొనర్పనెంచి క్రోధమువహించి ధైర్యోత్సాహములు ప్రబలుకొన సందుగొందుల బడిపోవుచుండ నారాయణుఁడాకస్మికముగావచ్చి మోటారునాపి ముందుపోవుచున్న వీరశర్మ నొక్కపోటున క్రిందబడవైవ యాతని యనుచరు లాతనిమోటారునబెట్టిరి. డ్రయివరంత మోటారు నతివేగముగా బోనిచ్చెను. నారాయణుఁడట్లు యవుషధాలయమునకు గొంపోయి వైద్యుని సలహాదీసికొని యాతడు వ్రాసియిచ్చిన యాజ్ఞాపత్రమునుగొని "పిచ్చియావుషధాలయము"లో నుంచి తనకడ్డమయినవాని నీరీతిగ పరిభవించితినిగదా యని సంతోషపడుచు బోయెను.

నారాయణుఁడు దాసినిగాఁజేసుకొని నిరాదరణజూపి దాని భానుమతియని పరిణయమాడుటయేగాక మీఁదుమిక్కిలి యపుడున్న ఆస్తిని సహితము దానికేవ్రాసియిచ్చి పూర్తిగా పరిభవింపబడెను.

చంద్రమతికిని నారాయణునికిని గలసంబంధ వివాహములు నాటిదినపు వార్తాపత్రికలలో ప్రకటించియుండిరి. నారాయణుఁ డా సంగతి చెలికాండ్రవలన దెలిసికొని విచారమునస్వస్థుఁడై దన కింక చెను దినములు రానున్నవని గ్రహించి భయముచే గడగడవణికెను. మరియు చంద్రమతి గర్భము దాల్చియుండుటచే నొకవేళ పుత్రుఁడో బుత్రికయో యుదయించిన యింకదనయాస్తినంతటిని యామె స్వాధీన పరచుకొనక మానదనియు, దాన దనగతి చాలహీనముగా బరిణమించకమానదనియు దెలసికొని యదరిపడెను. మరియు నాతఁడా చంద్రమతి యుంపుడుగత్తె మాత్రమనిజెప్పి దానిమాటలన్నియు సత్యములేయని జెప్పజూచెనుగాని ఆమెకు దానువ్రాసియిచ్చిన "వీలు" (will)ను గనబరచినచో దనగుట్టు దెలియక మానదని యూరకుండెను.

చంద్రమతి నారాయణుని వెనువెంటనే నాడురైలులోవచ్చెను. తన కదివరకుండిన కళంకమును పత్రికా సాయమున బోగొట్టుకొంటి నని సంతసించెను. రామశర్మ ధర్మపురమునుండి భానుమూర్తిపై హత్యాపరాధపుకేసు విచారణ వాయిదానాటికి యేతెంచెను. ఆతని గలసికొని తనవృత్తాంత మాతనికిదెల్పి కోడలినని చంద్రమతి పరిచయము గలుగజేసుకొనదలంచి యాతనివద్దకుబోయి "మామ గారూ! మీకు క్షేమమేగదా" యని సంభోదింప రామశర్మయాశ్చ ర్యముచే "ఎవ్వరీమె మామగారూ" యనుచున్నది. యనుకొను చుండ ఇంతలో చంద్రమతి మేజాపైనుండిన వార్తాపత్రికనుదీసి "మామయ్యా! ఏలయట్లాశ్చర్యపడుట; ఇదిగో! ఈవార్తనుజదువుడు.

అంతయు విశదముగాఁగలదు." అని తాను ప్రకటించిన వార్తనాతనికి గనబరచి దనకు సాయ మొనరింప వేఁడెను. ఆతఁడదియంతయు నదివరకే జరిగియుండుటచే విషయములన్నియు ముఖాముఖిని దెలిసికొని సాయ మొనర్చెదనని వాగ్దాన మొనర్చెను.

నారాయణుఁడు చంద్రమతి రామశర్మతో ముచ్చటించి యుండెనని విని హతాశుఁడయ్యెను.

# భానుమతి

## ముప్పది అయిదవ ప్రకరణము.

### సహాయపడు వారెవ్వరు?

కలకటా! న్యాయమున నెట్టిదో యిక్కాలమున లేదుగదా! స్వార్థపరులకు కాలముగాని సాధువర్తనులకు కాలము గాదు. అయ్యో! నన్నేల నిర్బంధించియుండిరి. చేతులార యగ్రజునిజంపు ఘాతకుండెందైననుండునే! నేనెవ్వరితో జెప్పుకొందు. భానుమతీ! నీ వెంతమంచిదానవుగదా! నీకొంటెచేష్టలు—నీచిలుకపలుకులు—నీ సాధువర్తనములు—నన్నుకష్టపరంపరలనుండి యొకింత దేలించుచుండెడివి. అవిగూడ నేమయ్యె. అయ్యో! దీనదయాళూ! ఆపద్రక్షకా! మాధవా! నే నేదోసము నొనర్చియుంటినో నాకుదెలిపి నన్నుశిక్షింపరాదా! పరమేశ్వరా నీకృత్యములు అగమ్యగోచరములుగదా!

హా! హా! దురదృష్టము! హేయమై—పాపభూయిష్టమై—తుచ్ఛమై—సాధుకంటకమై—దుర్జన నివాసమగు యీకమ్మల బోనులో—దుర్మార్గులింటిలో—ముండ్లపొదలో నివాసమా? దేవా! నాకుటుంబమున కెట్టిగతి సంభవించె. నేడో, రేపో హత్యాపరాధము నాపై మోపబడనున్నది. నన్నందుండి దప్పించువారెవ్వరు? పరమేశ్వరా! అపరాధమను నంతనే మేను గజ గజ వణఁకు. అట్టి నానిర్మలవర్తనమునైన నెఱుఁగజాలకుంటివే! అయ్యో! నాకార్యము లేటగలసె. నాయాశలడుగంటె. హా! నాయూరవ ప్రాణము—నానోములపంట—నావ్రతముల ఫలము—నాభక్తి చింతామణి—నానంసారనౌక—పుత్రుడా! నన్నింక బెండ్లాడెదవా? ఎక్కడి ప్రమద, ఎక్కడి భానుమూర్తి. ఇఁక నిన్ను నాకలోకముననే గలయుట.

అన్నయ్యా! నీవెంత క్రూరాత్ముండవయ్యును నేననవరతము నీయందు పూజ్యభావము వహించియుంటినే! అయ్యో! నిన్ను జంపిన ఘాతకు లెవ్వరు? నీవు వారికెట్టి యపకృతి జేసితివి. నన్నెందుల కన వలయు. నేనెప్పుడో సారంగధరుని చందంబున భ్రాతృహత్య యొనర్చియుండవలెను. లేకున్న నిరపరాధినగు నాపై లేని నేరము మోపబడుటకు కారణమెయ్యది?

చెల్లెలా! నాకిఁక మరణశిక్ష తప్పక సంభవింపగలదు. హా! దలఁచుకొన్న గుండెలుదడదడమనుచున్నవే! అయ్యో! కడసారినిన్నైన జూతుననికొంటి. ఈదుర్భాగ్యుఁడు నిన్ను బోగొట్టుకొనియె ఇఁక యెక్కడి భానుమతి! దేవా! తల్లిని, దండ్రిని, సోదరుని, చెల్లెలిని వేయేల? నాకుగల సంబంధీకులనెల్ల బోగొట్టుకొని యీభువిపై మనుటకన్న జచ్చుటమేలు; యీప్రాణములపై యాశలు యిఁకవలదు—వలదు: దేవా! రక్షింపుము! రక్షింపుము" అని భానుమూర్తి కారాగారమున విలపించుచు మూర్ఛపోయెను.

రామశర్మ ధర్మపురమునుండి వచ్చినవెంటనే భానుమూర్తిని జూచుటకుతొందరపడుచుండెను. అతని యోదార్చుటకై కారాగారమునకై బయలుదేరెను.

భానుమూర్తి మూర్ఛావేశమున క్రిందబడియుండెను. రామశర్మ యరుదెంచి «భానుమూర్తీ! భానుమూర్తీ! లెమ్ము! నేనెవ్వరో గుర్తించితివా'' యని యడిగెను.

భానుమూర్తి కన్నుల నులిమికొనుచు లేచికూర్చుండి యల్లంత దవ్వున రామశర్మనుగాంచి యాశ్చర్యశోకములు రెండును యుప్పతిల్ల "మహాశయా! మీపవిత్రపాదముల నేలయపవిత్ర మొనర్చుకొంటిరి?

ఈపాపి యిఁక నాలుగైదు దినములే జీవించియుండుట. ఆర్యా! నిరపరాధుల నెవ్వఁడు రక్షించు?

రాము—ఆ శ్రీమన్నారాయణుఁడే రక్షించు.

భాను—కల్ల. నేనమ్మజాల. ఆ దేవదేవుని హృదయాంతరాళముల కనికరమనునది లేదా! ఉండిన నాగతియిట్లగుట కేమి కారణము?

రాము—అన్నిటికినిఁగూడ కాలముగలిసిరావలయు. దేవుని నిందించిన ప్రయోజనమేమి? నీవేమియు భయపడవలదు. నేనిది వఱకే నీపరముగా వాదించుటకొఱకు న్యాయవాదిని నియమించినాఁడ. నీకభయ మొసంగుటకే నేనిక్కడికే తెంచియుండుట. గాన నీవు చింతదక్కి చరింపుము. వేళాయె. నేఁబోయివచ్చెద.

భాను—"మంచిది. మీ ఋణము నేఁదీర్పఁజాలను సుమీ! ఆర్యా! మీ రేనాకు తల్లియు, దండ్రియు వేయేల? నాసర్వస్వము మీరే! మీకెప్పటికిని నేఁకృతజ్ఞుండను." అనెను.

రాము—"భానుమూర్తి! ఇఁక నేఁబోయివచ్చెద"నని వెడలెను.

రాత్రి యెనిమిది ఘంటలయియుండవచ్చును. ప్రమద తన మనోవల్లభునిగాంచక యామోహనాకృతిని జూడక యెన్నిదినములుండగలదు? హృదయచోరుఁడారీతి యిడుముల బడుచుండ నౌదార్యక యూరకుండుట నుచితంబని మదినెంచి సన్యాసిని సాయము వేఁడి జైలు సూపరెంటెండెంటు త్తరువు పొంది కారాగారమున కేతెంచెను.

భానుమూర్తియప్పుడే భుజించి నాటిమధ్యాహ్నమునుండి గలిగిన తలనొప్పినివృత్తి కాగా యొకింత చల్లగాలికి మైమఱచెను.

అప్పుడే యుదయించిన బాలచంద్రుని శీతశీతల కిరణములా కమ్ములలో జారబడి భానుమూర్తి మోముపై దాండవమాడు చుండెను. ప్రమద యాతని దృశ్యమునుగాంచి విచారహృదయయై తేనిథైర్యము దెచ్చుకొని "ఆర్యా" యనిబిలుచ విషాదవారాశిని కష్టతరంగములమధ్య జిక్కుకొని దల్లడిల్లు యాతనిరక్షింప నేతెంచిన నౌకవోలె యాప్రమదవాక్కులు తేనెసోనలై చెవులనాట దటాలున లేచి కలయజూచి "ప్రమదా! ఈనిర్భాగ్యుండే ముఖముబెట్టుకొని నీ వద్దకే తేరగలడు? అయ్యో! నీవెంతచిక్కిపోయియుంటివి? హా! భానుమూర్తీ! నీమూలమున మెందరికి కష్టములు. పాపీ! నీవెంతగ్వరలో జచ్చిన నంతమేలు." అని నేలబడిపోయెను.

ప్రమద—ఆర్యా! ధైర్యమూనుడు. రామశర్మగారినెంతయో బ్రతిమాలి మీకుసాయమొనర్చునట్లుజేసితి. చింతవదలుడు. భయపడవలదు. మహానుభావా! మీదేహస్థితి యిపుడెటులున్నది?

భాను—ప్రమదా! ఎటులున్ననేమి? నీ యీ దయారస వాక్కులు నన్నురోగవిముక్తునిగా చేయగలవుకాని మనప్రణయనౌక భగ్నమయ్యెనుగదా! హా! యింక నన్ను బెండ్లాడుటకు త్వదీయ జననీ జనకులంగీకరింతురే! అయ్యో! నామూలమున నీకెన్నిపాట్లుగలిగె. పాలవంటి నిర్మలోత్తమకులవిభూషణవగు నిన్నుజేపట్టెడి భాగ్యము—హా! వెఱ్ఱివాని బుద్ధియనిన నిట్టిదేమోగదా. కటకటాలమ్రగ్గుచూ నేడో రేపో హత్యాపరాధమునకు శిక్షింపబడి చావనున్నవానికి వివాహాపు పిచ్చియా? ప్రమదా! నాయాశవిడుము. వేరెవ్వరినైన జెట్టపట్టుము. నాకుసాయపడు వారెవ్వరు?" అని దుఃఖముచే విలవింప సాగెను.

ప్రమద—ఆర్యా! ఏలయింతటి బేలలైతిరి? నా దేహముగూడ

మీశరీరసౌఖ్యమునకై త్యజింపనెంతునుగాని మిమ్ములవిడనాడుదునే! వెఱ్ఱిసిపీనుగు. నాకు వేళాయె. ఇచ్చట చాలకాలముండరాదు. (సన్యాసివైపుజూచి) మహాత్మా! మీకృపచే మా యీసమావేశము నెఱవేరినది. అందులకు నేనల్లపుడు కృతజ్ఞురాలను.'' అనెను.

భాను—మహాత్మా! మీసేవచిరస్మరణీయము. మీయాదరణ నిరుపమానము. అగణ్యము. మీఋణము నేదీర్పజాలుదునే?

సన్యా—తనయా! లోకోపకారార్థమై సన్యసించితినిగాని నా పొట్టకూటికిగాదు. నావిద్యుక్త ధర్మము నెఱవేర్చితిని. అంతయు భగవదాధీనము.

భాను—అవును. సర్వమా పరమేశ్వరాధీనమే!

ప్రమద—ఆర్యా! ఇక పోలీసులు మమ్ము మాటాడనీయరు. వారిచ్చిన గడువుమీఱినది. వేళాయె.'' అనియాతనివద్ద సెలవుగైకొని వెడలిరి.

భానుమూర్తి కన్నీరుగార్చుచు ‹‹నేనింక దుఃఖముచే బడియుండవలసినదే'' అని క్రిందబడిపోయెను.

కళావతి దానొనర్చిన ఘోరకృత్యము దలచుకొని భీతిచే ఆహారముగూడ గైకొనక నిరంతరము దురంత చింతావ్యాకులచిత్తయై యెపుడునూ నేదియో వదరుకొనుచు, రాత్రివేళల సైతము నిదుర రాక దామోదరుడు కలయందు గనపడ వెఱ్ఱివెఱ్ఱికేకలు వైచుచుండెను. అదంతయుగాంచి రామశర్మ భీతిచే యటులొనర్చుచున్నదని మొట్టమొదట దలంచెనుగాని యంతకంత కామెనోటనుండి వెడలు కలుషవచనములవిని యందేదో నిజమెఱుంగగోరి ఆమెప్రవర్తనమును మునుపటికన్న గడు జాగరూకతవహించి పరీక్షించుచుండ

యొక నాఁడు కళావతి కలలో దామోదరు నాకృతిగాంచి భయపడి “దామోదరా! రక్షింపుము! రక్షింపుము! పొరపాటొనర్చితి. నిన్ను జంప నాకెంతమాత్రము నిష్టము లేదు. భానుమూర్తికి బదులు నినుజంపితి. అంతయు పొరపాటు. తెలియక గావించిన దానికి నన్ను గరుణింపవా?” యనుసరికి రామశాస్త్రి అమాటలన్నిటిని విని యాశ్చర్యపడి కొంతవడి నిశ్శబ్దుఁడై “ఔరా! ఎంతటిమాయలమారి నన్నేడైన నినిజంపక మానదు. దీనిహస్తములో నెన్నిరహస్యము లిమిడి యున్నవో గదా! దీనికింతకు కారకుఁడా వైకుంఠశర్మయే గదా! వాడిప్పుడెక్కడెక్కడనో యున్నాఁడని నాసేవకుఁడిప్పుడే యెఱింగించె. కానీ! వానినిప్పుడే బంధింపజేసి దిరిగి యేదోవిధమారసి దీనినిగూడ నుట్టుబెట్టుటకు యోచింపవలయు”నని క్రోధమున లేచి నొక కాగితమును పరపరగోకి వ్రైచి పోలీసుస్టేషను కంపివైచెను:

భోజనసమయముగావున వైకుంఠశర్మ జ్యోతిషవేషమును వీడి భోజనమునకై లేచుచుండ నెవ్వరో తలుపులుదట్ట నారంభించిరి. “ఎవరువారని” యడుగునంత లోపలనే పోలీసువారింటి వెనుకనుండి దూకి యింటిలో బ్రవేశించిరి. వారినిగాంచి వైకుంఠశర్మ పండ్లు పటపటగొరుకుచు యెటుబోవుటకును దిక్కుదోపనందున వెంటలలో నున్న పిస్తోల (Pistol) నుదీయ నుద్యుక్తుడుకాగా రక్షకభటులాతని వెనుకనుండి యేతెంచి హస్తముల రెండింటిని పరిచికట్టివైచి “చాలు! చాలు! రమ్ము మావెంట”యని సంకెళ్ళనుదగిల్చి కారాగారమునకు గొంపోయిరి. వైకుంఠశర్మ దనపాపఫల మిప్పుడే గలిగినదనుకొని యిఁక నింతటితో ఆయువంతరించిన దనుకొనెను.

---

# భానుమతి

## ముప్పది ఆరవ ప్రకరణము.

### నిర్మలనది.

నిర్మలనది స్వచ్ఛజలపూరితము. దానికది సార్థకనామధేయమే. ఇద్దరి మనుజుల లోతుకంటె నెక్కుడు లోతు లేదు. అనదీజల మనేక జీవకోటి కత్యంత యుపయోగకరంబు.

రాత్రి గభీరము. అప్పుడప్పుడు వాయుసంచలనమువలన గలుగు చెట్లయలజడిదప్ప వేరొక సందడి లేదు. అంతయు నిశ్శబ్దము ప్రపంచ వ్యాపారము విరమింపబడినను ఆకాశరంగమున మాత్రము నక్షత్రసమూహము భూలోకవృత్తమును బరికించుటకోయన తొంగి తొంగి చూచుచుండెను.

అట్టియంధకారమున "నిర్మల" నదియొడ్డున కొందరు బెస్తలు తమవృత్తియు జీవనోపాధియునగు మత్స్యముల సేకరణమునకై యరుదెంచియుండిరి,

మానవకోటిలో నత్యంత నీచముగా జూడబడు జాతుల నేకములు గలవు. వాటిలో బెస్తకుల మొకటి. వారివృత్తియే వారిని నీచుల జేయుచున్నది, జ్ఞానవంతునకు గుణము ప్రధానముగాని కులముతో నిమిత్యము లేదు. నిజమరసిచూడ యిట్టినీచజాతులందు గల అయికమత్యము, స్వధర్మవర్తన, కులవృత్తి విడనాడకుండుట మొదలుగాగలవి యగ్రవర్ణములందుండవు.

బెస్తపల్లెకు రాముడు పెద్ద. వాడాకులవువారి కంతటికి రాజు వంటివాడు. వానివాక్యము వేదవాక్యము. అతఁడుగూడ నాటి

రాత్రి "నిర్మల" నదీతటమున కరుదెంచియుండెను. సమయము జూచి "వలవిసరుడు! వలవిసరు"డని హెచ్చరింప మిగిలినవారందరు తమతమవలలను నదీగర్భమున వైచిరి.

ప్రాతఃకాల మయిదుఘంటల కా దారినిబోవు ధూమశకటమా నదీవంతెనపై బోవుచుండ నదియొడ్డుననుండిన బెస్తలెల్ల తలలెత్తి జూచుచుండిరి. ధూమశకటమా నదీగర్భ ప్రదేశము జేరెనో లేదో అందుండి యెవ్వడో యొకడు పైనుండి నదిలోనికి దుమికెను. రాముడచ్చట దనవలను బన్నియుండుటచే పైనుండి బడినవానిని గట్టునకెత్తి తోడివారలనెల్ల బిలచి వలలోని మనుజునివిడిపించి స్మారకహీనుడైన నాతని పరుండబెట్టిరి. రాముడంత నొక్కని నింటికి దరిమి నిప్పులరెంటిని దెమ్మని వాటిసాయమున మంటవేయించి యాతని దేహము నొకింత కాపింప నాత డిటు నటు పొర్లనారంభించెను. మరికొంతసేపటికి కనువిచ్చిచూడసాగెను. ఎట్టెదుట నూతన విగ్రహముల గనుగొని రిచ్చపడిజూడ నూతని వాలకమునుజూచి బెస్తలు ప్రశ్నలను వేయసాగిరి.

బొల్లున తెల్లవారెను. పల్లెనారీమణులు దమచంకల మృణ్మయపాత్రములధరించి నీరముకై నదీతటముజేరిరి. వారిలోనొకరు వృద్ధురాలు. బ్రాహ్మణయువతి యగుటచే మిగిలినవారి కొకింత దూరమున నిలువబడి "బెస్తలారా! ఈయువకుడెవడు? ఇచటయుండుటకు గారణమెయ్యది" అని మొదలుగాగల ప్రశ్నలనడిగెను.

బెస్త—అమ్మా! యీయనయెవ్వడోగాని రైలునుండినదిలో బడ మేముబట్టుకొని సేదదీర్చితిమి. తెలివిప్పుడే వచ్చినది. తన చారిత్రము దెలుపమన్న బ్రాహ్మణుడని మాత్రము దెలుపునుగాని మఱేదియును బలుకనొల్లడు.

వృద్ధు—"బాలకా! నావెంటరమ్ము! మాగృహము చేరువనే యున్నది. నిన్నుజూచినంతనే కనిపెంచినవారి తెఱంగయ్యెడిది. నీసాహసముజూడ నేదో విచారముచే ప్రాణముల బాయనెంచితివని దోచెడిని. అదియుక్తమేమను. రమ్ము! అన్నియు నిదానముగా మాటాడుకొందము" అని యాతని వెంటనిడుకొనిబోయెను.

రెడ్డినారాయణ రాజుగారు చాలమంచివారు. కోమలహృదయులు. చుట్టుపక్కలగల గ్రామంబులలోకెల్ల పేరువడ్డవారు. ఆతనికున్న పలుకుబడి చుట్టు మూడుమైళ్లలో నేరికిగాని లేదు. ఇంత యుండియు యాతనయనంతర మాగొప్పస్థితి ననుభవించుటకు పుత్త్రులు గాని సమీప బంధువులు గాని లేరు. ఇంక గలుగుదురను యాశ లేదు. శతవృద్ధులు. అట్టివారి కాకస్మికముగా దొరకినపిల్లవాని నతి గారాబమున బెంచ నిచ్ఛగించిరి. తనయనంతరమా యువకుడే దన యాస్తికి దగినవాడని మనంబున నూహించి యాతనిచరిత్రము విన గోరెనుగాని యెన్నిమార్లు బలవంతపెట్టినను చెప్పనొల్లడయ్యె. నారాయణరాజుకు నెక్కువ ప్రస్తాపించిన సమంజసముగాదని యూరకుండెను.

పాపము! భానుమతి మారువేసమున నచ్చటొకింతకాలము గడుపనిచ్ఛగించెను.

# భానుమతి.

## ముప్పదియేడవ ప్రకరణము.

### ఇంకనూ బ్రతుకనిచ్చినాడు.

"దైవమా! ఏలనన్నూరక బాధించుట; నాప్రాణముల నొక్క తృణప్రాణముగ నెంచితి. ఆశలన్నిటిని విడనాడితి. ప్రపంచము నేమఱచితి. క్రూరాత్ముల చేతులలోబడి మానధనమును దొంగ లింపబడుటకన్న మరణమొంద నిశ్చయించితి. తెంపొనరించితి. నదిలో దుమికితి. తిరిగి నన్నిందులకింకనూ బ్రతుకనిచ్చినాడవురా దండ్రీ!

నేనెంత బుద్ధిహీనురాలను. ఆయుఃపరిమితియింకనూ గొంత కాలముండ నేబ్రయత్నించినచో చావగలనా? దేవా! సౌఖ్యమింక కలలోని వార్తయేనా? లేక దయదలంచెదవా? హా! సౌఖ్యమెక్క డిది? పరలోక సుఖమొక్కటియే మిగిలియున్నది. నాయావ్వనమం తయు కష్టముల పాలుజేయుమని ఆవిధాత నానొష్టన లిఖించియుండ సుఖపడుటెట్లు? ఒకటిబోయిన నింకొకటి వెదకుకొని వచ్చుచున్నది.

పాపపువిధీ! నీవు నీఉద్యోగమున కనర్హుండవు. నీకుగల క్రౌర్యము నంతటిని నాపైననే గనుపరుపనెంచితివా? అయ్యో! నిన్నే టికనవలయు. నాపురాకృతఖర్మ యిట్లేడ్పించుచుండ యొకరిననబని యేల? కానున్నది కాకమానదు.

అకటా! ఏమని యిల్లుసేరుదాన. ఇన్నిదినములు నీవెందుంటి వని యడిగిన వారికేమని ప్రత్యుత్తర మొసంగుదాన. లోకులు కాకులు. పలువురు పలుభంగుల దలంచియుందురు. పోనీ! యిచ

టనేబడి యుండమన్న కలకాలము దినదిన గండము వేయేండ్లాయు వన్నట్లు నానిజవేసము మరుగుపరచి యిల్లిన్నాళ్ళుచరించుట హా! దుర్భరము.

వీరశర్మా! నీవెందుంటివో గదా! యిన్ని దినములు నేగానరా కున్న నేమని దలంచితివో గదా! నీనిష్కపట హృదయమున యీను మానమునకు దావు లేకున్ననూ లోకులూరకుందురా? నేబ్రతికియుం టయే దటస్థించిన నిన్నుదప్ప యీయిక్కల గన్న త్రిమైనజాతునే! హా! నాయూహాలన్ని వెట్టియూహాలుగానున్నవి. ఇంతకూ నేయపవాద మును లేక నాయగ్రజుని జేరుకొనినిగదా యీమాటలు. నేనింటి కేగుదమన్న యీవృద్ధదంపతులు వీడిపుత్తురే. ఎటులైన వీరికెరిం గింపకయే బోవుటుత్తమంబు" అని భానుమతి తనపురుషవేషమున బెస్తపల్లెలోని వృద్ధదంపతులింట నూర్పుండి దుఃఖించుచుండెను. ఆవృద్ధనారీమణి యామెవైఖరినంతయుగాంచి మాటాడించెనుగాని మనోభావముల వెల్లడిజేయదయ్యెను.

రాత్రి పదిఘంటల సమయము. అంధకారనిశ్శబ్దత. జన సంచార సూన్యత. భానుమతి పలాయనాయాతురత జయము గాంచినదోయన్నటందరు నిదురించుచుండిరి.

కట్టకడసారి తన్నట్లాలాకుముద్దుగ బోషించుచుండిన వృద్ధదంప తుల నొకపరిజూచి మరి వెడలనిచ్చగించి భానుమతి ముసలవ్వ గది వద్దకుబోయెను. ఆమెగుర్రువెట్టి నిదురించుచుండెను. దీపము మినుకు మినుకు మనుచుండెను. అట్టిసమయమున భానుమతి వృద్ధ నారీమణిని లేపనెంచెనుగాని దాన దనప్రయాణమున కాటంకము గలుగునని కన్నులనుండి భాష్పములురాల మెల్లగ నామెపాదముల నంటి కన్నులకద్దికొనపోబోవ నామె యొకనృశ్చికము ముసలవ్వ

మోమున పొరాడుచుండుటగాంచి చేరుమాలచే దానినటు క్రిందికి ద్రోసిచంపి తిరిగికురుల దనసాహసకృత్య మొకవేళ నిద్రాభంగ మొనరించునేమోయని భీతిల్లి చెదరినముంగురుల చక్కదిద్ది నిద్రాభంగ మొకరవ్వంతయు లేకుండ జేయుచుండెను.

నారాయణరాజు నాల్గవ ఝామున మేల్కాంచి దీపమును వెలిగించి నిలువబడ నంతలో నెవ్వరివో యడుగుల చప్పుడు వినబడ మెల్లగా నాతడు గదివద్దకుబోయిచూడ యువకుడు తనభార్య మోముపై విసరుచుండె. ఏమనుకొనెనోగాని యెక్కడలేని కోపముతో "ఓరా! దురాత్మా యేమి జేయుచుంటివిరా" యని నొక్కగంతున లోనికరుదెంచి భానుమతిని నొక్కదన్ను దన్ని యీడ్చి కొట్టి మరియొక గదిలోద్రోసి తాళమువైచెను. పాపము భానుమతి "నాయనా! నేను నిర్దోషిని! నిజము బుత్తించెద" నని బ్రతిమాలి జెప్పుచున్నను నారాయణరాజు పెడచెవినిబెట్టుచు కోపోద్దీపితుడై కొట్టసాగెనేకాని వినడయ్యె.

ఇంతలో ముసలవ్వ మేల్కాంచి భర్తనుచేరబిలచి "నాథా! ఏమిది" అనియడిగెను.

నారా—ప్రియురాలీ! ఈతడొనర్చుచుండిన కృత్యమెఱుంగవే! అయ్యో! చెప్పుటకే సిగ్గగుచున్నది. త్రోవనుబోయ్యెడివాని చేర దీసినందులకు దగినట్లే ప్రవర్తించె. ముసలితనముచే శరీరము ముడుతలుబడి వికారాకార స్వరూపంబగు నిన్నాదుర్మార్గుడు ముద్దిడుచుండెనుగదా! వావివరుసలు వలదా? ఓరా! కాలమెంతకొచ్చెను.

భానుమతి లోనుండి "నాయనా! ఎట్టిమాటలుబలుకుచుంటివి, అయ్యో! నేనొకింతయు నెఱుంగను. దయయుంచి నన్ను బయిటకు

రానిండు. నిజమొతెలింగించెద. మీసంశయము నివృత్తికాగల"దని జెప్ప నారాయణరాజు మరింతమండిపడి "ఛీ! పాపాత్మా! నోరు మూయుమింకచాలు. కన్నులారగాంచిన దపద్ధమందువా?"

వృద్ధు—నాథా! ఏలయింత యాతురత! బయిటికి విడువుడు. ఏమిచెప్పునోవిని తదుపరి యపరాధ నిశ్చయ మొనర్చుట మేలుగాద.

నారా—(కోపముతో) అవివేకీ! నీకుగూడ బుద్ధిమాంద్యమె నట్లున్నది. చూడు వానిపుడేమి జేతునోఅని గదిఁవిడెను.

భాను—అవ్వా! నీవైనగరుణించి యొకమారు గొళ్ళెము దీసివైచినచో నానిజవేసము నానిర్దోషిత్వము దెలియగలదు. అయ్యో! నాకింకనూ శనియూవాహనా విముక్తికాలేదు కాబోలునని వెక్కివెక్కి యేడ్వసాగెను.

కరుణార్ద్రహృదయయగు నాయవ్వ మెల్లఁగ గొళ్ళెము దీసి చూడ అశ్చర్యము! యువకుఁడుగాదు, యువతి.

భానుమతి లోనుండి బరువెత్తివచ్చి యవ్వపాదములపైబడి "అవ్వా! నాయపరాధము క్షమింపుము. నేనింతవరకు నానిజవేసము మరుగుపరచుటయేగాక మీరడిగినపుడెల్ల నాచరిత్రమును దెలుపకం మలకు మరియొకమారు క్షమింపుమని వేడుచుంటి"నని వెక్కివెక్కి యేడ్చెను.

పాపము! అవ్వ యాతని నిర్దోషిత్వము దెలసుకొని "అమ్మా! నీవేల యట్లొనర్చితి. నిన్ను నానాథాని కోపాగ్నినుండి రక్షించెద"నని యభయ మొసంగెను. భానుమతి చతికిలబడి "అవ్వా! ఏమని దెలుపుదు నాదుర్భాగ్య జీవితచారిత్ర. సావధానముగ వినుము"

అని యిట్లని చెప్పదొడంగె. "అవ్వా! కొన్నినాళ్ళకుముందు నేనొక దురాత్మునిచే దరుమబడి పురుషవేసమున నై లెక్క- నాతఁడుగూడ వెన్నంటి నన్ను మానహీనురాలినిగ జేయ నుద్యమింప నాప్రాణపదమగు మానధనమును గాపాడనెంచి తుదకు ప్రాణములు బాయ నిశ్చయించి నదిలోనికి దుమికితి. తదుపరి నేమై నదియు మీరెఱింగియేయుంటిరి. నేనాదురాత్మునిచెరనుండి దప్పించు కొనుటకనేకకష్టములబడితి. నన్నియు నొకమారుమీకు మరెపు డైన విన్నపించెద. ప్రస్తుతమట్లానాకు మొదలు మీయనురాగ మున బెరుగుచుండ నాకొకనాడెక్కడలేని వ్యసనముదయించె. ఎన్ని నాళ్ళిచట రహస్యజీవన మొనర్పుటయని మనంబున బీడింపసాగె. మరియు నాయన్ననువిడిచి యీరీతియుండుట సాధ్వీత్వమునకే గళం కమని యెటులనైన నావారలజూచుటకేగ మీయనుజ్ఞ వేడితి. మీరు నన్నువిడజాలక పోవలదని బ్రతిమాలితిరి. నేనట్లూరక మిమ్ముల యడిగిన బోనివ్వరనియెంచి పలాయనమే శరణ్యమనినమ్మి నిన్నటిరాత్రి కడసారి మిమ్ములదర్శించి బోవుదమని మీగదివద్దకుబోయి మీచర ణములంటి కన్నులకద్దికొని యేగనుండ నెక్కడనుండెనోగాని నొక వృశ్చికము మీమోమున బారాడుచుండుటగాంచి దటాలున నాకేల నుండిన చేరుమాలసాయమున దానిక్రిందికీడ్చి చంపివేసితి. దాన మీకు నిద్రాభంగమగునని భీతిలి మెల్లగ విసరిసాగితి. దీనినంతటిని మరుగునుండి జూచుచున్న మానాయన నారాయణరాజు నేయొనర్చు చుండిన కృత్యముజూచి యనుమానపడి నన్నీరీతి బ్రతిమాలుచున్ననూ కొట్టియందుబడవేసె"నని పైటకొంగు సాయమున గనుగొనలనుండి యేతెంచు అశ్రుకణముల దుడిచికొన బ్రయత్నించె. అవ్వ భాను మతి చారిత్రినంతటినివిని యాశ్చర్యపడి తొట్టదొలుతనుండివిన కుతూ హలయై బ్రతిమాల నామెయంతటిని కొంతయైన మరుగువెట్టక జెప్పి

వైన పంథ్రిమాశ్చర్యములు పెనుగొన దవనాథునివద్దకేగి దానినెల్ల జెప్ప నాతఁడుగూడ వింతపడి చూడవచ్చె.

భానుమతి యాతని పాదములపైబడి "నాయనా! నన్ను క్షమింప"మనివేడ నాతఁడు లేవనెత్తి సమీపమున గూర్చుండబెట్టుకొని "బిడ్డా! నీచారిత్రమప్పుడే జెప్పియుండిన బాగుండెడిదిగదా! అయ్యో! నిష్కారణముగ నిన్నుగొట్టితినే! నీవేమియు భయపడవలదు. నిన్ను రేపటి దినము దప్పక మనిషిని దోడునిచ్చి బంపెదను. బిడ్డా! యెంతలో నెంతాయె నీవేమియు ననుకొనకుము. వెఱ్ఱిపిల్లా! మాతో జెప్పియుండిన నప్పుడే బంపియుండమా! ఇఁకనూ చాల ప్రొద్దున్నది. పరుండ"బొమ్మని మరునాడు సాగనంపుటనుగూర్చి యోచించుకొనుచు నిదురించెను.

# భానుమతి

## ముప్పది యెనిమిదవ ప్రకరణము.

### సుందరి మరణము.

మైలాపూరున నొక దివ్యప్రాసాదముచుట్టు నేడేలకో జనులు మూగియుండిరి. వచ్చిపొయ్యెడివారికి నిలకడయే లేదు. అయిల్లి ప్పుడు పోలీసువారిచే పరిరక్షింపబడు చుండెను. మోటారుబండ్లును ద్విచక్రశకటములు విధి విరామము లేక దిరుగుచుండెను. ఆయింటి కెదురుగా పురపాలక సంఘమువారి "Ambulance" మోటారొకటి నిలువబడియుండెను.

పోలీసువారు దమకుగావలసిన విషయముల నన్నింటిని విచా రించి వ్రాసికొనిరి. శవము నవుషధాలయమునకు గొంపోవు టొక్కటియే మిగిలియుండెను. కొంతసేపటికి శవమును బయటికి దేగా జనులందరు "అదిగో! శవము. అదిగో! శవము" అని కేక లిడుచుండిరి.

ఇంతలో పోలీసుల కధికారి (Sub-Inspector) యింటిని పరి శోధించుచుండినవాడు తనకొక లేఖలభింప దానిని బదిలముగ నెల్ల రికి యిట్లని జదివి వినిపించెను.

"ఆర్యులారా!

నేనీలోకము బాయుటముందుగ నాచేయొనర్పబడిన దురాగతములన్నిటి నొక్కమారు మీకు దెలియజేసి నానిజము దెలియ బరచి యనాయాసముగ యశువుల వీడనెంచితి.

నాకును భానుమూర్తికిని గలిగిన ద్వేషము నాగుట్టు బయట పడిన నాడే మీ కెల్లరకు విదితమై యున్నది. నాటనోలె నాహృద

యీన యసూయాకోపాగ్నులురగులు కొని యాతనెట్టులైన వివాహ మాడవలయు లేకున్న మట్టుబెటవలయునను రెండుద్దేశముల మాత్రము యనవరతము బీడించుచుండెను. ఎట్టకేలకొక నాడు వైకుంఠశర్మ సాయమున భానుమూర్తి యింటబ్రవేశించి యందు పరుండియుండిన దామోదరుని పొరబాటున దెలివిహీనునిగ జేసి యెత్తుకొనిపోయి సహాశ్య వివాహకార్యము ముగించితిమి. ఆ మరునాడతని మోముగాంచి దామోదరుడని దెలసి చేయునది లేక వానికిగొంత ద్రవ్యమొసంగి వివాహతంతు వేమాత్రము బయటబెట్ట కుండునట్లొడంబడిక గావించుకొంటిని. వాడట్లొకింతకాల మూర కుండి ద్రవ్యమునకై నన్ను బీడించుచూరాగా నేనప్పుడప్పుడు కొంత నాయమొసగుచుంటిని. ఇంతలో దామోదరుడు వధింపబడెను; అందున నాకొకింత సంతసమయ్యెనుగాని సింగముబాధదప్పి పులిబాధ దగులొనినట్లు వైకుంఠశర్మ యంతవరకు దానొక గొప్పజ్యోతిష్కుం డని నన్ను మోసపుచ్చినవాడు దామోదరుడు తనకుమారుడేయనియు వివాహకార్యము నంతటిని దానే జేసియుండుటచే యాకాగితముల నెల్ల నగుపరచి ద్రవ్యమునకై నన్ను బీడింపసాగెను. ఇంక నీతనితో వైరము బెట్టుకొన్న విధవనై నూరాలగుంపోని నాయవ్వనమంతయు నేటిపాడ్జేయుటో లేక దురుమార్గముల వ్యయమొనరించుటయో దప్ప వేరుగతి లేదని మనంబున నిశ్చయించి తెంపొనరించి యీప్రపంచ మునే విడనిచ్చగించి నేడాత్మహత్య యొనర్చుకొంటిని. గాన దయా మయులారా! నాయపరాధముల నెల్ల క్షమింపుడు. ఇందెవ్వరుగాని పాల్గొనమిచే యెవ్వరుగాని భాగస్వాములుగారు. కాన నెవ్వరిని గాని యపరాధముక్రింద శిక్షింపబని లేదు.

ఇట్లు,

దురాచారిణి క్షమింపగోరు,

సుందరి."

ఆమె లేఖయే సర్వము నెఱింగించియుండుటచే నాత్మహత్య యని దీర్మానించిరి.

పిమ్మట భానుమూర్తితో మాటాడివచ్చినపిదప నింటికేగెను. నాటగోలె యావరిపాళ్రజునకును రామశర్మకును యెడ తెగని స్నేహ మొదవెను. ఒకనాడు రామశర్మ ప్రసంగవశమున "మహాత్మా! భానుమూర్తి విడుదలగునా?" అనియడిగెను.

సన్యా—నిస్సంశయముగా

రామ—అదెట్లు?

సన్యా—సత్యమెన్నటికిగాని దాగియుండజాలదు. పాపము నిరపరాధి కెన్నియిక్కట్లు.

ఇంతలో సేవకుఁడొకఁడరుదెంచి రామశర్మకొక లేఖనతి దిచ్చెను. రామశర్మ విప్పి యిట్లని జదివెను.

"రామశర్మ మహాశయులకు"

వైకుంఠశర్మ వినయపూర్వక ప్రణామములు.

మహాశయా! నాకాలము దీరినది. నాజీవితము దినములలోనున్నది. ఇఁక నే దాచియుంచిన రహశ్యములనట్టేయుంచిన లోకమునకే యపకృతి యొనర్చిన పాపమున బోయెదను. మీయెడ నేనొనర్చిన పావ కృత్యములకు మేరయే లేదు. వాటి ఫలితమిచట యనుభవించుచుంటి. నన్ను మీరుకరుణించ బని లేదు. రహశ్యములలో కెల్ల నతిరహశ్యము మీతో మాత్రము వచింపకదప్పదు. దయయుంచి నేమరణించకమునుపే నన్నొకమారు గలసికొనవేడు.

వైకుంఠశర్మ"

సన్యా—రామశర్మగారూ! వీడెంతదుర్మార్గుఁడైననూ మనము మాత్రము కడపటి కోర్కెను నిరాదరించుటదప్పు. లెండు బోయి వత్తము.

రామశర్మ సన్యాసికి బదులు జెప్పజాలక నాతనితో వెంటనే కారాగారమునకు బోయెను.

రామశర్మాదుల గాంచుటతోడనే వైకుంఠశర్మ "ఆర్యా! ఇదే గైకొను మీ నిర్భాగ్యవిశ్వాసఘాతకుని కట్టకడపటి వందనములు. ఈదుష్టమృగమింక కొన్నిఘంటలమాత్రమే జీవించుట. నానోటి వెంట వెడలు కలుషంబుమాత్ర మసహ్యించుకొనక విన వేడుచుంటి ఇంతమాత్రము జేసినచో నా యీ దేహము దృప్తినొందగల"దనెను

సన్యా—రామశర్మగారూ! ఏవేళకేమివచ్చునది దెలిసిన వారు లేరుగదా! ఏపిక్కట్టిబుద్ధి బోధమింకంములకు సంతసింపవలసినదే!
వైకుం—మహానుభావా! అవధరింపుడు. నేజెప్పుగాథ యెంత మాత్ర మసత్యముగాదు. నిజము. ముమ్మాటికి నిజము. ఎవతె సౌందర్యము నవలోకించి ముగ్ధులై బరిణయమాడితిరో, ఏనీచురాలిచేతి కీలుబొమ్మనై నేను మెలఁగుచుంటినో ఆదురాచారిణి కళావతి నా యుంపుడుగత్తె. తామానాడు ధర్మపురమున దానిమాయాచూపులకు జిక్కి దానిచే పూర్తిగా వంచింపబడితిరి. వివాహకార్యము మొదలుగాగలవి మీకనుభవైకవేద్యమే! మీరు దాని బెండ్లాడునప్పుడు మూడుమాసములగర్భము దాల్చియుండెను. దానికడుపున నారాయణుండుదయించుటయు దెలిసియేయున్నది (రామశర్మవైపుజూచి) ఆర్యా! కోపగించవలదు. నా యీవార్తను బూర్తిజేయనిమ్ము. నిజముదెలియక దల్లడిల్లుటకన్న సర్వమెఱింగి మీ యీహస్తములచే నొక్కవ్రేటున దెగవేయుడు. సంతసమున బ్రాణములువీడెద.

వినుఁడు మఱియొకటి. నాడు మీప్రథమభార్యకుదయించిన బుత్త్రుని నా స్వాధీనమందుంచితిరి. కానికళావతి దానిరూపుమాపనాకొంపకు జిచ్చువెట్టించె. అందు మీకుమారుడు............అగ్నిలో...బడి............మరణించె......మీతో మాత్రము బ్రతికియే యుండెనని యసత్యముబల్కి యేతద్ శిశుపోషణార్థమై ధనమును లాగుచుంటి. ఆర్యా! ఆర్యా! నన్ను కోపదృష్టులజూడకుఁడు క్షమిం పుఁడు. మీకోపానలము నన్ను దహించి వేయుచున్నది.

ఇఁక భానుమూర్తి యెవరని మీరుబ్రశ్నింపవచ్చును. నీలకంఠుఁడను వాఁడొకఁడు జూదరి, త్రాగుబోతు వేయేల దుర్మార్గమూర్తియున్న సొమ్మంతవమ్ముజేసి వేశ్యాలంపటుఁడై కట్టుగుడ్డలేక దినకూడులేక యల్లాడుచుండెను. అట్టివాని యప్పటియవస్థ యేమని జెప్పఁదును. వానివద్ద యిరువురు పిల్లలుండిరి. (సన్యాసి ఆశ్చర్యముతో) "చెప్పుము. చెప్పుము. నామనంబు దత్తరపడుచున్నది. అంతకంతకు నాశ్చర్యము గొల్పుచున్నయది."

వైకుం—ఒకతె స్త్రీశిశువు. మఱియొకటి పురుషశిశువు. ఏమహాతల్లి వారినిగనెనోగాని యిద్దఱు నవమన్మథాకృతులే. వారిద్దఱుమడలు. వారితల్లి కని దివికేగెనట. వారితండ్రి నీలకంఠుని కన్నయగునట.

సన్యా—(ఆశ్చర్యముతో) వైకుంఠశర్మా! వారి నేమొనర్చితివి? ఇప్పుడుగూడ సజీవులై యుండిరా?

వైకుంఠ—సావధానముగ వినుండు. వారికి నే భానుమతీ భానుమూర్తులని నామంబులిడితి. భానుమూర్తియే రామశర్మ దనూజుండని యాతనికి నమ్మజెప్పి మోసగించితి. రామశర్మగారూ!

మీతో నాడువదించినరీతి యొకగుర్తుగూడవేసి మీకనుమానము రాకుండునట్లు జేసియుంచితిని. నాటగోలె మీయనుగ్రహమున మదార్సున నావ్యాపారము సాగింపనెంచితి. మీరు నాడే బర్మాకు వెడలితిరి. మిగిలినసంగతులన్నియు మీకు దెలిసియేయున్నవి గాని (రుద్ధకంఠముతో) ఆర్యా! కన్నులార నాకొమారుని దామోదరుని ఆఘోరపిశాచి, కులపాంశని, నాపాలిటమారి, రక్కసియగు కళావతి భానుమూర్తిని దన భావికార్యమునకడ్డురాకుండునట్లు జంపనెంచి పొరబాటున జంపివేసె." అనునప్పటికి రామశర్మ కనులనుండి విస్ఫులింగములు వెడలుచుండెను. చేయునదిలేక "హా! పాపీ చిరాయువన్నట్లు దుర్మార్గురాలగు నిన్నెవ్వరును జంపరైరిగదా!" యని హతాశుండై గోడకానుకొనెను.

వైకుం—ఆర్యా! నన్నేమి జేసిననూ పాపమురాదు. ఈ పాపియొనర్చిన కార్యముల కంతమేలేదు. భావిసుఖమునునమ్మి స్వకీర్తిని దిగనాడి మెనలేని యపఖ్యాతి నొడగట్టుకొంటి.

సన్యా—(కంటనుండి యమునా గంగలు ప్రవహింప) "అయ్యో! నీలకంఠా! యెంతటివాడవురా! నాగన్నబిడ్డల నేటిపాలొనర్చితివే!" అనుసరికి రామశర్మ మూర్ఛదగ్గి "మహాత్మా! మీరేల దుఃఖించెదరు. అన్నియు యయిపోయినవి." అనెను.

సన్యా—"రామశర్మా! ఆభానుమూర్తి నాదనూజుండేగదా!" అని విలపింపసాగెను.

రామ—(ఆశ్చర్యముతో) నిజమేనా?

సన్యా—నిక్కము. ముమ్మాటికి నిక్కువంబే. నేను గొన్ని వత్సరములకిందట యాత్రార్థినై గర్భవతిగానున్న నాభార్యను

నాసోదరుని పాపి నీలకంఠుని వశమునందునిచి వెడలితి. నేబోయిన కొన్నిమాసములకే న భార్య యిద్దఱి పిల్లలఁగనెనట. వారే భానుమూర్తి భానుమతులు. భానుమూర్తి కారాగారమునందుండె. అట్లు నేకొన్ని వత్సరములు వెనుకవచ్చి జూతునుగదా నాయిల్లమ్ము వేయబడియుండె. నాసోదరుఁడెక్కడేగెనో యెవ్వరు జెప్పజాలరైరి. యిరుగుపొరుగువారిని ఆవిషయము బ్రశ్నింప వారెవ్వరు దమకు దెలియదనిరి. నేనట్లు నిరాశాపరుఁడనై వారిజాడలుగానక సంసారముపై వ్యామోహము విడనాడితి. సాధువర్తనమే జీవనోపాధి యనుకొని నాదు "బ్యాంకు"నందుగల మొత్తముపై వచ్చు వడ్డీని మాత్రము దీసికొనుచు పరోపకారార్థమై నాయీదేహము నుపయోగింప నిశ్చయించితి. ఒకనాఁడు భానుమూర్తి వీరశర్మను దోడ్కొని పోవుచూ నేదియో పోయినవస్తువును వెదుకువారివలె వారి నాటి మోములఁగాంచి గనిపెట్టితి. వారినావిషయమై బ్రశ్నింప భానుమతి నెవ్వరో యెత్తుకొని పోయిరని విన్నవింప నేవెదకి గనుగొందునని మాటయిచ్చి మఱునాఁడే యామె నడయారు సౌధమున బందీగా యుండుట కనుగొంటిని. వెంటనే ఆవిషయము వారికి దెలియజేసితి. తిరిగి మేము పోయిచూతముగదా ఆదుర్మార్గులెందో పలాయనులైయుండిరి. మేము విఫలమనోరథులై వెనుదిరిగితిమి. నాటగోలె యామెజాడలే గానరాకున్నవి." అని సవిస్తరంబుగా విన్నవించెను. రామశర్మ అదంతయువిని యొకవంక జాలియు, యొకవంక క్రౌర్యము పెనుగొన "అయ్యో! దైవమా! యీనాచెవులకెట్టి వార్తవినిపింపజేసితివి. హా! క్రూరుడా! ఎంతటిపనిజేసితివిరా! హా! లీలావతీ! నీవైన నిపుడుండినబాగుండెడిదిగదా"అని ప్రలాపించి క్రిందబడిపోయెను.

# భానుమతి

## ముప్పది తొమ్మిదవ ప్రకరణము.

### భానుమూర్తి విడుదల.

రామశర్మ వెళ్ళినతరువాత వైకుంఠశర్మ తన భావిగతినించుక యోచించి యోచించి తుట్టతుదకు మనస్సుదిట్ట పఱచుకొనెను. అంతలో జైలు "వార్డన్" వచ్చి "లెండు! చాలప్రొద్దుపోయినది. మీమట్టి పాత్రను గైకొనుఁడ"నెను. వెంటనే తక్కిన ఖయిదీలతో పాటె డాక్టరుగారుకూడ వానపాత్రమును చేబట్టి యవతలికరుదెంచి కాలకృత్యముల నెఱవేర్చినబిదప రుచించినకొలది కొద్దిగా భుజించి మనమునకేమి దోచెనో గానిపహరాజవానును బిలచి తత్క్షణము "దండనాధికారినిన్ని పోలీసు యిన్స్పెక్టరుగారినిన్ని" బిలుచుక రావలసినదిగ వేడుచుదన వాఙ్మూలమును నప్పుడేగైకొన్నచో సరియనియు లేకున్న దానుమరణించుట నిక్కమనియు! విన్నవింప నాతఁడు సరియని వెంటనే నొక్కరక్షకభటు నంపివారిని రప్పించెను.

"దండనాధికారి వైకుంఠశర్మను సమీపమున గూర్చుండ బెట్టుకొని" నీపేరేమి" అనియడిగెను.

వైకుం—వైకుంఠశర్మ.

దండ—తండ్రి పేరు?

వైకుం—దామోదరశర్మ.

దండ—వయస్సు?

వైకుం—ఏబదికి మించియుండవచ్చును.

దండ—నీవేమి చెప్పదలఁచితివో సవిస్తరముగా దెల్పుము

వైకుం—అయ్యలారా! ఎవ్వని పసికూనను జంపిననేరము
నకై వెదకుచుంటిరో ఆదుష్టాత్ముఁడు—అట్టినిర్భీతచేతస్కుఁడు—
పాపుఁడు—నీచుఁడు—వేయేల? సర్వపాపభైరవుండను నేనే, నా
పాపములెల్ల గట్టెక్కినవి. వాటిప్రతిఫలమును సంతోషముతో
ననుభవింపనెంచితి. నాకుమీ రేశిక్షవిధించినను సంతసమున
యనుభవింతును. మహాశయులారా! ఈపాపిని మరియొక నేరము
నకై శిక్షింపవలసియున్నది. పాపము నావలన నిర్దోషియగు
భానుమూర్తి కారాగారమున మగ్గుచుండె రామశర్మమహాశయావం
శపయోధిని విషముద్భవించినపగిది యాతని కళత్రముగు కళావతి
యిందు మొదటి యపరాధి. భానుమూర్తినిజంపు నుద్దేశమున నా
సాయమున యట్టి నిశీథమున పొరబాటున మదీయసుతుని దామోద
రుని భానుమూర్తి గదిలో నిదురించుచుండిన వానిని, హా! నోరాడ
కున్నది, ఆదృశ్యమిప్పుడు కన్నుల గట్టినట్లున్నది: ఆకరాళి, రక్కసి,
చేతులార జంపివైచెను—గదా" యని తిరిగి చెప్పజాలక క్రింద
బడిపోయెను.

సేదదీరినపిదప భానుమూర్తి నెందులకు జంప యత్నించి
నదియు మొదలుగాగల కారణములన్నియుఁజెప్ప దండనాధికారి వాటి
నన్నింటిని వ్రాసికొని రామశర్మకోరినరీతి భానుమూర్తినిజామీనుపై
విడుదలగావించి కళావతిని బట్టుటకై వారంటుల నొసంగెను.

ఎచ్చటజూచినను కలకలము. పరిచారకులు యెదుట గన
బడుటకే వెరచుచుండిరి. ఏవేళ కేమి వచ్చునోయని భీతిల్లుచుండిరి.
తుదకు సుబ్బశర్మగూడ దనబానసమఱచి రామశర్మ యెదుటికిబోవ గడ
గడలాడుచుండెను.

రామశర్మ తనభార్య యొనరించిన యవినీతికార్యములెల్ల

దెల్లముకాగా యొకవిధమైన యున్మాద మాతని శరీరము నావ
హించెను. దానంజేసి యెదురుపడిన వారినందరిపై దనకోపమును
జూపింపసాగెను. కళావతి యాతని యాగ్రహకారణము దెలిసికొన
బ్రయత్నించి మెల్లగా యడుగులలో నడుగులిడుచు రామశర్మ గది
లోన బ్రవేశించెను. రామశర్మ విచారమున దల వాల్చికొని
యుండె. ఇంతలో యడుగులచప్పుడు వినబడ దలయెత్తిజూచి పండ్లు
పటపట గొరుకుచు కన్నులెర్రజేసి కోపమున "ఛీ! దురాత్మురాలా!
పొమ్మ్యావల. లోనబ్రవేశించితివా నీశిరమును ద్రుంచెద" ననెను.

కళా—(యించుకదగ్గి) నాథా! నాథా! ఇవిఏటిమాటలు?

రామ— నేనానీకు నాథుండను. రాక్షసీ! అదిగో! నీనాథుం
డా కారాగారమున" అని బిరబిరబోయి ఆమెనొక తన్ను దన్నెను.

కళా—(భయమున) "నాథా! నాథా" యని వెనుకకు
బోవును.

రామ—(చేయిపట్టుకొని) రా! రమ్ము! ఎక్కడికేగెదవు?
ఇప్పుడు నీవు వెడలగూడదు నీపాపభూయిష్టమైన హృదయ
కోశము నొకింత శోధింపవలయు.

కళా—"(భయముతో) నన్నేమిజేసెదవు! చంపెదవా యేమి?
అయ్యో! అయ్యో!"

రామ—"ఓసీ! గయ్యాళీ! కారుకూతలు గూసెదవా?" అని
కొట్టబోవును."

కళా—"అయ్యో! నారాయణా! నీవిప్పుడైన సాయమే తేరవా?"

రామ—"ఊఁ! నారాయణుఁడు! ఆదురాత్ము డెవనికిబుట్టెనో

కళా—నాథా! మీకు పిచ్చిపట్టినదా! లేకున్న నివి యేటి మాటలు.

రామ—"నాకా పిచ్చి. ఓసీ! నీవొనర్చిన యకృత్యము లన్నియు నాకు దెలిసినవిలెమ్ము. ఇంకనూగప్పిపుచ్చెదవా! మోస పోయెదననుకొంటివా? చాలు! నాచేతులార నిన్నిందులకు జంప వలయు. ఇప్పుడే నిన్ను కారాగారమునకు బంపెదగాక" యని క్రోధముతో గది వెడలిపోయెను.

"ఆహా! నేదలంచినదియు జనులు వాక్రుచ్చినదియు సరిపోయి నది. కటకటా! మాతల్లి యెంతటి ఘోరకృత్యమొనరించెను! తుచ్ఛ ధనమున కాశించి తుదకు జ్యేష్ఠుండు దామోదరుని కఠినమనస్కురాలై చంపెనుగదా! హా! ధనకాంక్ష యెట్టిపనినైన జేయించునుగదా! హా! నిజతండ్రి కారాగారమున మ్రగ్గుచుండ దెలిసియు రామశర్మ నిఁక నేమొగముబెట్టుకొని జూతును! హా! హా! దుస్సహము! ఔరా! అంతటికిని మూలమారక్కసి, గయ్యాళి, నీచాత్మురాలా కళావతియే గదా! సద్వంశము నెంతగా జేసివైచె. చెట్టునకు వేనుపురుగై జన్మించెనే! దీనినింతటితో ద్రుంచి బ్రహ్మవంశ కళంకము బాపె దగాక!" అని నారాయణుండు దనకుగలిగిన పరాభవమునకై చింతించి ప్రతీకారమొనర్ప నెంచి తళతళ మెరయు కరవాలంబు నొకదానిని కేలబూని గృహంబు బ్రవేశించె.

కళావతి రామశర్మ నాడాడిన పలుకులు ములుకులై నాట శరీరమెల్ల పోట్లెత్తినట్లుకాగ ధైర్యమువహించి రామశర్మకుం గాలము సమీపించినదనుకొని పండ్లు పటపటగొరుకుచు రాబోవు యవమాన మంతయు తాత్కాలికంబనుకొని నిర్భీతయై కానున్నది కాకమానదని

చింతదక్క నారాయణుఁడే తెంచిన వానిసాయము వేడి వేరుపడి నైన కాలముగడుప నిచ్ఛగించి వానిరాకకై నిరీక్షించియుండెను.

నారాయణుఁడు తొట్రుపాటుగల సాంత్వవాక్యములచే బోధింప నెంచి మెల్లఁగ యింటిలోనికేగెను.

కళా—నారాయణా! వచ్చితివా? రమ్ము! కూర్చొనుము.

నారా—(నిరాదరణగ) ప్రస్తుత సమాచారమేమి?

కళా—నారాయణా! అదేల నీకుగూడ ఉన్మాదమేనా? నే జేసిన మేలు మఱచితివా?

నారా—హా! నీవొనర్చిన యకృత్యములు నేమఱతునే! ఓ నిర్భాగ్యురాలా! నీదురాశ యెంతటి యవమాన యపయశముల కెడమిచ్చెనే! (కంట నీరుగారుచుండ) అమ్మా! నీయవాక్యము లీ పాపియెటుల నివేదింపగలడు.

కళా—(క్రోధచూపులతో) ఔరా! పామునకు పాలుబోసిన విషముమాత్రనే! యెంతజేసిన నేమి? చెప్పుము? నీవేమి యెఱింగి యుంటివో! అంతయు నీమేలునకేగదా!

నారా—నీవెంత పాపాత్మురాలవైననూ గన్నతల్లివిగాన నీ యెదుటనే నిటుమాటలాడ తగదుగాని—హా—నేభరింపజాల— (క్రోధమున) ఓసీ! నీడెందమునజేయిడి యొక్కసారి యాలోచించుకొమ్ము. ప్రజలెనుంగరని యెన్నని యకృత్యము లొనర్పవచ్చును గాని—ఆసర్వేశ్వరునికన్నుల మట్టిగొట్టఁజాలుదుమే! వేయేల? తల్లీ! నీచేష్టలు నీహృదయ పుటభేదనంబు గావించుటలేదా? నీయంతరాత్మ నిన్ను బీడించుటలేదా? ఎంతపాపము నొడగట్టికొంటివే! అయ్యో!

దారుణము—మహాపాపము—నాతల్లి కల్మషము నేనేయుచ్చరింప వలయునా? అమ్మా! నీవుంతరాత్మానురాగబద్ధవై యేదోవిధమున ఆవైకుంఠశర్మను దగుల్కొంటివి. కాని—ఆదుర్మార్గుని—దురాచారుని ప్రేరేపణముచే భావిసుఖమునకై యున్న గౌరవ మాన మర్యాదల గోల్పోవనిచ్చించి నిర్భీతివహించి నిష్కల్మషహృదయుండు, కల్యాణగుణనిలయుండు, కీర్తికాయుండు, ధర్మాత్ముండగు రామశర్మ కన్నులమన్నుగొట్టి వానిపెండ్లాడితివిబో అంతటితో నూరకుంటివా? హా! తల్లీ! నీకులసాంప్రదాయమును, సద్వంశము నొక్కమారు దలంచుకొనుము. ఏమీ! నీకుగోచరించుటలేదా?

కళా—(పండ్లు పటపటగొరుకుచు) నీవుగూడా దారికివచ్చితివిలే! చాలు! చాలు! నోరుమూయుము

నారా—అమ్మా! తెలిసియో దెలియకయో యొనర్చినదోస మొనర్చితివి. అట్టిపాపములువాయ నాసర్వేశ్వరుని వేడుకొనుము. ఇంకనైన సన్మార్గురాలవుగమ్మా.

కళా—ఓసీ! నీవంతకంతకు స్మృతిమించి రాగమున బడుచున్నట్లున్నదే. పోమ్మావల. దురహంకారుడా! ఏమిరా? యింతవఱకు ప్రేలినది. ఇంకమాటాడుము. నీనాలుకగోయించెద. కనిపెంచి, పెద్దజేసి యడిగి దండించుచున్నందులకా నాపై స్వారిచేయు నెంచితివి. తాళుము. నీపనిబట్టించెద.

నారా—(క్రోధముపట్టజాలక) ఓసీ! నీకుబోధించిన ధర్మోపదేశ మాచెట్టునకు బోధించియుండిన భగ్గునమండి పాపప్రాయస్చిత్త మొనర్చుకొనియుండునే! నీవెంతటి రాయిగుండెగలదానివే. నిన్నేమి జేసినను బాపము లేదుగదా—

కళా—(బిరబిరవచ్చి కాలితో నొక తన్నుదన్ని) పొమ్ము! దుర్మార్గుఁడా! కండకావరమున గన్నుంబగానక పేలుచుంటివా?

నారా—(తోకద్రొక్కిన ద్రాచువలె మండిపడి మీఁదికురుకుచు గుప్తముగ దాఁచియుంచియున్న కరవాలము నూడబెరకి) "ఏదీ! ఆపాదమిఁక వెయ్యుమ్మ! దానినేమి జేతునో చూచెదవుగాక. పాపీ! నీకు కాలము సమీపించినది. నీ యీపరలోకయాత్ర దేశమునకాదర్శప్రాయమగుఁగాక" అని యామెకొప్పును బట్టియీడ్చి క్రిందికిబడవేయ కళావతి యాతని దనపిడికిటిపోటుచే నుపలఁగొట్ట నాతఁడు వ్రేటుదినిన బెబ్బులిబోలె మీఁదికురికి కత్తినెత్తి "దుష్టసంతతిని బెకలించి యమసదనమునకంపు ఓ! శస్త్రమా! నీయాఁకలి నేఁడుదీరినది. గైకొనుమీ పాపిదేహము నాహారముగ." అని కళావతీ వక్షస్థలమున బొడిచివైచెఁ. కళావతి "హా" యని మొదలంట నఱికిన కదళివలె క్రిందబడిపోయెను.

నారాయణుఁడు దిక్కుదెలియక నట్లేనిలవబడపోయెను.

కళావతి మరణవేదనచే "నాథా! నాథా! నారాయణుండు నన్నుజంపివైచె. ఇఁకనైన నన్నుగరుణింపుము. ఓరీ! పాతకీ! తల్లిని జంపనీచేతు లెట్లాడెరా! నీమనసదెట్లొప్పెరా! అయ్యో! మాటాడజాల"—కొంచెమూరకుండి తిరిగి "దేవా! నన్నుగరుణజూడుము. నేవేడుచుంటి. పాపఫలమనుభవించితి. అయ్యో! భరింపజాల—తుచ్ఛసుఖమునకాశించి అసమానమానినీత్వము బోగొట్టుకొంటినే—నేఁడెట్టి దుర్దినము. నాకింక సద్గతులున్నవా? హా! పతిభక్తికిమించిన వస్తువీజగంబున లేదనుసంగతి యిప్పుడే యెఱింగితి. ఏదిగాని యనుభవములోనికి వచ్చినగదా దెలియును. నీచధనమునకాశించి—ఎంతటి—పాపసంచయము—చేకూర్చుకొంటి. ఓ నా తలిదండ్రి

లారా! మీవంశమునకు వేరుపురుగై జన్మించి యపకీర్తి గడించితిని గదా! భారతాంబరో! పురాకృత ప్రారబ్ధవశమువం జేసి యిట్టిదుష్కార్యము లాచరించి పాపంబు గొడిగట్టుకొంటి. ఇంక నెవ్వరుగాని ఇట్టి దుర్మరణము పాలుగాకుండ నా యీచరితంబు దార్కాణముజూపుము. ఓనారీరత్నములారా! మీరెల్లరు విద్యావతులై భర్తసేవయే మోక్షప్రదంబనిదలంచి దుర్గుణంబులదరిజేరనీయక తలిదండ్రులకు, అత్తమామలకు యశంబుగూర్పుడు. సకలసౌఖ్యముల కాలపట్టగు సంసారసాగరంబున భర్తయే రాజహంసవంటివాడు. అయ్యో! ఇంకమాటాడ—జాల—అంతికంతకు నాహృదయము పగిలిపోవు చున్నదే—సోదరీమణులారా! పరపురుషుల సోదరులగను, పరధనంబుల దృణంబులగను బరికించుడు. పతి గుడ్డియైన, కుంటియైన, కురూపియైన కూడ వాడే యేడుగడువ. హా! నారాయణా! కరుణించితిననుము. నీవు మంచిపనిజేసితివి. నీపవిత్రహస్తముచే ఈ పాపిజీవినంత మొనరించి కళంకము బాపుకొంటివి. దేవా! నారాయణుసి గావాడుము. ప—ర—మేశా—నీలో—జేర్చు—కొమ్ము" అని విగతజీవియయ్యెను.

రక్తము వెల్లువలై బారగ కళావతీమరణవేదనారవమ్ముల్ల వీనుల బడపులకాంకితుడై నారాయణుడు క్రోధమున నంతటిని బోద్రోలి "హా! తల్లీ"యని యామెపైబడి కొంతవడి విలపించి "దైవమా! తుదకు నాయవస్థ నెంతకుదెచ్చితివి? ఆహా నీలీలల గమ్యాగోచరములు గావా! నిర్మలకులసాంప్రదయములబోనాడి నీచాతినీచమై పరమాపవిత్ర దుష్కార్యాచారిణియై లోకమును హాసింపజేసిన నా—యీ—దలిని—జంపించినిగాని—నాయొనర్చిన వధజన సమ్మోశమే అయ్యో! మెంతైన దల్లిగదా! హా! బ్రతికినంతకాలము మాతృహం

తకా! యనిబిలువబడ వలయునే! భరింపజాల. అయ్యో! పిన్న నాటనుండి నన్నాల్లారుముద్దుగబెంచి నన్నింతవానినిగజేసి అస్మదీయ జననిం జంపుట బాడియే! అరే! నారాయణనామకా! నరాధమా! రుధిరప్రవాహమున దేలియాడుచు పరలోకమున కేగనున్న యీ నాతల్లినిట్లొనర్చినది నీవుగావా? ఈదురంత, దుస్సహమరణమునకు గారకుండవు నీవుకావా? ఛీ! ఛీ! ఈపాడుదేహము నెట్లుసైతు. ఓ కరవాలమా! కరుణయొకింతయు లేక తల్లి నేజంపినదానవు నన్నుమాత్ర మూరక విడిపుత్తువే! ఎప్పుడో—ఎచ్చటనో—ఎవరిచేతనో—చంప బడవలసినది— నాచేతనే! హా! క్రొన్నెత్తురేరీతి ప్రవహించుచుండె."

"అయ్యయ్యో! నాహృదయమున శూలములచే బొడిచినట్లు లున్నది. మాతా! పవిత్రా! నీకడుపున నెటులుద్భవించితినే తల్లీ. ఇంక నేజీవింపజాల. నన్నుగూడ నీవెంటగొనిపొమ్ము. అయ్యో! నినువీడి నేబ్రతుకజాలుదునే. ఛీ! పాపీ! అంతకు నీవేగదా కారణము. (పూర్వస్మృతిగలిగి) ఏమిది? కోపాతిరేకమున నన్నుగానక గావించిన క్రూరకృత్యముచాలక దిరిగిదిట్టనారంభించితినే అయ్యో! బుద్ధియంతె కంతకు మందమగుచున్నది. దేహమంతకంతకు కృసించిపోవుచున్నది. నాప్రాణపదనగుతల్లి—కళావతీదేవి యింకనూ జీవించియున్నదేమో జూచెదగాక. జీవములుండుట దటస్థించెనేని బ్రతికించుకొనియెద గాక" అని హృదయనాడిప బరీక్షించి "అయ్యో! తల్లీ! పోయితివా? చూడజాల—నీమరణదేహమును జూడజాల. ఏ మహాసాధ్వి యనవరతము నాక్షేమమేగోరుచుండెనో, ఏనాతల్లి యితరుల కెంత మాత్రము దెలియనీయక నేద్రోహమొనరించననుగూడ క్షమించి నన్ను బ్రేమించుచుండెనో—ఆనాపూతచరిత, తల్లియస్తమింప ఛీ! నారాయణా! ఇంకనూ బ్రతుకనెంచితివా—(స్మరణ నభినయించి)

అదిగో! ఎటుజూచినను గూడ "మాతృఘాతుకా" అని వ్రాయబడి యున్నదే! అయ్యో! నేచూడజాల, భరింపజాల. దేవా వీనిని గూడ బరిమార్చుము" అని కత్తిని కుత్తుకలో బొడిచికొని క్రింద బడి పోయెను.

పోలీసువారు డాక్టరు వైకుంఠశర్మవద్ద వాఙ్మూలముగైకొని కళావతిని బట్టుకొనుటకై రామశర్మగృహ ప్రవేశమొనర్ప కళావతి విగతజీవియైయుండె. నారాయణుఁ డుచ్ఛ్వాసే యసువుల బాయనుండె. అప్పుడువారు బిరబిర నతని లేవనెత్తి చావనున్న వాని నోటనుండి యీమాటలను మాత్రము తమపొత్తముల లిఖించుకొనిరి. "అయ్యలారా! నాయీతల్లిని చేతులారజంపి ఆనేరమునకై నన్నుజంపక మానరని యెంచి ఆత్మహత్య గావించుకొంటి. ఇంతకన్న—ఎక్కువ—చెప్పజాల—నారాయణ! నారాయణ!" అని కన్నులు మూసికొనియెను. వారలది గ్రహించి వాని వ్రేలిముద్రను తమ రికార్డులో వేయుంచుకొని శవముల నవుషధాలయమునకు గొంపోయిరి.

# [illegible]మతి

## నలుబదియవ ప్రకరణము.

### టెంకాయతోపు.

శైలాపురమునకు దక్షిణదిగ్భాగమున నొకటెంకాయతోపు గలదు. అయ్యదియెటుజూచిన నొకకోసు పరిమితంబగు స్థలంబు నాక్రమించియున్నది. అందలి వృక్షములన్నియు దట్టముగా బెరిగి వరుసలుదీరి నిలిచియున్నవి. అందందు చింత, మామిడి, కానుగ, వృక్షములుగూడ తమంతకుదామే యుద్భవించియుండుటచే వరుసలుగా లేక చెదరియుండెను. ఆతరువులు దాదోన్నతిజెంది యంబుదమండలంబు దాకుచుండెను. సహస్రకిరణుండు గగనమండలమధ్యవర్తియై తనకిరణంబులను లోకంబున బ్రసరింపజేసి ధ్వాంతముల నడుపుచున్నను, ఆటెంకాయతోపులో నివసించిన వారినుమ్మాలింప లేదనుట నిక్కువంబు. అసంఖ్యాకములగు కొబ్బరిచెట్లుండ మరియుండుటచే చూపరులకు భయముగొల్పుచుండును. అట్టిభయంకరంబగు నాతోటజొచ్చిన ఎట్టిబలశాలికిగాని భయంబున దేహంబుగంపింపక పోదు. ఆతోటమధ్యప్రదేశమునందొక కొలనుగలదు. అయ్యది యే ప్రక్కగొలిచినను సుమారు అయిదుగజముల పరిమాణంబుగలదు. వేసవిలోగూడ సమృద్ధిగా జలంబులుండుటకై లోతుగాత్రవ్వబడియె ఆభావియొద్దనమాత్రము చెట్లంతగా లేవు. లేకున్న యెండతగులక కొలనులోని నీరముల నారోగ్యకరములై యుండును.

ఆనాడు భానుండభోమండలమధ్యవర్తియగుచు ఆతనికిరణములగ్నికణంబులవోలె దహించివేయుచుండెను. ఆసూర్యరశ్మిచే భూమండలంబంతయు యుడికింపబడుచుండెను. అడుగిడునంతమాత్రము

నసే యతికాళ్ళు బొబ్బలెక్కుచుండెను. అట్టిసమయంబున యిద్దఱు
బాటసారు లెవరో ప్రసంగించుకొనుచు మైలాపురాభిముఖులై వచ్చు
చుండిరి. వారికానాటియెండ అంతతీక్ష్ణముగా దోచినదిగాదు.
ప్రాతఃకాలమునుండి యెండలోనే నడచివచ్చుటచేత వారికది సామా
న్యముగానే దోచెనేమో.

వారెచ్చటనుండి యేతెంచుచుండిరో దెలియుటలేదు.
వారిలోనొకతె స్త్రీయును, ద్వితీయుండు పురుషుండు. ఆపురుషునకు
ముప్పదికి పైబడియుండెను. ఆలలన యౌవ్వనవతియే. ఇంకను
యువవివాహితగానే గన్పట్టుచుండెను. లేకున్న గళమున మంగళ
సూత్రమగపడదా? మార్గాయాసంబుచేతనో, రోగపీడితయగుటచేతనో
గాని వారిలోనాకాంత కడుమందంబుగ నడచుచుండెను. ఆ యిరు
వురిలో నాపురుషుని ముఖమున సంతసము గన్పట్టుచుండెనుగాని,
యౌవ్వనయుక్తయగు నక్కామినీమణి ముఖంబు విచారంబు సూచిం
చుచుండెను. ఆస్థితినిబట్టి యోచింప బెద్దవాడగు పురుషుండా బాలను
విచారసముద్రమునుండి గొనివచ్చుచున్నట్లు దోచెడిని. కొంతదూర
మేగినపిదప బాలపురుషునిజూచి "అయ్యా! అనతిదూరములోనే నా
యిల్లున్నది. నేనీతోటదాటినతోడనే యిల్లుసేరుకొనగలను. నా
కిపుడు నోరెండుకొని పోవుచున్నది. దయయుంచి ఆయుధ్యప్రదేశము
వరకురమ్ము. అచటగల కొలనిలోని నీరములోకింతగ్రోలి సేదదీర్చు
కొని మరివెడలెద. నీవుగూడ చాలడస్సియున్నావు." అని తన
యొడిలోని మూటనుదీసి యందుగల బంగారుహారము నొకటిదీసి
వానిచేతవైచి "ఇదిగో! దీనిబారితోషితముగా గైకొనుము." అనెను.
వాడదిగైకొని సంతసించుటకుమారుగ విచారమొందెను.

బహుమానహారమునుదిలకించి "ఆహా! నేనన్నిదినములు

గష్టపడినను దీనివిలువను సంపాదింపగలనే! ఇట్టివిలువగల వస్తువు లెన్ని యామూటనున్నవో! నేనింతవఱకు గనిపెట్టనైతి. నాచేతికెన్ని మారులందించియుండెను. నాకప్పుడే దెలిసియున్న పలాయన మంత్రము బఠించియుందునే! కానిమ్ము! ఇప్పుడేమాయె"నని యామె వెనువెంటనే వెడలెను. అంత భానుమతి కొలనువద్దకరుదెంచి 'అయ్యో! ఈమూటనిటు దీసుకొనుండు నేబోయి గుటికెడు నీరము, ద్రాగివచ్చెద''నని యాతనికామూటనిచ్చి కొలనిలోనికిదిగుచుండెను.

ఆపురుషుండు దురాశాపిశాచప్రేరితుండై యామెనట్టె జంపి వైచిన తిరిగి దన్నుగుర్తించు వారెవ్వరుండరనియనుకొని దురుద్దేశముతో నామెను వెనుక చప్పుడుగాకుండ దానుగూడ దిగెను. పాపమా యువతి కాలుసేతులు కడిగికొనగాళ్ళపై నీటిని జల్లుకొనుచుండ పురుషుండు మెల్లగా నామెనొక్కత్రోపుద్రోసి పరుగెత్తెను. వెంటనే యక్కాంత "అయ్యో" యని నీటిలోబడిపోయెను.

పరివ్రాజకుండొకండా ప్రాంత్యమున దిరుగాడుచుండి ఆచావు కేకవిని గబగబబరివెత్తుకొనివచ్చెను. నూతిలోబడిన మానిసియింకనూ బ్రతికియున్నట్టు మూల్గుడు వినబడుచుండెను. ఆహీనస్వరమునుబట్టి నూతిలో యెవ్వరోబడియుండిరని గ్రహించి ఆపరివ్రాజకుండు నూతివద్దకుబోయి తొంగిచూడ, ఒక స్త్రీ నూతిగట్టున మొలచిన తంగేటిమొలక నూతగాగొని గట్టునకేగుదారిగానక యల్లాడుచుండెను. ఇంక దడయుట పాడిగాదని ఒక్కపెట్టున జలములోనికురికెను. తానుగూడ తంగేటిమొక్క నొకచేతితో బట్టుకొని వేరొక హస్తమున నామెతలవెండ్రుకలబట్టి పైకెత్తి గట్టుపైకిద్రోసి తానుగూడ బయటికేతెంచెను. ఆసుదతి నట్టిస్థితిలోజూచి యాశ్చర్యపడెను. ఇంటికిగొంపోయి సేదదీర్చమని యెంచెనుగాని యంత

లోనె యాలలనామణి యిటునటు పొర్లనారంభింప నాతడామె దేహముపై బడినంతటిని దుడిచివైచి భావిలోనుండి యామెనెత్తుకొని యొకవృక్షచ్ఛాయ విశ్రమింపజేసెను. కొంతదడవట్లా చల్లగాలి మీాయుచో నాసుందరి దెలివొంది లేచికూర్చొండెను. కన్నులువిచ్చి యిటునటు చూడసాగెను. అంతనాపరివ్రాజకుండు సుందరినిజూచి "అమ్మా! భయపడవలదు. నేనేనిన్ను దరిజేర్చినది. నూతిలో నీవు బడుటెట్లుసంభవించె. సవిస్తరంబుగ దెలియజేయు" మనివేడ నక్కాంత దనకుదోడుగావచ్చుచుండిన మనుజుడు నగలుదీసికొని దన్నుభావినిబడవేసి పలాయనుండైన విషయంబంతయు తేటదెల్లంబుగ నాతనికి దెలియజేసెను. అతడాశ్చర్యపడి "అమ్మా! నీవే గదా నాడాయడయూరు సౌధమున బంధింపబడియుండినది" అని యడిగెను.

కాంతి—మహాత్మా! నేనే! అనిర్భాగ్య భానుమతినినేనే. మీారేగదా నాసందేశమును గొనిపోయినది. మహానుభావా! మీా మేలుమఱతునే!

పరి—అమ్మాయీా! నీవప్పటినుండి యెన్నియిడుముల బడితివి ఆసౌధమునుండి నిన్నెచటికి గొంపోయిరి. అదియంతయు సవిస్తరంబుగ దెలియజేయరాదా!

భాను—మహాశయా! క్షుద్బాధభరింప నశక్యంబు. తినుటకేదైన నొసంగినచో నంతయు జెప్పగలదాన. దేహమస్వస్థతగానున్నది. మాటాడుటకు త్రాణమే లేదు.

పరి—"బిడ్డా! రమ్ము! పోవుదము మాయింటికి. అదిగో! ఇచటికనతిదూరమున నేయున్నది. లెమ్ము!" అని యామెను లేవనెత్తి దనచేతితో యామెను మెల్లగ నడిపించుకొనిబోయెను.

అట్లువారు కొంతదూరమునడచిపోవ త్రోవలో నెవ్వరో మూల్గుచున్నట్లు వింతశబ్దమొక్కటి వీనులబడుచుండె. అదియేమై నదియు దెలిసికొన కుతూహలుడై పరివ్రాజకుండు ఆమెనటు కొంత సేపుండమనిచెప్పి శబ్దమే తెంచినచోటికి బోయిచూడ, ఒక్కడు తనచే మూటను క్రిందబార్వైచి, దెలివిహీనుడై క్రిందబడియుండుటను జూచెను. అతనినోటినుండి నురుగులువచ్చుచుండెను. అతనిపైఖరి నంతయుజూచి చాలసేపు బ్రతుకజాలడని యాతనిముఖమే జెప్పు చుండెను. పాపమాసన్యాసి యాతనిపై జాలిగొని లేపి కూర్చుండ బెట్టుకొని ఆతండెందులకట్లు బడియుండెనో జెప్పుమనియడిగెను. ఆతండు నాలుకతడబడ కొల్లగకనువిచ్చి యిటునటుజూడ ననతిదూర మున భానుమతినిగాంచి "అమ్మా! నిన్నుజంపనెంచిన కిరాతుండిదే దుర్మరణము నొందుచున్నాడు. తల్లీ! తగినశాస్తియే జరిగినది." అనుసరికి భానుమతి దటాలున నచ్చోటికి బరువెత్తివచ్చెను. కిరాతుం డామె పాదద్వయమునుబట్టికొని "అమ్మా! భానుమతీ! పతివ్రతా తిలకమా! నీశీలమేమనంగనచ్చు. ఎంతటిపుణ్యవంతురాలవే నాతల్లీ. నిన్నుజంప నెంచినందులకా పరమేశ్వరుడు నన్నేజంపించె. అట్లు భావిని నన్నుపడద్రోసి నగలమూట నెత్తికొని పరుగెత్తుచుండ యెక్క డుండెనోగాని అదిగో! ఆపొదలలోనుండి నల్లత్రాచొకటివచ్చి కఱచి వేసినదమ్మా! అయ్యో! నేభరింపజాల"నని వాడుకన్నులమూసెను.

పరివ్రాజకుండు పరమేశ్వరుని చెయిదముల కద్భుతమంది "బిడ్డా! నీవు పతివ్రతాతిలకంబవగుట నిశ్చయంబు. త్వరలో నీ కష్టములు గట్టెక్కగలవు. స్వర్గతుల్యమగు సుఖములు త్వరలో నున్నవి. ఆచిహ్నములిప్పుడే గనుపడుచున్నవి. బిడ్డా! యెంత యలసియుంటివమ్మా! రమ్ము త్వరితముగా బోవుద"మని యామెను

దోట్టాని యింటికేగి వలసిన తినుబండములనిచ్చి సంతృప్తిగావించెను.

వైకుంఠశర్మ జెప్పినట్లు భానుమతి దనకొమార్తెయోగాదో యని మనంబున సంశయించి పూర్తిగా సంగతి సందర్భముల నెఱింగిన పిదప సత్యమెఱింగింతునని యూరకుండెను.

భానుమతి కొంత సేదదీరినపిదప "అమ్మా! భానుమతీ! నీ వృత్తాంతమునంతటిని నొకమారు వినబడచేయు"మని బ్రతిమాలెను.

భాను—మహాత్మా! నామనంబంతయు అన్నను జాడ నభిలషించుచున్నయది. కావలసినచో మఱియొకమారు ముచ్చటించుకొందము.

సన్న్యా—అమ్మా! భానుమూర్తి సుఖియైయున్నవాఁడు. వలసినచో నాతని నిచటికే పిలపింతునులెమ్ము. నీవేమియు చింతింపబనిలేదు.

అంత భానుమతి తనమునుపటి చరిత్రనంతటిని నివేదించి తమపరి నారాయణుఁడు కల్లజాబువ్రాసిపంపి చెఱగొని బంధించినదాదిగ నడచిన వృత్తాంతమునెల్ల సవిస్తరంబుగా దెలుప నాతఁడాశ్చర్యపడి "బిడ్డా! పరమేశ్వరుఁ డిన్నిదినములకు మనలనిద్దఱిని నొక్కచోట యొనగూర్చెను" అని కంటదడిపెట్టెను. పాపమా భానుమతి యాతని వాలకము నెఱుంగజాలక "మహాశయా! ఏల మీరు దుఃఖించుచుంటిరి" అనియడిగెను.

సన్న్యా—బిడ్డా! నీవు నాతనయవు సుమా.

భాను—(ఆశ్చర్యముతో) అదెట్లు. మాతండ్రి వైకుంఠశర్మ గాదా?

సన్యా—కాదు. మీతల్లి గర్భవతిగానుండినప్పుడు నే యాత్రార్థినై దూరదేశములకేగితిని. నేవెడలిన కొన్నిమాసములకు మీతల్లి మిమ్ములగని దివికేగెనట. పిదప నేకొన్నివత్సరములనంతరము వచ్చిచూచితినుగదా మీరెవ్వరును లేరు. ఉన్నయింటిని సహితము మాతమ్ముడు నీలకంఠుడు యమ్మివేసి దుర్మార్గులసహవాసమొనర్చి యాస్తియు పాడొనర్చె. పిన్నవయస్కులగు మిమ్ముల నా వైకుంఠశర్మకమ్మి యెందుబోయెనే కొన్నివత్సరముల వఱకాతని జాడ నేమెఱుంగకుంటి. అప్పుడప్పుడాతని జూచినవారలునాతో యాతని నెచ్చటనో జూచితిమని చెప్పుచూవచ్చిరిగాని యెందునునాకు గానరాడాయె. అంతటితో నిరాశ జేసికొని బిడ్డల నేమిజేసెనోయని చింతించి చింతించి తుదకు సన్యసించి పరోపకారార్థమై నాకు బ్యాంకునందుగల పైకముపై వచ్చు వడ్డీనిమాత్రము వినియోగించుకొనుచు కాలము గడుపుచుంటి. ఒకనాడు భానుమూర్తి నిన్నెవ్వరో గొనిపోయిరని వచింప నేవెదకి దెత్తునని నిన్నా యూడయూరు సౌధమున గనుగొంటిని. అదుపరి జరిగినసంగతులంతయు నీకువిదితమేగద. మొన్నటిదినము భానుమతీ, భానుమూర్తులు నీబిడ్డలేయని వైకుంఠశర్మ కారాగారమున వచించె. నాటినుండి నిన్ను వెదుక నిశ్చయించితి. దైవప్రేరేపణమున ఆడబోయిన తీర్థమెదురైనటుల నిన్నిపుడుచూడగంటి''నని దనవృత్తాంతమునెల్ల నివేదించెను.

భాను—(ఆశ్చర్యముతో) మహాత్మా! చూడగానాడ నాచరితమే వింతగొలుపుచున్నది. పోనిండిపుడాతఁడెపుడిచటి కరుదెంచె; చెరయందుండుటకు కారణంబేమి? సత్వరమాతని నేజూడవలయును. నామనంబంతయు తహతహలాడుచున్నది. దేవా! మీరునన్నచటికి గొనిపొండు.

జెప్పె. పిదప నేనాతని శెలవుగైకొని యింటికేగుచుండ త్రోవలో (Lunatic Assailan.) పిచ్చియపుపాధలయమువద్ద నొకింతయాగితి. నీవెవ్వరితోనో మాటలాడుచుండినట్లు నీపెద్దగొంతు నాకుస్పష్టముగా వినబడ నేనాశ్చర్యచకితుడనై వీరశర్మ యుండేయుండెనని యచటి దక్షిణదిగ్భాగమునగల చెట్టునెక్కి విలోకింప నిన్నుంగనుగొని నీ సంభాషణయంతటిని చెవులారవింటిని. నాకామూలముగ నిన్నుమోస పుచ్చి కల్పితకారితములచే పిచ్చివాడని నిన్ను నిగ్రహించి యుపస ధాలయముజేర్చిన సంగతంతయుజెప్పి హాస్యముతో నవ్వుజగడమాడు చుంటివి. అతడు నిజముజెప్పెగనుక నావన్నియు పిచ్చిచేష్టలని మందలించుచుంటివి. నేనిక దడయరాదని సత్వరము మీజనకుని వద్దకుపోవుచుండ నంతలో భానుమతి భావిలోద్రోయబడి "అయ్యో నాని కేసి నేను పరుగిడివచ్చితిని".

పిరి—(ఆశ్చర్యముతో) "భానుమతియా? భావిలోబడెనా?" అనుసరికి యచటనొకమూల చిరునవ్వు ముఖమున దాండవమాడ సిగ్గుచే దలవాల్చికొనియున్న భానుమతి లేచి మరియొకచోటికిబోవ నాతడామెనుగాంచి సంతసించి మందస్మితవదనారవిందుడై "మహా త్మా! ఆమె యెందులకు నూపమున ద్రోయబడెనో జెప్పరాదా?" అనియడిగెను.

సన్యా—అదంతయు పెద్దగాథ. నిను నేమహాత్మునుగాను. నాతోరమ్ము! అన్నియు విశదముకాగలవు. నీవు నాకల్లుండవుసుమా.

పిరి—అదెట్లు!

సన్యా—లెమ్ము! కొన్ని నిముషములలో యన్నియు దెలియ గలవు. రమ్ము! భానుమూర్తివద్దకు బోవుదము.'

వీర—భానుమూర్తి విడువబడియెనా?

సన్యా—అవును. అన్నియు అచటనే విశదముకాగలవు. భానుమతి యొక్కయు, భానుమూర్తి యొక్కయు వివాహములు గూడ నేఁడో రేపో దప్పక నిశ్చయింపబడును.''

వీర—అంతయు మీయాశీర్వాద ప్రభావమే.

సన్యా—అమ్మా! భానుమతీ! వేళాయె! రమ్ము''అని భానుమతీ వీరశర్మలదోడ్కొని భానుమూర్తి వద్దకుఁబోయెను.

# భానుమతి

## ముగింపు.

---

### విందు.

భానుమతీ వీరశర్మలయొక్కయు, పద్మిమదా భానుమూర్తుల యొక్కయు వివాహము లత్యంత వైభవముగ జరుపబడెను. వివాహముకై యలంకరింపబడిన పచ్చనితోరణములు, స్తంభములకు గట్టియుంచిన కదళీతరువులు, చిత్రవిచిత్ర తరంబులగు విద్యుద్దీపగుళికలు తోరిపపొడుగున రత్నకంబళ్ళు మొదలుగాగల వింకనూ రూపుమాయలేదు.

నాడుకడపటి దినమగుటచే పాత్రయాలంకారముల కొంకింత న్యూనతగలిగించి మునుపటికన్న మెఱుగుగా గానబడునట్లు చేసియుండిరి. మరియునాదినమున గ్రామమునంగల గొప్పవారికెల్లరికి విందొనర్పనెంచి రామశర్మ నాహ్వానపత్రికల నంపియుండెను.

విందొనర్పనెంచిన స్థలమంతటిని కుర్చీలతోడను, బల్లలతోడను నింపివేసియుండిరి. అతిథులందరొక్కరొక్కరేవచ్చి నాశీనులగుచుండిరి. నూతనదంపతులగు భానుమతీ వీరశర్మలును, పద్మిమదా భానుమూర్తులును మధ్యప్రదేశమునగల స్థలముల నాశీనులైరి. వారికొకింత సమీపమున రామశర్మ సుబ్బశర్మాదులు, పరివ్రాజకులవారు, భానుమతీ ప్రేమాస్పదులగు నారాయణరాజు దంపతులు పల్లియునివాసులగు కాపుదంపతులుగూడ వచ్చియుండిరని వేరుగజెప్ప నక్కరలేదు.

ఆహా! ఆదృశ్యమే మునుగవచ్చును. మేఘమాలికలచే నిజ

జ్యోతిర్మయ ప్రకాశమడగిపోయి చూపరులకు చంద్రబింబమే
గానుపింపమి మగుడి మేఘకలశములు పటాపంచలుకా పరిపూర్ణ
బింబమగుపనునట్లు కష్టపరంపరలచే కృశించి కళావిహీనమై వాడి
వసగై యున్న భానుమతి వదనారవిందము నేడు ప్రియునిగూడియుట"
సౌందర్య సాగతరంగమాలికా డోలికల నూగునప్పుడు డా
వులు మైనట్టి ప్రసన్నవదనమై కళాపరిపూర్ణమై ఆరమా
వించిన జలజంబు చందానసుందరమై, నయనానంద కరం
అతివిశాలంబులగు నయనము లిప్పుడు శతపత్రపుష్పములని భాను
యుండెను. సంతతవిచారసముదాయముచే నల్లబడియున
గోష్ఠము లిపుడెఱ్ఱబడి అలనాడా గోపికారమణుండు వేణుగ
కాలమున గలిగిన మందస్మితమును ధిక్కరించుచుండెను. కే
ప్రియావియోగానల పరితప్తంబగు దేహమానాడు సంపూర్ణ
లాకార విలసితమై వజ్రనిర్మిత భూషలచే ప్రజ్వరిల్లుచుండెను.
వేయేల నావాటికయంతయు సంతోషసాగరంబుచందాన వెలుగు
చుండ ప్రేమలతాంతమున వికసించి వినిర్మల విచిత్ర పర్ణాయ పరి
తప్త కుసుమముల మాడ్కి నెలయు, అరుదెంచిన యాధిపులెల్లరా నూ
తన దంపతుల సంతోషోత్సాహమును దిలకించు భ్రమరసంఘముల
రీతి విలసిల్లిరి.

అట్టిసమయమున కథాభాగము ముగియుటచే భరతవాక్యము
జెప్ప నలుకునిరీతి పరివ్రాజకుండు లేచి యిట్లని యుపన్యసింపబోవగా
"మహాశయులారా! భానుమూర్తి నింతవఱకు తనయుడవియెంచి
యున్న రామశర్మ యాశాలత దుంచివేయబడినన్నా యట్లుగాకే
బరిణమించినందున తిరిగి చిగిర్చి నూతనవికాసము నొందినందున
కెల్లరకు ముదావహంబు. ఎన్నడో బోగొట్టుకొన్న నాసుతాదుల
నాకుజిక్కి గన్నులపండువొనర్ప వీరశర్మ మదీయజామాతగా బరిణ

మింప గొప్పవారలతోడ నెయ్యమనాయాసముగ లభింపజేసిన ఆ పరమాత్ముని యద్భుతసంఘటనము పురాకృత సుకృతఫలము. నేనభిలషించిన మేరకు నాభాగ్యము పండినది. నాయాశలు ఫలించినవి. నాకీప్రపంచమున గావలసిన దీనూతనదంపతులు చిరకాలము వర్ధిల్లు కటియే. ఇదిగో! నాకు "బ్యాంకు"నందుగల పైకము భాని భానుమతిపేర నేడే వ్రాసియుంచితి. రామశర్మ సుబ్బ యొక్కయలు భానుమూర్తి నిల్లటపు నల్లునిగా నుంచుకొందమని ముందుకై వచించినందులకు నేధన్యుండను. నాతమ్ముడు నీలకంఠుడు యుంచిన ప్రీతమునెల్ల యొప్పుకొని క్షమింపవేడెగాని నాతని మీయందరి తోడ్పాటున క్షమును క్షమించితి. నేటి మొదల వాడు రామశర్మవద్ద నుండ మానుసనది. నేడు మొదలు తొంటిరీతి మనకుటుంబములు సారసంసార ామములు సముద్భవింపజేసుకొని యభివృద్ధినొందునట్లుగా జేయు మని సర్వేశ్వరుని నేబ్రార్థించుచూ నింతటితో విరమించెద''నని కూర్చుండెను.

ఇంతలో వైకుంఠశర్మ కారాగారమున మరణించెనని వార్త వచ్చుటచే వారియానందసౌధ కొకింత దురువార్తాతుపానుసోకి కొంతు కంపనగ్నమయ్యెనుగాని త్వరలోనే బాలభాస్కరుండుదయింప తుపాను విడి సంతోషసాగరము నిశ్చలమై పోయినట్లుకీతి వైకుంఠశర్మ మరణవార్త భానుమతీ భానుమూర్తులు నాకిన్నాములనులచే యెట్టి గాకైనదేమి దమ్మ్మ పిన్ననాటనుండి యాల్లారుముద్దుగ బెంచి పెద్దజేసి వ్యాబుద్దులగరపినాములకు కొకింత విచారమొందరిగాని యాత్మం డొనర్చిన యకార్యములు జ్ఞప్తికి నాకాని ప్వేమకల్లయునుకొనిరి.

—:సంపూర్ణము:—

బ్రిటానియా ముద్రాక్షరశాల, మదనపల్లి. కా, 1000/1930.

